సంపుటము - 26

# శృంగార సంకీర్తనలు



అన్నమాచార్య ప్రాజెక్టు
తిరుమల తిరుపతి దేవస్థానములు

తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 26

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కరణ

కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ

మరియు

కామిశెట్టి శ్రీనివాసులు




ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు

1998

T.T.D Religious Series - 558

ప్రథమ ముద్రణ : 1992
ద్వితీయ ముద్రణ : 1998






ప్రతులు : 2,000

వెల : రు. 32-00




ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

*ఇందరికి అభయంబు లిచ్చు చేయి*
*కందువగు మంచిబంగారు చేయి ॥*

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమత: తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మేశ విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింపబడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు ఆధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A., Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతాజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

# తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక చినతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయ బడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినవి. వివిధ దశలలో 5, 6, 7, 8, 9 సంపుటాలు ప్రస్తుతం 1, 2, 3 సంపుటాలుగా గ్రహింప వినతి. వివరములకు ఆయా సంపుటాల పీఠికలు చదువగలరు ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక

"కోరేటి దేవుఁడవైతే గుడిలోనే వుందుగాక
చేరి మొక్కినట్టివారిఁ జెఱుగు వట్టేవా"

(శృం.సం. 32 సంకీ.6)

'నా పాదాల చెంతచేరిన వారిని బ్రోచే భారం 'నాది' అనే ప్రత్యక్ష పరమేశ్వరుడు వేంకటాచలపతి. జీవనాయికల చెరుగువట్టి అంకాన, అక్కున చేర్చుకొనే పరమనాయకుడు శ్రీనివాసుడు. మధుర భావనతో పరతత్త్వాన్ని అందుకోవడానికి మార్గాన్ని ఈ శృంగార పదాలలో చూపుతున్నాడు మహాభక్తుడు అన్నమాచార్యుడు. "ఆధిభౌతికానుభవములలో అన్నమాచార్యులు ఎక్కువగ భావించింది శృంగారము. దాన్ని కూడ ఆధ్యాత్మికపు మట్టాని కెక్కించిన మహాపురుషుడాయన." [1]

తిరుమల తిరుపతి దేవస్థానముల శ్రీకార్యనిర్వహణాధికారి ఎం.వి. యస్. ప్రసాద్‌గారి ఆశయానుసారం, శృంగార సంకీర్తనల సంపుటాలు కీ.శే. గౌరిపెద్దిరామసుబ్బశర్మగారు పరిష్కరించి అసంపూర్ణంగ వదలినవి 'తత్రగచనయకా' ప్రాప్తిచేసే భాగ్యం నాకు కలగడం శ్రీనివాసానుగ్రహం. ఆ సంపుటాలలో శృంగార సంకీర్తనల సంపుటం 32 పూజ్యులు గౌరిపెద్దివారు రేకుల నుండి ఎత్తి వ్రాసినది [11-4-79 ఉ. 8-30 గం. నుండి 15-9-1979 శనివారం సా. 4-30 గం.]. పాటలు, అనుబంధాలతో 374 పుటలు. రేకులు 1601-1700 వరకు. మొత్తం పాటలు 599.

---

[1] రా.అ.కృ.శర్మ. చూ. అన్న. సంకీర్తనలు. సం.II. పు. xx కూర్పు. కా.శ్రీ. తి. తి.దే. 1982.

బ్రహ్మశ్రీ గౌరిపెద్ది వారు రేకులలోని పాటల వ్రాతప్రతిని సిద్ధం చేసినారు. శబ్దార్థాలకు సంబంధించిన చర్చ ఆయా పాటల క్రింద సూచించినారు. నా సూచనలను కా.శ్రీ. అనే పుటాక్షరాలతో సూచించినాను. నాకు సందేహం కలిగిన తావుల మూలంతో పోల్చి చూసి వ్రాయసగాని తప్పులను క్రీగీతలో సూచించినాను. ఈ గ్రంథంలో పీఠికతోబాటు, అనుబంధంలో, స్థూక్ష్మంగ సంకీర్తనల్లోని విశేషాంశాలను చర్చించినాను.

తెలుగులో పదకవితకు అన్నమాచార్యుడు ఆద్యుడు. 1408లో జన్మించిన ఈ మహాపురుషునికి 1424లో వేంకటేశ్వర స్వామి సాక్షాత్కారమైంది; 1503లో తిరువేంగళనాథునిలో ఐక్యమైనాడు.[1] ముప్పదిరెండు వేల సంకీర్తనలు రచించినాడని ప్రస్తుతింపబడిన అన్నమయ్య పాడిన పాటలను రాగిరేకులమీద వ్రాయించిన ఖ్యాతి అతని వంశపురుషులైన పెదతిరుమలయ్య చినతిరుమలయ్యాదులదే.[2] ఈ తాళ్లపాకకవుల సంకీర్తనల రాగిరేకులను తిరుమల దేవాలయంలో సంకీర్తనభండారంలో భద్రపరచినట్లు సాక్ష్యాలున్నవి. తాళ్లపాక కవుల రచనల రాగిరేకులు చాలవరకు కాలగర్భంలో కలసిపోయినవి. రాగం విలువ తెలియని జాతి రాగికోసం వానిని కరిగించుకొన్నది. వేంకటేశ్వరానుగ్రహం వల్ల మనం దక్కించుకొన్నవి కొన్నే.[3]

---

[1] ఈ వివరాలు, అన్నమయ్య సంకీర్తనల తొలిరాగిరేకు అవతారికలో ఉన్నవి.
[2] "పరమతం (మం) త్రములు ముప్పదిరెండు వేలు" సంకీర్తనములు చూ. అన్న. చరి: 45 తి.తి.దే. 1978.

"హేవళంబి సంవత్సర మార్గశిర శు.౧౧ బుధవారము తాళపాక చినతిరుమలాచార్యులు అనతిచ్చిన అష్టభాషాదండకం తామ్రశాసనస్థవగాను వ్రాయించితిమి" ఒకానొక రాగిరేకు మీద ఉన్న ఈ వ్రాతవల్ల సంకీర్తనల రాగిరేకుల వివరాలు తెలుస్తున్నవి. The Minor works Vol. I. పు. 156 తి.తి.దే 1935.

[3] ఈ రేకుల వివరాలు చూ.శృం.సం. 22. పు. 14 గౌ.రా. తి.తి.దే.

| | | |
|---|---|---|
| | | రేకులు |
| అన్నమయ్య | .. | 2289 |
| పెదతిరుమలయ్య | .. | 205 |
| చినతిరుమలయ్య | .. | 37 |

తిరుమల సంకీర్తన భండారంలో, అహోబలంలో, శ్రీరంగంలో దేవస్థానం యాజమాన్యం సేకరించినవి. ఈ రాగిరేకుల్లో రచనలన్నీ (ఒక్క శృంగార సంకీర్తనలు అన్నమయ్యవి 400 తప్ప) దాదాపు ముద్రణకెక్కినవే. వీనిని సేకరించి పరిష్కరించి ప్రకటించడంలో సహకరించిన పెద్దలు సర్వశ్రీ సాధుసుబ్రహ్మణ్యశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పండిత విజయరాఘవాచార్య, ఉదయగిరి శ్రీనివాసాచార్య, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ తదితరులు. తాళ్లపాక కవుల రచనలన్నీ సేకరించి ప్రకటించాలనే తాపత్రయంతో తిరిగే నాకు వేంకటేశ ముద్రతోటి సంకీర్తనలు కొన్ని తంజావూరు సరస్వతీమహలు తాళపత్రకాంతారంలో కనిపించినాయి.[4] అన్నమయ్య తన సంకీర్తనలను పరమ మంత్రాలుగనే భావించినాడు. వేంకటేశ మంత్రాలవంటి తన సంకీర్తనల్లో 'ముద్రగ' వేంకటేశ శబ్దాన్నే ఆ మహాభక్తుడు స్వీకరించినాడు. తాను వచించిన సంకీర్తనలను వేంకటేశ్వరుని చరణాలకే అంకితం చేసినాడు.

దాచుకో నీ పాదాలకు తగ నే చేసిన పూజలివి
పూచి నీ కీరితి రూప పుష్పము లివి యయ్యా

1975.

[4] వెంకటేశ పదాలు T.M.S.S.M. 465, B. 11658, D. 467 తైలింగపదరాగతాళ సహితం B. 11640 సంగీతం పదాలు. 1974లో నేను సేకరించినవి.

ఒక్క సంకీర్తనే చాలు వొద్దికై మమ్ము రక్షించఁగ
తక్కినవి [5]భండారాన దాఁచి వుండనీ
వెక్కసమగు నీ నామము వెలసులభము ఫలమధికము
దిక్కై నన్నేలితివింక నవి తీరని నాధనమయ్యా.

నా నాలికపై నుండి నానా సంకీర్తనలు
పూని నాచే నిన్నుఁబొగడించితివి
వేనామాల వెన్నుఁడా వినుతించనెంతవాఁడ
కానిమ్మని నాకీ పుణ్యము గట్టితి వింతేయయ్యా.

ఈ మాట గర్వము గాదు నీ మహిమే కొనియాడితిఁగాని
చేముంచి నా స్వాతంత్ర్యము చెప్పినవాఁడఁగాను
నేమానఁబాడేవాఁడను నేరము లెంచకుమీ
శ్రీమాధవ నేనీదాసుఁడ శ్రీవేంకటేశుఁడవయ్యా.

(అధ్యా. సం. 2 (క్రొత్త) - 338.)

"అన్నమయ్య తన జీవిత మందలి తపస్సుకు మూల ద్రవ్యంగ పదకవితను పరిగ్రహించినాడు. సంస్కారసిద్ధమై సహజమైన కవితాశిల్పం, ఎప్పుడూ పదను చెడని భావనాశక్తి కలవాడు. స్వతః ఉద్రిక్తమై భావవేగాలను అణచుకోలేని ప్రకృతి. ధాన్ని సర్వాత్మనా శ్రీవేంకటేశ్వరునికర్పణం చేసినవాడు[5]

---

[5] శ్రీ తిరుమల ఆలయంలో సంకీర్తన భండారము ప్రసక్తి No. 6 of vol. 4. క్రీ.శ. 1530 వివరణకు చూడు. "తాళ్లపాక కవుల కృతులు -- వివిధ సాహితీ ప్రక్రియలు" వే.అనం. పు. 84

[5] రా.అ.కృ.శర్మ. అన్నమాచార్యుల సంకీర్తనలు-II. కూర్పు. కా.శ్రీ. పు. xviii తి.తి.దే. 1978.

తాళ్లపాకవారి పదాలు ఎక్కడెక్కడో ఎన్నో రూపాలను, రూపాంతరాలను పొందినట్లు తెలుస్తున్నది. కర్త పేరు తెలియక భిన్న విభిన్న పదకర్తల రచనా సంకలనాలలో చోటు చేసుకొన్నవి. నా దృష్టి కందిన కొన్ని వేంకటేశ్వర ముద్రాంకిత పదాలను ఉద్ధరించే ప్రయత్నం చేస్తున్నాను. మా గురువుగారు శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు[6] "ఆ పాటలు నశించిపోకుండుటకై ఇందుద్ధరించుచున్నాను." అంటూ కొన్నిటిని ప్రకటించి నాకు మార్గోపదేశం చేసినారు. [7] నేను సేకరించిన పాటలని కొన్నింటిని గురువుగారికి వినిపించి వారి ఆమోదముద్రను పొందినవి ఇందు పొందుపరుస్తున్నాను.

1. [8] అదె వచ్చె చెలియ మొయారంబుతో ప్రియుని
సదనంబు వెడలి తన సఖుల గానకుండా

నుదుటి కస్తురి చెమట పదనై జార చీర
నదిమి వీడిన తురుము కుదురు పరచి
వొదిగొదిగి తనకెవ్వరెదురౌదురో యంటా
పెదవిగంటి మడపు తుద మాటుకొంటా

నునుగుబ్బకవ గోటికొనజీర మరుగుబడ
పెనుకెంపు బంణ సరు లనువుబరచి
తనకింద ెదళుకుకన్నుల నిదుర సొలయుగా
వనజము మార్కొని వూర్పుబడి నణచుకొంటా

[6] రా.అ.కృ.శర్మ. అన్నమాచార్యుల సంకీర్తనలు-II. కూర్పు. కా.శ్రీ.వు. viii తి.తి.దే. 1978.
[7] శృం.సం. xix సంపుటం. వు 6-8. రా.అ.కృ.శర్మ. తి.తి. దే. 1965.
[8] B. 11640. Copy 1427 a. సంగీతం-పదాలు. వు. 117

అల తత్తరబడుచు అవ్వల నివ్వల గట్టు
ఛలువశాలకలువలు సడలగా
అల శ్రీవెంకటరాయని కూడిన సరసపు
కలయిక మది తలచుకొంటా

పరిష్కృత పాఠాలతో: తాళపత్రంలో రాగం పేరులేదు.

తాళం: ఖండచాపు

పల్లవి

అదె వచ్చె చెలియ యొయారమ్ముతో ప్రియుని
సదనంబు వెడలి తన సఖులు గనకుండా

చరణాలు

నుదుటి కస్తురి చెమట పదనై జారుచీర
నదిమి వీడిన తురుము కుదురుపరచి
వొదిగొదిగి తనకెవ్వరెదురౌదురో యంటా
పెదవిగంటి మదుపు తుద మాటుకొంటా

నునుగుబ్బకవ గోటికొన జీర మరుగుబడ
పెనుకెంపు బన్నసరు లనువుబరచి
తనకింద దళుకు కన్నుల నిదుర సొలయుగా
వనజము మూర్కొని వూర్పుబడి నణచుకొంటా

అల తత్తరబడుచు అవ్వల నివ్వల గట్టు
చలువశాలకలువలు సడలగా
అల శ్రీవెంకటరాయని కూడిన సరసపు
కలయిక మది తలచుకొంటా

ఈ క్రింది పాటల్లో మూలపాఠాలను క్రీగీతలో సూచించాను:

2. సౌరాష్ట్రం - అటతాళం

[8]ఇన్నియు కొత్తలు తోఁచె యింతలో చెలి నీకు
విన్నని నిగ్గు జూచి వెరపేఁటి కాయనే

పెట్టిన కస్తురిబొట్టు పెదవిపై కేల జారె
కట్టిన చెంగావి కెంపు కన్నుల కేల యెక్కె
పుట్టిన [9]లేఁజెమటలు పులకలేమిటికి గప్పె
పట్టిన తామెరమొగ్గ పదనేఁటి కాయనే

నిండిన సైరణలకు నిజమేల లేదాయ
పండిన కోరికలకు ప్రాణమేల వచ్చె
కొండలలో నెలకొన్న కోనేటి రాయఁడు గూడె
యెండలేని నీనీడ నీకితవేఁటి కాయనే

3. కేదారగౌళ - ఝంపెతాళం

పల్లవి

నీకే తగునయ్య మా నెలఁత
గోకులాంబుధి రాజ గోవిందరాజ

గొప్ప కన్నులదిరా కొాదమచన్నులదిరా
చెప్పఁజూపరాని మంచి చెలువరా
కప్పురంపు నగమురా కస్తూరిమృగమురా
కొప్పు నీటులరాజ గోవిందరాజ

---

[8] ఈ పాట తాళపత్రంలో తొలుత చరణం తర్వాత పల్లవి సంకీర్ణమై ఉంది.
[9] పత్రంలో పాఠాలు: లేఁజెమటలు

బెళుకు నెమ్మేనురా పిడికెఁడె కౌనురా
నిలువెల్ల అపరంజి నిగ్గురా
యెలమించు దొరకెరా యెంత గరగరికరా
కులుకు గుబ్బలరాజ గోవిందరాజ

క్రమమంత యెరుఁగురా కలికి క్రొమ్మెరుఁగురా
రమణి మంత్రముకాదు రామరా
రమణీయ వాణిరా రతుల సురతాళిరా
కొమరుసేఁతల రాజ గోవిందరాజ.

4. శంకరాభరణం - అటతాళం

పల్లవి

దిష్టిదాఁకీ మా యయ్యకు తెరవేయారే
దిష్టించి యెవ్వరినైన తేరి చూడనీకురే

చరణాలు

చప్పుడు సేయకరి[8] యవసరమాని చెప్పరే
అప్పుఁడు మాజ్ఞాన మాడీనని చెప్పారే
కప్పూరంపు సురటుల విసరే రనరే
అప్పుఁడు సతులు దాను అరగించీ ననరే

దంతాపు చవికెలో యేకాంత మాడీననరే
అంతరంగమున నృత్తమాడీ ననరే
దొంతి వేడుక పూలతోఁటలో నున్నాఁడనరే
చెంతాల కేళాకూళి చెంతానున్నాఁడనరే

---

[8] చప్పుడు సేయకుండుట అని తాత్పర్యం.

పట్టంపు రాణియు తాను పవ్వళించున్నాఁడనరే
రట్టుగా యెవ్వరినైనా రాకు మనరే
యట్టె అలమేల్మంగాధిపతి వేంకటేశ్వరు
యిట్టె వొకరొకరినీ సేవించు మనరే.

5.

సుదతికి మీ రిందరు చుట్టాలైన ఫలము
మదనుని వేడుకోరె మంచిదౌగాని
పొదపైన సంపెంగ పువ్వులు వెదజల్లరే
ఉదుటు[8]తుమ్మెదగుంపు లుడుగుగాని
పది దిక్కులను రఘుపతి పేరుఁదలఁచరే
గుదిగొన్న[9]కోవిలలు కుయ్యకుండుగాని
జలములలో నెల్ల[10]చంద్రకాంతులు జల్లరే
అల దామెరల గర్వమణగుగాని
చలపట్టి వనమెల్ల జవ్వాజి వాసించరే
మలయు చిలుకపలుకులు మందమౌగాని
పాటలలో శంకరాభరణ[11]మాలపించరే
నీటు చల్లగాలి సొంపు నిలుచుగాని
పాటించి యలమేల్మంగపతి పేరుఁదలచరే
పాటించరే యివిగొన్ని జాడలౌగాని.

---

[8] తుమ్మె
[9] కోవిలాలు
[10] చంద్రకాంతలు
[11] ఆలపించరెవి చల్లగాలి

6.

[12]అతివరో శ్రీవేంకటగిరిమీద వీడె
కౌరవుల[13]పాలిటి విశ్వరూపమితడు- వీడె

త్రిపురంబులపైఁబారిన యాఘన[14]తీవ్రబాణ మితఁడు
కపటపు భస్మాసురుని పాలిటికి కాలదండ మితఁడు
విపరీతపు కంభములో వెడలిన వీరసింహమితఁడు
చపలపు[15]బాణునకు మర్మభేదియగు చక్రధరుఁడితఁడు.

ధరణికింద బలినణచిన యాపాతాళశౌరి యితఁడు
దురమున నెదిరిన దనుజకోట్లకును ధూమకేతువితఁడు
ఒరసిన నరకాసురుని పాలిటికి ఉరుమని పిడుగితఁడు
పరచు రావణుని శిరములు ద్రుంచిన ప్రళయవాయువితఁడు

ఇదిగో విధి రుద్రాదుల కెల్లను వెలసిన వేల్పితఁడు
పదిలముగాఁదనుఁగాచిన యాశ్రితపారిజాత మితఁడు
కదలని యా బ్రహ్మాండకోట్లకును కన్నతండ్రి యితఁడు
వెదకి వెదకి మరి వరము లొసగు శ్రీవేంకటపతి యితఁడ

7. పల్లవి

వేళ కొదవిన వాడె విందు
వేళ లెంచిఁజూచితే వేడుకలబ్బునటే

---

[12] అతివెరో
[13] పాలిటికి విశ్వరూపమితఁడు వీఁడె
[14] తీవ్రబాణ
[15] బాణుమ

కాంత మోమరవిరిగా జారుకొప్పు విరులు
యింతోటు నీకు జూపి [16]యెట్లుండె నమ్మ
చెంతనే రాహువు తన చెలికాని కదియగా
కంతుడంత సోన[17]గమ్మినట్లుండె

సగము జారు[18]పయ్యెద జవ్వని గబ్బిగుబ్బలు
యెగువ కెంపుల తాళి[19] యెట్లుండె నమ్మ
మగటిమి తమ్ములపై మంచు ముంచుకోరాగా
తగవు కాదని రవి తరమినట్లుండె

అలమేలుమంగ మేన అల తొల్లి విరహమున
[20]యలమి శ్రీ వేంకటప్ప డెట్లుండె నమ్మ
మలయు లేఁదీగె [21]ఎండమావులచే కదువాడగా
పొలశి నీలమేఘము పొడమినట్లుండె

8. శ్రీరాగం - ఝుంపెతాళం[22]

పట్టరాదు యీ వలపు పతులకును సతులకును
[22]దోస మెరుఁగదు వలపు [23]దొరతనంబెడ రేఁచు
బాస యెరుఁగదు వలపు బలిమిఁ జెరుచు

[16] యట్లుండె
[17] గంమినట్లుండె
[18] పై యద
[19] యట్లుండె
[20] యెలమి
[21] యండమావులచే
[22] శ్రీ రాగం-ఝంప్పె తాళం
[22] దోస మెరుంగదు
[23] దొరతనంబ్బెడ రెంచు

త్రాసు వంటిది మనసు తగిలితే కుంగించు
యీసునకు మొదలైన దెట్టిదో చెలియా

కన్నుల నుండును వలపు కానరాక మందమై
[24]పన్ని పైకొని తిరుగు భయమెరుఁగకా
వెన్నవంటిది మనసు వెచ్చనైతే కరఁగు
యెన్ని విధముల తెలియ దేఁటికో చెలియా

కలిమి యెరుఁగదు వలపు కడు యెమ్మెలై తోఁచు
చలువ లెండై తోఁచు సరసమునను
యెలమి శ్రీ వేంకటేశ యిట్టె నన్ను గూడితివి, నిన్ను
తెలిసె నన్ను తెలియ దేఁటికో చెలియా

9. భైరవి - ఆదితాళం

పల్లవి

తిరుమలయ్య విందు మంచిదే [25]వుండంటే వుంటినమ్మ
సరవిలేని చెంచువారి సంతయేలె తనకును

పరికిదండ పొగడదండ బండిగురిగింజ దండ
బెరకులేని పికిలిదండ బలిదండలన్నియు
మెరసి కానుకియ్యబోతె మేనిదండలడిగెనమ్మ
మరల చెంచువారితోడి మాటలేలె తనకును

---

[24] పమ్మి - ప్రాసభంగం
[25] వుండంట్ల

మునురుతేనె జుంటితేనె ముదిరినట్టి పెరలతేనె
పొసఁగ మించు పూవుతేనె పుట్టతేనె లన్నియు
వొసఁగి కానుకియ్యబోతె మోవితేనె లడిగె నమ్మ
యెసఁగ చెంచువారి యెంగి లేఁటికమ్మ[26]తనకును

వెలగపండు జీడిపండు వెలలేని మోవిపండు
పలుకుదొండపండు పాలపండు కానుకిచ్చితే
చెలఁగి పక్కపండు మంట శ్రీ వెంకటనాయకుఁడు
యెలమి కూడెనమ్మ చెంచు లేఁటికమ్మ తనకును.

10. కాంబోది - అటతాళం

పల్లవి

అవునయ్యా లెస్స తగవాయ మరేమి
[27]తవిలి తప్పొకరిది దండన వొకరిదా.

చరణాలు

దిద్ది నీ చెక్కిట గోరు తీర్చిన వారుండఁగా
అద్దము చూచుకొమ్మంటే అదే నేరమా
[28]వొద్దిక నీ మోవి కెంపులుంచిన వారుండఁగా
అద్ది కప్పురము వెట్టుటే అదె నేరమా

నెరయ నీ మేన చెమట నించిన వారుండఁగా
అరసి సురటి విసరితే అదె నేరమా
శిరిగల నీ కొప్పు బమ్మిన వారుండఁగా
అరుదుగ ముడుచుటే అదె నేరమా

---

[26] తవకు
[27] తవిలి
[28] వొద్దిక

యెలమితో నిన్నలయించన వారుండఁగా
అలసి వచ్చితివంటే అదె నేరమా
అలమేలుమంగ[29] వేంకటాధీశ కూడితివి
అలుగకు మికనంటే అదె నేరమా. [26]

ఇట్లా నేను సేకరించిన కొన్ని వందల పాటలు ముందు ముందు తర్వాతి సంపుటాలలో ప్రకటించగలను. వీటిని పరిష్కరించి ఒక ప్రత్యేక సంపుటంగ ప్రచురించాలనే సంకల్పము కూఁ లేకపోలేదు. అంతా శ్రీనివాసేచ్ఛ.

తమిళ దేశంలో ఆళ్వారులు నానా దివ్యదేశాలను సందర్శించి అక్కడి అధిష్ఠాన దైవతాల గురించి పాశురాలను (పాటలను) గానం చేసినట్లే ఈ తెలుగు ఆళ్వారు అన్నమయ్య దక్షిణాపథంలోని వైష్ణవ క్షేత్రాలను సేవించి సంకీర్తనలు గానం చేసినాడు. ఆంధ్రదేశంలో కడప, చిత్తూరు, అనంతపురం, కర్నూలు, నెల్లూరు, ఒంగోలు, గుంటూరు మొదలైన ప్రాంతాలలోని ఆలయాలను ఎక్కువగ దర్శించి ఆ దేవుళ్ల గురించి గానం చేసినట్లు ఉపలబ్ధమైన సంకీర్తనల ద్వారా తెలుస్తుంది. అన్నమయ్య జీవిత తపస్సు వేంకటేశ్వరుడు. అతని సంకీర్తనలు వేంకటేశ్వర చరణాంకితాలు. అతడు వావిలి పాటి వీరరాముని పేర్కొన్నా, కడప వెంకటరమణుని పలుకరించినా ఆ దేవతలకు వేంకటాచలం రాక తప్పదు, వేంకటేశ ముద్ర వేసుకోక తప్పదు. శ్రీ వేంకటాద్రి చేరిన వావిలపాటి రామచంద్రుని అన్నమయ్య మనసార, నోరార గానం చేస్తున్నాడు.

---

[29] వెంకటధీశ

[26] 1-10 దాకా ఈ పాటలన్నీ 11640. Copy 1427a సంగీతం - పదాలు, తంజావూరు సరస్వతీ మహలు గ్రంథాలయం నుండి సేకరించబడినవి.

## 15

రామక్రియ

పల్లవి

రాతిఁబతిమ నేసిన రామచంద్ర! నీ
చేతిలోని దాన నింతే శ్రీరామచంద్ర

చరణాలు

వట్టి రట్టు సేయకిఁక వద్దు రామచంద్ర
నెట్టన నేను దూరనోప నిను రామచంద్ర
వొట్టితిఁబ్రేమము నీపై వో రామచంద్ర మమ్ము
వట్టి జాలిఁబెట్టకిఁక వద్దు రామచంద్ర

విన్నపాలు వేయునేల విను రామచంద్ర నా
కన్నులకు నీవె గురి ఘన రామచంద్ర
యెన్నిక నన్నుఁబాయకు మిఁక రామచంద్ర
నిన్ను నన్ను నెంచుకొమ్మీ నీవు రామచంద్ర

ఆయము లంటితివి నెయ్యపు రామచంద్ర వొక్క
పాయమే ఇద్దరికిని బలు రామచంద్ర
ఆయెడ వావిలిపాటి హరి రామచంద్ర
చేయార శ్రీవేంకటాద్రిఁ జెందితి రామచంద్ర

(చూడు. సంకీ. 36)

ఈ సంపుటంలో:

| | |
|---|---|
| వోగునూతులౌభ శేశుడు. | 3 |
| వావిలిపాటి రామచంద్రుడు | 22, 34, 37, 38, 39, 40, 41, 44, |

అన్నమయ్య సంకీర్తనల్లో అపురూపంగ గోదాదేవి మీద పాట ఒకటి ఈ సంపుటంలో గోచరిస్తుంది. ప్రాయశః నా దృష్టికంది నంత వరకు ఇదొక్కటే 'ఆండాళమ్మ'ను స్తుతించే కీర్తన. [27]'వాడె వెంకటేశుడనే వాడె, వీడు' అనే సంకీర్తనలో 'పెరియాళువారి బిడ్డ పిసికి పై వేసిన విరులదండల మెడ వేసినవాడు' అని ప్రస్తుతిస్తాడు. ద్రవిడ దేశంలో వెలసిన మహాభక్తుడు పెరియాళ్వారు. అతని పెంపుడు కూతురు గోద. ఒక మహాభక్తుని సుసంస్కృతమైన తులసీవనంలో పెరి గిన ఆధ్యాత్మికపు మొలక గోద. తండ్రి గ్రుచ్చి కూర్చి శ్రీరంగనాథుని అలంకరణకు సిద్ధం చేసిన వనమాలను తాను ధరించి మురిపాలను

[27] చూడ. అధ్యా. సం. < సంకీ. 121. పు. 83. తి.తి.దే. 1980

కుమ్మరించి పంపేది. తన భర్తుంల మధుర స్పర్శను పొందిన ఆ మాలను ప్రణయానందంతో రంగనాథుడు ధరించేవాడు. ఆ ప్రణయమే గోదా రంగనాథుల పరిణయానికి దారి తీసింది. ఈ మనోజ్ఞమైన కథ ఎందరో మహాకవులకు కావ్యత్వసిద్ధిని చేకూర్చింది. శ్రీ కృష్ణ దేవరాయలు భగవదాదేశంతో ఆ గోదాకల్యాణగాథను 'ఆముక్తమాల్యద' మహాకావ్యంగ అవిష్కరించినాడు.

"ఎన్నినుఁగూర్తునన్న విను మే మును దాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలి సెప్పుము మున్నుగొంటి నే
వన్నసదండ యొక్క మగవాఁడఁడ నేనుఁ దెలుంగు రాయఁడ
న్గన్నడరాయ యక్కొదువగప్ప ప్రియాపరిభుక్తభాక్కథన్"

(ఆము. 1-14)

తిరుమల వేంకటేశ్వరుడే శ్రీరంగనాథుడు. ఈ కలియుగంలో రాముడైనా, రంగడైనా ఈ గోవిందుడే. నేటికి తిరుమల దేవాలయంలో ధనుర్మాసవేళ గోదాదేవి అర్పించిన 'తిరుప్పావై' గానం చేస్తారు. బ్రహ్మోత్సవ వేడుకలలో శ్రీవిల్లిపుత్తూరునుండి గోదాదేవి ధరించిన బొందు తోమాలను తెచ్చి తిరుమల వేంకటరమణునికి (మూలవర్లకు) సమర్పణం చేస్తారు. 'అప్పిన్నది' అంపిన సుమమాలను క్రీడాశుకాన్ని ధరించి ఉత్సవాలపెళ్లికొడుకు మురిసిపోతాడు. 'శ్రీ వేంకటేశుడు తానె వచ్చి పెండ్లాడిన మహాలక్ష్మియట చూడికుడుతనాచారి'.

లలిత

చూడరమ్మ సతులాల సోబానఁబాడరమ్మ
కూడున్నది పతిఁజూడికూడనాచారి

శ్రీమహాలక్ష్మియట సింగారాల కేమరుదు
కాముని తల్లియట చక్కఁదనాల కేమరుదు
సోముని తోఁబుట్టువట సొంపుఁగళ కే మరుదు
కోమలాంగి యీ చూడికుడుత నాచారి

కలశాబ్ధి కూఁతురఁట గంభీరాల కేమరుదు
తలఁప లోకమాతయట దయ మరి యేమరుదు
జలజనివాసి యట చల్లఁదన మేమరుదు
కొలదిమీర యీ చూడికుడనాచారి

అమర వందితయట అట్టె మహిమే మరుదు
అమృతము చుట్టమట ఆనందాలకే మరుదు
తమితో శ్రీవేంకటేశుఁ దానె వచ్చి పెండ్లాడె
కామెర వయసు చూడికుడుతనాచారి.

(చూడు. సం. 246)

సీతావియోగపరితప్తహృదయుడైన రాముడు లక్ష్మణునితో బావురుమన్నాడు. 'వన వాసంత పవనాలు సీతలేని నన్ను తపింప చేస్తున్నవి. సీత లేక ఒంటరిగ బతుకుతున్న నన్ను ఈ మంద మారుతాలు అగ్నిహోత్రునిలా దహింప చేస్తున్నవి. కమలదళాల వంటి విశాలనయనాలతో ఒప్పు 'సీతను చూడని నాకు జీవితం మీదనే విరక్తి కలుగుతున్నది' అని సౌమిత్రితో రాముడు వాపోయినాడు.

మాం హ్యద్య మృగశాబాక్షీ చింతాశోక బలాత్కృతమ్
సంతాపయతి సౌమిత్రే క్రూరశ్చైత్రో వనానిలః
(కిష్కిం. స. 1 శ్లో. 35)

ఏష పుష్పవాహో వాయుస్సుఖ స్పర్శో హిమావహః
తాం విచింతయతః కాంతాం పావక ప్రతిమోమమ
(కిష్కిం. స. 1. శ్లో. 52)

పద్మపత్రవిశాలక్షీం సతతం పంకజప్రియామ్
అపశ్యతో మే వైదేహిం జీవితం నాభిరోచతే
(కిష్కిం. సర్గ. 1. శ్లో. 66)

[28]రామాయణాన్ని నవంగ ద్విపదలో అన్నమయ్య రచించినాడని చిన్నన్న పేర్కొన్నా దానిని మనం దక్కించుకోలేక పోయినాము. [29]సంకీర్తనా త్మకంగ అన్నమయ్య వినిపించిన రామకథ, చరిత్ర, మహిమలు కొన్నింటినైనా మన భాగ్యవశాన ఆస్వాదించకలుగుతున్నాం.

"చంద్ర మందానిలాదులు, యెరవై మమ్మింత యేఁచీ నేమిసేతు వీనిని" అంగన చూపు చందురు నంటె నా చూపును నంటె అంగజతాప మారదాయఁ జూడు తమ్ముఁడా (చూడు. సం. 74) అని రామయ్య తమ్మునితో నిర్వేదపడతాడు. ఈ సన్నివేశంలో రామ లక్ష్మణుల మధ్య సాగిన సంభాషణ ఒక మనోహరమైన పాటగ మన ముందు నిలిచింది.

శ్రీరాగం

పల్లవి

రా: కానకుంటి మిందాఁకా కంటి మాడకుఁబోదము
ల: కానీలో అందుకేమి కళవళ మేలయ్యా

---

[28] "ప్రవిమల ద్విపద ప్రబంధ రూపమున, నవముగా రామాయణము.." అన్న.చరి. చిన్నన్న పు. 45-46. తి.తి.దే. 1978

[29] 'వాల్మీకి రామాయణమెల్ల, రాగంబుతో నమరాగంబుతోడ, బాగుగా గంధర్వులాగుగఁజదివి' అన్న.చరి.చిన్నన్న. పు. 30. తి.తి.దే. 1978

చరణాలు

రా: తొంగిచూచె నదె సీత తూరుపునఁ దమ్ముఁడా
ల: నంగతిఁ జందురుఁడింతె నతిగాదయ్యా
రా: చెంగట నే వెదకఁగాఁ జేరి నవ్వీఁ జూడరాదా.
ల: రంగగు వెన్నెల లింతే రామచంద్ర చూడుమా

రా: పొంచి చేతఁదిలిచీని పొద దండ నదె సీత
ల: అంచెల తీగె యింతే అటుగాదయ్యా
రా: యెంచనేల దవ్వులను యెలిఁగించీ వినరాదా
ల: పెంచవు నెమలిగాని పిలుపు గాదయ్యా

రా: నిలుచుండి చూచెనదె నిండుఁగొలఁకులో సీత
ల: కలువలింతే ఆపెగాదయ్యా
రా: కలికి శ్రీవేంకటాద్రిఁ గాఁగిలించె నిదె నన్ను
ల: తలఁపులే నాకె నిన్నుఁ దగిలుండునయ్యా (చూడు.సం.105)

అన్నమయ్య సంకీర్తనలకు వర్చస్సు నిచ్చినది శ్రీనివాసుని తిరు మూర్తి అందాలు, ఉత్సవ వైభవాలు, తత్త్వ రహస్యాలు, విశిష్టాద్వైత ధర్మ సూక్ష్మాలు. అన్నమయ్య తిరుమలలో కాపురముండి వేంకటరమ ణుని నిత్యోత్సవ వైభవాలను ప్రత్యక్షంగ దర్శించి పరవశించి గానం చేసినాడు. స్వామి సుప్రభాత సేవనుండి ఏకాంత సేవదాకా సకల సేవ లను కీర్తించినాడు. వేదంలా, ద్రవిడ వేదంలా, అన్నమయ్య సంకీర్తన 'తెలుగు వేదంగా'. స్వామి నిత్య సేవా కార్యక్రమాలలో భాగంగ నిలిచి పోయింది. అన్నమయ్య పాట వింటూ తిరుమలపతి నిద్ర లేస్తాడు. అన్నమయ్య పాటవింటూ అలమేలుమంగపతి నిద్రపోతాడు. అన్నమ య్యకు తిరుమలయ్యకు ఉన్న సంబంధమది.



[1] "హరిపూజ హరిసేవ హరికీర్తనంబు
హరి మననము ధ్యాన మనిశంబుఁదనకు"

[2]అన్నమయ్య శృంగార సంకీర్తనలు విని వేంకటపతి మంచి ప్రాయపువాడైనాడట. అన్నమయ్య విశ్వలోకపతికి సాగే తట్టు పునుగు కప్పురకాపుల సేవలను మహిమాలంకార సమన్వితంగ వర్ణిస్తాడు. వేంకటరమణునికి తిరుమలలో ప్రతి శుక్రవారము అభిషేకము. ఈ అభిషేకోత్సవాన్ని అన్నమయ్య మరొకచోట "కంటి శుక్రవారము గడియలేడింట, అంటి అలమేల్మంగ అండనుండే స్వామిని" అని కన్నులకు కట్టినట్లు వర్ణిస్తాడు. తెనాలి రామకృష్ణుడు కూడ 'శుక్రవారపు సొగసుల వాడని' ఈ స్వామిని అభివర్ణిస్తాడు. వర్ణనాతీతుడు, వర్ణాలకు లోబడనివాడు శ్రీవేంకటనిలయమూరితి.

పల్లవి

ఏమని వర్ణించునాకో ఇఁకఁ బురాణములెల్ల
వేమరుఁగొత్తలాయ విశ్వలోకపతికి

చరణాలు

పాలజలనిధిలోన పలుమారుఁ దేలఁగాను
నీలవర్ణమెల్లఁబోయి నిండుఁదెలుపై నట్టు
మేలిమి కప్పురకాపు మేననిండ నించఁగాను
పాలికె వేరొక్కటాయ పురుషోత్తమునికి

---

[1] అన్న. చరి. చిన్నన్న. పు. 30. తి.తి.దే. 197౦
[2] "జగతి నీ శృంగార సంకీర్తనముల కగపడి మంచి ప్రాయపువాఁడనఁ దీ.'

వేడుకఁగాళిందిలోన వేమారు నీఁదఁగాను
ఆడనే కమ్మర నలుపైనట్లు
తోడనే తట్టుపుణుఁగు తొప్పఁదోఁగ నించఁగాను
జాడ వేరొక్కటాయ సర్వేశ్వరునికి

అలమేలుమంగ నురమందునే నిలుపఁగాను
అలరి బంగారు వర్ణమైనట్టు
నలుగడ సొమ్ములతో నానావర్ణములు
నిలిచె శ్రీవేంకటనిలయమూరితికి.

(చూడు. సం. 110)

'తిరు తేరుమీద నేఁగీ దేవదేవోత్తముడు' అని అలమేలుమంగతో కలసి ఊరేగే వేంకటాద్రిపతిని (చూడు. సం. 119) వర్ణిస్తాడు. 'పుష్పయాగ' వేడుకలతో మురిసే దేవుని కీర్తిస్తూ 'అలమేల్మంగ తురుము విరులే నీకు, పొరసి నీ వురముపై పుష్పయాగము' (చూడు. సం. 207) అని సాభిప్రాయంగ చెబుతాడు. 'అలర్ మేల్ మంగై' అనే ద్రవిడ శబ్దానికి 'పూవు మీద నిలచిన పదునారేండ్ల యువతి' అని వ్యుత్పత్తి. శ్రీరంగాన్ని భోగమండపమని, కంచివరదుని క్షేత్రాన్ని యోగమండపమని, తిరుమలను పుష్పమండపమని సంప్రదాయజ్ఞులు వ్యవహరిస్తారు. దేవతలు అనుదినం ఆకాశంనుండి పుష్పవృష్టిని కురిపించి తిరుమలలోని స్వయంవ్యక్తమూర్తిని అర్చించేవారట. తిరుమలకు వెళ్లే దారిలో ఒక కుగ్రామం ఉండేది. అక్కడ కురవనంబి అనే కుమ్మరివాడు కుండలు చేయగా మిగిలిన బంకమట్టితో పూలు చేసి తాను కొయ్యతో చేసుకొన్న వెంకటరమణమూర్తిని అర్చించేవాడు. తిరుమల దేవాలయంలోని శ్రీవారిని తొండమాన్ చక్రవర్తి స్వయంగా ప్రతినిత్యం బంగారు పువ్వులతో పూజించేవాడు. ఒకరోజు స్వామి పాదలపైన తాన

ర్పించిన బంగారు పువ్వులు తొలగి బంకమట్టి పువ్వులు నిలిచాయి. భక్త సులభుడు వెంకటపతి రాజును కుమ్మరి భక్తుని వద్దకు వెళ్లి అతని ద్వారా తన సాయుజ్యాన్ని పొందమని ఆదేశిస్తాడు. ఈ సన్నివేశాన్ని తెలిపే అన్నమయ్యపాట.

కాంబోది

**పల్లవి**

[2]కురవనంబి తిరుమల **కురవనంబి**, నీ
చరణములే కొలిచి బ్రతికె **కిరీటము**గలరాజు

దవ్వ్లామటనుండి నీవు పువ్వులఁబూజించితే అవి
చివ్వన అప్పని యడుగుఁదామెరలపై చెలఁగి యప్పుడే నిలిచె
పువ్వులకు తెక్కులున్నవో లేక పుండరీకాక్షుని మహిమో
నివ్వటిల్లు నీ భక్తియోకాని నేఁడు నాతోఁజెప్పవే.

పొంకపు దోసిటి యదుసున లెస్స పారలిన గన్నేరుఁబువ్వులు
కుంకుమగంధ మాకల్పములపై కోరి వేడి నిలిచె
బంకమన్నది యెంతవాసనో లేక పారిజాతముల కెక్కుడో
వెంకటపతి కెంత వేడుకో నాకు వివరింపవె అప్పయ్య

దోసిటిలోపలఁబెట్టిన శ్రీతులసి సేవంతిపువ్వులు
వాసిగ జగమెల్ల కుక్షిలో నిదుకొన్న వాని మేనెల్ల నిండె
వేసదారి యలమేలుమంగ శ్రీవేంకటేశ్వరుని మహిమో నీ
దాసరితనము బలమో కాని తలఁపు నాతోఁజెప్పవే.

(శేషాచార్యులగారి వ్రాఁతప్రతి)

---

[2]అన్న.చరి.పీఠిక. పుట 11. తి.తి.దే. 1978. కొండకు నడచివెళ్లే మార్గంలో కురవనంబి కథాశిల్పాలున్నవి. అక్కడ కుమ్మరి మండపం నామ-రూపాలే లేవు.

తిరుమలలో నందనోద్యానవనాలను తొలుత తీర్చిన ఘనత అనం తాళ్వారుదే. క్రీ.శ. 13వ శతా. భగవద్రామానుజుల ఆదేశంతో తిరు మలలో పుష్పకైంకర్యం చేయడానికి విచ్చేసినారట. ఈ ఆళువారుల తటాక నిర్మాణం, ఉద్యానవనాల తీర్మానం, అలమేలుమంగా శ్రీనివాసుల పుష్పవన విహారాలు దేవాలయ సంప్రదాయంలో భాగంగ నిలిచినాయి. [2]అనంతాళువారి తిరుమల జీవితం శ్రీనివాసునితో పెనవేసుకొని చరి తార్థమైనది. అనంతాళువారి వంశస్థులకు నేటికీ ఆలయమర్యాదలు సాగుతున్నవి.

అన్నమయ్య 'ఇదం బ్రాహ్మం ఇదం క్షాత్రం' అని గ్రాంథిక వ్యావ హారిక రూపాలను విశృంఖలంగ వాడారు. నానుళ్లను, పలుకుబళ్లను, జాతీయాలను విరివిగ ప్రయోగించినారు. ఏఁటికి యెక్కిన వానికేనిగె గుజ్జానో కాదో (సం. 31) బూడిదెలో వసంతమా (సం.32) విచ్చిన మేడిపంటి బోనము (సం. 39) సగము నవ్వితి నేను (41) వుప్పాగప్పా రమువలె వుండకుండీనా (సం. 86) బూతునఁదిట్టుదుఁజుమ్మీ. (సం. 108) మాణికాలపెట్టె వంటి మగువ నీ నోర (సం. 141) వేడుకకు వెలలేదు వేసాలకు గురిలేదు (సం. 240) తాసువలెఁపూఁడితివి (సం. 270) చిటివాసి తన బాస చేతికియ్యరే (సం. 346) కోటికిఁబడిగెత్తి. (సం. 382) మూఁటనవ్వులు నవ్వేవు (సం. 396) యెగపోసి దిగపోసి

[2] 'మఱియు ననంతాళువారి చెఱువుగట్ట, మన్నుమోయఁగా దెలిసె మీ నటనలు' (శేషాచార్యులవారి వ్రాతప్రతి) అన్న.చరి. పేజీ. 25 తి.తి.దే. 1978 'అచ్చపు వేడుకతోడ ననంతాళువారికి, ముచ్చిలి వెట్టికి మన్ను మోఁచినవాడు'(-అధ్యా.సం. vసం.కీ. 93)--శ్రీనివాసుని తొలివనమాలి అనంతయ్యను పేర్కొన్నవే. వీరు రచించిన శ్రీ వేంకటేశ్వర ఇతిహాసమాల పరమ ప్రామాణికమైనది. దీనిని తెలుగు చేసిన వారు సుప్రసిద్ధ పండితులు శ్రీ ఎన్.సి.వి. నరసింహాచార్యులు (చూ. తి.తి.దే. ముద్రణ)

(సె.414). ఇరుమొనసూది (సం. 491) పచ్చి నవ్వు ముంచెను (సం. 508) కన్నులానోర వింటివి (సం. 547). చన్నులు వచ్చిన యంతే జవ్వనము (సం. )

అన్నమయ్య వ్యవహారంలో ఉన్న పదాలను ఉన్నట్లే వాడడం వల్ల అవి కొన్ని వ్యవహారంలో చ్యుతిని పొంది అర్థబోధనలో కొంత ఇబ్బందిని కలిగిస్తున్నవి. తాళ్ళపాక వాఙ్మయానికి ప్రత్యేకమైన నిఘంటువును సిద్ధం చేయవలసిన అవసరమెంతైనా ఉంది. ఈ దృష్టితోనే పూర్వ పరిష్కర్తలు అన్నమయ్య సంకీర్తనల సంపుటాల్లో శబ్దార్థ చర్చలు, సందిగ్ధపదసమీక్షలు చేర్చారు. వీనిని దృష్టిలో ఉంచుకొని ప్రధానంగా రాయలసీమ వ్యవహారంతో పరిచయమున్న పండితులతో చర్చించి, పద ప్రయోగసూచికలను సిద్ధం చేసుకొని చక్కని అవగాహనతో ఈ తాళ్ల పాకకవుల ప్రయోగాలకు ప్రత్యేకమైన నిఘంటువును సిద్ధం చేసినప్పుడు ఇటు తాళ్లపాక వాఙ్మయానికి అటు ఆంధ్రసారస్వతానికి ఎనలేని సేవ చేసిన వాళ్లమౌతాము. తిరుపతి దేవస్థానం యాజమాన్యం ఈ దిశలో పయనిస్తూ ఈ నడుమనే సుప్రసిద్ధ అన్నమయ్య వాఙ్మయ పరిశోధకులు ఉస్మానియా విశ్వవిద్యాలయ పూర్వాచార్యులైన వేటూరి ఆనంద మూర్తిగారికి ఈ పెద్దపనిని అప్పగించడం ముదావహం. ఈ సన్నివేశంలో 'తాళ్ళపాక కవుల ప్రయోగాలకు ప్రత్యేక నిఘంటువు' అని 24-5-89 ఆంధ్రప్రభ సచిత్ర వారపత్రికలో నేను వ్రాసిన ప్రత్యేక వ్యాసాన్ని గుర్తుకు తెస్తున్నాను.

## తాళ్ళపాక కవుల ప్రయోగాలకు ప్రత్యేక నిఘంటువు

తాళ్ళపాక కవులు 'ఇదం బ్రాహ్మం, ఇదం క్షాత్రం' అని గ్రాంధిక, వ్యావహారిక రూపాలను విరివిగ తమ రచనల్లో వాడారు. వ్యావహారిక

ప్రయోగాలను నిర్లక్ష్యంగా లొంగదీసుకొనే ప్రయత్నం కూడా చేసినారు. సమకాలీనమైన శాసనస్థ లిఖిత ప్రమాణాలను వీరి రచనలతో తులనాత్మకంగా పరిశీలించి, పరిశోధించి వానికి అర్థ నిర్ణయం చేయవలసి ఉన్నది. ప్రత్యేక నిఘంటు నిర్మాణానికి ముందు వీరి రచన లన్నింటికీ పదప్రయోగసూచికలు తయారు చేయించవలసిన బాధ్యత ఉన్నది. తరువాత జన బాహుళ్యంలో రాయలసీమ ప్రాంత వ్యవహారంలో జారిపోకుండా నిలిచిన శబ్ద సంపదను దృష్టిలో పెట్టుకొని తాళ్ళపాక కవుల ప్రయోగాలను బేరీజు వేసి, చర్చించి తేల్చవలసిన పని చాలా ఉంది. విశ్వవిద్యాలయాలు బాధ్యతగా స్వీకరించి ఇటువంటి నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను చేపట్టకపోతే, మన భాషకు తీరని అపాయం వాటిల్లక తప్పదు.

తాళ్ళపాక కృతులు పరిష్కరించిన పండితులు, తాళ్ళపాక వాఙ్మయ పరిశోధకులు ప్రారంభించిన సందిగ్ధ పద సమీక్షలను స్థాలీపులాకంగా ఇక్కడ పొందుపరుస్తున్నాను. భవిష్యత్తులో తాళ్ళపాక కవుల ప్రయోగాల అర్థ నిర్ణయ ప్రణాళిక కిది సూచన ప్రాయంగా నిలువగలదని ఆశంస.

**సంతకూటాల ధర్మపు సంగతి:**

(రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ తాళ్ళపాక పాటలు, సం. 11 పు. 7,24 సం. 5, సంకీ. 291)

**'పంతాన శ్రీవేంకటేశ పట్టి నీకె శరణంటి**
**సంతకూటాల ధర్మపు సంగతి నాకేలా'**

సంతలలో చేరు గుంపుల నడతల వంటి ధర్మాలు. ఒకరివలె ఇంకొకరు గాక, విరుద్ధంగా కూడా స్వల్ప ఫలానికై, ఫలమే లేక,

నడుస్తుండడం సంతలలో సహజం అటువంటి వాని గొడవ నాకేల? పరమఫలం నీవు చేతి కందునట్లుండగా - అని తాత్పర్యం.

**పన్నగపు దోమతెర:**

"విన్నపాలు వినవలె వింత వింతలు
పన్నగపు దోమతెర పైకెత్త వేలయ్యా"

(సం. 4 సంకీ. 25.)

"నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః శరీరభేదైస్తవ శేషతాంగతైర్యథోచితం శేష ఇతీరితే జనైః" అని శ్రీ యామునాచార్యులానతిచ్చినట్లు (స్తోత్రరత్నము. ప. 40) ఆదిశేషుడు శ్రీ మహావిష్ణువుకు పలు విధాలైన భోగోపకరణాలుగా సేవ చేస్తాడు. అలాగే ఆ పన్నగం - పాము - దోమతెరగా కూడా రూపెత్తి సేవిస్తాడు.

**అందగారి మాటలు:**

(రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, గౌరిపెద్ది రామసుబ్బశర్మ శృం.సం. సంపు. xix., సందిగ్ధపదసమీక్ష సం. 1,31) (శృం.రేకు. 514, సం. xix సంకీ. 82)

"అందగారి మాటలాడి ఆయము లంటి యంటి
యిందుముఖిఁజొక్కించి యేలుకొంటివి"

'అందగాఁడు' అనడానికి కన్నడంలో 'అందగార' అని రూపం. ఇది దాని ఔపవిభక్తికం కాగలదు. తెలుగు వారికి కర్ణాటక సామ్రాజ్యంతోడి పొత్తు గలిగిన ఫలంగా వచ్చిన అనేక శబ్దాల్లో ఇది ఒకటి.

**దోమటి:**

(శృం.రేకు 505 సం. xix సంకీ. 25)

"ఆమని పులకలలో నాసలు పెనగొనఁగ
దోమటిని వద్దివారితో నవ్వవలెనా"

(శృం.రేకు 532. సం. xix సంకీ. 129)
"పడంతి నీ పతికె భాగ్యములు
తొడింబడ దొరకెను దోమట్లు"

'అన్నము' అని సూర్యరాయాంధ్ర నిఘంటువు శబ్దరత్నాకరము లిచ్చిన అర్థం ఇక్కడ పొసగదు. 'దోమటి దొడుకు' అనే ప్రయోగం శబ్దపల్లవంలా పలుచోట్ల ఇందులో కానవస్తాంది.

**అలజాలము:**

(గౌరిపెద్ది రామసుబ్బశర్మ, అధ్యా. సం. 1 పు)
(అధ్యా. రేకు. సంఖ్య 35. సం. 1. సంకీ. 218)
'తట తటన నీటిమీందట నాలజాలంబు
లటునటుం జరించవా యాంది యాంది'
(అధ్యా. రేకు. సంఖ్య. 62. సం. 1 సంకీ. 321)

'అరయం జంచలముచే నాలజాలంబు వలెం
దిరుగ దొరకొనియెం దన దేహము'

ఈ పదం నిఘంటువులలో కానరాలేదు. అలజాలంబు - నీరు దండిగా నిండినప్పుడు, దానిపైన మూతి దగ్గర, తోక దగ్గర రెండు రెండు పొడవైన వెంట్రుకలు కలిగి, సన్నని శరీరంతో (సాలెపురుగులా) ఈదులాడే జలచరమా - అనిపిస్తాంది. నీటి ప్రవాహంలో కోలాహలంగా తిరుగులాడే ఈ జల జంతువుల ఆటే కాబోలు, నేటికి చాలా ఉత్సాహంతో చెలరేగిన కార్యక్రమాన్ని చెప్పేటప్పుడు 'అలజాలంగా ఉంది' అని వ్యవహారంలో ఉంది.

ఈ అర్థాన్ని పాటల్లోని ప్రకరణాన్ని బట్టి మాత్రమే నిర్ణయిస్తారు.

**ఆపోదము:**

(వేటూరి ఆనందమూర్తి. "తాళ్ళపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు" పు. 402)

తాళ్ళపాక వారీ పదాన్ని ఆసోదము, అసోద్యము, అసోదాలు, ఆసోదకాడు, ఆసోదకత్తె మొదలైన ప్రయోగాలను బ్రయోగించిరి. ఈ పదాన్ని తక్కిన తెలుగు నిఘంటువులు గ్రహించకున్నా, బ్రౌణ్య మిశ్ర మాండలిక పదకోశం మాత్రం 'ఆసోద for అనూదా - N.S. Rest. Respose, Refreshment. విశ్రాంతి. సేద దేర్చుకోవడము' అని వివరించింది. పారశీక భాషాపదం Contentment, happiness హాయి, పరితృప్తి అని దీనికర్థం. వీరి ఈ ప్రయోగాలు చూడండి.

"పవ్వళించి నామీఁద పయ్యెదకుంబెనఁగేవు - వెడగు
నీ యాసోదాలు విడు విడవోయి" (3-560)
"కా నీవయ్యా దానికేమి కలది కలట్టయ్యాని
అనుకొని యిఁక నెంత ఆసోదమో"(3-631)
"వాసితోడ సేవలు సేయఁగా
అసోదకత్తెని యందువుగా" (3-126)
"ఆసోద కాఁడవు నీ వన్నిటను
ఆ సుద్దులే మడిగీ నాన తీయవయ్యా" (3-622)

పై ప్రయోగాలలో ఆసోద - వాంఛ, కోరిక అనే అర్థాలు భాసిస్తున్నాయి. "ఆసోదము సం. xix సంకీ. 18" ఆసోదకాఁడవు నీకు నాండ్లుఁబాతా. ఇది 'ఆస్వాద' శబ్దభవమని పండితులొక్కరు సూచించిరి. ఆచోద్య భవమా? అని మేమనుకొనుచుంటిమి. "రమణీయత" అర్థం కావచ్చును.

—రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ.

## 'నిరుధాన'

పుట.1. అవతారిక "నిరుధానకు"

"....అది మొదలుగాను శాలివాహన శక వరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభి సంవత్సర ఫాల్గుణ బ. ౧౨ నిరుధానకు..."

ఇది సంకీర్తన తొలి రాగిరేకులోని అవతారికలో ఉన్న వాక్యము. "ఈ శబ్దము అపరిచితము. శ్రీ ప్రభాకరశాస్త్రి గారు 'నిరోధానకు?' తిరోధానకు? అని సందేహముతో పాఠము సూచించిరి. 'సరిగా' అను నర్థమున ప్రయోగించినట్లున్నది. ఇది ఇంకను అన్వేక్షనీయము" అని రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు తెలిపినారు. (శృం.సం. xii. పు. 1. 1956. T.T.D.). "నిరుధానము అనగా చనిపోవు అని అర్థమున ప్రయోగించినట్లున్నది." అని అర్చకం ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు పేర్కొన్నారు. (శృం.సం. xv పు. 1. 1961 T.T.D.) "ఈ పదము నిరోధ శబ్దమునకు సంబంధపడినది. నిర్యాణము = వరకునను నర్థమునఁబ్రయోగింపబడినది. (నిరోధము=వినాశము) అని పి.టి. జగ న్నాథరావుగారు తెలిపినారు. (శృం.సం. xviii పు.1 1964. T.T.D.). "ఈ శబ్దము 'నిరోధ' నిరుద్ధ శబ్దములకు వ్యావహారిక రూపముగ కానవచ్చుచున్నది. అడ్డగింపు, అవధి అని యర్థము. అనాఁడు కడపటి దినమని తాత్పర్యము. అవధి అను నర్థములో 'ఈ విరుద్ధమునకుఁ గుశలంబు మాకు' అను తరిగొండ వెంగమాంబగారి ప్రయోగము దీనికి సహాయపడుచున్నది. (విష్ణు పారిజాతము సాహిత్య అకాడెమీ. పు. 55) నేసి ప్రయోగ మివ్వగా శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారు "నిఋత్తం" అను అరవపదము కూడ "నిలువు" అను నర్థముతో దీనికిసహాయపడుననిరి." అని గౌరిపెద్ది రామసుబ్బ శర్మగారు చర్చించి నారు." (శృం.సం. xxiii పు.1. 1975. T.T.D.) అన్నమాచార్యుల సంకీర్తనల్లో గాని మరి ఇతర తాళ్లపాక కవుల వ్రాతలలోగాని నిరుధాన శబ్దప్రయోగం నా కంటికి కనపడలేదు. ప్రసిద్ధ నిఘంటువులలోను

పూర్వకవి ప్రయోగాలలోను ఈ శబ్దము కానరాదు. కొన్ని శాసనాలలో 'నిరుధాన' శబ్దం గోచరిస్తుంది.

(i)"......మా (సీమం) జెల్లే నగం బాలికిని ఒడంబడను అథ(న్) ముగొని యీదినం నిరుద్ధానకు యీస్తానానకూజెల్లే అటువంటి మానగం (విత్తి మేర సైతమైన అష్టభోగ తేజ సామ్యతలుంను) ఈ దినం ఆరభ్యంగాను......." (No. 6 (A.C. No. 404 of 1904) చిలుముకూరు, కమలాపురం తాలూక, కడపజిల్లా, అగస్త్యేశ్వరస్వామి కోవెలలో, హరి హరరాయులు II. 1382 A.D.)

(ii) "విరోధి సంవత్సర కాతిన్క మాసం మొదలు నందన సంవెత్సరం ఆషాఢమాన (ని) రుద్దానకు కానికెంగా నమ పిన్ంచిన ౧౯౪౧౦" నైవేద్యానకు సమపిన్ంచిన ౧౩౦ ఉభయం ౧౩౬౩ పితాంబర ౧కి తట్టు ౧ కిన్ని చెఱగులు నికిన్ని తిరు (మ) హారాల కిచ్చిన....."

(No. 97 (A.C. No. 542 of 1919. చిన్నకాంచీపురం, చెంగల్పట్టు జిల్లా ఆరుళాళ పెరుమాళ్ కోవెలలో అచ్యుత. క్రీ.శ. 1532)

(iii) ".....రం శ్రావణ. బ ౧౦ నిరుధానకు కానికగాను నమ పిన్ంచిన....."

(No. 98 A.R.No. 158 of 1924) కాళహస్తీశ్వర దేవాలయం అచ్యుత. క్రీ.శ. 1532)

(iv)"......నదాసివ దేవమహారాయలుంగారు | మాకు అమర నాయ కంరానకు పాలించిన మిరుతూరి గ్రామానను స్వామికి పూర్వాన చెల్లివచ్చే క్షేత్రం హస్తాక్షి ప్రమాణం కొలపాటి.... యి నిరుధానకు చెల్లివచ్చే క్షేత్రమును"

(No. 161 (A.R.No. 409 of 1426) మిడుతూరు, కర్నూలు జిల్లా చెన్నకేశవస్వామి కోవెల. సదాశివరాయలు. క్రీ.శ. 1547)

ఈ ప్రయోగాలను పరిశీలిస్తే 'నిరుధాన', 'నిరుద్ధాన' రెండు రూపాలు గోచరిస్తాయి, నాటి వ్యావహారిక రూఢియో లేక వ్రాయసగాని

సంస్కారమో. 'నిరుద్ధమునకు' అనే తరిగొండ వెంగమాంబ ప్రయోగం కూడ దీనితో పోలుతుంది. నిరుద్ధమునకు > నిరుద్ధానకు > నిరుధానకు కావడంలో వింతలేదు. నిరుధ్ ni-rudh, P.Ae-runaddhirunddhe: to hold back, stop, hinder, shit up, confine, restraine, check, suppress, destroy. R.V. etc., etc., to keep away, ward off, resume, R.V. Br., to surround or invest (a place) Rajat; Bh.P., to close (lit. 'a door' or fig 'heart', mind etc.,) M.Bh. Kar & C., to catch or overtake Mrich. i.20 (A Sanskrit English Dictionary - Sir Morein Monie Williams. First Edition. 1899) ఈ చర్చ శబ్దం వరకు సరిపోయింది. అర్థ నిర్ణయం చేయవలసి ఉన్నది. సర్వశ్రీ వేటూరి, రాళ్ళపల్లి, ఉదయగిరి, జగన్నాథ రావుల సూచనలు ఈ శబ్దార్థానికి సరిపడవు. గౌరిపెద్దివారు చేసిన సూచన కొంత సబబైనది. శాసనస్థమైన ప్రయోగాలను పరికిస్తే 'ఈ దినం దాక', 'ఆషాఢ మాసం వరకు,' 'బహుళ దశమిదాకా', 'యీ తిథివరకు' అనే అర్థాలే పొసగుతున్నవి. పైపెచ్చు నిరుధాన శబ్దం దినాన్నో, తిథినో అనుసరించి వస్తున్నది. సంకీర్తన రాగిరేకు లోని వాక్యంలో కూడ 'ఫాల్గుణ బహుళ ౧౨ నిరుధానకు' అని తిథిని అనుసరించినట్లే ఉన్నది. ఈ చర్చలను గురువర్యులు శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారికి లేఖమూలంగా తెలిపినప్పుడు వారు దయతో పరిశీలించి ఉత్తరం వ్రాసినారు. దాన్ని యథాతథంగ ఇక్కడ పొందుపరుస్తున్నాను. "బెంగుళూరు - 41, 26.7.77 చి.శ్రీ. శ్రీనివాసుల శెట్టికి మంగళాశాసనాలు. ఉభ.రి. నీ జాబు 22.7.77 ది. చేరి చాలా సంతోషించినాను. ఉద్యోగవ్యాజముతో నానా క్షేత్ర తీర్థ సేవ చేయగలిగితివి. ఆ వ్యాజం కూడ నిండుగా నెరవేర్చు కోగలిగినావు. అందుకు నా హార్దాభినందన పూర్వకమైన ఆశీస్సులు. నీ శ్రద్ధా వ్యాసంగాల మూలమున తాళ్ళపాక సారస్వతం పరిపుష్టమై నిలువగలదు. ఇతరులెవరు గమనించినా గమనింపక పోయినా 'తృప్తాం తర్పయన్తీం' అని పేర్కొనబడిన శ్రీ శ్రీనివాసులు గలరు." నిరుధా

నకు శబ్దార్థం నీ పరిశీలనలో స్థిరమైనది. 'నిఋత్తం' అనే తమిళపదము నిఋతం -నిరుధంగా పరిణమించేది ఆ భాషలో సహజం. నిరోధ-నిరుద్ధ శబ్దాలకు ఆ యర్థంలో సంస్కృత వ్యవహారం కానరాదు. తెలుగులోను క్వాచిత్కముగానే ఒకప్పుడుండి ఊడిపోయిన దనిపిస్తుంది. ఎట్లైనా అర్థభేదం లేదు. ఇట్టి పదాలెన్ని కాలక్రమంలో ఊడిపోయినవో ప్రాచీన వాఙ్మయం పరిశీలిస్తే తెలుసుకోగలము. తమిళంలోను నాటినేటి మాటలలో ఎక్కడైనా వాడుకలో నుండునేమో పరిశీలింపదగును."

ఇక్కడంతా క్షేమం. శ్రీ శ్రీనివాసుల కృప. మీ క్షేమాన్ని తెల్పుము.

మంగళాశీస్సులు

(సం.) రా.అ.కృ.శర్మ.

ఈ చర్చను ఇంతటితో ముగిద్దాం.

దేవస్థానం యేలుబడిలో ఉన్న రాగిరేకులన్నీ యథాతథంగా ఫొటోస్టాట్ కాపీలు తీసి వీనిని శాశ్వతంగా భద్రపరచవలసి ఉంది. పరిష్కరణ పేరుతో కొన్ని మార్పులు, చేర్పులు కూడ తప్పని సరిగ జరిగినవి. ప్రామాణికమైన పరిశోధనలు జరగడానికి ప్రాథమిక ఆధారమైన ఈ రేకులలోని వ్రాతలను పరిశీలింపవలసి ఉన్నది. దేవస్థానం యాజమాన్యం చిన్నవి, పెద్దవి అన్నీ కలిసి సుమారు మూడువేల దాకా ఉన్న ఈ రాగి రేకుల ఫొటోస్టాట్ కాపీలు తీయించే ప్రయత్నంలో ఉన్నారు. రేకులోని వ్రాతకు ముద్రణ కెక్కిన పాటలకు ఉన్న తేడాను గమనింపగలరు.

శుభమస్తు|| శ్రీమతే రామానుజాయ నమః|| స్వస్తిశ్రీ జయాభ్యు[1]దయ శాలివాహన శక వరుషంబులు 1346 అగునేటి క్రోధి సంవత్సరమందు తాళపాక[2] అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుఁడు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహనశక వరుషంబులు 1424 అగు నేటి ధుందుభి సంవత్సర ఫాల్గుణ బ. ౧౨ నిరుధానకు తిరువెంగళనాథుని మీఁదను అంకితముగాను తాళపాక[3] అన్నమాచార్యులు విన్నపము చేశిన[4] శృంగార సంకీర్తనలు. || శ్రీవేంకటేశాయనమః ||

శ్రీరాగం || పల్లవి || యేవ్వారి కేవ్వారు యెక్కడికి నెక్కడ | నీవు మాకు నేఁకనేల నిజమైనాఁడెవ్వరా || అర్ధమ రాతిరి దాఁకా నందు నిందు నుండి వచ్చి | పొద్దువోరా నీకు నింత పొలశినొల్లములు[5] | నిద్దుర గంటికి లేక నీకు నుండ వారమా | పొద్దిక చాలనివారముండినానుండితిగి || ౧ || వేఁకమైన పరితాప వేదనఁ బొరలలేక | కాఁక వుట్టి[6] తిరిగేవు కన్నుగానలేక | మేఁకట దీరఁగ[7] నీక నెంధరు గలరని | పోఁకల వులుసుక లువులఁ బుచ్చవలెనా || ౨ || అందగాఁడ తిరువేంకటాద్రీశ పెక్కిండ్ల | విందపై నీ పొకతెపై పెచ్చుఁదన మున్నదో[8] | మందె మేళమున నీతో మాటలాడితిమిగాక | కెఁడువ మన్నన చాలు కలకాలమెల్లనూ[9] || ౪ ||

బైరవి[10] || పల్లవి || గందము వూశేనోలే కమ్మని మేన యీ | గందము నీమేని తావికంటే నెక్కుడా || || అద్దము చూచే వేలే అప్పటప్పటికిని | అద్దము నీ మోము కంటే నపురూపమా | పొద్దిక[11] తామెర[12]విరి నొత్తేవు కన్నులు నీ | గద్దరికన్నులకంటే కమలము ఘనమా || ౧ || బంగారు పెట్టేవేలే పడఁతి నీమెయి నిండా | బంగారు నీ తనుకాంతి పతి ఎచ్చీనా [13] | వుంగరా[14] లేటికినే పొడికవువేళ్ల | వెంగలి మణులు నీ వేలి గోరఁబోలునా || ౨ || సవరమేఁటికినే జడియు నీ నెరులకు | సవరము నీ కొప్పు సరివచ్చీనా | యి పలఁజవులు నీకు నేలే వేంకటపతి | సవర నీకెమ్మోవి[15] చవికంటేనా || 3 ||

ముద్రిత ప్రతి:
[1] జయాభ్యుదయ
[2] తాళ్లపాక
[3] తాళ్లపాక
[4] చేసిన
[5] వలసినొల్లములు
[6] కాకపుట్టి
[7] మేఁకట దీర
[8] పెచ్చుఁదన మున్నదా
[9] కలకాల మెల్లమ
[10] భైరవి
[11] ఒద్దిక
[12] తామర
[13] ప్రతివచ్చీనా
[14] ఉంగరాలేటికినే
[15] సవరని కెమ్మోవి

ఇప్పటికే గ్రంథం పెరిగింది. పూజ్యులు గురుతుల్యులు కీ.శే. గౌరిపెద్ది రామసుబ్బశర్మగారితో, వారి పరిష్కరణ కార్యంతో ప్రత్యక్ష సంబంధమున్న నాకు, ఈ విధంగా వారు అసంపూర్ణంగ వదలిన 32వ. సంపుటాన్ని పూర్తిచేసే భాగ్యం కలిగింది. ఆ సౌభాగ్యాన్ని ప్రసాదించిన శ్రీనివాసునికి, ఆ శ్రీవారి ప్రతినిధి శ్రీ ఎం.వి.యస్. ప్రసాద్ గారికి నా కైమోడ్పులు. అన్నమాచార్య ప్రచార కార్యక్రమాలను తొట్ట తొలుత నాతో చేయించిన దేవస్థానం యాజమాన్యం, అన్నమాచార్య ప్రాజెక్టు సంస్థాపకసంచాలకులుగ నన్ను నియమించిన అధికారులు, మళ్ళీ మూడవసారి అన్నమయ్య కార్యకలాపాలతో సంబంధాన్ని కలిగించారు. "నేమానఁబాడే వాఁడను నేరము లెంచకుమీ, శ్రీ మాధవ నేనీదాసుడ శ్రీవేంకటేశుఁడవయ్యా" అని అన్నమయ్య గొంతుతో శ్రుతి కలపడమే నేను చేయగలిగిన పని. కొండలయ్య లీలలు ఊహాతీతాలు.

ఈ 32వ సంపుటం వ్రాతప్రతిలో శ్రీ గౌరిపెద్ది గారి వ్రాతతో బాటు చి. జాలకంటి బాలసుబ్రహ్మణ్యం చేతి వ్రాత కూడ ఉంది. రేకులతో పోల్చినప్పుడు కనిపించిన వ్రాయసగాని తప్పులను అక్కడక్కడ క్రీగీతతో సూచించినాను. పీఠికతోబాటు విశేషానుబంధాన్ని చేర్చినాను. విషయవిస్తరభీతితో నేను క్లుప్తంగ శబ్దార్థ తాత్పర్యాల చర్చ చేసినాను. ముందు ముందు సంపుటాలలో మరికొన్ని అంశాలను విపులంగ చర్చించే అవకాశం కలుగుగాక. 1979లో తయారైన ఈ వ్రాతప్రతిని ఇంతకాలం భద్రపరచి పరిష్కరణ ప్రకటనల కోసం నా కప్పగించిన సప్తగిరి సంపాదకులు శ్రీ కె. సుబ్బారావు గారి అప్పు తీర్చుకోలే నిది. ఈ సంపుటం ముద్రణ విషయంలో తగు ప్రోత్సాహాన్నిచ్చిన దేవస్థానం పౌరసంబంధాల అధికారి డాక్టర్ రావుల సూర్యనారాయణ మూర్తి గారికి, శ్రద్ధాభిమానాలతో నాకు ఆనుకూల్యాన్ని కలిగించి గ్రంథ ప్రకటనలో తోడ్పడిన ప్రెస్ అధినేత శ్రీ విజయకుమార్ రెడ్డిగారికి, వారి సిబ్బంది శ్రీ గోవిందరాజ ప్రభృతులకు నా ధన్యవాదాలు. ఈ

ప్రూఫులు దిద్దడంలో నాకు సహకరించిన ఆత్మీయ మిత్రులు చేట్లూరు శేషాద్రికి, నా కుమార్తె చి|| వైజయంతికి మంగళాశాసనాలు.

ఎన్నో నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపట్టి మావంటి వారిచే ఈ పనులు చేయిస్తున్న దేవస్థానం ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీ తిక్కవరపు సుబ్బరామిరెడ్డిగారికి, సభ్యులకు మరొక్కమారు నమస్కరిస్తూ ఆ అన్నమయ్య జీవనాయికతో పాటు నేనూ పాడుకొంటాను.

ఇంకనైనఁ గరుణించ వేమయ్య శ్రీ
వేంకటేశ మా ఇంటికి విచ్చేయవయ్యా.
చింతాజలధి దాఁటఁజెక్కు చేయి తేపసేసి
కాంత నీకెదురు చూచీఁగదవయ్యా
కొంతవుఁగోరికలనే కొండ వాఁకఁదన జడ
ఇంతలో నిచ్చెన సేసీ నిది చూడవయ్యా
వెడ చింతజీఁకటికి వెలుగుగా నిట్టచూపు
కడఁగి పంజువట్టె రాఁగదవయ్య
అడరి తమకమనే అడవి దాఁట నిట్టూర్పు
యెడ గుఱ్ఱముగఁజేసి యెక్కె నిదె కోవయ్యా.
మదనానలంబార్చ మంతనానఁ జెమటల
నదులు వరపి నిన్ను నవ్వెనయ్య
యిదివో శ్రీవేంకటేశ యింతలోఁగూడఁగ నిన్ను
మదిరాక్షి నీ పొందు మరవలేదయ్యా. (32-17)

భవదీయుడు,
**కామిశెట్టి శ్రీనివాసులు.**
ప్రాజెక్టు అధికారి, రికార్డింగు విభా
తి.తి. దేవస్థానములు.

**తిరుపతి,**
**25-6-1992.**

# విశేషానుబంధం

సం.3 అహోబలేశ > ఓభళేశ. అహోబలం ప్రధాన నరసింహ క్షేత్రం. కర్నూలు జిల్లా ఆళ్లగడ్డకు సమీపంలో ఉంది. అహోబలాన్ని 'ఓబులం' అని వ్యవహరిస్తారు. అహోబలం, అహోబిలం అని రెండు పేర్లు ప్రచారంలో ఉన్నాయి. 'భ' మహాప్రాణం 'ళ' మూర్ధన్యం వ్యవహారంలో చేరినవే. 'వోఁగు నూతులు' కడపకు సమీపంలో పులివెందల మార్గంలో ఉన్న నృసింహ క్షేత్రం. అన్నమాచార్యులు ఈ స్వామి మీద చాల పాటలు పాడారు. ఈ క్షేత్రాన్ని నేడు 'వేయి నూతుల కోన' అని వ్యవహరిస్తారు. కడప ప్రజలకిది వనభోజన విహారస్థలము.

సం.6 'మెస్త్రిరా', 'నిలరా' 'పదరా' అన్నమయ్య వ్యావహారిక భాషోద్యమానికి నిదర్శనాలు. 'జగతి కదు చెల్లుబళ్లై నగినగి భాషించునట్టి నానుడి పలుకులు తగదన రహి చెదు'నని వారి విశ్వాసం. 'గుడిలోనే ఉందువు గాక' అని. పురుష బోధక ప్రత్యయం లోపించినది.

సం.13 'తగులఁదీసుట' తగుల తీయుట. తీయు> తీసు +ట భావార్థంలో.

సం.18 'జాజర' చర్చరీ శబ్దభవమని.

"వీణాగానము వెన్నెల తేట
రాణ మీరగ రమణుల పాట
ప్రాణమైన పిన బ్రాహ్మణు వీట
జాణలు మెత్తురు జాజర పాట"

— నాచన సోమనాథుని వైజయంతీ విలాసం

వెన్నెలరేల కన్నెపిల్లలు గుంపులు గుంపులుగ చేరి చప్పట్లు చరుస్తూ చేసే బృందగానం.

సం.26 'తీపులఁబెట్టితి' తీపులఁబెట్టు. "సీ. తెల్లగ్రుడ్డులు తేలగిర్లి తీపులు పుట్ట దోషముల్ పొందుగఁదొట్టగిల్ల" కవిక. 5 ఆ. యాతన. (శ.ర.)

సం.37 'బతిమి వొయ్యీనా' బతము వై.వి. వ్రతము కళా.పూ. 'సమీపంలో ఉన్నంత మాత్రాన వ్రతం చెడిపోతుందా' అనే అర్థంలో

సం.39 'ఎక్కినవానికేనిగె గుజ్జె' ఎక్కినంతవరకు ఏనుగ ఎత్తుగనే ఉంటుంది. ఎక్కిన తర్వాత ఏనుగ పొట్టిదే ఔతుంది. 'ఏనిగె' 'ఏనుగ' వ్యావహారిక రూపం.

సం.64 'మాఁచనోలు', 'మాచనవోలు' అని వ్యవహారం. అక్కడ అధిష్ఠాన దైవతం చెన్నకేశవస్వామి.

సం.66 'బంటి' లోతు యొక్క ప్రమాణం. (బ్రౌణ్యం), నీళ్ల కొలదిని దెలిపెడి ప్రత్యయము (శ.ర.) 'చన్నుల బంటి' అనిగూడ ప్రయోగం.

సం.68 'నాచుబొమ్మచారితనము' నాచు: దొంగ (బ్రౌణ్యం) దొంగ బొమ్మచారి అంటే 'దొంగ బ్రహ్మచారి' బ్రహ్మచర్యము యథార్థం కాదు.

సం.70 'చెతురుఁడ' 'చతురుఁడ' వ్యావహారిక రూపం. 'నట్టు కొట్టు' ఆలస్యముచేయు (బ్రౌణ్యం).

సం.71 'ముగిఋంచ' పదమధ్యంలో 'ఋ' అచ్చుగ వ్రాయడం ఈ రేకులలో సర్వసాధారణం.

సం.86 "వుప్ప గప్పురము వలె వుండకుండీనా". అన్నమయ్య నాటికే ఈ ప్రయోగం ప్రచారంలో ఉంది. వేమన్న నీతి పద్యాలద్వారా ఇది బహుళ ప్రచారాన్ని పొందింది.

సం.87 'పొరచి' వ్యర్థము, నిస్సారము. గ్రామ్యం. భారత ప్రయోగం. ఆది. ఆశ్వా 5. 161. 'నాఁడి ముత్యాలు'

సం.102 నిత్యానపాయిని అలమేలుమంగ ఉరమున కాపురమున్నందుకు ఆమాత్రం స్వామికి ప్రణయసపర్యలు చేయవలసిందే. అన్నమయ్య మనోహరభావాలకు ఈపాట మచ్చు తునక.

సం.105 'మెలిఁగించి' కంఠస్వరము, కూత

సం.108 'బూతునఁదిట్టుదు' చెడ్డమాటలలో తిట్టడం. బూతు, తిట్టు రెండిటికి చెడ్డమాట అనే అర్థమున్నా నేటి రాయలసీమ వ్యవహారంలో 'తిట్టే'; 'బూతు' లేదు.

సం.112 పతితో పంతములేల ప్రణయానికి ముందుపడవమ్మా అని ఈ భక్తుడు అలమేలుమంగను బుజ్జగిస్తున్నాడు.

సం.117 తాను కరఁగి పతిని కరగించి ఉరమెక్కి నిలిచిన అలమేల్మంగ.

సం.119 అలమేలుమంగతో రథమెక్కి తిరిగే పురుషోత్తముడు, రథోత్సవ వర్ణన.

సం.121 'అంగజ సాముల'చేత అంగజగురుని మురిపించిన అలమేలుమంగ.

సం.124 పతిని మాటలతో, పాటలతో, ఆటలతో సయ్యాటలతో వశం చేసుకొన్నే అలమేలుమంగ.

సం.126 రతులలో తేలి పవ్వళించిన తిరుపతి గోవిందరాజస్వామిని వర్ణించేది.

సం.134 'ప్రేరేఁతుఁగాని' 'ప్రేరేపించెదవుగాని' అని

సం.136 అన్నమయ్య యశోదమ్మ పిలుపు. చిన్ని కృష్ణయ్య లీలావిలాసాలు.

సం.140 'సుసరమయిన'. సుసారము: సరళమైన. (గ్రామ్యం)

సం.143 'మర్నాడు' మరునాడు. 'రేపు లేదు మొర్నాడు' అనే వ్యవహారం కడపలో ఉంది. ఇక్కడ మొర్నాడు అంటే ఎల్లుండి అని తాత్పర్యం.

సం.146 'నిష్ఠురి' నిష్ఠురురాలని దెప్పకండి అని తాత్పర్యం.

సం.148 'సూడుఁబాడు' పగతో కూడుకొన్న. 'నాలుక బెల్లాలు చూప' ఒట్టి మాటలతీపే చేతల పసలేదని. నోటి మాటలతో మరపించడం.

సం.154 'అంగపుఁజమట' చెమట రూపం.

సం.157 కృష్ణలీలలు. 'కే చమరె' చేతితో కొట్టడం. 'తురిగి'- తుఱుగు. తురుగు: క్రుక్కుట.

సం.156-158 బాల కృష్ణలీలలు.

సం.158 'పంచనుండే దుష్టు' దగ్గరుండే దుష్టుడు. 'క్రిష్ణుడు' 'కృష్ణుడు' వ్యవహారంలో 'క్రిష్ణుడు'.

సం.163 'యింటిచెట్టు మందుగాదు' పెరటిచెట్టు మందుకు పనికి రాదని - సామెత

సం.167 'గదరుకో' 'గదరుకొను' గట్టిగ ఎదిరించి మాట్లాడటం కడపజిల్లా వ్యవహారం.

సం.170 'చలఁగితి' 'చెలఁగితి' ఉచ్చారణ విధేయంగ వ్రాతలో 'చె>చ'

సం.172 'నొడిగితిమి' నుడుగు> నొడుగు, నుడువు: చెప్పడం.

సం.173 అలంకార సంపద. ఆ సుకుమారి నిట్టూర్పులగాలికి కొట్టుకొని పోవలసినదే. చనుగొండల బరువులే నిలి పినవట.

సం.174 'వావిచడ' వావివరుస. (చె>చ) బంధుత్వము చెడ అని తా.

సం.180 'అసము' యు.దేవి. 1 చనవు, దర్పము. 'అస మున మీఁదెఱుంగక, భార.విరా. 5. ఆ.' 2. యశము. 'అసంబున మీఱైదు' య. 3. ఆ.

(శ.ర.) Tadbhava form of Skt. యశము – కీర్తి, ఉద్రేకము, యశము -- అధికారము, బలము, సందు, ఎడము, "కులగిరిపై నుండి కుంభిని మీది కస మున నురుకు సింహంబు చందమున", H.D. ii. 2069 మొగుడు అసమిచ్చినందున అది యింత త్రుళ్లుచున్నది. (బ్రౌణ్యం)

సం.180 'ముల్లు ముంటనే తీరీ ముసల మేటికి'-- ముల్లును తీయడానికి ముల్లుచాలు రోకలి అక్కరలేదని.

సం.181 అహోబల క్షేత్రంలో వెలసిన లక్ష్మీనరసింహస్వామి వర్ణన. ఈ ప్రహ్లాదవరదునికి విశాలమైన ఉన్నత మైన గుడిగోపుర ప్రాకారాలు 'చిన్న అహోబిలంలో' ఉన్నవి. ఊరు, వాడ ఇక్కడే. పెద్దహోబలంలో ఉండేది ఉగ్రనరసింహుడు. గుహలో వెలసిన స్వయం వ్యక్తమూర్తి. పెద్ద అహోబిల పర్వత సానువులలోనే నవనారసింహాల మూర్తులున్నవి. అన్నమయ్యను అను గ్రహించిన మూర్తి. అన్నమయ్యకు తిరుమల తర్వాత చాల అభీష్టమైన క్షేత్రం.

సం.182 కోన తిరువెంగళేశుని గురించిన పాట.

సం.184 అహోబలేశ > ఓభళేశ

సం.185 'వస్తివా' అన్నమయ్య వ్యావహారిక భాషోద్యమానికి నిద ర్శనం.

సం.186 తొండమారేగుళ్ల గోపీనాధుని గురించి. ఇది ఎక్కడ ఉన్నదో పరిశీలించవలె.

సం.193 ఇంతి భాగ్యమే భాగ్యము. ఎడసిన ఒక సఖి. ఎనసిన ఒక సఖి.

సం.207 పుష్పయాగం. తిరుమల దేవాలయంలో ఇది ఒక మహో త్సవంగ ప్రతి సంవత్సరం నిర్వహింపబడుతుంది. తిరుమల క్షేత్రం పుష్పమండప మనడానికి మరికొన్ని

ప్రమాణాలు చూపిన తి.తి.దే. ఆళ్వారు దివ్య ప్రబంధ ప్రాజెక్టు ప్రత్యేకాధికారి శ్రీ వరదరాజన్‌గారి నివేదిక (19-6-92).

## PUSHPA MANDAPAM

Pushpa Mandapam is a name first mentioned for Tirumala in Acharya Hridayam of Acharya Alagiya Manavala Perumal Nayanar (14th Century) while describing the ups and downs of one's caste in doing service to God. Here the commentator Acharya Manavala Mamunigal refers Tirumala as Pushpa Mandapam where Kurumbarutha Nambi did kainkarya by way of offering sand flowers, that was accepted by the Lord. Here, the Acharya quotes a line in Nammalvar's Tiruvoymozhi that speaks the greatness of Tirumala and for giving the name Pushpa Mandapam. To quote: సిందుప్పూ మగి తిరువేంగడం The famous commentator Acharya Nambillai narrates Alwar's inner thought thus:

Nitya Suris (Celestials) in Paramapada with their King Vishvaksena came down, in their strength, to serve the Lord at Tiruvengadam. Having seen Lord's simplicity (souseclya) in showing His attributes to living creatures like elephants, monkeys, lions and so on on the Hill, Nitya Suris get swept off their feet by the Lord's amazing simplicity and the extraordinary (अप्राकृत) flowers/garlands, brought by them to be offered to Lord, drop from their hands unnoticed and scattered on the floor of the Hills and immediately blossomed without fading. Such is the greatness of Tirumala where the flowers even though brought from Paramapada

but . for the relationship and naturality of Tirumala, it blossomed so beautifully than the buds in plants.

Hence Pushpa Mandapam is the name adorned to Tirumala. Kanchi Sri P.B.A. Swami also wrote in his commentary that because of Alwar's description the name Pushpa Mandapam is adorned to Tirumala.

In S.V. Ithihasamala, there is a mention that in chapter 9 of Varaha Purana, that a flower garden was established by a devotee Ranga Dasa, apart from mentioning Nambi story in Tirumala Ozhugu; later on by Yamuna, Ananthalwar and so on.

సం.208 'వుప్పతించి, ఉప్పతించు: ఓర్వక ఆడిపోసుకొను. 'వోవలు సేసేవు' ఓవు. To fit, to be agreeable సరిపడు, ఒవ్వు, (బ్రౌణ్యం)

సం.212 'ఒరయించు' పరీక్షించు

సం.213 'దిచ్చరి' వ్యభిచారి.

సం.215 'ఏరాలిఁ' ఏరాలు. దే.వి. (ఎరవు+ ఆలు) తోడికోడలు (శ.ర.). 'కరికుంభజగన' కరికుంభములవంటి జఘనాలు (పిరుదులు) జఘనాన్ని కరికుంభాలకు పోల్చడం విలక్షణం.

సం.246 చూడికుడనాచారి! చూడికుడుతనాచారి. తమి. శూడి కుడుత్తనాచ్చియార్. (కురులకు) అలంకరించుకొని ఇచ్చిన (సమర్పించిన) అమ్మవారు.

సం.260 వొడ్డాఁబెట్టా మాటలాడ' ఒడ్డా: పందెమిడుట.

సం.263 'కణజముగాఁగట్టి' ధాన్యం పోసే గాదె

సం.276 ఈ ప్రహ్లాదవరదుడు అహోబల లక్ష్మీనరసింహస్వామి.

సం.277 ఈ విట్ఠులుడు పండరంగి దేవుడో మరేవూరవెలసిన వాడో. అన్నమయ్య సంచారంలో ఎక్కడ తగిలినవాడో.

సం.278 హంపీ విజయనగరంలో వెలసిన కృష్ణయ్య

సం.281 భూపతి చెర్వు. ఇది ఎక్కడో అంతుచిక్కలేదు.

సం.286 'అడియాలపుంబులక' అడియాలము: గుర్తు, సంకేతం.

సం.299 'వ్రాటుకూరి కోనేటిరాయ' రాజంపేటకు తాళ్ళపాకకు సమీపంలోని గ్రామం. అక్కడి దేవుని అన్నమయ్య కోనేటి రాయుడని వ్యవహరించాడు.

సం.319 'లగ్గదింపులు' Assault bafflers (these were stones kept upon fortresses to be rolled down upon the beseigers) కోటమీద నుంచి శత్రువులపైకి దొర్లించే బండలు (గ్రామ్యం).

సం.320 'నాటు చేసు' తాంకుజేసు' తద్ధర్మక్రియలు చేయు > చేసు.

సం.329 'పొస్తకాన' పుస్తకాన.

సం.330 'ములికలు' మెలికలు-వంచన మాటలలో మెలికలు తిప్ప వద్దు.

సం.338 'తెలుతము' తెలియచేయుదుము. తెలుచు ధాతువు తెల్లముచేయు అనే అర్థంలో (గ్రామ్యం)

సం.345 'తెక్కులి' వంచకులు.

సం.346 'చీటి వాసి తన బాస చేతికియ్యరే' తాను చేసిన ప్రతిజ్ఞ చీటిమీద వ్రాసి యివ్వడం.

సం.347 'సొంట్లు' దోషాలు (గ్రామ్యం) "వెంటనరుదెంచు తన మచ్చెకంటి తీరు, సొంట్లు సోదింపఁగడకంటఁజూచు కొనుచు. శుక 2. ఆ. (శ.ర.)"

సం.355 'చదువుతా' శత్రర్థంలో.

సం.384 పాటలు పాడుతూ అర్థాలు వివరించడం.

సం.404 వేంకటేశ్వరుడు కొండమీది గొల్లపల్లె దేవుడనీ వ్యవహారం.

సం.430 'కైలాటాలు' cf కలసి యిద్దరిలోనఁ గైలాటమిడుచు. అన్న శ్వం. మం) కైలాటము| కయిలాటము. మాయోపాయము (శ.ర.) ఈర్ష్యాకలహమని ప్రకరణార్థం.

సం.445 మనికితము. దే.వి. దుఃఖము. వి.పు. 7 ఆ. (శ.ర.)

సం.446 ఒందిరి దుఃఖము.

సం.491 'ఇరుమెన సూది' రెండువైపుల పదునే.

సం.494 మీనబావపాట.

సం.533 'వొళవు' ఒళవు. మర్మము. (గ్రామ్యం)

సం.540 'యీగెమెట్లు' వీణమెట్లు.

సం.547 'కన్నులా నోరా వింటివి' సంభ్రమాశ్చర్యాలతో వినడం.

సం.563 'నిజము నిష్ఠూరము' నిజము చెపితే నిష్ఠూరము. అని వ్యవహారం.

* * *

శ్రీరస్తు

శ్రీ తాళ్లపాక

# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు

## ౨౬వ సంపుటము

స్వస్తి శ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౮ అగు నేఁటి క్రోధిసంవత్సరమందు, తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారుయేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను, అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగునేఁటి దుందుభిసంవత్సర ఫాల్గుణ బ. ౧౨ నిరుధానకు[1] తిరువేంగళనాథునిమీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపముచేసిన శృంగార సంకీర్తనలు.

రేకు 1601 ముఖారి

పంతగాఁ డప్పటి నన్నుఁ బైకొననేలే
పొంత చెమటలలోనె పుంగుడయ్యేఁగాక || పల్లవి ||

---

[1] ఈశబ్దము 'నిరోధ' 'నిరుద్ధ' శబ్దములకు వ్యావహారికరూపముగా గానవచ్చు చున్నది. అడ్డగింపు, అవధి అని యర్థము. ఆనాడుఁ కడవటిదినమని తాత్పర్యము, కీ. శే. ప్రభాకరశాస్త్రిగారూహించిన "సరియుగు" అన్నునర్థము తాత్పర్యార్థము గావచ్చును. 'అవధి' అనునర్థములో "ఈ నిరుద్ధమునకుఁ గుశలంబు మాకు" అను తరిగొండ వెంగమాంబగారి ప్రయోగము దీనికి సహాయపడుచున్నది. సాహిత్య అకాడమీవారి విష్ణుపారిజాతము 55 పుట. నే నీప్రయోగ మివ్వగా శ్రీమాన్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, "నిఋత్తం" అనుఅరవపదముకూడ 'ముపు' అనునర్థములో దీనికి సహాయపడుననిరి. (గా.రా.) 'నిరుధాన' మరికొన్ని శాసనస్థ
గాలు, చర్చ, చూ. అనుబంధము (కా.శ్రీ.)

మక్కువలేనివిభుఁడు మాటలాడఁ బనియేమే
వొక్కమనసునఁ దానే వుండుఁగాక
చిక్కని నవ్వులతోనే సెలవి గొణఁగనేలే
వుక్కవలపుల నేనే వుమ్మగిలేఁ గాక || పంత ||

మనసురానిపతి మముఁ దిట్టఁబనియేమే
తనరాజసముతోనే దైవారుఁగాక
కనుచూపుఁగోపముతో కాఁకపులకలతోనే
తనరూపు దలపోసి తమకించేఁగాక || పంత ||

అలిగినరమణుఁడు ఆపపడి కూడనేలే
పిలిచినదాఁకా నుండి పెనఁగుఁగాక
చెలఁగి వేడుకతోడ శ్రీవేంకటేశుఁడు దానె
కలఁడు నాకు గతెని[1] కళదేరేఁగాక || పంత ||

కాంబోది

దొడ్డవానితోడిపొందు దొరకినంత చాలదా
గొడ్డేరే మరికొంత కొసరూ వలెనా || పల్లవి ||

తలఁచితి నపుడే తనరూపము మతి
కులికి కన్నులఁ గనుఁగొనవలెనా
బలిమి వీణెలోనఁ బాడితిఁ దనపదాలు
మలసి ఇంకా వేరే మాటలాడవలెనా || దొడ్డ ||

సేసవెట్టితి నపుడే చేతులకొలఁదులను
మూసి మంతనాల నేను మొక్కవలెనా
ఆసల నారూపు వా(వ్రా?)సియంపితిఁ బటమునను
రాసికెక్క నే నింటికి రావలెనా || దొడ్డ ||

---

[1] గతి+అని

కూరిమితో నపుడే కొనగోర( జెనకితి
కోరి వేరే కాఁగిట నేఁ గూడవలెనా
ఆరయ శ్రీవెంకటేశు నంటితి మీ మాఁట వింటి
నేరుపులు మీతోను నెరపఁగవలెనా || దొడ్డ || 2 ||

### సాళంగనాట

ఓభళేశ[1] వోఁగునూతులోభళేశ
శోభనము నీకు నాకు జోడుగూడెఁగాదా || పల్లవి ||

వున్నతి గిరు లెక్కితి[2] వోఁగునూఁతులోభళేశ
యెన్నిక నాకుచగిరు లెక్కరాదా
యెన్నఁగ నిట్టూరుపులతో యేఁటికైనా నలసేవు
అన్నిటా నారతులలో నలయురాదా || ఓభ ||

ఆకసము మోవ రూప మందితి విందరిలోన
ఆకసము నానడుము నంటరాదా
పైకొని వెన్నెలలోనఁ బతి గాఁగ నవ్వేవు
మేకొని నాసరసాన మించి నవ్వరాదా || ఓభ ||

తెరచి నోరు ముయ్యవు తియ్యని ఆసలతోడ
సారిది నామోవి చవిచూడరాదా
అరిది శ్రీవేంకటాద్రి నటు గూడి నేఁడీడ
నరసింహరూపమైతి నాటకము గాదా || ఓభ || 3||

---

[1] అహోబలం సుప్రసిద్ధ నృసింహక్షేత్రం. కర్నూలు జిల్లాలో ఉన్నది. ఈ క్షేత్రాన్ని 'ఓబులం అని' అక్కడి స్వామిని ఓబులేశని స్థానికులు వ్యవహరిస్తారు. (కా.శ్రీ.)

[2] వివరణ అనుబంధంలో

## ముఖారి

విన్నపము నొకటే విచ్చేసేది నొకటే
అన్నివనులాయు[1] మమ్ము నంపేవో అంపవో || పల్లవి ||

చిత్తమెల్లా నిగిరించెఁ జెక్కులెల్లాఁ జెమరించె
కొత్తవలపు సతికి గోరమాయను
జొత్తులవిభుఁడ నిన్నుఁ జూచినయప్పటినుండి
వత్తివలెనాయ మేను వచ్చేవో రావో || విన్న ||

పరగ తురుము జారె పచ్చిపులకలు మీరె
పురుటుఁబాయము సతి కొమ్మదాయను
సరసాన నీవు నవ్వు చల్లినయంతటనుండి
యెరవాయ నిద్దురలు యెనసేవో లేవో || విన్న ||

నిట్టూరుపులు రేఁగె నివ్వెరగు లవె మూఁగె
యట్టె కన్నెకాఁగిలి యింతాయను
గట్టిగా శ్రీవేంకటేశ కలసితివి యింతిని
వొట్టి యీడనే యెప్పుడు నుండేవో వుండవో|| విన్న || 4 ||

## శంకరాభరణం

ఎక్కువైనదొర దాను యిల్లాల నేను
వొక్కటి గమ్మనీఁ దాను వోయమ్మ వెరతునే || పల్లవి ||

మొక్కితి నేఁ జేతులెత్తి మోనాన నుండితిని
చిక్కుదేరె నింక నేమిసేయుమనీనే
పక్కన నవ్వితి నే నప్పటిఁ దలవంచుకొంట
యెక్కువతక్కువ లింక నిందులోన నేలే || ఎక్కు ||

[1] అన్ని వనులాయు.

దగ్గరి విడెమిచ్చితి దవ్వులనే నిలుచుంటే
సిగ్గువిడిచింక నేమిసేయుమనీనే
నిగ్గుల నిక్కి చూచితి నే నింటిలోని కేఁగితి
వెగ్గల మింతకు నెరవేసా లేలే ॥ ఎక్కు ॥

పాదము లొత్తితిని పానుపుపైఁ బండితిని
సేదదేరె నిఁక నేమిసేయుమనీనే
ఆదరించి శ్రీవేంకటేశుఁ డిటు గూడె
వాదులెల్లఁ దీరె నిఁక వంతువాసు లేలే ॥ ఎక్కు ॥ 5 ॥

## రామక్రియ

మేలుమేలు జాణవౌదు మెచ్చితిరా నిన్ను
పోలికెకు నవ్వితేనే బూమెలు సేసేవా ॥ పల్లవి ॥

చేరలంతలు కన్నులఁ జిమ్మి తిట్టే విట్లైతే
మారుకుమారు దిట్టేఁబో మానరా నీవూ
కోరేటిదేవుఁడవైతే గుడిలోనే వుందుగాక
చేరి మొక్కినట్టివారిఁ జెలఁగు వట్టేవా ॥ మేలు ॥

సన్నసేసి బొమ్మలనే జంకించే విట్లైతే
నిన్నుఁ గమ్మర జంకించే నిలరా నీవు
వున్నతపుదొరవైతే వూళ్లేలుదువుగాక
వన్నెలవిడె మిచ్చితే వావి చూచేవా ॥ మేలు ।

సంగడిఁ జేయిముట్టి సరసములాడే విట్లైతే
వంగించి నే నట్టేసేసేఁ బదరా నీవు
రంగుగ శ్రీవేంకటేశ రాజువలె నుందుగాక
వుంగిటి నిన్నుఁ గూడితే వురమెక్కించేవా ॥ మేలు ॥ 6॥

రేకు 1602 శంకరాభరణం

తనిసితి మన్నిటాను దలవయ్యా
కనుసన్నలెల్లఁ గంటిఁ గానీవయ్యా || పల్లవి ||

పిలువా నేరుతువు బిగియా నేరుతువు
పలికినపాటే చాలుఁ బట్టకువయ్య
చలమొ పలమొ చనవిమనవు[1] లింకఁ
గలిగినపాటే చాలుఁ గానీవయ్యా || తని ||

కరఁగించ నేరుతువు కాకుసేయ నేరుతువు
వరుస నాఁడే చాలు వద్దువద్దయ్య
సరసమో విరసమో సారెసారె వినయాలు
యిరవైనపాటే చాలు యింతేలయ్యా || తని ||

తత్తరించ నేరుతువు తరితీపు నేరుతువు
బత్తిగలంతే చాలు బాసలేలయ్యా
అత్తి శ్రీవేంకటపతి ఆదరించి కూడితివి
పొత్తు నత్తుఁ గూడె నింక బూటకమేలయ్యా|| తని || 7 ||

ముఖారి

చూతమువో నీబలిమి జోలి యింతేల
కాతరించి పడనేల కానీలే యిఁకను || పల్లవి ||

---

[1] 'చను' ధాతువుపై 'చనువు' కృదంతము. 'మను' ధాతువుపై 'మనవి' పోలికతో 'చనవి' వాడినట్లున్నది. లేక 'చనవు+ఈమనవు విశేషము' తోచుట లేదు.

రమ్మంటే నలిగేవు రాపుగాఁగ మలిగేవు
నిమ్మపంట వేసితేనే నీకు నొచ్చెనా
వుమ్మడి నాకొనగోర నూఁదితే నేమిసేతువే
యెమ్మెలఁ బంతగత్తె వెందువోయే విఁకను || చూత ||

వంక చూచితే నవ్వేవు వట్టిసటలఁ బెట్టేవు
కుంకుమనీరు చల్లితే గురిదాఁకెనా
బింకపునీకుచములు పిసికితే నేమందువో
తెంకినే యీచలమెల్లఁ దెలిసెఁబో ఇఁకను || చూత ||

కాఁగిట సిగ్గువడేవు కలిసితే నవ్వేవు
కాఁగినమన సొక్కటై కళదాఁకెనా
ఆఁగి శ్రీవేంకటపతి నదె మెప్పించితి నిన్ను
చేఁగల నాచలమెల్లఁ జెల్లెఁగదె ఇఁకను || చూత || 8 ||

## లలిత

అన్నిసింగారాలు నీకె అమరుఁగాక
యన్నిటా దేవతలు నిన్నిందుకే మెచ్చేరు || పల్లవి ||

చందురునివంటిమోము జలజాలే కన్నులట
యిందిర నీకే తగు నీ కొత్తలు
గొంది నొకటొకటెకిఁ గూడవందు రివి నీకు
పొందై పాలవెల్లి తోడఁబుట్లే కావా || అన్ని ||

ముక్కు సంపెంగవంటిది ముంగురులు తేంట్లట
ఇక్కువలు నీకే తగు నీ కొత్తలు
అక్కున[1] వరలక్ష్మివి హరి వసంతమాధవుఁ
డెక్కడా మీ కిద్దరికి యెనయికే కాదా || అన్ని ||

ధర నడుము సింహము తగు గజగమనాలు
తిరమై శ్రీవేంకటేశుదేవి నీకే పో
నరసింహుఁడె యుండి కరిఁగాచినట్టివాని-
సురత మందితిగాన చుట్టమువేకోవా || అన్ని || 9

శ్రీరాగం

మంతనపుసన్నలేల మానరమ్మ
చెంతలఁ జేరితే వీఁడు సిగ్గువడీనమ్మా || పల్లవి

నుదురెల్లఁ జెమరించె నూఁగుదూలిమేనితో
అదె వీది నాడివచ్చెనమ్మ కృష్ణుడు
కదిసి గోపికలకాఁగిటఁ బెనఁగెనంటా
నిదులఁ[2] గొంద రేఁటికి నిందవేసేరమ్మా || మంత

సారె జారేకాసె తోడ చల్లేటి ముద్దులతోడ
అరితేరి బుసకొట్టీనమ్మ కృష్ణుఁడు
తారి వెన్న ముచ్చిలఁగాఁ దరిమితే వచ్చెనంటా
నేరమివేసి మీరేల నిందలాడేరమ్మా || మంత

---

[1] ఈ పాదములో అభాస విరోధము స్పష్టముగ లేదు. వరలక్ష్మి శబ్దములో శ్రావణమాసము వర్షర్తువూ గ్రహించి, వసంత వర్షములభిన్న ధర్మములలో విరోధము చూపి, లక్ష్మి-మాధవ శబ్దములతో పరిహరింపవలెనా
[2] నిదులన్

తేనెగారేమోవితోడ తేఁకువ శ్రీవేంకటాద్రి-
నానుక నిలుచున్నాఁడోయమ్మ కృష్ణుఁడు
కానుకగా నింతులకే కాచుకున్నాఁ డితఁడంటా
నేనే వినఁగ నేల నిందలాడేరమ్మా || మంత || 10 ||

## దేసాళం

పోపో యెందువోయేవో పోయి రారాదా
కోపులవెనుక[1] నన్నుఁ గూడేవుగాని || పల్లవి ||

పక్కన నాతో[2]మాటపలుకు లాడేవుగాని
యెక్కడో పరాకు నీకు నిదెఱఁగనా
చక్కఁజూచి నాతోనే సటలుసేసేవుగాని
చిక్కనినీమతిలోనిచింత వేరేరా || పోపో ||

యెదురైనవాఁడవై యిటు నిలిచితిగాని
అదన నీతమకము లవి వేరేపో
ముదముల (న?) నూరకైన మోవినె నవ్వేవుగాని
కదిసిననీమేనికాఁక వేరేరా || పోపో ||

కళలు సోఁకఁగ నన్నుఁ గాఁగిలించితివిగాని
తలమోచివచ్చినట్టితమి వేరేపో
యెలమి శ్రీవేంకటేశ యిపు డొక్కటాయఁగాని
కలదాననేని నీకుఁ గడమేది లేదురా || పోపో ||

[1] కోపులు=నిలుకడలేని పోకడలు, దంభాలు విసురుమాటలు ఇత్యాద్యర్థములలో మాండలికము. కోపులు వదొద్దు ఇత్యాదివ్యవహారమీనాటికి గలదు
[2] మాటపలుకు=ఈ జంట పదమునకు ముందుమాట్లాడుట-దానికి బదులాడుట అర్థము కాద.

### మంగళకౌశిక

సవతి చుట్టరికాలు జగతిలోఁ గలవా
వివరించుకొంటగాక వినయా లింకానా || పల్లవి ||

వద్దు వద్దు వాదులు వలవనిపోదులు
యిద్దరి జాడలు గంటి మింకానేలే
అద్దో నీవేమిసేతు వాతనివల్లనే కాక
కొద్దిమాలి నే నీతోఁ గొసరే దింకానా || సవ ||

కాతరపుటానలు కదుఁబచ్చిమేనులు
యీతనికి నీకె తగు నింకానేలే
వోతరుణి యేసినవాఁడుండఁగ నమ్మేమిసేయు
తోతో నీకును నాకు దొమ్ము లింకానా || సవ ||

చాలుఁజాలు బాసలు చక్కనాయ రేసులు
యీలక్రాఁ కుప్పు చాల దివి యింకానా
అలరి శ్రీవెంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
వాలుకరెప్పలు నీపె వంచే దింకానా || సవ || 12 ||

### సామంతం

వట్టినేరా లెంచ కిఁక వచ్చేవో రావో
చుట్టరికాలలో యింత సూదుఁబాదుఁ గలదా || పల్లవి ||

బొమ్మల జంకించితేనే పూఁచి మాటాడుత(ట?)గాదా[1]
కొమ్మకు నీమీఁద నింత కోపమున్నదా

[1] వేయు, వ్రాయు, కోయు మొదలగు ధాతువుంపై 'తజ్' వర్ణము భావార్థమున వచ్చి నట్లు 'అడు' ధాతువుపై వచ్చుట సంప్రదాయమువుగాదు. అరసున్నయూ లేదు. అగు ధాతు-రూపాంతరమైన 'అవు' పై 'టాత'వలెనా?

వుమ్మడిగా నవ్వితేనే వుంకువ వెట్టుత(ట?) గాదా
ఇమ్ముల నీతో నాకె యెగసక్కెమాడెనా || వట్టి ||

తప్పక చూచినదే తగులఁదీసుటగాదా
అప్పుడే యాకె నిన్ను నదలించెనా
అప్పటి నెదుటనుంటే యాసపడుటగాదా
వుప్పతించి ఆకె నిన్ను నొరయఁగవచ్చెనా || వట్టి ||

సంగడిఁ గూచుండితేనే సమరతి యౌతగాదా
చుంగుల నీతో బలిమి చూపవచ్చెనా
రంగుగు శ్రీవేంకటేశ రమణిఁ గూడితి విట్టె
చెంగట నప్పుడే నేను చెప్పినదేకాదా || వట్టి || 13 ||

## కాంబోది

వట్టిజోలి దవ్వనేల వచ్చేవో లేదో
ఇట్టె తారుకాణించ ఇది నాకుఁ దడవా || పల్లవి ||

ముందట నీ వుండఁగాను మొగమోట మంటిఁగాక
ఇందు నిన్నుఁ గోపగించ నెంతలేదు
అంది చేయి వేయఁగాను అన్నీ మరచితిఁగాక
నిందలు నీపై వేయ నేఁడు నాకుఁ దడవా || వట్టి ||

మించి నీవు నవ్వఁగాను మోహమే చల్లితిఁగాక
యెంచి నీతో నలుగఁగ నెంతలేదు
మంచానాకుఁ దియ్యఁగాను మనసుగలిగెఁగాక
వెంచి నీతో మారుకొని పెనఁగఁగదడవా || వట్టి ||

గక్కన( గా(గిలించ(గ( గళవట్టై వుంటే(గాక
ఇక్కువ( బచ్చిసేయ(గ నెంతలేదు
చెక్కునొక్కి కూడితివి శ్రీవేంకటేశ నన్ను
మొక్కితి(గాక నిన్ను మోసపుచ్చ(దడవా || వట్టి ||

వరాళి

అంగడి( బెట్టుకోకు నీయాచారాలు
చెంగట నన్నాడించితే చెల్ల(బెట్ట( బదరా || పల్లవి ||

కానికానితిట్లల కా(కలతో వొట్లల
తేనెవంటినీగుణాలు తెలిపేవేరా
వూని కొంగు వట్టనేల బొమ్మల జంకించనేల
నాన(బెట్టి పరులతో నవ్వవా నీవు || అంగ ||

నిక్కినిక్కి వాదులేల నెల(తలపోదులేల
మొక్కినట్టే నీతప్పు మోపేవేరా
లెక్కలేనియానలేల లే(తమాయ లి(కనేల
చక్కనిసతులతోడ జాణతనాలాడేవా || అంగ ||

సారెసారె సన్నలేల సందిగొంది చిన్నెలేల
బీరమేల నిన్నే మెప్పించేలేరా
ఆరసి నే(డు శ్రీవేంకటాధిప కూడితి నన్ను
వోరి నీవింతకతొల్లె వొకరి[1] నెఱి(గవా || అంగ || 15 ||

దేసాళం

మా(టొకటి చే(తొకటి మతకమై యుందిగాని
మూ(టవలపులే కాని మోహము దెలియరా || పల్లవి ||

---

[1] 'వొక్కరి' తాళానుగుణ మేమో?

చిత్తములోపల నీకు చింత యెందున్నదోకాని
గుత్తపుఁగళలు దేరీ గురి నీమోము
యెత్తి(న)[1] విరహోనన్నుండే ఇటునాయలవు చూచి
రిత్త వగచేవుగాని కొత్త లివెక్కడోరా || మాఁటొ ||

కాయముమీఁదట నీకుఁ గాఁక యెట్టున్నదోకాని
చాయల చూపుల నీకు సంతసమే పో
పాయముతో (లో?) నిన్నుఁబాసి పడియున్ననన్నుఁ జూచి
మాయల కెత్తితిగాని మచ్చికేమీఁ గానరా || మాఁటొ||

కూడినకూటములోనఁ గోరి కెట్టున్నదో కాని
నీడ నీభావము నివ్వెరగులే
యీడనే శ్రీవేంకటేశ యేకమైతి మిద్దరము
వీడనాడితి నిందాఁకా విరసాలు లేవురా|| మాఁటొ || 16 ||

**ఆహిరి**

ఇంకనైనఁ గరుణించవేమయ్య శ్రీ-
వేంకటేశ మాఇంటికి విచ్చేయవయ్యా || పల్లవి ||

చింతాజలధి దాఁటఁ జెక్కుచేయి తేపసేసి
కాంత నీ కెదురుచూచీఁ గదవయ్యా
కొంతవుఁ గోరికలనే కొండవాఁకఁ దనజడ
ఇంతలో నిచ్చెనసేసీ నిది చూడవయ్యా || ఇంక ||

---

[1] 'ఎత్తినవిరహోనన్' అన్నంతవరకు కర్మధారయము. 'ఉండే' అనుధాతుజ విశేషణముతో 'ఎత్తి...నన్' అనుదానికి అభానకర్మధారయము. 'ఉండే' అనుధాతుజ విశేషణానికి 'నాయ-లవు' తో కర్మధారయము. మధ్యలో 'ఇటు'కు సంబంధమేమి? యతినిర్బంధములోవచ్చిన 'ఇటు' సమాసమధ్యపతితమైనది.

వెడ చింతచీఁకటికి వెలుగుగా నిట్టచూపు
కడఁగి పంజువట్టె రాఁగదవయ్య
అదరి తమకమనేలడవి దాఁట నిట్టూర్పు
యెడ గుఱ్ఱముగఁ జేసి యెక్కె నిదె కోవయ్యా || ఇంక ||

మదనానలం బార్ప మంతనానఁ జెమటల-
నదులు పరపి నిన్ను నవ్వెనయ్య
యిదివో శ్రీవేంకటేశ యింతలోఁ గూడఁగ నిన్ను
మదిరాక్షి నీపొందు మరవలేదయ్యా || ఇంక || 17 ||

## శ్రీరాగం

వాడలవాడలవెంట వసంతము[1]
జాడతోఁ జల్లేరు నీపై జాజర జాజర జాజ[2] || పల్లవి ||

కలికి నవ్వులె నీకుఁ గప్పుర వసంతము
వలచూపు కలువల వసంతము
కులికి మాటాడినదే కుంకుమ వసంతము
చలమునఁ జల్లె నీపై జాజర జాజర జాజ || వాడ ||

కామిని జంకెన నీకుఁ గస్తూరివసంతము
వాముల మోహపు[3] నీటి వసంతము
బూమెల సరసముల (లె?) పుప్పొడి వసంతము
సామజగురుఁడ నీపై జాజర జాజర జాజ || వాడ ||

---

[1] వసంతము=సంబరము, ఆనందము ఇత్యాది కావచ్చు
[2] ఇది గూడ 'జాజర' అనియే యుండవచ్చు. కానిపాటంతా అట్లే యుండుటచే 'జాజ' గా నిలిపినట్లున్నది. జాజర శబ్దవ్యాఖ్య చూ: 12 వ సంపుటము ద్వితీయముద్రణ పీఠిక
[3] 'మోహము' కావచ్చు.

అంగన యధర మిచ్చె యమృత వసంతము
సంగడి శ్రీవేంకటేశ సతిఁ గూడితి
ముంగిటిరతిచెమట ముత్తేల వసంతము
సంగతాయ నిద్దరికి జాజర జాజర జాజ ॥ వాడ ॥ 18 ॥

## శుద్ధవసంతం

అందరునుఁ గన్నపనే అంతే చాలు
గొందికి నన్నుఁ దియ్యకు కోపము వచ్చీని ॥ పల్లవి ॥

చెప్పరాదు నీబత్తి చెక్కులవెంటాఁ గారి
ముప్పిరి జారినకొప్పు ముడిచేవు
దప్పిదేరితి నప్పుడే తనిసితి నీవంక
కప్పుర మియ్యకు నాకుఁ గాఁకలు రేఁగీని ॥ అంద ॥

యెంతలేదు నీనిజము యెదుటనే వుట్టిపడి
అంతకంతకె నామీఁద నానవెట్టేవు
చింత వాసె నీవంక సిగ్గులెల్లాఁ దీరితిని
మంతనమాడకు నాతో మచ్చకా లెక్కీని ॥ అంద ॥

సాకిరేల నీగుణాలు సరివచ్చి వుండఁగాను
కైకొని కాఁగిట నన్నుఁ గలసితివి
మేకొని శ్రీవేంకటేశ మెచ్చితి నిన్నిన్నిటాను
నాకు నీకు బాసలేల నవ్వులువచ్చీని ॥ అంద ॥ 19 ॥

## అహిరినాట

ఎవ్వరు నేమి చెప్పేరే యింతులు నీకు
జవ్వనిరో యిద్దరును జంటనుంటే మేలు ॥ పల్లవి ॥

యెనసినచోటికిని యెగ్గుదప్ప లెంచనేల
    చనవి మనవితోడిసంతమే మేలు
ననుపుగలచోటికి నాయాలకుఁ బనిలేదు
    తనలోనే సంతసించె తగుపొందే మేలు || ఎవ్వ ||

ఆయములంటినచోటి కనుమానా లిఁకనేల
    సాయములోఁ గరఁగేటిబాగులే మేలు
పాయరానివావులకుఁ బరుల నడుగనేల
    చేయిచేతఁ బుట్టినట్టిచెనకులే మేలు || ఎవ్వ ||

వలచినచోటికి వాసివంతు లిఁకనేల
    బలిమి చూపక కిందుపడుటే మేలు
యెలమి శ్రీవేంకటేశు నిప్పు డిట్టె కూడితివి
    చలము దీరెను మీలో సమ్మతులే మేలు || ఎవ్వ || 20 ||

బౌళి

లేనివిచారములేల లేవే యింక
    మానుపడి వుండనేల మానవే యింత || పల్లవి ||

చెలువుని తురుమిది చెదరితే నేమాయ
    వలపు రట్టుసేతురా. వద్దే యింత
అలసి సొలసి వుస్సురంటే నిందేమాయ
    చలివాయ నాడనేల చాలదా యింత || లేని ||

రమణుఁ డింతటనే పరాకైతే నేమాయ
    తమకము చెరుతురా తగదే యింత
అమరినమరురేక లవి యుంటే నేమాయ
    కొమరుమిగిలినాఁడు కోపమేలే యింత || లేని ||

వాడుమోము నీయెదుట వంచితేనే యేమాయె
వీడనాడఁ బనిలేదు విడవే యింత
వేడుకతో నిన్ననే శ్రీవేంకటేశుఁ డిటు గూడె
పాడిఁబంతమెల్లాఁ జెల్లె బాసలేలే యింత ॥ లేవి ॥ 21 ॥

మాకుఁ జూడ వెరగాయ మగువచందము నేఁడు
నేకరముగా[1] చలము · చెల్లించకుండీనా ॥ పల్లవి ॥
అందరిలో నిన్ను నేమి ఆడఁజాలకే పో
చెంది చెలి పాదానఁ జిమ్మె నిన్నును
ఇందుముఖికోపమెంతో యేకాంతాన నీవుండితే
చిందరవందర పచ్చిసేయకుండీనా ॥ మాకుఁ ॥
నముకాన నిన్ను నిట్టె సంకించలేకెపో
తమితో గొణఁగి తిట్టీ తనలోననె
రమణిమైకాఁక యెంతో రతివేళ నిన్నెంతే
జమళిమై వోసరెల్ల(రిల్ల?) సాదించకుండీనా ॥ మాకుఁ ॥
కరుమొగమోటమునఁ గాదనలేకె పో
తడయక గుట్టుతోడఁ దగఁ గూడెను
యెడయని శ్రీవేంకటేశ నీపై మోహమెంతో
వడఁతి నీవే తానై భ్రమయించకుండీనా ॥ మాకుఁ ॥ 22 ॥

భైరవి

ఉండవిమ్మనవే నన్ను వూరకే యాత
వండివడీ నేమున్నా చాయల యాగుణము ॥ పల్లవి ॥

[1] మేటి అమరముతో 'శేఖర' శబ్దమున కిది వ్యాఖ్యానోచితముగానున్నది.

తనతో నే నవ్వఁబోతే తరిగొనీ సిగ్గులు
చెనకి చేయంటఁబోతేఁ జెమరించీని
మనసునఁ దలఁచితే మర్మములు గరఁగీ
వెనకటిపొందే చాలు వెఱతు నే నిఁకను || ఉండ ||

దగ్గరి కూచుండఁబోతేఁ దమకించీఁ దనువు
వెగ్గళించి చూడఁబోతే వెరగయ్యీని
నిగ్గుల మాటాడఁబోతే నిలువెల్లాఁ బులకించీ
అగ్గమైతిఁ దొల్లి తన కాయనాయ నిఁకను || ఉండ ||

రతులు మెచ్చఁగఁబోతే రాఁగీఁ బెదవులు
యితవై కాఁగిలించితే నేకమైతిని
సతమై శ్రీవేంకటాద్రిసరసుఁడు గూడె నన్ను
అతిమోహమున మించెననేల యిఁకను || ఉండ || 23 ||

సాళంగం

అందితిఁ బొందితి నల్లనాఁడే తన-
కందువ లింకాఁ గడమా నేఁడు || పల్లవి ||

వలవనిడోలిఁక వద్దనవే తన-
తలఁపులోన నుందాన నిదే
బలిమిసేయ నీకుఁ బనిలేదు తాఁ
గలఁడు నేఁ గలను కడమా యిపుడు || అంది ||

వూరకె మాఁటలు వొద్దనవే తమ-
వారము గామా వలసినను
సారెకుఁ బెనఁగఁగఁ జవిగాదు
కారణము గలదు కడమా యిఁకను || అంది ||

తగవు లేమిటికిఁ దగదనవే తా
నగినప్పుడె నే ననిచితిని
పగటు శ్రీవేంకటపతి నను( గూడెను మై
గగుర్పొడిచె నిఁకఁ గడమా యిపుడు ॥ అంది ॥ 24 ॥

రేకు 1605. శంకరాభరణం

ఏమి గలిగె మీ కిందునను
ఆమనిజవ్వన మణచఁగఁదగునా ॥ పల్లవి ॥

చనవున నొకపరి సతి నినుఁ గొసరిన
కనలి నీవు నలుగఁగఁ దగునా
తనువులు బడలెను తగ నిద్దరికిని
మనసులచలములు మానఁగఁదగదా ॥ ఏమి ॥

అంటకుమని చెలి యటు నినుఁ గొసరిన
నంటునీకు మానఁగఁ దగునా
ఇంటిలోననే ఇద్దరు నలసితి-
రంటినకోపము లాఁపఁగఁ దగదా ॥ ఏమి ॥

నటనలకుఁ జెలియ నాఁటఁగఁ జూచిన
సటలకుఁ దలవంచఁగఁ దగునా
ఘటనల శ్రీవేంకటపతి కలసితి-
వటుగన చెలితో నవ్వు డిది దగదా ॥ ఏమి ॥ 25 ॥

నాదరామక్రియ

నిండుఁబాయముఁ గాయము నీసొమ్ము
కొండలరాయఁడ నీవే గురి యింతే కాక ॥ పల్లవి ॥

పంతము నీతోడ నేఁ బలికేనా అఁటదాన
చెంతఁబుణ్యపాపము నీచేతిదేకాక
యింతగా వలపించితి వెడమాఁట లిఁకనేల
కంతు గురుఁడవు నీవే కనుఁగొంట గాక || నిండుఁ ||

చూపుల నిన్నింకా నే సొలసేనా యింటిదాన
తోపు మాకుడెల్లా నీకే దోసముగాక
తీపులఁబెట్టితి నీవే తిరుగనాడఁగనేల
శ్రీపతి విన్నిటాను నీచిత్త మింతేకాక || నిండుఁ ||

కాఁగిట నిన్నింకా నేఁ గాదనేనా మేనదాన
చేఁగయుఁ జిగురు నీకే సెలవుగాక
వీఁగక కూడితివి శ్రీవేంకటేశ యిటు నన్ను
పాఁగినపతివి నీకే ఫల మింతేకాక || నిండుఁ || 26 ||

వరాళి

సారె జారుఁబయ్యదతో సతినేల వేల వ్రాసి[1]
గారవించి బుద్ధిచెప్పి కైకొనరాదా || పల్లవి ||

చిత్తములోపలిమాట చెప్పి సిగ్గువడి యదె
జొత్తువలెఁ జెమరించె సుదతిమేను
చిత్తజగురుఁడ యాకెఁ జెక్కునొక్కు నేదదేర్చి
అత్తుకొని నీవు మాట లడుగఁగరాదా || సారె ||

కూడినట్టి మొగమోట కూరిమి గొసరలేక
వాడుమోమై తలవంచె వనిత నేఁడు

[1] వ్రాసేవు కాబోలు

నీడకుఁ జేపట్టి తీసి నిండుఁగాఁగిటఁ నదిమి
వేడక నవ్వు నవ్వించి వింతసేయరాదా ॥ సారె ॥

రతివేళ తమకాన రాఁపు నిన్నుఁ జేయలేక
మతి మఱచి చొక్కెను మగువ నేఁడు
ఇతవై శ్రీవేంకటేశ యిక్కువఁ గూడితి విట్టె
మితిమీర నాకెచేత మెప్పించుకోరాదా ॥ సారె ॥ 27 ॥

## శుద్ధవసంతం

ఎవ్వరి మెచ్చఁ దగవు యిద్దరిలో రామరామ
రవ్వగా సురలు విచారముసేసే రిందుకే ॥ పల్లవి ॥

దశరథు యజ్ఞములో తగ నీవు జనియింప
దశకంఠుమేనఁ బుట్టె దావాగ్ని
వశమైన శాంతితో వర్ణనకెక్కితి నీవు
దశకంఠుఁ డంటి (ది?) నట్టిధర్మ మందె సమసె॥ఎవ్వ॥

నెఱిఁ దొల్లి సీతకుఁగా నీవు విల్లెత్తఁగాను
చెఱకు విల్లెత్తె నీపెఁ జేరి మరుఁడు
విఱిగె నీవెత్తినట్టి విల్లయితే నెంతైన
విఱుగ కాతనివిల్లు వెసఁ బెండ్లిసేసెను ॥ ఎవ్వ ॥

శ్రీవేంకటాద్రిమీఁదఁ జేరి యెక్కితివి నీవు
అవెలఁది నీవుర మట్టె యెక్కెను
దేవుఁడవై ఇందరిలోఁ దిరుగాడుదువు గాని
వోవల వాకైతే[1] నీపై వున్నచోనే వున్నది ॥ ఎవ్వ ॥ 28 ॥




[1] ఆకై + అతే.

## అహిరినాట

సతివెఱవు దెలిపి చనవింక నియ్యరాదా
చతురుఁడ నీకాకెతో చలము లింకానా || పల్లవి ||

వనిత నీచెక్కులపై వలపు వా(వ్రా?) యఁగలేక
కొనగోర నేల వా(వ్రా?)సీఁ గోరి కెట్టిదో
ననిచి మరుశాస్త్రము నాలుకఁ జదువలేక
వెనక నీపేరు చదివీఁ బెదవులనె || సతి ||

తరుణి నీకు మదనతంత్రము నేరుపలేక
సిరుల చేసన్నలను చేసుకొనీని
అరుదుగా నీమోహము లెక్కవెట్టలేక
పొరలి చింతలఁ దలపోసీని || సతి ||

చెలియ నీమోము చూచి సిగ్గులు చల్లఁగలేక
మొలకమోవిని[1] లోలో ముంచి నవ్వీని
కులికి శ్రీవేంకటేశ కూడి నిన్నుఁ బాయలేక
నిలువురతులతోడ నిన్ను లాలించీని || సతి || 29 ||

## మంగళకౌసిక

ఎన్నైనఁ గలవు పను లేమనీనే
చిన్నినగవున నాసిగ్గు వాపుమనవే || పల్లవి ||

చిక్కువడ్డనెరులతో చింతతోడి మనసుతో
ఋక్కడ నుందాన నన్ను నేమనీనే

---

[1] 'మొలక' శబ్దము లక్షణలో 'చిగురు' అర్థమునఁ గాబోలు.

వెక్కసానఁ దనకేకా విరహాన నింతైతి
చక్కఁజేసి తానే యీసడి వాపుమనవే || ఎన్నై ||

కమ్మఁజెమటలతోడఁ గాఁగినమేనితోడ—
నిమ్ముల నుందాన నన్ను నేమనీనే
నెమ్మదిఁ దనకొరకే నివ్వెరగున నుందాన
రమ్మని[1] తానే నాతో రాఁపు వలదనవే || ఎన్నై ||

మనసుకోరికలతో[2] మంచుఁబులకలతోడ
యెనసితిఁ దనతో నే నేమనీనే
యెనలేక శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
తనకేకా యిటులైతి దయఁజూడుమనవే || ఎన్నై || 30 ||

రామక్రియ

ఏఁటికి యెక్కినవాని కేనిగె గుజ్జానా కాదో
మేఁటితనపంతమెల్ల మీఁదాయఁ జాలదా || పల్లవి ||

చేసినచేఁతలు గాక చెలువుఁ డందుకుఁదోడు
మాసియు మాయనియట్టిమాయలుఁ గొన్నా
మోసము నాదేకాదా మొన్న నలిగినదాన
వాసితో నుండకుండితే వచ్చుఁబో నేరములు || ఏంటి ||

దయమాలి తా రాక తాపము రేఁచుటగాక
నయగారితనముల నవ్వులుఁ గొన్నా
క్రియ నే నెఱుఁగఁగాక కిమ్ముల నే నుండఁగాను
ప్రియము చెప్పఁగఁబోతే బిగియక మానునా || ఏఁటి ||

[1] 'తానే రమ్మని' అని అన్వయము.
[2] మనసులోని కోరికలతో — అని విగ్రహము కావచ్చు.

అలసి సొలసి కొమెరాఁక లాఁగుతాఁ గాక
కలసినరతివేళ కళలుఁ గొన్నా
యెలమి శ్రీవేంకటేశు నిట్టె కూడినదాన
వులివచ్చి సేయకుంటే వొరయఁగఁజెల్లదా ॥ ఏఁటి ॥ 31 ॥

సామంతం

అడనుండి[1] మోవిఁ దిట్టే వంతేకాదా వలపు
బూడిదెలో వసంతమా పోపో అంతేకాదా ॥ పల్లవి ॥

నేనేడ నీవేడ నీతోడివారమా
ఆనలువెట్టఁగవచ్చే వంతేకాదా
దానికేమి గొరతా తలిలేదు మితిలేదు
మానవుగా జగడాలు మరి యంతేకాదా ॥ అడ ॥

దాఁపనేల రాఁపులేల తడవవచ్చితిమా
ఆపెచేతఁ దిలిపించే వంతేకాదా
పైపై నింకానేల పంతనాలు మంతనాలు
మాపుదాకా సరసము మరి యంతేకాదా ॥ అడ ॥

వన్నెలెంత వానులెంత వద్దనేటిదాననా
అన్నిటా వేసాలు చల్లే వంతేకాదా
వున్నతి శ్రీవేంకటాద్రి నుండి వావిలిపాటిలో[2]
మన్నించితి రామచంద్ర మరి యంతేకాదా ॥ అడ ॥ 32 ॥

---

[1] ఈ పాటంతా మరీ సంభాషణ శైలిలో నడచినది. అధ్యాహార పదముల అవసరమెక్కువ. రాముల్లే కూడా రసికుల్లే చేసినవి కొన్ని పాటలు.

[2] ఈ వావిలిపాడు పేరు వాయల్పాడుగ వ్యవహరింపబడుతున్నది. మదనపల్లి తాలూక, చిత్తూరుజిల్లాలో ఉన్నది. అన్నమయ్య స్తుతించిన రామచంద్రుని మూర్తి. గుడిగోపురాలు చెక్కుచెదరుకుండ నేటికి నిలిచి ఉన్నవి (వా. శ్రీ.)

## రామక్రియ

పిలువరే వానిఁ బ్రియము చెప్పైన
పొలసి తానేల పొయ్యీనే || పల్లవి ||

తలకునఁ జూచి తలవంచుకొంటి
అలసి యేమైన నంటినటే
చెలువుఁడు తానే సిగ్గువడీ నింతే
యెలమి మాయింటికి యేల రాఁడే || పిలు ||

ఆడికలు వింటే నట్టె మఱచితి
తోడుత నేమైన దూరితినా
వేడుకకాఁడై[1] విచారించీ నింతే
వోడి వాకిట నేలున్నాఁడే || పిలు ||

కపటాలు దీరె కాఁగిలించుకొంటి
చపలపుఁదప్పు సాదింతునా
యిపుడె శ్రీవేంకటేశుఁడు గూడెను
వుపమలయాన లొద్దేలే[2] || పిలు || 33 ||

## సాళంగం

ఎంతైన మానఁడు పతి యేమోకాక
ఇంతటఁ దానే పదరె నాడరాదు గాక
పట్టినపయ్యదకొంగు పాయఁదియ్యఁ దడవా
చుట్టపువరుస గొంత చూచితిఁగాక
తిట్టినట్టె నావిభునిఁ దిట్ట నాకుఁ దడవా
మెట్టపట్టుక మిమ్మెల్ల మెప్పించితిఁ గాక || ఎంతై ||

---

[1] వేడుకకాఁడై - వేడుకకాఁడగుటచేత అని హేత్వర్థము కావచ్చు.
[2] ఒద్దు (వద్దు) + ఏలే.

వేడుక చెక్కునొక్కఁగ విదలించఁ దడవా
ఆఁడదానికేలంటా నటు వుంటిఁగాక
లేఁదు నామోవి యంటఁగ నే వొట్టువెట్టఁ దడవా
నాఁడు చేసినచేఁతకు నవ్వుకొంటిఁగాక || ఎంతై ||

గక్కనఁగాఁగిలించక (చఁగఁ?) కసరుకోఁ దడవా
వొక్కమోహములు చూచి వొప్పితిఁగాక
చిక్కితి వావిలిపాటి శ్రీరఘునాథ నీ కీ-
యిక్కువ శ్రీవేంకటాద్రి నిరవైతిఁగాక || ఎంతై || 34 |

## బౌళిరామక్రియ

ఊరకే నన్ను రేఁచక వుండనియ్యరా
కోరికెల్లా రాసులైతేఁ గోటానఁగోట్లు || పల్లవి |

చిత్తము నొచ్చీనంటా సెలవి నవ్వితిఁ గాని
వొత్తి మేఁకులైతే వోరువరాదు
బత్తి చెరుచఁగరాక పట్టఁగా లోనైతిఁ గాక
యెత్తిననాసిగ్గులైతే యెన్నైనాఁ గలవు || ఊర |

మన సెట్టుండునోయంటా మాట నే నాడితిఁగాని
పెనఁగి పెదవులైతే బెండుపడీని
నను పెట్టానోయంటా నాఁటఁగఁ జూచితిఁ గాక
నినువు నాయాసలైతే నిండాఁ బండఁగలవు || ఊర |

వరుసదప్పీనంటా వాసికిఁ గూడితిఁ గాక
మరులవువలపులు జొబ్బిలీ నిదె
గరిమ శ్రీవేంకటేశ కలసితి మిద్దరము
పరవశములయితే పట్టరాదు నాకు || ఊర || 35 |

## రామక్రియ

రాతిఁ బతిమ[1] సేసినరామచంద్ర నీ--
చేతిలోనిదాన నింతే శ్రీరామచంద్ర || పల్లవి ||

పట్టిరట్టు సేయ కిఁక వద్దు రామచంద్ర
నెట్టన నే దూరనోప నిను రామచంద్ర
వొట్టితిఁ బ్రేమము నీపై వో రామచంద్ర మమ్ము
పట్టిజాలిఁ బెట్ట కిఁక వద్దు రామచంద్ర || రాతిఁ ||

విన్నపాలు వేయునేల విను రామచంద్ర నా--
కన్నులకు నీవె గురి ఘనరామచంద్ర
యెన్నిక నన్నుఁ బాయకు మిఁక రామచంద్ర
నిన్ను నన్ను నెంచుకొమ్మీ నీవు రామచంద్ర || రాతిఁ ||

ఆయము లంటితివి నెయ్యపురామచంద్ర వొక్క--
పాయమే ఇద్దరికిని బలురామచంద్ర
ఆయెడ వావిరిపాటి హరిరామచంద్ర
చేయార శ్రీవేంకటాద్రిఁ జెందితి రామచంద్ర ||రాతిఁ||36||

## పాడి

అఁదుఁగొల వచ్చుఁ జుమ్మీ ఆచారా లింతైతే
నేఁడు గామించితిఁ జుమ్మీ నిన్ను రఘునాథ || పల్లవి ||

తొంగిచూచి నంతలోనే దోసము వచ్చీనా
అంగవించి వలచిన అఁదుదానను
ముంగిట మాటాడితేనే మోనము దప్పీనా
యెంగిలౌనా మోవిపండు ఇంతలోనే నీకును || అఁదు ||

[1] 'ప్రతిమ'కు వ్యావహారికము, తద్భవమూ 'పతిమ'. ఇక్కడ ఈ శబ్దమునందు, శిలావి-
-ము గాక, ప్రకరణముతో పతివ్రతా రూపముగ తోచుచున్నది.

పొదము సోఁకించితేనే పంతములు దప్పీనా
వీదిఁబోతాఁ జెనకేనవెలఁది నేను
పొద్దై సంగడినుంటే బతిమి వొయ్యీనా
సోదించి కళలు నీను జొబ్బిలిని ఇపుడే || ఆఁడు ||

తొడమీఁద నిడుకొంటే దొరతనము వొయ్యీనా
బడిబడిఁ దిరిగాడే పడఁతి నేను
కడఁగి శ్రీవేంకటాద్రిఘనుఁడ వావిరిపాట
వొడయఁ రాఘవ కూడె వొద్దికఁ బాయకుమీ ||ఆఁడు||37||

ఆహిరి

మారుమాట లంత నేర మఱి విన్నపాలు నేర
శ్రీరామచందురుని చిత్త మింతేకాక || పల్లవి ||

కన్నుల నెదురుచూచి కరఁగేటదానఁ గాక
సన్న సేసి పిలువను సరిదాననా
మన్నించి తాఁజూచితేను మనసిచ్చేదానఁగాక
అన్నిటా నే నెడమాట లాడించేదాననా || మారు ||

ఆనవాలుగా నుంగర మందుకొనేఁ గాక
నేనే పైకొన నంతనీటుదాననా
పూని తా విచ్చేసితేను పొడగనేదానఁ గాక
కానుకలు సారె నంపి కాఁక రేఁచే దాననా || మారు ||

సోదించి నన్నుఁ గూడితే చొక్కేటిదానఁగాక
కాదుకూడదని దూరఁ గడదాననా
సాదించి వావిలిపాటిజయరామ యేలితివి
అదియై శ్రీవేంకటాద్రి నంతదాననా || మారు || 38 ||

## బౌళి

నేటఁగాకుండితే రేపే నేరిచీఁ గాక
తేటకన్నులకుఁ గెంపు దెచ్చుకోఁ గలనా || పల్లవి ||

కానీకానీవే కన్నుల నవ్వీఁ దాను
పైనే, విచ్చినమేడిపంటిబోనము
దానికేమి యింతలోనె తాఁ జేసినందుకెల్ల
తేనెవంటిపెదవుల తెగనాడఁగలనా || నేటఁ ||

కాదంటేఁ బోదుగదే కాఁకలురేఁచీఁ దాను
పోది సేయనేల లక్కపూసకపులు
వాదులేల తా నన్ను వలెనని పట్టఁగాను
యీాదెస మెత్తనిచేత నిఁకఁ దోసేనా || నేటఁ ||

ఆయనాయ నందుకేమి అరడిఁబెట్టీఁ దాను
యేమెడ నెక్కినవాని కేనిగె గుజ్జే
ఆయపు శ్రీవేంకటాద్రి నదె వావిలిపాటను
పాయపురాముఁడు గూడె పంతమాడేనా || నేటఁ || 39 ||

## సాళంగనాట

సిగ్గరి పెండ్లికూఁతుర సీతమ్మ
దగ్గరి సింగారబొమ్మ తలవంచకమ్మా || పల్లవి ||

అల్లనాఁడే రాఘవుఁడు హరువిల్లు విరిచెను
మెల్లి నేఁడే పెండ్లాడీ నిదివో నిన్ను
యెల్లగా జనకుఁడు నిన్నిచ్చినట వీఁడె
వెల్లవిరి నీమాట వినవమ్మా || సిగ్గ ||

అదె పెండ్లితెర యెత్తి రండనే వసిష్ఠుఁ డుండి
చదివీ మంత్రాలు సేస చల్లవమ్మా
మొదల రామునికంటె ముంచి తలఁబాలు వోసి
సుదతి యీతనిమోము చూడవమ్మా || సిగ్గ ||

కంకణదారాలు గట్టి కాలుదొక్కితివి మీరు
పొంకాన బువ్వ మందరో పొత్తుల నమ్మ
వుంకువ వావిలిపాట నుండి శ్రీవేంకటగిరి
తెంకుల నిన్నుఁ గూడి తిరమాయనమ్మా || సిగ్గ || 40 ||

రేవగుప్తి

ఔనేఔనే ఆయఁ బని
పూని వలపు మోఁపి పోయీనా తాను || పల్లవి ||

మగిడిమగిడి మమ్ముఁ జూచీనే
మిగులఁ దనాన[1] నామీఁదఁ బారెనా
తగవూ నగవూఁ దా నెఱఁగఁడా
సగము నవ్వితి నేను జాణవునే[2] తాను || ఔనే ||

మలసి మలసి మాఁటాడీనే
అలరి యంతలో నే నాలసైతినా
వలిమి[3] బలిమీ సాదించీనా
యెలమి నిన్నాళ్ళదాఁకా నెందుండై తాను || ఔనే ||

చేరి చేరి చేయి వేసీనే యిట్టె
సారెకు నన్నుఁ గూడి చవిగనెనా

[1] తన + అన (కా.శ్రీ.)
[2] జాణ + అవునే (కా.శ్రీ.)
[3] 'వలిమి' వెలిమి అనడానికి (కా.శ్రీ.)

రారె వావిరిపాటిరాఘవుఁడు
ఈరీతి శ్రీవేంకటేశుఁడే తాను ‖ ఔనే ‖ 41 ‖

## నాదరామక్రియ

వచ్చెను నీ రమణుఁడు వసంతమాధవుఁడై
ఇచ్చగించి చేకొనవే యెదురేఁగి నీవు ‖ పల్లవి ‖

పూచెఁబో నీ సెలవుల పున్నమ వెన్నెల నవ్వు
కాచెఁబో చన్నుల నిమ్మకసుఁగాయలు
రాచిలుక లెలిఁగించి[1] రమణి నీ పలుకుల
యేచెను వసంతకాల మిదె నీ పాయమున ‖ వచ్చె ‖

చిందెఁబో నీమేన నట్టె చెమటల రసములు
అందెఁబో చేతులకు నీ యాయపుఁజన్ను
మందలాయఁ దుమ్మిదలు మరి నీ తురుమునను
చందపు నీ కోరికలే జాజరవసంతము ‖ వచ్చె ‖

పండెఁబో నీకెమ్మోవిఁ బల్లదొర లింతలోనె
నిండెఁబో చల్లనిగాలి నీ వూర్పుల
అండనె శ్రీవేంకటేశుఁ డంతలోనె నిన్నుఁ గూడె
బొండుమల్లెపానుపువో పులక చొంపములు ‖వచ్చె‖42‖

## వరాళి

కాదనినందుకు నీవు గరితేఁజాలు
నీ దాననైతిఁగాక నించనోప నిఁకను ‖ పల్లవి ‖

చక్కని నీ వదనమే చంద్రోదయము నాకు
చుక్కలేని మోవి మీఁది సూదివాట్లు

---

[1] 'లెలిగింపి' (కా. శ్రీ.)

వెక్కసపు నీ నవ్వు వెన్నెలపులుఁగములు
వొక్కటైతి నలుగ నేనోప నీతో నిఁకను || కాద ||

నీ మేనిచెమటలు నిండినట్టిమంచు నాకు
ఆమనివూరుపులే పయ్యెరగాలి
కోమలపుఁబులకలె కూరిమి గుజ్జనఁగూళ్ళు
యేమిగల్లా నియ్యకొంటి నెదురాడనోపను || కాద ||

కాఁగిననీరతిపొందే కందువరాతిరి నాకు
మూఁగిన పరవశాలే ముంపునిద్దుర
వీఁగక శ్రీవేంకటేశ వేడుక నీసరసమే
పాఁగినట్టైతలఁబాలు పదరకు మికను || కాదు || 43 ||

## ఆహిరినాట

రామా రామా రాజీవనయనా
కామించి నినుఁ జూచె గక్కన మా చెలియ || పల్లవి ||

యింతి పిలువనంపె నెడమాటలేలా
యింతలో విచ్చేయు ఎన్నికగాక
చెంత నిందులకుఁగా సెలవి నవ్వేలా
పంతముతో నాకెఁ బాలింతు గాక || రామా ||

తరుణి పూవుల వేసె తలవంచనేలా
సరి నీవు మోహమే చల్లుదుగాక
నిరతి నిందుకుఁగా నివ్వెరగేలా
మరిగి యాకెను నీవే మన్నింతుగాక || రామా ||

మగువ కాఁగిటఁ గూడె మరి సిగ్గులేలా
వెగటురతుల విఱ్ఱవీఁగుదుగాక

వగల శ్రీవేంకటేశ వావిలిపాటిరాము
మిగుల సీతతో మెఱతువుగాక || రామా || 44 ||

### కాంబోది

చెల్లఁబో యీ తగవు చెప్పరే మీరు
వెల్లవిరి యిందుకేపో వెరగయ్యీ నాకు || పల్లవి ||

వూరకుండఁగ నాతో వొద్దిక మాటలాడీని
కారణములేనిపొందు కద్దా బూమి
వూరికెల్ల తా జాణ వుప్పవేసి పొత్తుగూడీ
నారుకొ[illegible] యిందుకేపో నవ్వువచ్చు నాకు || చెల్లఁ ||

తలవంచుకుండఁగాఁ జిత్తరువులే చూపవచ్చీ
పిలువని పేరటము ప్రియమయ్యీనా
బలువు చూడవే వీఁడు బండిగట్టీ చింకలను
తలఁపున యిందుకేపో తమిపుట్టీ నాకు || చెల్లఁ ||

సిగ్గుతో నే నుండఁగాను చెక్కునొక్కవచ్చీని
దగ్గరి చేత మొక్కఁగా తప్పగలదా
నిగ్గుల శ్రీవేంకటాద్రినిలయుఁడు నన్నుఁ గూడె
తగ్గులే కిందుకేపో సంతసమయ్యీ నాకు || చెల్లఁ || 45 ||

### ముఖారి

చెలులాల యీమాట చెప్పరే మీరు
నిలువునఁ గరఁగితి నిజమైతిఁ దనకు || పల్లవి ||

కన్ను సన్న సేయఁబోతే కసరై తోఁచెనేమో
విన్నవించి తోడుకరావే విభుని

మిన్నక నే నవ్వఁబోతే మించి వెంగెమాయనేమో
అన్నిటాఁ దెలుసుకొనీ నలుకేలే తనకు || చెలు ||

గొప్పమాట లాడఁబోతే కోపమైతోఁచెనేమో
చెప్పరే యాతని కిది చెల్లదని
రెప్పలెత్తి చూడఁబోతే రేసులై తోఁచెనేమో
తప్పులెల్లా వొప్పులయ్యీఁ దడవేలే ఇఁకను || చెలు ||

రతికి మంచమెక్కితే రాజసమై తోఁచెనేమో
యితవుగాఁ దనమతి యెగ్గు వాపరే
సతమై శ్రీవేంకటేశ్వరుఁడు న న్నిటు గూడె
కతలాయ వలపులు కడమేమే తనకు || చెలు || 46 ||

## సామంతం

మానలేనే[1] పొందు మానలేనే నిన్ను మానలేనే | ఆ
అనెను మోహము నేఁ డంటవే నాదేహము || పల్లవి ||

చక్కఁదనములతేట చల్లనివెన్నెలవూట
వొక్కమాటాడవే నీ వొద్దిక మాట
చక్కెరవింటిలో తూపు జవ్వనములో నీరూపు
గక్కనఁ జూడవే కడకంటిచూపు || మాన ||

యింపుఁజిగురుఁజప్పర మిన్నిటిలో బిత్తరము
సొంపుగఁ జాఁచవే నీసోగకరము
సంపదల ముజ్జగము చందురునిసోయగము
జంపులేల యెత్తవే నీసవరనిమొగము || మాన ||

[1] శ్రీరామచంద్రుడే రసికనాయకుడుగ మాటాడిన పాట యిది. అన్నమయ్య చేతిలో రామచంద్రుడు కృష్ణుడైనాడు.

మదనుని తేరుడోక మంచిమెఱుఁగులరేక
యెదురు చూడఁగ వచ్చే విట్టె నీరాక
ఇదె శ్రీవేంకటగిరి నిరవై వావిలిపాటఁ
బొదలిన రాఘవుఁడఁ బొందితి నదె ॥ మాన ॥ 47 ॥

వసంతం

సారె వేరేవను లేడ సంతోసమేకాక
తారుకాణేల విభుఁడ తగులమేకాక ॥ పల్లవి ॥

మనసుగలసినచో మరి కోప మేడది
యెనసి యేమిసేసినా యింపులే కాక
చనవుగలుగుచోట సారె వెరపేడది
చెనకినచేఁతలెల్లఁ జెల్లుబడే కాక ॥ సారె ॥

సరివలచినచోట చంచలము లేడవి
తరితీపులఁ గరఁగేతములే కాక
అరుదందిచూచుచోట నడ్డాఁక లేడవి
మురిపెపుఁబ్రేమములముచ్చటలే కాక ॥ సారె ॥

యిచ్చగించియున్నచోట యెడమాఁట లేడవి
పచ్చిగాఁ గూడినయట్టిపగటే కాక
అచ్చపు శ్రీవేంకటేశ అప్పుడే నన్నేలితివి
తచ్చన లిన్నిఁకనేవి తనియుటే కాక ॥ సారె ॥ 48 ॥

రేకు 1609 శంకరాభరణం

కామినిచేతు కిది కతలాయ
వేమరుఁ జూతువు విచ్చేయువయ్యా ॥ పల్లవి ॥

వెడఁగు నిట్టూర్పులు విసరఁగ విసరఁగ
పడఁతినెన్నడుమె బయలాయ
చిదుముడి లోలోఁ జింతింపఁ జింతింప
జడిగొను చెమటలు జలనిధులాయ || కామి ||

పొరిజవ్వనమునఁ బొరలఁగఁ బొరలఁగఁ
గరిమఁ దురుము చీఁకట్లాయ
విరహపుఁగాఁకలు వెడలఁగ వెడలఁగ
పరగినమనసే పాతాళమాయ || కామి ||

కలయఁ గోరికలు కదుమఁగఁగదుమఁగ
పులకలమొలకలు పోగాయ
యెలమిని శ్రీవేంకటేశ నీవు సతి--
నొలసి కూడఁగా నొక్కమనసాయ || కామి || 49 ||

దేవగాంధారి

ఏమమ్మ వూరకుండే వెశోదమ్మా[1]
యీ మేఁటిబాలకృష్ణు నేమరకువమ్మా || పల్లవి ||

బండి దన్నెఁ బట్టరమ్మ బాలునిపాదము నొచ్చీ
కొండ యెత్తె నొకచేతఁ గోరి వీఁడు
యెండనె మాఁకులసంది కేఁగకుండాఁ బట్టరమ్మ
దండిబాలుఁ డేమెఱుఁగు దగ్గరుండరమ్మా || ఏమ ||

పాముఁ బట్టీఁ బట్టరమ్మ పసిబిడ్డఁ డేమెఱుఁగు
దామెనకోడెలఁ గొట్టీఁ దానే వీఁడు

[1] వూరకుండేవు+యశోదమ్మ. యతిస్థానంలో 'ఎశోదమ్మ' (కా.శ్రీ.)

కామించి మాఁకులెక్కెఁ గాదని మానుపరమ్మ
బూమెల యీ బాలునికి బుద్ధి చెప్పరమ్మా || ఏమ ||

గాలికేఁగెఁ బట్టరమ్మ కడుశిశు వేమెఱుఁగు
పాలువెన్నలు దొంగిలీ బాలుఁడు వీడు
ఆలరియై శ్రీవేంకటాచలము మీఁది కెక్కె
ఆలుఁదాను నున్నాఁ డదె చూడరమ్మా || ఏమ || 50 ||

## సామంతం

ఇంతిభాగ్య మిఁక మేమనఁగల దిదె
సంతస మబ్బెను సరుసనె మీకు || పల్లవి ||

వీనుల కివివో వెలఁదికిఁ దొడవులు
సోనల నీ నిజసుద్దులును[1]
కానుక లివివో కంటిమి చెలిపై
నానినచూపులు నాయకుఁడా || ఇంతి ||

వొడలికి నివివో వుంకువలు చెలికి
వెడ నీనవ్వులవెన్నెలలు
వుదుగర లివివో వొదిగెను నీ చేతి-
బడిబడి సన్నలు పడఁతికి విభుఁడా || ఇంతి ||

మనసుకు నిదివో మంచినిధానము
అనుగుఁబానుపున నలము రతి
యెనసితి శ్రీవేంకటేశ యిన్నిటా
చనవిచ్చితి విటు సతికి రమణుఁడా || ఇంతి || 51 ||

---

[1] 'నిజసుద్దులు' ఇట్టి విల్లర దోషముల కీవాఙ్మయమున పట్టింపులేదు.

## శుద్ధ వసంతం

వీఁడివో అలవిజయురాఘవుఁడు
పోఁడిమిఁ గొలువునఁ బొదలీఁ జెలియా || పల్లవి ||

రాముఁడు లోకాభిరాముఁడు | గుణ-
ధాముఁ డసురలకు దమనుఁడు
తామరకన్నులదశరథ తనయుఁ(యుఁ?) డు
మోమున నవ్వీ మెుక్కవె చెలియా || వీఁడి ||

కోదండధరుఁడు గురుకిరీటపతి
పొదిగ సురముని పూజితుఁడు
ఆదిమ పురుషుఁడు అంబుదవర్ణుఁడు
నీదెస చూపులు నించీఁ జెలియా || వీడి ||

రావణాంతకుఁడు రాజశేఖరుఁడు
శ్రీవేంకటగిరి సీతాపతి
వావిలిపాటలో పరమూర్తి దానై
వోవరిఁ గొలువున నున్నాఁడే చెలియా || వీడి || 52 ||

## నాదరామక్రియ

ఏఁటికి మా మాఁట లిటమీద
వేఁటసరసముల వెరసితి విపుడే || పల్లవి ||

కలికి నినుఁ గలయఁ గట్టెను తొలుతనె
పలచని నగవుల బాసికము
నిలువున నీవును నించఁగఁ గైకొనె
సొలపులచూపులసూసకము || ఏఁటి ||

యింతి పెదవులనె యిచ్చెను నీకును
వింతగాఁ బెండ్లివిడేలు
సంతసపు వలపు చల్లఁగఁ గైకొనె
యింతటఁ బులకల నివె తలఁబాలు || ఏఁటె ||

భోగపురతులనె బువ్వము దొడికెను
చేఁగిలిసెనటే చెలుపాలు
యీగతి శ్రీ వేంకటేశుఁడ కూడితి
బాగుగా సోబానఁ బాడేము నేము || ఏఁటె || 53 ||

## పాడి

మేలు విచ్చిచెప్పరాదు మేడపంటె వోపము
కాలమందే కంటె వింటెఁ గతి చేఁటకనవే || పల్లవి ||

మొక్కేనని వీఁడు ముందట నిదేవే తొల్లి
మొక్కనదేవరికే మొక్కుమనవే
చెక్కొటది నాచేయి చిత్తము దనసు రాయి
యిక్కువలు గిలిఁగిని యేమందునే || మేలు ||

పట్టే నూరికె తాను పయ్యెద నాచెఱఁగు తాఁ
బట్టినచలము వెల్లెఁ బదమనవే
మెట్టినది పాఁతరి మీరి చెప్పె కొండెము
యెట్టైనాఁ జేయునీవే యెదుటెవ్వరే || మేలు ||

తగిలీ నూరికె తాను తతిగొని వెంటవెంట
తగిలె మోహము నాపైఁ దనమీఁదనె
చిగురొత్తె నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు
తగవాయఁ బనులెల్లా తారుకాణలేలే || మేలు || 54 ||

రేకు 1610 **సౌరాష్ట్రం**

ఏలే యింతేసిచేఁత యీఁతా మోఁతా
వేళ వచ్చినదాఁకా వెరగులే చాలు || పల్లవి ||

తప్పక చూడవెరతు తలవంచుకో వెరతు
అప్పటప్పటి సుద్దులు అవెచాలు
కప్పురము లంటనేల కాఁకలఁ బొరలనేల
తెప్పలచెమటనీఁటఁ దేలుటే చాలు || ఏలే ||

దగ్గరి రా నేనోప తప్పించుకొననోప
తగ్గుముగ్గలేనిపాటె తగులే చాలు
వొగ్గి తనవిడె మెల్ల వొగిలొగిలిననొల్ల
సిగ్గువడ్డ చెక్కుచేతిచింతలే చాలు || ఏలే ||

మంతనమాడ నేనొల్ల మర్మము చొక్కించనొల్ల
వంతుకు తాఁ గూడేటువరుసే చాలు
కాంతుఁడు శ్రీవేంకటాద్రి కడపరాయఁడు[1] నేఁడు
పంతమిచ్చి నన్నుఁ గూడె భాగ్యమాయఁ జాలును||ఏలే||55||

శ్రీరాగం

ఏల నన్ను వేఁడుకొనే విటుఁ నీవే నేఁ గాన
తిలుపడనేర నేను తెలివేకాని || పల్లవి ||

నగి నగి తిట్టినాను నాతో నలిగినాను
వెగటులేదు నాకు వేడుకేకాని

[1] కడప పట్టణంలో దేవునికడపలో వెలసిన వేంకటేశ్వరస్వామిని సంబోధిస్తూ అన్నమయ్య ఆ దేవుని కడపరాయనిగా వ్యవహరిస్తాడు. (సా. శ్రీ.)

మొగిసె మాటాడినాను మోనాన నీవుండినాను
జగడము లేదు నాకు చనవే కాని || ఏల ||

కన్నులఁ గొసరినాను కాఁకల విసరినాను
చిన్నఁబోదు నామోము చెలువే కాని
సన్నలనే తిట్టినాను చాయలనన్నాడినాను
యెన్న నెగ్గుగాదు నాకు నితవే కాని || ఏల ||

పైకొనక మానినాను పరాకు సేసినాను
నాకెందు నెరవు లేదు నలుపేకాని
శ్రీకాంత నేను నీవు శ్రీవేంకటేశుఁడవు
యేకమైతి మెదురేది యిచ్చకమే కాని || ఏల || 56 ||

భైరవి

వలచిన పతితోడ వాఁడి మాట లాడనోప
మలసి నానవ్వులే మల్లెపూజ గాదా || పల్లవి ||

గొప్పలు నాకుచములు కొండలఁ బోలుచనేలా
ఒప్పగుపతిఁ గాఁగిట నొత్తనేలా
దప్పిదేర నవియే తామరలఁ బోలిచితే
నెప్పున మా యిద్దరికి నిచ్చపూజ గదా || వల ||

మచ్చిక నాకనుచూపు మరునమ్ములననేల
నచ్చుదాఁక నా విభుని నాటించనేల
కచ్చుపెట్టి అవియే కలువలఁ బోలిచితే
మచ్చికైనమాలోని మంచిపూజ గాదా || వల ||

తనువు తీగెననేల[1] తక్కక వొరయనేల
అనుగుఁబూవుఁగోమలినంటే మేలు
ఘనుఁడు శ్రీవేంకటేశుకాఁగిటఁ గూడితి నేను
చనవున మాలోనిసరిపూజ గాదా || వల || 57 ||

### శంకరాభరణం

మాఁటలేల యిఁక మాఁటలేల
మాఁటలేలరా మాయకాఁడా || పల్లవి ||

చూచి చూచే చొక్కించితి
యేచి నీ చేఁత కేమందురా
కాచెఁ బూచెను కాఁగిట చన్నులు
లోఁచి చూడకు లోనైతి నీకు || మాఁట ||

నవ్వి నవ్వే నమ్మించితి
ఎవ్వరును నిఁక నేమనేరు
రవ్వసేసెను రాఁపగు వలపులు
తవ్వ కిఁకఁ జోలిదక్కితి నేను || మాఁట ||

చేరి చేరి చేకొంటివి యింత
దూరఁబోతే దోసమిఁక[2]
యేరా శ్రీవేంకటేశ్వరుడా
రార కడపలో రతికెక్కెఁ బనులు || మాఁట || 58 ||

### తెలుఁగుఁగాంబోది

వీది వీధి జెప్పఁగానే వింటిమి నేము
కాదుగూడదననేల కంటిమిగా కొత్తలు || పల్లవి ||

---

[1] తీగె+అననేల
[2] 'దోసమి' చిలుమెక్కిన భాగము.

చెంగావి చూపులును సేమంతినవ్వులును
యింగితానఁ జెలికబ్బె నేడవో కాని
అంగన నింత సేసినయతఁ డెంతజాణఁడో
ముంగిటఁ జూచినదాఁకా ముచ్చటయ్యా మనసు || వీది ||

కప్పురపుమాటలును కస్తూరి వూర్పులు
యిప్పుడే కలిగె చెలి కేడవో కాని
దెప్పర మింతరేఁచిన దేవర యెంతటవాఁడో
తప్పక చూచినదాఁకా తమకించీఁ దనువు || వీది ||

ముత్తేల పులకలు ముంగారు చెమటలు
యిత్తలఁజెలికె నబ్బె నేడవో కాని
చిత్తగించి కూడినాఁడు శ్రీవేంకటేశుఁడట
అత్తి నాకుఁ బొడచూపె ఆసగించీ గుణము||వీది||59||

## పాడి

చాలదా యీ జన్మము చల్లఁగా మీరిట్లుంటే
పాలుగల ఆకె యెంతభాగ్యము సేసినదో || పల్లవి ||

సతి[1](ససి?) సేసకొప్పుతోడ చంద్రవంక బొట్టుతోడ
ఇసుమంతనవ్వు చిందె నేఁటికో కాని

[1] ప్రాసభంగము.

అసురుసురయ్యీని అప్పటనుండి నామేను
యెసగ నీకు నాకె యేమౌను చెప్పరా || చాల ||

పచ్చఁబట్టు పయ్యదతో భారపు గుబ్బలతోడ
ఇచ్చట నీవంక చూచె నేఁటికోకాని
వెచ్చనైతి నిది చూచి వేసాలు మాని నాతో
వచ్చేనని యాసవెట్టి వచ్చితివో చెప్పగా || చాల ||

ముత్తేలకమ్మలతోడ ముంజేతిసొమ్ములు చూపి
యెత్తి నీకు సన్న సేసీ నేఁటికో కాని
చిత్తగించి కూడితివి శ్రీవేంకటేశుఁడ నన్ను
హత్తి మా యిద్దరిలోన నౌఁగాము లెంచరా||చాల||60||

## రేకు 1611 సాళంగనాట

ఏలే తనకు నాకు నేఁటిమాటలే | మమ్ము
తేలించి యెడమాటాడి తీరవలెఁగాక || పల్లవి ||

లేవే నేఁ బిలిచితే లెక్క సేసీనా తాను
చావివోయ[1] వుమినాకి చవుతమా ఇఁక(?)
వావాత నేనుఁ దాను వాదించితే నవ్వరా
వేవేలు నాయఁబోయ వెనకకే పొందులు || ఏలే ||

ఔనె దొరతో నెదురాడవచ్చునా నాకు
మానిపండ్లు రాలితే మానికిందనే
తా నొకటి నే నొకటి తలపోఁత ఇన్నాళ్లు
నానాట మోహములు నాము వేసీఁగాక || ఏలే ||

[1] 'చావివోయ వుమినాకి చవుతమా ఇఁక' అని రేకు. క్రీగీతలు గల అక్షరములను హ్రస్వ దీర్ఘములుగా మార్చుకొను అవకాశముగలదు. ఎట్లు చేసినా పదస్వరూపమే బోధపడుటలేదు.

వద్దె యింక నాతో వట్టి వట్టి సరసాలు
అద్దో ముంజేకంకణాన కద్దమా యింక
గద్దించి శ్రీవేంకటాద్రి కడపరాయఁడు గూడె
పొద్దు వొద్దుకు వింతైన భోగములే కాక ॥ ఏలే ॥ 61 ॥

## బౌళి

ఎంతవేగిరకాఁడవు యేమి సేతువో
పంతగాఁడ ఇట్లయితే పనులెల్లా దక్కేను ॥ పల్లవి ॥

నట్టుకొట్టి నాలో నే నవ్వితేఁ దిట్టవచ్చేవు
పట్టితే నేమిసేతువో బాపురా నీవు
వెట్టైన చెమట దీర విసరితేఁ గసరేవు
ఇట్టె గురు లేడవంటే నిఁక నేమిసేతువో ॥ ఎంత ॥

తప్పక నేఁ జూచినదే తగ (గి?) లి యెగ్గులెంచేవు
ఇప్పుడే వెంగెమాడితే నేమిసేతువో
వొప్పుగా సన్న సేసితే వొకటొక టాడేవు
తప్పులే నిన్నుఁ బట్టితే దాని కేమిసేతువో ॥ ఎంత ॥

మోవి ఇచ్చినంతలోనే మోనాన సిగ్గువడేవు
యీవల గంటరేఁచితే నేమిసేతువో
వేవేలు వచ్చెను శ్రీవేంకటేశ నీవు నన్ను
కైవసమై కూడితివి ఘనతెంత సేతువో ॥ ఎంత ॥ 62 ॥

## దేసాళం

నీవే తెలుసుకొమ్మి నీ వోపిక
యీవల నేఁ గాదనేనా యింత కోపఁగలవా ॥ పల్లవి ॥

చిగురాకుఁ గెమ్మోవి చెంచువారము । నీకు
వొగరై తోఁచునేమె వొద్దురా నేము
సొగసు లేళ్లవంటిచూపులు మావి । పెక్కు--
వగలై మిన్నులఁ బారి వంచుకొనఁగలవా ॥ నీవే ॥

సరవి కొండలవంటి చన్నులనేము । నీ--
వురమెల్ల నొత్తఁజేసు నొద్దురా నేము
కరికుంభములవంటి[1] కటితటము యీ--
అరిది నడవివారి నాపఁ గలవా ॥ నీవే ॥

చిల్లెరతీగెలవంటి చేతులు మావి నీ--
వొళ్లెల్ల నరడుఁజేసు వొద్దురా నేము
మెల్లనే శ్రీవేంకటేశ మేకొలిపి కూడితివి
బల్లిదుఁడ వౌదుగాక పంతమాడఁగలవా ॥ నీవే ॥ 63 ॥

## ఆహిరి

పచ్చిసేసి వెచ్చిసేసి పాయ మింత నలఁచనేలా
మచ్చికెల్లఁ జూతుగాని మాపటింత రారా ॥ పల్లవి ॥

మాఁచనోలిచెన్నుఁడా మాటలాడి మమ్మునింత
రేఁచనేల వుండవోయి రేలుఁబగళ్లును
దాఁచలేము మోహమును తమక మింత గలిగితేను
యేఁచనేల వీదివీది యింటి కింక రారా ॥ పచ్చి ॥

వేణునాదమోహనా వెలిగోరు మోఁపి మోఁపి
జాణతనము లాడనేల చక్కనుండరా

---

[1] తాళపత్రిక యీ వాఙ్మయమున అక్కడక్కడ గలదు.

ప్రాణ మింత కోపదూను పలుకులేమి గలిగినాను
వీణెలోనె తెలుతుగాని వెంటవెంట రారా || పచ్చి ||

నందగోపనందనా నవ్వినవ్వి మమ్ము నేడు
కందువందు చేయివేసి కరఁగఁజేసితి--
విందుగూడినట్టు శ్రీవేంకటాద్రినుండి వచ్చి
దిందుపడితి మాఁచనోల దినదినంబు రారా||పచ్చి||64||

## సౌరాష్ట్రం

ఏమాఁట[1] కే మాఁట యేలరా
నామోము చూడవే నవ్వే నేను || పల్లవి ||

వద్దు వోరా వాదులు | వొక్క--
సుద్ది చెప్పే రావే సొలయక
కొద్ది నుండదురా కోపము | అయితేఁ
గదు(ద్దు?)లేవే[2] నిన్నుఁ గలసే నేను || ఏమాఁ ||

సారె నేలరా చలము | మరి
కోరికెల్లఁ జెల్లె కొంకువానెనే
మేరమీరేవేరా మెల్లనే | తొల్లె
తేరపనులకునుఁదెగువేలే || ఏమాఁ ||

చెల్లెరా నీ చేఁతలూ
అల్లనాఁడె నే నంటేఁగదె
వెల్ల విరయితి శ్రీవేంకటేశ | నిన్నుఁ
గొల్లగాఁ గూడితి కొసర నేలే || ఏమాఁ || 65 ||

---

[1] ఇది వాకోవాక్యము.
[2] ప్రాసభంగము. 'కదు' అని పదస్వరూపము సరికాదు.

నాదరామక్రియ

ఈఁతగాదు మోఁతగాదు ఇంతేలోతు మోహము
చేఁతసేసి యిఁకనైనా చెక్కునొక్కవే || పల్లవి ||

వలపు పుక్కిటిబంటి వనిత విభునితోడ
మలసి సొలసి యిట్టె మాఁటలాడవే
చలము చంకలబంటి సరసము లాడితేను
కలసి మెలసి యిట్టె కాఁగిలించవే || ఈఁత ||

కోరికె పిక్కలబంటి కొంకుదేరవలసితే
యేరీతినైన నాతనింటి కేఁగవే
తారుకాణ మొలబంటి దగ్గరఁబోయినప్పుడే
కూరిమితో తొడమీఁదఁ గూచుండవే || ఈఁత ||

పాయము రొమ్ములబంటి భావించి చూచితేను
ఆయెడ శ్రీవేంకటేశు నటు చూడవే
ఆయము కుత్తికబంటి అతఁడిట్టె నిన్నుఁగూడె
మోయుచు మదనమంత్రములు వినిపించవే ||ఈఁత||66||

రేకు 1612 కాంబోది

ఏల నన్ను దూరేరే యెందాఁకాఁ బోరేరే
చాలుఁజాలు నన్నిటికి సమ్మతించే నేను || పల్లవి ||

అప్పుడే యాతనితో మాటాడించవద్దు గాని
చెప్పరమ్మ మీ బుద్ధి సేసే నేను
చెప్పరాని చేఁతలెల్లా చెల్లఁబెట్టవద్దు గాని
వొప్పగా మారెందుకైనా వొడఁబడే నేను || ఏల ||

దుట మమ్మిద్దరిని ఇంత రేఁచవద్దు గాని
వొదిగి నీయానలోనే వుండే నేను
ముదిరిన మా కోపములు దిద్దవద్దు గాని
యెదురాడ కెంతకైనా నియ్యకొనే నేను || ఏల. ||
నాయము పెట్టిద్దరిని నవ్వించవద్దుగాని
కాయపుఁగోప మారితేఁ గదిసే నేను
ఆయమంటి శ్రీవేంకటాధిపుఁడు నన్నుఁగూడె
వేయునేల మీ మాఁటే వింటిఁగదే నేను || ఏల || 67 ||

## కేతా(దా?)రగౌళ

మాయలేల రారా మనకేఁటి కలుక
పోయినవల్లాఁ బొల్లు పొద్దువోయ నిఁకను || పల్లవి ||
పలికితే దోసమా పలుమారుఁ బిలువఁగ
యెలమిని పరకాంత లీడ నున్నారా
వలతునందువు నాకు వారివీరితోడ నేల
కలది లేని దిఁ (దిం?) దే కానవచ్చె నాకు || మాయ ||
చూచితేనే దోసమా నే చొక్కి యెదుట నుండఁగ
నాచుబొమ్మ చారితనము దప్పినా
యేచి మనకూట మిఁక నిందరును మెత్తురు
తాచి నేఁడు ఇందులోనే తారుకాణలాయఁగా || మాయ ||
మనసిచ్చితే దోసమా మంచిమాట లాడఁగాను
మినుకునీజవ్వనము మీఁదువోయీనా
చెనకఁగఁ గూడితివి శ్రీవేంకటేశ నన్ను
మునిపితే ముయాయి[1] మోహ మెందుఁ గలదే||మాయ||68||

---

[1] ముయి+అయి. ముయి=మాట, నింద ఇత్యాదికావచ్చు.

దగ్గరితే నిఁ(నిం?)తనేసె తా నదేమే
యెగ్గుసిగ్గు లెంచఁ జోటు ఇందులో నేదే || పల్లవి ||

తక్కించి పొరుగునను తాను నేను వుండఁగానే
చెక్కిటికి చేయివచ్చె నేసేదేమే
కక్కసించి రాకపోక కన్నుల నే చూడఁగాను
లక్కవంటిమనసాయ లాగు నిఁక నేలే || దగ్గ ||

తాను నేను నొక్కపీది తగ నడచినంతనే
మానుపడె మేనెల్లా మరిఁకనేమే
నానుపుగా తానునేను నవ్విన యంతటిలోనే
తానకమాయ వలపు తారుకాణ లేలే || దగ్గ ||

తలపోసి తలపోసి దగ్గిరినయంతలోనే
కలసె కాఁగిట నన్నుఁ గత లేలే
చెలఁగి శ్రీవేంకటేశు చేరినఫలములాయ
నిలువే నివ్వెరగాయ నేర మెంచనేలే || దగ్గ || 69 ||

ముఖారి

అతివ గుట్టుననున్న దందాఁకాను
చెతురుఁడ[1] నిఁకనైన సంగడి కేఁగరాదా || పల్లవి ||

నేసకొప్పు వంచినది చెక్కుచేత మించినది
ఆసగా యేమాటయిన నాడరాదా
మూసిన ముత్య మయినది ముంగిట నిలుచున్నది
మేనుల ఆకెతోడ మేలమాడరాదా || అతి ||

1 'చతురుఁడ' యతిసమసంవేది (వా.శ్రీ.)

నిట్టూర్పు నించినది నిండాఁ జెమరించినది
నట్టుకొట్టి అకెఁ గొంత నవ్వించరాదా
మెట్టి నేల వ్రాసినది మేలు నీకుఁ జెప్పినది
పట్టి యాఁకె పానుపుపై పాలార్పరాదా || అతి ||

నివ్వెరగుతో నున్నది నీమనసెల్లఁ గన్నది
రవ్వగా అకె నిట్టె రమ్మనరాదా
యివ్వల శ్రీవేంకటేశ యింతసేపి కూడితివి
నివ్వటిల్లఁ గోమలికి నిజమియ్యరాదా || అతి || 70 ||

## తెలుఁగుఁగాంబోది

ఈవలపు నాకేయో[1] యిందరికి నిట్లానే
దైవముసేసినమాయో తప్ప కిట్టె చెప్పరా || పల్లవి ||

కన్నుల నిన్నుఁ జూచి కనురెప్ప వెట్టఁజాల
అన్నిటా సతులుఁ బతు లలిగే దెట్టో
సన్నపునవ్వులు నవ్వి చాలునని మానఁజాల
తిన్ననికాంతలు పతిఁ దిట్టే దెట్టో || ఈవ ||

మాటలాడి మాటలాడి మాట ముగియించఁజాల
చాటువగా దంపతులు జంకించే దెట్టో



[1] నాకే+ఓ పూర్వపదాంతమున ద్రుతములేదు. కావున యుదాగ[illegible] [illegible]నట్లో నిది [illegible] 'నాకేవో' అని గలదు. 'వీరేవా బలరామకృష్ణులు' భాగ. స్కం. 10 [illegible] పూర్వముగూడ ద్రుతము కలిపివ్రాయుటకలదని తోచుచున్నది

కూటువుకాఁగిట నించి కొంత వదలఁగఁజాల
మాటున తెరవేసేటిమంతనము లెట్టో ॥ ఈవ ॥

భావరతిఁ గడుఁజొక్కి పక్కనఁ దెలియఁజాల
మోవి గంటిసేతురవేమొక్కుల మెట్టో
వోవల శ్రీవేంకటేశ పురమెక్కించితి నన్ను
వేవేలకు బొందులు వేరనఁగ నెట్టో ॥ ఈవ ॥ 71 ॥

బౌళి

నీ వేమిసేతువయ్య నే వచ్చుటేదోసము
ఈ వేళ వెన్నెలగాసీ నిదియేపో దోసము ॥ పల్లవి ॥

వలచినజవరాల వద్దనఁగ దోసము
కలిగినట్టాడకున్నఁ గడు దోసము
యెలమి నీ యింత నీ వెఱఁగవు దోసము
మలసి యింతనేసినమరునిదే దోసము ॥ నీవే ॥

చెంగటిచెలులు బుద్ధిచెప్పనిది దోసము
యింగితపుమతి రాయయినది దోసము
కంగించి రానీనియట్టి కాంతలదే దోసము
'ంగార దైవము దయవుట్టించనిదోసము ॥ నీవే ॥

తొట్టినసంపదలతో దొరవైన దోసము
వట్టివేరాలు విన్నించేవారి దోసము
ఇట్టె శ్రీవేంకటేశ యింతి గూడితివి నేఁడు
తట్టినట్టిందరికి నింతటఁ బాసె దోసము ॥ నీవే ॥ 72 ॥

రేకు 1613 దేసాళం

ఓయమ్మ తనపొందు వొల్లకుందునా
చేయివట్టి తీయనేలే చెలులు నన్నిపుడు || పల్లవి ||

దగ్గరి మాటాడ నాకుఁ దడవా తనతోను
యెగ్గులదప్పులొనని యెంచేఁ గాక
నిగ్గులసరస మాడనేరనా కొంతైనా
సిగ్గరితనాన కేనేఁ జింతించేఁ గాక || ఓయ ||

సొలపుఁ జూపులఁ దన్నుఁ జూచు టరుదాతన-
తలఁపు దెలియలేక దాఁగేఁ గాక
సెలవినవ్వు దనపై చిలికించనేరనా
కొలఁదిమీరునోయని కొంకే. ాక || ఓయ ||

కాఁగిలించి ఇట్లనె కరఁగించ నా
మూఁగినయాసలు చూపి మాఁపితిఁగాక
తోఁగెను చెమట నాకుఁ దోడనె శ్రీవేంకటేశ
అఁగి రతిఁ జొక్కించితి వందుకే కాక || ఓయ || 73 ||

శ్రీరాగం

సరస మాకొకపాత్తే చంద్రమందానిలాదులు
యెరపై మమ్మింత యేఁచి నేమిసేతు వీనిని || పల్లవి ||



వెంగటఁ జల్లనిగాలి సీతనంటి వచ్చినా
యంగమంటెయును నింకా నారదు కాఁక
అంగనచూపు చందురు నంటె నాచూపును నంటె
అంగజతాప మారదాయెఁ జూడు తమ్ముఁ || సరు ||

యెనసి అఖదువిరులే ఇద్దరివి సోఁకినవి
ఘనమై మానవు తమకము లింకాను
వావరె మనసులలో వొకరొకరి రూపులు
కనుఁగొనియు రతులఁ గరఁగవు మేనులు || సరు ||

కట్టితి లంకపట్టము గట్టితి చింతాజలధి
అట్టె సీతఁగూడితిఁ బాయదు చెమట
గట్టిగా వావిలిపాట ఘనశ్రీవేంకటగిరి
జట్టిగా నున్నాఁడ రామచంద్రుఁడ నే నిదివో ||సరు ||74||

## శంకరాభరణం

అవి నాకాఁగిట నమరీనా
జవళిమాఁటలకు జాణవుగదరా || పల్లవి ||

పలుకవదేమే పడఁతీ | నా-
పలుకులు చిలుకలపలుకులె పో
యిల నీరూపున కెనయౌనా | యిటు
పొలఁతులఁ జిలుకలఁ బోలుచరటరా || అవి ||

చూపులఁ జూడవె సుదతీ | నా-
చూపులు మదనుని తూపులెరా
యేపున నీ కందుకేమివవె[1]
పోపో ఆనరి పోల్తురు గదరా || అవి ||

అలమవె కాఁగిట నతివా
అలమీఁ దీఁగెలె అమారు

---

[1] వ్రా(?)తిక ఏమి+ఇవి+అవె

కలసితి శ్రీవేంకటవిభుఁడను నే
పొలిఁతి నీలతలవె పోల్తురుగదరా || అవి || 75 ||

## సాళంగనాట

తాపసులడవి యేడ తరుణి యేడ
బాపు బాపు రామచంద్ర భావించి చూడుమా || పల్లవి ||

సీతఁ బాసి బంగారు సీతఁ బెండ్లియాడితివి
ఆతలఁ బరస్త్రీల నంట వందురు
చేతులార ముత్తేలసేస వెట్టె నీకు ఆ--
చేతనుఁజెక్కు మోఁపి చింతించే కొరకా || తాప ||

వెంటనే భూమిజఁ బాసి వేరేభూమి చేకొంటి
జంటనే సత్యముగలజాణ వందురు
వింటివంక నీకు నాకె వేడుకఁ జేరి మరు--
వింటిబారిఁబడి యొంటి వేఁగేటికొరకా || తాప ||

కొడుకులవంకఁ బెండ్లికొడుకవై జానకి--
నడరి కమ్మరఁ బెండ్లియాడితివి
తొడరి శ్రీవేంకటాద్రిఁ దోడనె వావిలిపాట
కడఁగి రాముఁడవై కరుణించే కొరకా || తాప || 76 ||

## బౌళి

ఏదుముల్లుచెంచెతా[1] ఏఁటికే యింతా
వాదులకు నీవు రాకు వద్దు వద్దు ఇఁకను || పల్లవి ||

పీఁకవింటి చెంచెతా పీఁచి కోసేవేఁటివే
పోఁకలవిడేలువో వొగరుగాని

---

[1] ఇది సంభాషణాత్మకము.

ఆఁకపోలముగదే అందుకు లోనైతివే
యేఁకటైతేఁ[1] జాలుఁగాని యేరుకోరా నీవును ॥ ఏదు ॥

పిలిచుంగుచెంచెతా పేరు ఇవి యేఁటివే
వోలి నవి జీడివివో వొమ్మవు గాని
చాలి నాకు నియ్యఁగదే చవిగొన నోపుదును
యేలరా తొల్లె ఇవి యెంగిలాయఁగదరా ॥ ఏదు ॥

మోవితేనె చెంచెతా మొగిఁ జూసేదేఁటికే
కావిరాతిగందము వో కాఁకవుఁగాని
నీవు నన్నుఁ గూడితివి నీసొబగు నాకు నంటె
శ్రీవేంకటేశ్వర చిక్కులింకా నేలరా ॥ ఏదు ॥ 77 ॥

పాడి

అడుగరే చెలులాల ఆమాఁటే ఆతని
విడువక పంతగాఁడై విఱ్ఱవీఁగీఁ దాను ॥ పల్లవి ॥

నెమ్మి యమునలో నీఁదనేరిచినవాఁడు నాతో
ఇమ్ముల వలపుమడు గీఁదఁగలఁడా
దిమ్మరై అడవులెల్ల తిరిగినగోపాలుఁడు
సొమ్ములనా జవ్వనము[2] చొరఁగలఁడా ॥ అదు ॥

---

[1] ఏఁకటాఁడేటు ('ఏకారునకు' రూపాంతరము) కావచ్చు. కాని ఈ పాదభావము అంతగా [illegible] లేదు.

[2] ఇచ్చట పాటలోని అర్థక్రమమును బట్టి 'జవ్వనము' శబ్దములో ఏకదేశమైన 'వన' శబ్దమునకు అర్థము స్వీకరింపవలసియున్నది. లేదా 'జడియు+వనము'=(జడియునట్లు చేయువనము) జవ్వనము. అని నిష్పాది గణములో చేర్చినదైన సాధింపవలసియున్నది.

బొందినే గోవర్ధనపుకొండ లెత్తినట్టివాఁడు
యిందులో నాచన్నుఁగొండ లెత్తఁగలఁడా
పందెమాడి గోపికల బడలించినట్టివాఁడు
అందపురతుల నన్ను నలఁచఁగలఁడా || అదు ||

మించుఁదిల్లఁగోవి మోవి మెరసినవాఁడు నా-
చుంచుఁ దిల్లఁ గోవిమోవి సోఁకఁగలఁడా
యెంచఁగ శ్రీవేంకటేశుఁ డింతలోవిచ్చేసి కూడె
ఇంచు భావబంధాల కీయకొనఁగలఁడా || అదు || 78||

రేకు 1614 ముఖారి

ఇంకనైనా రమ్మనవే యిట్టే తాను
అంకెలఁ బొందైనచోట నంతేలే తాను || పల్లవి ||

కన్నులఁ జూచినచూపు కలువరేకై తాఁకె
యెన్న నది మరుబాణ మెఱఁగఁడా తాను
సన్న సేసినట్టిచేయి జలజలమై మీఁదఁబారె
మున్నిటి యమ్ముకుఁ దోడు ముంచినా తాను || ఇంక ||

మచ్చిక నవ్వినవ్వు మామిడిపువ్వయి తాఁకె
ఇచ్చఁ జిత్తజునమ్మోత ఎఱఁగఁడా తాను
అచ్చపు బొమ్మజంకెన లశోకమై తాఁకె
కొచ్చి మరియు నంపె పైకొసరా తాను || ఇంక ||

కప్పురము వంటిమాట కమ్మని జాజై తాఁకె
యెప్పుడు పంచబాణాల నెఱఁగఁడా తాను
ఇప్పుడే శ్రీవేంకటేశుఁ డేఁగివచ్చి నన్నుఁ గూడె
కప్పి కానివి మంచివికాఁ జేసె తాను || ఇంక || 79 ||

## భైరవి

నమ్మితింబెనవాపోటిక[1] చవిగా దొకరి బుద్ధి
నెమ్మది వానె తలఁపు నీవే యెఱుఁగవయ్యా || పల్లవి ||

ఆకె నీపైఁ దమ్మివేసె నందుకు నీ వియ్యకొంటి—
నేకచిత్తమైనపోట నెడమాఁటలా
యేకత మేమిగల్లా విట్టె నీవు విచ్చేసి
ఆకెతో వాదుకోవయ్య అయ్యో నే మోపము || నమ్మ ||

కూడి మాడి వుండుదురు గుణములు మీ కొక్కటే
యీడ మాచేఁ దిలిపించే వింతిని నీవు
పాడిఁబంత మెఱఁగవా పడఁతిని నోరినిండా
అడనే పిలువవయ్య అయ్యో నేము నేరము || నమ్మ ||

నిక్కి నన్ను నేసిలివి నెలఁత నెలవి నవ్వె
వొక్కటైనచోట నింకా నొడఁబాట్లా
చక్కని శ్రీవేంకటేశ సతిఁ గూడితివి యాకు
ఇక్కువ మడిచీవయ్య యీవేళ దగ్గరము || నమ్మ || 80 ||

## దేసాళం

పేరఁబేర వలపులు పెంటలయ్యీని
నేరుపులు లోలోనే నింతముగాని || పల్లవి ||

తేనెగారేమోవిమీఁద తీపుమాట లాడకువే
మోనమున నాకు గదుమొగచాటాయ
నూనెగారేచెక్కులపై నున్నఁజే యిడకువే
సోనలై జీరుకువారీఁ జూపులకు నాకు || పేరఁ ||

---

[1] నమ్మితింబెన+అ పోటికి

తళుకుదంతాలమీఁద తగ నవ్వు చిందకువే
తెలుపు రేయివగలుఁ దెలియనీదు
చిలుకుఁజూపులలోన సిగ్గులు నించకువే
తలపోఁత నా మనసు తగిలి పోనీదు || పేరఁ ||

పిక్కటిల్లుఁ జన్నులతో దిగువున వీఁగకువే
మిక్కిలి నాకాఁగిటికి మారుకొనీని
యెక్కువైన శ్రీవేంకటేశుఁడ నేఁ గలసితి
మొక్కకువే సారె నట్టె మోఁపులై నిండీని ||పేరఁ||81||

## కన్నడగౌళ

ఇంతసేసెఁగా మాయ ఇద్దరిమాయెడమ[1]
చింతించే నిందుకే పతిచిత్త మెటులుండునో || పల్లవి ||

తప్పక తాఁ జూచినాను తలవంచి చూడనైతి
అప్పుడే రాఁడాయనని ఆ కోపాన
చిప్పిలఁ దా నవ్వినాను సెలవిని నవ్వనైతి
చెప్పఁడుమాటలు విన్న చిత్తపుఁగోపానను || ఇంత ||

కాలు దాఁకినాను నేను కడఁగి మొక్కనైతి
చాలి వొట్టువెట్టుకొన్నచలానను
కేలువట్టి తీసినాను కినిసి లోఁగా నైతి
జాలిమనసెఱఁగనినందేహమునను || ఇంత ||

మచ్చికఁ దాఁ జెనకఁగా మారు నేఁ జెనకనైతి
వచ్చియైన సిగ్గుమీఁది వరాకున

[1] 'మాయిద్దరియెడమ' అనుట సహజము. యతి నిర్బంధము కాలోలు.

తప్పి శ్రీవేంకటపతి తానే నన్నిటు గూడె
యిచ్చకమైతి నిప్పుడే యెక్కువ మోహానను ॥ఇంత॥27॥

## శంకరాభరణం

చెలులాల బలిమిసేసేరు గాని
బలిమి వలచితే పసలేదు సుమ్మీ ॥ పల్లవి ॥

ఆడినమాఁటకును నడ్డము చెప్పక
కూడేఁగాని కొరతసుమ్మీ
వోడక పిలువఁగ వూఁకొంటిఁ గాని
జాడతో గదిసిన చవిగాదు సుమ్మీ ॥ చె ॥

తానే యీవేళ తగులఁగ నలుకలు
మానేఁ గాని మఱచు సుమ్మీ
పూని మొక్కఁగా పొదిగితిఁగాని
కానీలే తనమతి గానఁ జుమ్మీ ॥ చెలు ॥

కాఁగిట నించఁగ కదిసేఁ గాని
చేఁగ పంతములు చెల్లె సుమ్మీ
వీఁగక యిటు శ్రీవేంకటపతిగాన
నాఁగువార నే నవ్వేఁ జుమ్మీ ॥ చెలు ॥ 83 ॥

## మధ్యమావతి

తనసొమ్మై వున్నదాన తమకమేలే
ననుపైనదే చాలు నగితి నే ననవే ॥ పల్లవి ॥
తేనెలమాఁటలు నాఁడె తీపులాయ తనవల్ల
కానివొట్లతో నేఁడు కారములాయ

వ్వా (వ్వా?) ని యింక నేమన్నా నాగరానో చేఁదానో
మోనాన నుండుటే మేలు మొక్కితి నే ననవే ॥ తన ॥

అల్లనాఁటితనచూపు లప్పటికి నీడలాయ
యిల్లిదె తన్నుఁ బాయఁగ యెండలాయను
వెల్లిగా నిఁక నేమన్నా వేఁడానా[1] వాండ్లానో
వెల్లవిరి సేయనేల వెరగైతి ననవే ॥ తన ॥

పొందినపొందులు నాఁడె పూఁపలాయఁ బిందెలాయ
చెంది నేఁడె దోరలాయ చేరికూడఁగా
అందిన శ్రీవేంకటేశుఁ డంటితేనె పండ్లాయ
మందెమేళ మింతచాలు మరవకు మనవే ॥ తన ॥ 84 ॥

రేకు 1615 సామంతం

చింతతోడ నన్నుఁ జూచి సిగ్గువడుకొంటిగాక
యింతలో నీతెరువు రా మిందుకేల కోపము ॥ పల్లవి ॥

చెక్కునఁ జేయిడఁబోతే శిరసుపువ్వులు రాలె
అక్కరతో నవ్వితిఁబో అందుకే నేను
నిక్కిచూచి జంకించేవు నిన్ను నేఁ దడవితినా
చక్కని వో రమణుఁడ చాలుఁజాలుఁ గోపము ॥ చింత॥

నిట్టూరుపు నించఁబోతే నిండ మేను చెమరించె
అట్టె కసరుకొంటేఁబో అందుకే నేను
నెట్టన దూరే వందుకు నీతో నలిగితినా
వట్టినేరా లీడ లేవు వద్దు వద్దు కోపము ॥ చింత ॥

[1] 'వేండ్లానో' అనిన బాగుండునేమో

కాఁకల నొరగఁబోతే కందువ నీ మేను సోఁకె
ఆఁకల బెదరితిఁబో అందుకే నేను.
యేఁకటలో శ్రీవేంకటేశ యిట్టె కూడితివి
వూఁకొనఁగఁ జోటులేదు వుడివోయఁ గోపము ||చింత||85||

**సామంతం**

అప్పటి బలిమిసేసే రయ్యో మీరు
వుప్పు గప్పురముఁవలె వుండకుండీనా || పల్లవి ||
పైతరవు లింతయేల పట్టకురే చెలులాల
ఆతఁడేడ నేనేఁడ అయ్యో మీరు
రాతి రింటిపొందులెల్ల రాతిరికే ఆయఁబోయ
యీతల వేగఁ బొద్దు ఇష్టాడుండీనా || అప్ప ||
చందమామగుటుకలు సారెసారెఁ జెప్పఁబోతే
అందునిందు నెడతాఁకే రయ్యో మీరు
నిందవచ్చెఁ దనకుఁగా నిండెను రేకలు మేన
సందేహమెల్లఁ బాసె సరివచ్చీనా || అప్ప ||
చిత్తమునెంచరి దిరి శ్రీవేంకటేశుఁ డిన్ను
హత్తించితిరి మేలు అయ్యో మీరు
పొత్తులచుట్టాలు మీరు భోగములు మాకు నట్టె
కొత్తలాయ నవ్వులు కొలుతయ్యీనా || అప్ప || 86 ||

**ముఖారి**

చేసినంతఁ[1] జెల్లుఁబోరా చేతికి నే లోనైతి
రాసికెక్కినంతమీఁద రంతులు వంతులునే || పల్లవి

---

[1] చేసిన + అంతయున్ = చేసినంతన్. యు లోపము. చేసినవెంటనే ఫలసిద్ధు లంత నసినాలేదు.

కోరి దవ్వులఁ జూచితే కొండలెల్ల నున్ననే
చేరువైతే చెట్లూనుఁ జేమలింతే
పోరచివోరమణుఁడ పొందుదాఁక వినయాలె
తారుకాణ లటమీఁదఁ దాఁటలుఁదూఁటలునే || చేసి ||

మక్కువఁజూచిన నెండమావులెల్లఁ జెరువులే
నిక్కము వెదకఁబోతే నేల మిన్నే
చక్కఁగా మాటాడుదాఁక చల్లనివే నీ గుణాలు
వొక్కటైవ మీఁద మరి వొలసీనొల్లములే || చేసి ||

కడఁజూడ జలధికి కల్లలు బుల్లలునే
వడఁపఁ నాఁడిముత్యాలు [1]నవరత్నాలే
యెడయుఁగా శ్రీవేంకటేశ నిన్ను నంటఁగాని
బడి నన్నుఁ గూడితివి బాగులు లాగులువే || చేసి || 87 ||

## సాళంగనాట

చెల్లుబడి యింతగాఁ జేసితివమ్మా
పల్లదాన నుట్లకుఁ బందుగాయునమ్మా || పల్లవి ||

కోలలెత్తుక వుట్ల గొట్టే నేఁ డల్లవాఁడె
మేలు మేలు యశోద మీబాలుఁడు
బాలులఁ గూడుక వీదిఁ బారాడి నల్లవాఁడె
బేలుఁదనమున లెస్స పెంచితివోయమ్మా || చెల్లు ||

ఇంటివారు వుండఁగానే యిండ్లు చొచ్చి వాఁడె
దంటతనా లివి మీకు తగునమ్మా

[1] ముత్యాలు

అంటఁబారి పట్టుకొంటే ఆయములు దాఁకించె
జంటితేనెమోవు లివి చూడవమ్మా || చెల్లు ||

కాదుగూడదనఁబోతే కాఁగిలించీ నిదె వీఁడె
ఆదెస నీదేఁటినవ్వు లవునమ్మా
సాదై శ్రీవేంకటాద్రి సరసమాడీనమ్మా
యీదెస మమ్మిటు గూడె నేమిచెప్పేమమ్మా ||చెల్లు||88||

ధన్నాసి

పదియుఁ[1] బదియుఁగాను పతి నీకె వలచెను
పొదిగి నీరమణుని భోగించవమ్మా || పల్లవి ||

రెప్పవెట్టక చూచెను తప్పక లోఁ జింతించె
చప్పరించె దొండపండు సరి మోవెంటా[2]
కప్పి నీ సింగారాలు కదుమెచ్చి లోనాయ
అప్పటనుండే పిలిచీ నాడకు రావమ్మా || పది ||

తాపమున వేఁడుకొనీ తల్లినైనఁ గోపగించీ
యేపొద్దు నిన్ను వెదకీ యెడసివుండీ
యేపున నీడకు వచ్చె నిదివో నీకుఁ గానె
పైపై నెదురుకొని పచ్చి సేయవమ్మా || పది ||

మానుపడ్డట్టై వుండె మరి నీ కాఁగిట గూడీ
ఆనుకొని రాతిగుండెయ్యె నిలిచెను
కానిమ్మని శ్రీవేంకటపతి కొడఁబడి
ఠానె వురమెక్కితి వంతదానవమ్మా || పది || 89 ||

---

[1] ఇందు దశావతార సమన్వయము కలదు.
[2] మోవి అంటా.

## శ్రీరాగం

ఎట్టున్నదో మీ చిత్త మెవ్వ రెఱుఁగుదురు
జట్టిగొని యింతలోనే జాగులేఁటికయ్యా || పల్లవి ||

మనసిచ్చి నీతోను మాటలెల్లా నాడెఁ జెలి
చనవిచ్చి యేమన్నా సమ్మతించెను
తనువిచ్చి నీయెడకుఁదగినకాఁగిటఁ గూడె
తనియ వేమిచ్చినాను తమకించేవయ్యా || ఎట్టు ||

పేరుకొని నీమీఁదిబీరపుఁ బదాలు వాడె
తేరకొని నిన్నుఁ జూచి తేలిమెచ్చెను
మారుకొని సరసాన మాఁటకె మాఁటకె నవ్వె
కోరుకొని వుంటె వింక కొసరేఁటికయ్యా || ఎట్టు ||

పులకించెఁ దనమేను పొందిన నీ రతులలో
చిలికించె వలపులు చెక్కులునొక్కి
పలికించె నీవు రతిఁ బరవశమైతేను
వులికించేవు శ్రీవేంకటోత్తముఁడ గోరను || ఎట్టు || 90 ||

## రేకు 1616 దేశాక్షి

వనిత జవ్వనమున వసంతకాలము వచ్చె
ననిచి నీవు రాకుంటే నాయముగాదయ్యా || పల్లవి ||

పట్టపగలె యిటు పంకజాలు మొసలించె
ఇట్టె విచారించ విది యేలయ్యా

వెట్టిన వేసవిలోన నీరు[1] చిమ్ము గానెం దీగె
పట్టి విచాంచకుంటేఁ[2] బాపమయ్యా || వనిత ||

వుండుండె యకాలాన వూరకె సేమంతి వూచె
అండనట్టె తన్నదుగ వదేలయ్యా
విందుఁ జంద్రుఁ డుదయించె నిక్కావు కలువ లిదె
దండి విభుఁడవు నీకుఁ దగదయ్యా || వనిత ||

అర్ధమరాతిరి[3] గాకె అదె దిరిశము వూచె
సుద్దులెల్ల మాని చెలిఁ జూడవయ్యా
వొద్దిక శ్రీవేంకటేశ వునిదఁ గూడితి నిట్టె
పొద్దు వొద్దు పువ్వులు నీ పూజలయ్యా || వనిత || 91 ||

## రామక్రియ

ఊరకే నోరుమూసుక వుండలేము చూచిచూచి
చేరి నేము చెప్పినట్టు సేయువయ్య నీవు || పల్లవి ||

పాయకురమణి గాన వంతానకే పెనఁగీని
చేయివట్టి తీసినా చేరఁగరాదు
అయము సోఁకినమాట అడిగే నీకేమాయ
నోయయ్య నీ కోపమున కోపమయ్య నేము || ఊర ||

సిగ్గువడేనతిగాన శిర సెట్టె వంచీని
వొగ్గి పేరఁ బిలిచిన నూరకున్నది
దగ్గరి నీవు పైకొంటే తగవు నీకేమి దవ్వ
వెగ్గళించేరాజసము వెలితుమయ్యా || ఊర ||

1 నీరుచిమ్ము 'నీటిదాహము' కావచ్చు.
2 'విచారించకుంటే' వ్రాయునగాని తప్పు (శా. శ్రీ.)
3 అర్ధరాత్రివేళ దిరిసెనపువెట్టు పూచునట. క్రొత్త ప్రకృతి రహస్యము.

ాఁగినరమణిగాన కడు బడలియున్నది
అఁగి నేమేమిచెప్పినా నడ్డమాడదు
దాఁ-కఁక శ్రీ వేంకటేశ తరుణిఁ గూడితి నీవే
యేఁగుఁబెండ్లి అయి నేఁడు యియ్యకొంటిమయ్యా ||ఊర||92||

ఆహిరి

ఎందాఁకాఁ జలమింక నియ్యకోవయ్య
కందువ నీచెప్పినట్టె కానీవయ్యా || పల్లవి ||

కోపగించఁగలందుకుఁ గోపగించితిమి మీతో
నాపనికి నింక నీతో నవ్వేనయ్య
తీపుల నీచేఁతలకుఁ దెగి పంతాలే యాడితి
మోపిచూపి ఇఁక నీకు మొక్కేనయ్యా || ఎందాఁ ||

అట్టె నీవు రానందుకు నవ్వరి మోమైతి నాతే
యెట్టు విలిచిన వచ్చే నిదిగో వయ్యా
చుట్టువువరుసలెల్లఁ జూచిచూచి సొలసితి
జట్టి నీవేమి సేసినాసమ్మతించేనయ్యా || ఎందాఁ ||

అప్ప టావేగిరమున ఆన పెట్టుకొంటి నేను
యిప్పుడు లేదనవయ్య యేమయ్యా
వొప్పగ శ్రీవేంకటేశ వొనగూడి రతులను
మెప్పించఁగ నే నిన్ను మెచ్చితినయ్యా || ఎందాఁ || 93 ||

కాంబోది

ఎవ్వనిఁ దలఁచితివే ఎక్కడ మోహించితివే
చివ్వనఁ జెప్పవే నాతో సిగ్గువడనేఁటికి || పల్లవి ||

చెక్కులేల చెమరించె చెలియ నీ కిదె నేఁడు
వెక్కసపుటెండలతో వేసవి రాదు
గక్కున నీమేనేల కదుఁ బులకించె నేఁడు
వక్కణింప నింక జడివానలు రావు || ఎవ్వ ||

వెలువెల్లఁబారనేలే వెన్నెలబొమ్మవలె
అలరు శారదసమయంబు గాదు
పలికేనీమోవి నేల పక్కులుగట్టె నేఁడు
కలికి యిప్పుడు మంచుకాలము గాదు || ఎవ్వ ||

కప్పనేల పయ్యదను కాలమిది చలి గాదు
చెప్పలేదు వసంతము చిగిరించెను
దప్పిదేర నిటు గూడె తగ నిన్ను నింత చేసె
యిప్పుడా శ్రీవేంకటేశుఁ డేడనున్నాఁడే || ఎవ్వ || 94 ||

## ఆహిరినాట

ఇంతకుమిక్కిలి మాఁట యేమియుఁ నాడకుమనె
అంతయు నీవెఱుఁగుదు వటమీఁదననుచు || పల్లవి ||

పడఁతి నీకుఁ గప్పురపలుకు గానుక యంపె
వడి నీ మాఁటలు నీకే వచ్చెనంటాను
తడయక మరి మొల్లదండలు నీవద్ది కంపె
నడుమనే తనపాటు నవ్వులాయ ననుచు || ఇంత ||

పుచ్చినవీలాలదండ గొబ్బున నీకు నంపె
మచ్చిక నీచూపు నీకె మరలెనంటా
అచ్చపుబంగారుబొమ్మ వదియును నీ కంపె
యిచ్చితిఁబో తనదేహ మిదె కొమ్మనుచు || ఇంత ||

తోడనే చెలియు నీకు దొంతరపువ్వులు నంపె
కూడినకూటములకు గురుతంటాను
యీడనె శ్రీవేంకటేశ యిద్దరుఁ గూడితి రిట్టె
వేరుక తొల్లిటివెల్లా వీడుకు వీడమచు || ఇంత || 95 ||

## తెలుఁగుఁగాంబోది

చెలులాల కోరిటు చేరి మతించఁగ
అలమేల్మంగకు నమరినది || పల్లవి ||

పూవుబాణములు పాదినేసె మరుఁడు
కావవి నవ్వులు కాంతవి
భావించ మందపవనుఁడు మలసెను
తావివూరు పిది తరుణిది || చెలు ||

మొదల నారదుఁడు మోయించె వీణెను
అదిగాదు మాఁట లంగనవి
చదల నదివో యురసంజ వొడమె నిటు
మదరాగము లవి మానినివి || చెలు ||

మెఱుఁగులు మెరిచీ మింటను మేఘము
యెఱఁగలేరు కళ లింతివి
అఱిముఱితిగె మాకంటెను కా దింతి
యెఱుకల శ్రీవేంకటేశునిఁ గూడె || చెలు || 96 ||

రేకు 1617 రామక్రియ

అప్పుఁ జెల్లెండ్ల మింతే ఆతఁడు నవ్వీ నంతనె
ఇప్పుడు వేరుగఁ జూచే విది యేమే నీవు || పల్లవి ||

వోరగండ్లఁ జూచేది వొక్కొక్కమా టాడేది
యీరసాలువలెఁ దోఁచీ నిదేమే నీవు
కేరి కేరి నవ్వేది కేరడము లాడేది
నేరుచుకొంటివి నాతో నీకేలే వోరట || అప్పఁ ||

బొమ్మలు ముడివెట్టేది పొరపొచ్చము సేసేది
యెమ్మెల రేసులు దోఁచీ నిదేమే నీవు
దిమ్ములఁ జెమరించేది తీగెసాగ నూఁకొనేది
కమ్మరఁ గమ్మర నీకు గలిగెఁగా నేఁడు || ప్పఁ ||

ముక్కున నుసురనేది మొగముఁ వంచుకొనేది
ఇక్కువసేఁతలు దోఁచీ నిదేమే నీవు
తెక్కుల శ్రీవేంకటాద్రిదేవుఁ డిట్టె నన్నుఁ గూడె
వొక్కమనసున నింక నుండవే నీవు || అప్పఁ || 97 ||

## ఆహిరినాట

అప్పడే యెంతకు వచ్చె నదేరా నీవు
రెప్పలు నే వంచితేనే రేసు పుట్టెఁ బనులు || పల్లవి ||

శిరసువంచి తిట్టి సిగ్గులుమోవఁ జెనకి
అరగన్ను మోడ్చి చూచే వదేరా నీవు
గరిమ నిన్ను జొక్కించి కళలంటి యిందు మారు
సరికిసరి నవ్వితే చక్కనయ్యెఁ బనులు || అప్ప ||

బొమ్మల నే జంకించి పోకుండా నానలు వెట్టి
అమ్మరో కోపమురేఁచే వదేరా నీవు
తమ్మిమోము సోఁకఁజేసి తలఁపెల్లా మరపించి
కమ్మర సూడు వట్టితే కానవచ్చె బనులు || అప్ప ||

చిగురుఁగాఁగిట నించి పెదవిఁబెదవి మోఁపె
అగడుసేఁతలు సేసే వదేరా నీవు
జిగిదీర నేను నట్టె శ్రీవేంకటేశ నిన్ను
మగుడఁ గూడితి నింక మంచిదాయఁ బనులు||అప్పు||98||

## పాడి

మగువ నీవే మాతో మాటలే యాడవుగాని
తగవాయఁ బనులెల్ల తనిసితి మమ్మా || పల్లవి ||

పూచెఁ బూచె వెన్నెలలు పున్నమచంద్రుని వద్ద
రాచిలుకలందు దోఁచె రంతు వనాన
వీచె నిదె చల్లగాలి వేడుక ముంగిట నిదే
యేచి మరురాజ్యమాయ నేవి గడమమ్మా || మగు ||

కుందనపుజక్కవలు కుంకుమలే కురిసేని
ముందుముందె లతలను ముత్తేలువండె
కందువతో నాకసము గంటు వదరె నింతలో
కందువ నామని మించె గడవేఁటిదమ్మా || మగు ||

తుమ్మిదలు చెలరేఁగెఁ దొడరి యాడవాడను
వుమ్మడి నుగ్గుదేసియు లుట్టిపడెను
కొమ్మరో శ్రీవేంకటేశుకూట మిదె గాఁబోలు
నమ్మతించితిమి మేము చాలదా వోయమ్మ|| మగు || 99 ||

## భైరవి

వద్దు వద్దు బలిమి వచ్చె మాకుఁ జెలిమి
పెద్దరిక మింతే చాలు పేరడయ్యెఁ జలము || పల్లవి ||

మాటలాడనేలరా మాణిక్యాలు రాలీని
తేటలనీకన్నుల తేలింపే చాలు
వాటము సేయకురా వలపులు మామీఁద
కూటములు చాలకుంటే కొసరలేము || వద్దు ||

చెక్కులు నొక్కకురా చిత్తమెల్లాఁ జిల్లులై (లా?)
తక్కరితనాలయెడతాఁకులే చాలు
తొక్కకురా పాదమున తొల్లె అన్నియు నాయ
అక్కడనుండి చేలుల నంపినదే చాలు || వద్దు ||

నవ్వులు నవ్వకురా నారుకొన బులకించి
పువ్విళ్లూర సంగడిఁ గూచుండుటే చాలు
రవ్వలాయ మారకపురముచెన్నరాయ[1] నేఁడు
యివ్వల శ్రీవేంకటాద్రి నిటు నన్ను గూడఁగా||వద్దు||100.

## సామంతం

చెల్లెఁ జెల్లెఁ బనులెల్లఁ జేఁత లింకేలే
కొల్లలాయ వలపులు కొసరు లింకేఁటికే || పల్లవి

చెక్కటఁ బెట్టిన చేత సేసవెట్టితివి నీవు
యెక్కడా రమణి నీకు నేలే చింత
ముక్కునబెట్టినవేల ముదమంది మెచ్చితివి
చక్కనాయఁ బనులెల్ల జాణతనా లేఁటికే || చెల్లెఁ

తిట్టినపెదవిపైనే తేటనవ్వు లవె నిండె
పట్టినపలము చెల్లె బదులేలే

[1] [illegible]

([illegible])

కొట్టఁగొన తలఁపులు కోరి మొదలికి వచ్చె
చుట్టపువరుస మించె సోఁకనాడనేఁటికే || చెల్లెఁ ||

వాడిన వదనమున వడి గళలెల్లా నిండె
వేడుకలే దైవారె వేసట లేలే
కూడిని [illegible] గూర్మిఁ గడపలోన
పాడిఁబంతాలెల్లఁజెల్లె పచ్చిసేయ నేఁటికే ||చెల్లెఁ||101||

శ్రీరాగం

ఒంటి నూరకేలుండాన[1] వోయమ్మ పతి
జంట నిన్నుఁ జేయిపట్టె సంగడి నుండవమ్మా || పల్లవి ||

అంగన నీచెక్కు లివి హరికి నద్దములమ్మ
ముంగిటనివ్వులు మంచిముగ్గు లోయమ్మా
అంగవించిననీచూపు లతనికి సొమ్ములమ్మ
పొంగారు మాటలు తేనె బోనము లోయమ్మా || ఒంటి ||

అతివ నీ పూరుపులె ఆలపట్టము లోయమ్మ
తతి మేనిమెఱుఁగు లారతులమ్మా
మితిలేని నీకుచాలు మెత్తని యొరగులమ్మ
అతనికి నీకౌను వయ్యాళి బయలమ్మా || ఒంటి ||

తరుణి నీ కరములు తామరల పూజలమ్మ
ధర నీభావ మాతని తల పోయమ్మా
మరిగిన యలమేలుమంగివు శ్రీవేంకటేశుఁ-
డురముపై హారముగా నునిచె నిన్నమ్మా|| ఒంటి || 102 ||

---

1 [illegible] + ఏల + [illegible]

## ఆహిరి

అందుకేపో నిన్ను తూరనాడితి మిందరిలోనా
ఇందుముఖిభావ మిది ఇఁకను నీ చిత్తము || పల్లవి ||

చిత్తము నీపై నిలిపి చెలితో ముచ్చట చెప్పి
తత్తరించి తనమాఁట తా మరచె
కొత్తగా మోవిని నవ్వి కోపమే బొమ్మల నించి
చిత్తరు పతిమవలె చేఁతలెల్లా మరచె || అందు ||

చెప్పినసుద్దులే చెప్పి సేసినచేఁతలే సేసి
అప్పు డేమంటినోయని అడిగీఁదాని
రెప్పల తుదల సిగ్గు రేసులై నిట్టూర్పులను
దప్పిదేరేమేనితోడ తడఁబాటుఁ బొందెను || అందు ||

అంతలోనే నిన్నుఁ జూచి అంగన కన్నీరు నించి
పంతపుఁ గూరిమితో నీపై నొరగెను
ఇంతసేసి కూడితివి ఇప్పుడే శ్రీవేంకటేశ
వింతగాఁ గళలఁ జొక్కి వేడుక నలసెను ||అందు||103||

## దేసాళం

దగ్గరి ఇంకానేల తలపోఁతలు
వెగ్గళపు మోవిఁదేనె వెల్లివిరియఁగను || పల్లవి ||

చెక్కు చేయి ఇఁకనేలే శిరసు వంచఁగనేలే
అక్కరతోఁ బతి నిన్ను నాదరించఁగ
చక్కఁ జూడ విదిమేలే చలము లింకానేలే
వొక్కటై నేమిందరము నొడఁబరచఁగను || దగ్గ ||

వాడుమోము ఇఁకనేలే వలవనిమోనమేలే
యీడనే విభుఁడు నీతో ఇంత నవ్వఁగా
ఆడుకొన నిఁకనేలే అప్పటి వేసటలేలే
యేడలేని తమకము లెద నుండగాను || దగ్గ ||

కన్నులు ముయ్యఁగనేలే కాఁకలఁ బొరలనేలే
అన్నిటా శ్రీవేంకటేశుఁ డండ నుండఁగా
పన్నిన మాయ లివేలే పంతపు ఒగువు లేలే
వున్నతపు మీమోహా లొద్దికె కూడియును|| దగ్గ || 104 ||

## శ్రీరాగం

కానకుంటి[1] మిందాఁకా కంటి మాడకుఁ బోదము
కానీలే అందుకేమి కళవళ మేలయ్యా || పల్లవి ||

తొంగి చూచె నదె సీత తూరుపునఁ దమ్ముఁడా
సంగతిఁ జందురుఁ డింతె సతి గాదయ్యా
చెంగట నే వెదకఁగాఁ జేరి నవ్వీఁ జూడరాదా
రంగగు వెన్నెల లింతే రామచంద్ర చూడుమా || కాన ||

పొంచి చేతఁ బిలిచీని పొద దండ నదె సీత
అంచెలఁ దీగె ఇంతే అటుగాదయ్యా
యెంచనేల దవ్వులను యెలిఁగించి వినరాదా
పెంచపు నెమలి గాని పిలుపు గాదయ్యా || కాన ||

నిలుచుండి చూచె నదె నిండుఁగొలఁకులో సీత
కలువ లింతే ఆపెగాదయ్యా

---

[1] సీతను బాసిన రామయ్య లక్ష్మణునితో. చ. సంభాషణాత్మక సంకీర్తన విలక్షణమం-
దరము (శా. శ్రీ.)

కలికి శ్రీవేంకటాద్రిఁ గాఁగిలించె నిదె నన్ను
తలఁపులో నాకె నిన్నుఁ దగిలుండుమయ్యా|| కాన || 105 ||

## రామక్రియ

పట్టకు నన్ను బలిమిఁ బదవే నీవు
అట్టె యూనలు వెట్టే వదేమే నీకెంత || పల్లవి ||

కడు నిందరియెదుట కాకుగాఁ బేరెలువున
బడి నన్నుఁ బిలువక పదవే నూవు
యెడసెరిగతినంటా[1] యీడ కాతనిఁ బిలిచే-
వడరి వద్దన్న మాన వదేమే నీకెంత || పట్ట ||

మిగిలిన మగవాని మాపేరు దలఁపించి
మొగి మెచ్చేఁగాన పదవే నీవు
వొంపేత నిమ్మపండు దూరుగా నా కిచ్చేవు
అగిసేవు మా మనసు అదేమే నీకెంత || పట్ట ||

గట్టిన శ్రీవేంకటేశుఁ గూరిచితి విటు నన్ను
పట్టినపలము చెల్లెఁ బదవే నీవు
వొట్టి జాణతనా లొకటొకటే యీతనితోడ
అట్టె కేరుచుఁ జెప్పేవు అదేమే నీకెంత|| పట్ట || 106 ||

## శుద్ధవసంతం

ఊరకున్న యీఁటదాని నొరయుటెల్ల
కూరిమితో రతిసేయుఁ గోరుటే కాదా || పల్లవి ||

---

[1] ఎడసి+అలిగితినంటా

మాటలాడించినదే మతిలోనియాస గాదా
నాటఁజూచుటే వలపు నమచగాదా
తేట నవ్వులే పొందుల తెరువు చూపుట గాదా
పాట వాడుటే తమి పైఁ జల్లుట గాదా || ఊర ||
గక్కనఁ బొలయుటలు కాఁకలు సేయుట గాదా
అక్కరఁ గొనెట (గొనుట?) మే[1] గుట్టరయఁ గాదా
తక్కరి జాణతనాలే తగులవేసుట గాదా
ఇక్కువఁ బేరడుగుటే ఇంపు రేఁచఁ గాదా || ఊరు ||
కొప్పునెరుసు దీసుటే కూడేటి భావము గాదా
యెప్పుడూ వద్ద నుండుటే ఇన్నియుఁ గాదా
వొప్పుగ శ్రీవేంకటేశ వొకటొకటే సేసి
కప్పి కలసితి విదే కడు నేర్పు గాదా || ఊర || 107 ||

## బౌళి

వద్దు సుమీ చెప్పితిమి వాసిగల దొరవు
ముద్దు ముద్దు వలె నీకు మొక్కితినేను || పల్లవి ||
నిమ్మపంట వేతుఁజుమ్మీ నిందలు గట్టుదుఁజుమ్మీ
మెచ్చెలకు నీవు మమ్ము నేమన్నాను
బొమ్మల జంకెంతుఁ జుమీ బూతునఁ దిట్టుదుఁజుమీ
చిమ్ముచు నీవేమి మమ్ముఁ జెనకేవాను || వద్దు ||
కడకంటఁ జూతుఁ జుమీ కాఁకలు చల్లుదుఁ జుమీ
వడిగా మావెంట నీవు వచ్చితేను
కొడిమ తెన్నుదుఁ జుమీ కోపాన సాదింతుఁజుమీ
బడలివుందాన గొంగు పట్టితేను || వద్దు ||

[1] మే=మెల్లగా 'మెయు' యొక్క సాహిత్యరూపము కావచ్చు

జీరవారఁ దీతుఁజుమీ సెలవి నవ్వుదుఁ జుమీ
పేరుకొని నీవు మమ్ముఁ బిలిచితేను
యేరా శ్రీవేంకటేశ యేమన్నా మానక కూడి
ఆరీతి నేరితి విఁక నట్లే అవుఁ జుమ్మీ || వద్దు || 108 ||

## దేవగాంధారి

కోపముఁ దీరినమీఁదఁ గూడేఁగాని
యీ పొద్దు కెదిరిమెచ్చు కింత చాలురా || పల్లవి ||
సెలవి నీవు నవ్వఁగాఁ జేరి మేను నవ్వేఁగాని
అలరి నామతినైతే నలుకలేరా
నిలిచి నీవు చూడఁగా నేనూఁజూచితిఁగాని
బలు దొరవైన నీతో బాడి గాదురా || కోప ||
మాటలాడఁగా నీతో మాటలు నే నాడేఁగాని
మాటి మాటికి నాకు సమ్మతిగాదురా
కూటమిఁ బిలువగా నే గుట్టున నూఁకొంటేఁగాని
యీటునఁ గూడినదాఁకా యెరవెరవేరా || కోప ||
కాఁగిలించఁగా నిన్నుఁ గాఁగిలించేఁగాని నేను
కాఁగిన నామేనిమీఁదికాఁక చూడరా
దాఁగక శ్రీవేంకటేశ తలఁపులో చింతవాసె
ఆఁగిన నీరతిలోన నలసితిరా || కోప || 109 ||

## దేసాళం

ఏమని[1] వర్ణించునాకో ఇఁకఁ బురాణములెల్ల
వేమారుఁ గొత్తలాయ విశ్వలోకపతికి || పల్లవి ||

[1] ఇది అధ్యాత్మ కీర్తనంలో వుండదగినది

పాలజలనిధిలోన పలుమారుఁ దేలఁగాను
  నీలవర్ణమెల్లఁ బోయి నిండుఁ దెలుపైనట్టు
  మేలిమి కప్పురకాపు మేన నిండఁ నించఁగాను
  పోలికె వేరొక్కటాయ పురుషోత్తమునికి || ఏమ ||

వేడుకఁ గాళిందిలోన వేమారు నీఁదఁగాను
  ఆడనే కమ్మర నలుపైనట్టు
  తోడనే తట్టుపుణుఁగు తొప్పఁదోఁగ నించఁగాను
  జాడ వేరొక్కటాయ సర్వేశ్వరునికి || ఏమ ||

అలమేలుమంగ నురమందునే నిలుపఁగాను
  అలరి బంగారువర్ణమైనట్టు
  నలుగడ సొమ్ములతో నానావర్ణములు
  నిలిచె శ్రీవేంకటనిలయమూరితికి || ఏమ || 110 ||

## పాడి

నీడ నుండి యలసేవు నిక్కి చూచి సొలసేవు
  జోడైనపతికింతాఁ జూపరాదా నీవు || పల్లవి ||

కప్పురపుఁ బలుకులు కలికి నీ పలుకులు
  ముప్పిరి జెమటవాన మోహపుసోన
  చిప్పిలునీమోవితీపు చిత్తజునివింటికోపు
  ఇప్పుడీ భావానఁ బతిఇంటికి రారాదా || నీడ ||

జక్కవ పెఋఁలతీరు సతి నీపయ్యద జారు
  చెక్కుట ముత్యాలముగ్గు చెలి నీసిగ్గు
  చొక్కపు వెన్నెల పువ్వు సుదతి నీ లేఁత నవ్వు
  చుక్కలనీవతి వద్దఁ జూపవద్దా యిపుడు || నీడ ||

కామిని నీతాంగి చూపు కారుమెఱుఁగులరూపు
దోమటి నీకొప్పుతీరు తుమ్మిదనారు
అమని శ్రీవేంకటేశు నంతలోనె కూడితివి
వేమరు నాతని మీఁద విఱ్ఱవీఁగవమ్మా ॥ నీడ ॥ 111 ॥

## దేవగాంధారి

హరి నిన్నుఁ బిలిచీని అదిగో వమ్మా
తెరమఱుఁగు నిఁకనేల తియ్యవమ్మా ॥ పల్లవి ॥

చిత్తరు పతిమవంటి చెలియా
యిత్తల పతికి విడె మియ్యవమ్మా
కొత్తమెఱుఁగుఁ బోలిన కోమలి
మొత్తమి కూరిమిపతిమోము చూడవమ్మా ॥ హరి ॥

బంగారుబొమ్మవంటి పడఁతి
అంగవించి పతితో మాఁటాడవమ్మా
అంగజు శరమువంటి అతివె నీకు
సంగతైన ఫిది యీల నవ్వవమ్మా ॥ హరి ॥

పంచల చిగురువంటి జవ్వని
కొంచక శ్రీవేంకటేశుఁ గూడితివమ్మా
మించుఁదమ్మిలోని యలమేలుమంగా
యెంచి యిద్దరును మమ్ము నేలరమ్మా ॥ హరి ॥ 112 ॥

## శంకరాభరణం

ఎన్నఁడు నెఱఁగమమ్మా యిటువంటి కొత్తలు
కన్నె ముద్దరాలో కాక కాంతుని మోహనమో ॥ పల్లవి ॥

హరి చెక్కుటద్దములయందుఁ దనరూపు చూచి
పరసతిఁ దెచ్చెనంటాఁ బతి దూరీని
అరుదుగఁ దానే నవ్వి యాకె గందవొడి చల్లె
సరివచ్చె నిదియంటా జంకించె బొమ్మలము[1] || ఎన్న ||

పతి కంఠమునఁ జంద్రాభరణము వెట్టె నే-
సతి చంద్రవంకలంటా సాదించీని
తతిఁ దనచూపులందుఁ దామెరలై నిండేతేను
రతి నాకె వేశెనంటా రమణుని దూరెను || ఎన్న ||

కాంతుని కాఁగిటఁ దనకమ్మవాస నంటేతేను
వింతవాస నేడదంటా వెరగందెను
యింతట నా శ్రీవేంకటేశుఁ డన్నీఁ దెలుపగా
చెంత నలమేలుమంగి చేకొని తా నమ్మెను || ఎన్న ||113||

ముఖారి

రారాఁ పు లిఁకనేల రావే నీవు
సారెకుఁ బతి విలుపఁ జలమా నీకు || పల్లవి ||

వేడుకలు దైవారె వెన్నెల నవ్వులు గారె
యేడకేడ పతిమాఁట లియ్యకొనవే
కూడుటే కావలె నొండె కోపమే కావలె నొండె
నీడనుండే యెండ దాఁకి నీకుఁ జెల్లునా || రారాఁ ||

మొక్కిన చేతులు రాసె మొకమోటములు వాసె
యిక్కువ విభునిచేఁత కియ్యకొనవే
మక్కువైయుండుట వొండె మత్సరమైయుండు టొండె
వెక్కసాలు విసియూఁలు వెలయించఁ జెల్లునా || రారాఁ ||

---

[1] 'బొమ్మలను' లేదా 'బొమ్మలవలను' కావలె (వా. శ్రీ.)

చిత్తములు సరివచ్చె సిగ్గులెల్లా గురివచ్చె
యెత్తి శ్రీవేంకటేశుమే లియ్యకొనవే
యిత్తల గూడితిరి మీరిద్దరును నొండొండె
మత్తిలి తొల్లిటపొందు మరవఁగఁ జెల్లునా ||రారాఁ||114||

రేకు 1620 పాడి

చెక్కుచేయి నీకేలే చెలులతోఁ జెప్పనేలే
చక్కనివిభునితోనే జంట నుందు గాక || పల్లవి ||

వలచిన నీకు నిఁక వాసులునుఁ జెల్లునటె
కొలఁదిగా నవ్వు నేసుకొనుట గాక
చెలిమినాటెనమీద సిగ్గులునుఁ జెల్లునటె
బలిమి నాతనికింటెఁ బైకొందు గాక || చెక్కు ||

మాట పట్టిచ్చినచోట మతకాలు చెల్లునటె
వోటైనా నందాలు సేసుకొనుట గాక
యీటున సరసమాడె యెగ్గులెంచఁ జెల్లునటె
కూటములే గురిసేసుకొను టంతే కాక || చెక్కు ||

కాఁగిటఁ గూడినవేళ కళవళ మిఁకనేలే
వీఁగనిరతుల విట్టివీఁగుదు గాక
ఆఁగితి శ్రీవేంకటేశు నలమేలుమంగ నీవు
లోఁగనేలే యిన్నిటికి లోనౌట గాక || చెక్కు || 115 ||

వసంతవరాళి

మగవాఁడు తాను మానిని నేను
తగవులఁ బెట్ట నిందు తనునుఁ జోకేదే || పల్లవి ||

నిక్కి నిక్కి తాఁజూచె నే నందుకు నవ్వితిని
యెక్కువైన. రమణుఁడు యేమనీనే
వెక్కసపు నిమ్మపంట వేసె నేఁ బులకించితి
తక్కిన సుద్దులేల్ల తడవీనే తాను || మగ ||

రమ్మని పేరఁ బిలిచేరంతున నే నూఁకొంట
యెమ్మెలకు విభుఁడు నన్నేమనీనే
కమ్మరఁ దా సన్నసేసె కాయము నే మరచుంటి
అమ్మరో యింకా నన్నాడ బోటుదే || మగ ||

కందువఁ దాఁ గాఁగిలించె కరఁగితి నట్టె నేను
యిందుకు శ్రీవేంకటేశుఁ డేమనీనే
అంది తానె మోవి ఇచ్చె నలమేలుమంగ నేను
ముందువెన కెంచిచూడ మెరఁ గిందుఁ గలదా ||మగ||116||

భూపాళం

అప్పు డెంత చొక్కితివో అది నా మతిఁ దలఁచి
ఇప్పుడే వెరగందితి నింతలో వేగినది || పల్లవి ||

కనకపుటందెలతో కలలోన నొకసతి
నసువు నీ చేయి వట్టి నవ్వినది
ముసువు నీ మోము చూచి ముచ్చటెల్లఁ దీరనట్టె
మనసెచ్చి నీతో నొక్కమా టాడినది || అప్పు ||

కీలుగంటు వేసుకొని కేలు చాఁచి నీ మీఁద
వలవేసె వలపుల నొరగినది
పోలించి నీకుఁగాఁ జూనుకవచ్చొకతెతో .
ఆలరితనాన వాదులడేచినది || అప్పు ||

కాఁగిలించి నీ మేను కరఁగించి తాఁ గరఁగి
పాఁగిన పై చెమటలుఁ బరగినది
దాఁగక శ్రీవేంకటేశ తతి నదె నిక్కలాడు
అఁగి నీ వురాన నాకె అలమేల్మంగయునది ||అప్ప||117||

## మధ్యమావతి

డాలేరా నీ గుణము అలిగిన వానివలె
తేలించె నీ తమకము తెలిసెఁబో నాకును || పల్లవి ||

సుద్దులు చెప్ప వదేర సొరిది నీమోవి మీఁద
అద్దిన కెంపులు రాఁగీనని యుంటానో
అద్దా కన్నులఁ జూచి ఆదరించ వదేర
నిద్దుర కన్నుఁగొనల నిండెనంటానో || డాలే ||

దగ్గరి కూచుండవేర తగు వింతవాసనలు
బగ్గన నా మీఁద నిట్టె పారీనంటానో
సిగ్గునఁ దలవంచేవు చెల్లఁబో నీవిదియేర
అగ్గలపు మోము కళ లవి గనేనంటానో || డాలే ||

కాఁగిలించవదియేర గక్కున నేఁ గూఢఁగాను
కాఁగిన నీమేని కాఁక గనేనంటానో
వీఁగక శ్రీవేంకటాద్రి విభుఁడ కూడితి రతి
మాఁగిననే నలమేలుమంగ నంటానో || డాలే || 118 ||

## సాళంగనాట

పురుషులలోనెల్లా పురుషోత్తముఁడు వాఁడె
తిరుతేరు మీఁద నేఁగీ దేవదేవోత్తముఁడు || పల్లవి ||

చెక్కులు మెరవఁగాను సేసముత్యాలు రాలఁగా
యెక్కువైన తేరుమీఁద నేఁగీవాఁడె
యిక్కువలు గరఁగుచు యిరుమేల నొరగుచు
చిక్కని నవ్వులు నవ్వీ చెలులతో వాఁడె || పురు ||

నిమ్మపంట వేసుకొంటా నిక్కి నిక్కి చూచుకొంటా
యెమ్మెలకుఁ దేరిమీఁద నేఁగీ వాఁడె
తమ్ములము సారెఁ జేసి తగవల్లెవాటువేసి
చెమ్మఁజెమట గందాలఁ జెలరేఁగీవాఁడె || పురు ||

అలయుచు సొలయుచు నలమేలుమంగఁ గూడి
యెలమిఁ దిరుతేరుపై నేఁగీ వాఁడె
బలిమి శ్రీవేంకటాద్రిపతి యీ పెండ్లికొడుకు
నిలువుఁ జక్కఁదనాన నిండుకొనీ వాఁడె|| పురు || 119 ||

## శంకరాభరణం

వద్దు వద్దు మాతో వాదులుఁ బోదులు
పొద్దు వోయ నీఁకఁ బోరాదా || పల్లవి ||

పట్టకు పట్టకు పయ్యెద దొలఁగీ
అట్టె వుండి మాఁటలాడు నాతో
నిట్ట చూపు చూచి నీవేల నవ్వేవు
పొట్టఁ బొరుగునఁ బొద్దు వోదా || వద్దు ||

పిలువకు మమ్ముఁ జెను వేసటయ్యీ
నిలిచితేఁ జాలు నీ వెదుట

నిలిగి[1] నిలిగి నీవేల దూరేవు
యెలమి నీకెవ్వ డిదే వనా || వద్దు ||
నొక్కకు నాచెక్కు మనుగోరు నాఁటీ
మొక్కినంతెచాలు మున్ను నీవు
యెక్కుడు శ్రీవేంకటేశ కలసితి
యిక్కువ మొఱఁగులు యిఁకనేలా || వద్దు || 120 ||

రేకు 1621 దేశాక్షి

ఇందాఁకాఁ బొడగాన మిటువంటివి
ఇందిరారమణి భావ మిప్పుడే సొంపెక్కెను || పల్లవి ||
మగువ నెమ్మోము తామరపువ్వు వికసించె
తగు విభుఁడనే సూర్యోదయవేళను
నిగిడి నెన్నడుమనే నెమలియుఁ జెలరేఁగె
మిగుల విభునికాంతి మేఘోదయమున || ఇందాఁ ||
సతి కనుఁగవలనే చకోరములు నిక్కె
అతనిన్న(న?) వ్వువెన్నెలలామనివేళ
జతనాన పెరుఁదనే సైకతము నీరుపట్టె
రతి రమణుని కృపారసవేళను || ఇందాఁ ||
అంగనదేహవల్లి అంతయునుఁబులకించె
రంగగు శ్రీ వేంకటేశురతివేళను
ముంగిట చెలి చెమటముంగారు లవెముంచె
అంగజసాములచేత[2] నలసినవేళను || ఇందాఁ || 121 ||

---

[1] 'నిలిగి నిలిగి' (కా.శ్రీ.)

[2] అంగజ సాముల వంటి దుష్టసమాసము మొదలయిన పిల్లర దోషముల కీవాఙ్మయమున పట్టింపులేదు.

## మంగళకౌసిక

ఎక్కడ పరాకుసేసే వేఁటి సుద్దులు చెప్పేవు
చెక్కుచేయి దీసి యిట్టె సేస చల్లరాదా ॥ పల్లవి ॥

మించుమణిదంతములు మెరువఁగ మాటలాడీ
చెంచెలాక్షి[1] నీతోడ సారెసారెకు
వంచిన మోవితేనె వడియఁగా నవ్వు నవ్వీ
యించుకంత చెలిదిక్కు యిటు చూపరాదా ॥ ఎక్క ॥

కమ్మఁ దామెరలవంటి కరములు చాఁచిచాఁచి
కొమ్మ నిన్ను సన్నసేసీఁ గూరిమితోడ
వుమ్మ పన్నీటి చెమట నుసురనురనుకొంటా
దిమ్ము రేఁచీ వలపులు దిష్టించరాదా ॥ ఎక్క ॥

పచ్చని తీగెలవంటి బాహుమూలముల నిన్ను
పుచ్చి కాఁగిలించి పట్టీ కోమలి నేఁడు
ఇచ్చెరిఁగి శ్రీవేంకటేశ కూడితివి ఇట్టె
ముచ్చటసిగ్గిఁకనేల మోము చూపరాదా ॥ ఎక్క ॥ 122 ॥

## ఆహిరి

ఎక్కడౌతా నెఱఁగదు ఇంతి నీమీఁది యాసల
చెక్కులెల్లఁ బులకించె చెల్లఁబో నీవలపు ॥ పల్లవి ॥

గుబ్బలపై వట్టంచుకొంగు జారుతెఱఁగదు[2]
అబ్బురపడి మాటాడీ (ప్పటె నీతో

[1] 'వంచలాక్షి
[2] జారుటు-ఎఱఁగదు. భావార్థంలో 'త' ప్రత్యయం ఇట్లాపే 'పీడుత' మొదలైనవి

గొబ్బున సంపెఁగలకొప్పు వీడు తెరఁగదు
నిబ్బరాన నవ్వీ చెలి నిండెఁబో నీ వలపు || ఎక్క ||

చెమట కస్తూరి బొట్టు చెదరిన దెరఁగదు
తమకాన నిన్నుఁ జూచీ తప్పక మోము
బిమలివడ్డాణము జారినది యెఱఁగదు
కొమరె నీమాట విని కూడెఁబో నీవలపు || ఎక్క ||

అందెలు దిక్కుల గల్లురనే దది యెఱఁగదు
ఇందుముఖి కాఁగిలించీ ఇంపురతుల
విందుగఁ గూడితివి శ్రీవేంకటేశ మాసతిని
ముందువెన కెరఁగదు ముంచెఁబో నీ వలపు ||ఎక్క||123||

## రామక్రియ

మించి దేవాంగన లిట్టె మెచ్చేరమ్మ
యెంచ నలమేలుమంగ యెంతదాననమ్మా || పల్లవి ||

మాటలనే వూరడించి మచ్చికలఁ బొద్దు వుచ్చి
నీటునఁ బతిఁ దేలించ నేరుతువమ్మ
పాటలనే కరఁగించి పంతములు మరిగించి
చాటువ నాతనిఁ గూడ జాణవమ్మా || మించి ||

నగుతానే రప్పించి నటనల మెప్పించి
తగుఁబతి దక్కఁగొన దంటవమ్మా
పగటుల భ్రమయించి బడినుండే వలపించి
చిగిరించఁ జేయఁ బతిచిత్తము వత్తువమ్మా || మించి ||

కాఁగిటనే చొక్కించి కందువల మొక్కించి
ఆఁగి పతియురమెక్కె వప్పుడే యమ్మ
పాఁగిన శ్రీవేంకటేశు పట్టపురాణివి నీవు
నీఁగని వేడుకతోచ నీవారమమ్మా || మించి || 124 ||

## ముఖారి

ఇంత చాలదా నాకు యిందరిలో రమణుఁడ
సంతసాన నీకు [illegible] సరసుఁడ విందుకు || పల్లవి ||

చింతలన్నియునుఁ బాసె సిగ్గు లన్నియునుఁ దేరె
ఇంతలోనే విభుఁడ నీ వీడకు రాఁగా
మంతనాలు సరివచ్చె మర్మములన్నియుఁగొచ్చె
దొంతులైన మాటలు నాతో నాడఁగాను || ఇంత ||

కపట మింతయుఁ బాసె కాఁకలెల్ల చల్లనారె
ఇపుడు నా చెక్కు నొక్కి యెనయఁగాను
తపమెల్లా ఫలిఇంచె తలఁపులు సరిగూడె
అపురూపముగ నాతో నంది నవ్వఁగాను || ఇంత ||

వలపులు దైవారె వాడికెలు తుదమీరె
వెలయ నాపై చేయి వేయఁగాను
కలికి శ్రీవేంకటేశ కాయము లొక్కటి యాయ
సొలపు రతుల నన్నుఁ జొక్కించఁగాను || ఇంత || 125 ||

## కాంబోది

ఒయ్యనే దగ్గరరమ్మ వూడిగపుసతులు
అయ్యో విసరరమ్మ అలసున్నవాఁడు || పల్లవి ||

మెఱయుఁజెమటలతో మెత్తని పరపు మీఁద
   వొఱగి పవ్వళించినాఁ డొత్తగిలి
జఱయుమాటలతోడ ఛాఁచిన పాదములతో
   గుఱియైన సతులతో గోవిందరాజు || ఒయ్య ||

తెల్లని కన్నులతోడ తేనె గారేమోవితోడ
   చెల్లుబడిఁ బవ్వళించె శేషునిమీఁద
వెల్లిగొను వూర్పులతో వెన్నెల నవ్వులతో
   కొల్లవలపులు చల్లీ గోవిందరాజు || ఒయ్య ||

బొడ్డు వూప కొడుకుతో వుక్కిటి వీడెము తోడ
   వొడ్డిన రతులలోన నోలలాడీని
వెడ్డువెట్టి కూడెను శ్రీవేంకటేశుఁ డింతులను
   గొడ్డువోని వరముల గోవిందరాజు || ఒయ్య || 126 ||

రేకు 1622 రామక్రియ

ఏమీఁ దన్నుఁ దడవము ఇదివో తాను
   సామాన నుండిన నాతోఁ జలమా తాను || పల్లవి ||

వొద్ద వచ్చికూచుండేది వూరకైనా నవ్వేది
   వద్దన్నా మానఁ డిదేఁటి వలపే తాను
సుద్దులు చెప్పవచ్చేది చూపులఁ దేలించేది
   చద్దికి వేఁడికి నాతోఁ జలమా తాను || ఏమీఁ ||

పువ్వులు పైఁ జల్లేది బొమ్మల జంకించేది
   యెవ్వరి ముందరనైనా నిదేమే తాను
రవ్వగాఁ బేరుకొనేది రమ్మని చేయివట్టేది
   జవ్వనులతోడ నింతచలమా తాను || ఏమీఁ ||

గక్కనఁ గాఁగిలించేది కప్పుర మియ్యవచ్చేది
అక్కర నిన్నిటా జాణఁడౌనే తాను
యెక్కువ శ్రీవేంకటేశుఁ డిప్పు డిట్టె నన్నుఁగూడె
జక్కవకుచము లంటేఁ బలమా తాను ‖ ఏమీఁ ‖ 127 ‖

## సామంతం

తడవాయ నేము వచ్చి తతి వచ్చెఁ జెలియకు
కడుదక్కె రావయ్య కాంతభాగ్యములు ‖ పల్లవి ‖

పూచెను జవ్వనము పొలిఁతి మైపులకల
కాచెను నిమ్మపండ్లు ఘనకుచాల
వాచవుల దొండపండు వడిఁ బండెఁ గెమ్మోవి
చూచివత్తురావయ్య సుదతి భాగ్యములు ‖ తడ ‖

పలికెఁ జిలుకలు పడఁతి మాటలలోనె
తొలఁకెఁ జల్లని గాలి దొమ్మి వూర్పుల
వలపుల కందువల వసంతకాలము వచ్చె
తెలిసివత్తు రావయ్య తెరవ భాగ్యములు ‖ తడ ‖

చెమటల కొలఁకులు చెలిమేన దైవారె
తమి నవ్వువెన్నెలలు దట్టమాయను
అమర శ్రీవేంకటేశ అంగనఁ గూడితి విట్టె
రమియింతు రావయ్య రమణి భాగ్యములు ‖తడ‖128‖

## బౌళి

ఎంత చెప్పినా మానవు ఇది యేఁటికే
వింతసేసి రమణుని వెంగెమాడ నేఁటికే ‖ పల్లవి ‖

చెక్కునొక్కి నీవు బుద్ధి చెప్పరాదా తొలుతనె
ఇక్కడ నాతని తప్పు లెంచనేఁటికె
చక్కనిపతిని నీవు జంట వాయకుండరాదా
నిక్కిచూచి నేఁడతని నిందలాడ నేఁటికే || ఎంత ||

ఆయమంటి మొదలనే ఆనవెట్టించుకోరాదా
వాయితప్పి యిప్పు డిఁక వాదు లేఁటికే
చేయివేసి కాఁగిటనే చిక్కించుకొనరాదా
బాయిటికిఁ దీసి వేరె వగచాటనేఁటికే || ఎంత ||

యెదుట శ్రీవేంకటేశు నిన్నియు నడుగరాదా
అదన నాతనిపై వేగింపనేఁటికే
వుదుటురతులఁ గూడి వొక్క బుద్దినుండరాదా
అదివో వురమెక్కియు ననుమేఁటికే || ఎంత || 129 ||

ముఖారి

వనిత నిన్నిటా నీవు వహించుకోక పోదు
వెనక ముందరి కిదె విన్నపము సుమ్మీ || పల్లవి ||

జవ్వన భారమెల్లా సతికుచముల నిండె
మువ్వంక విభుఁడ నీకు మోవక పోదు
చివ్వన మోహరసాలు చెమటలై దైవారె
వువ్విళ్లూరుచు నీకు నోలలాడవలసె || వని ||

కామిని కోరికెలెల్లా కనుచూపులై మెలసె
దీమసాన నది నీవు తీర్చక పోదు
ఆమనిగుణాలు మోవియందుఁ దేనెలై వుబ్బె
గోమున నీవిది చవిగొనక పోదు || వని ||

పొంచిన తమకములు పులకముత్తెములాయ
యెంచి నీమై నవి సింగారించక పోదు
చంచుల శ్రీవేంకటేశ సతిఁ గూడితివి యిట్టె
కంచపు పొత్తులు మీకు కలయఁగఁ గలిగె ॥ వని ॥ 130 ॥

## సింధురామక్రియ

ఇందరు బుద్దులు చెప్పే దిందాఁకానే
కందువఁ గూడితి రిదె కాఁక లిందాఁకానే ॥ పల్లవి ॥

యేఁటి కీఁక మాఁటలు యెదురైతి రిద్దరు
గాఁటపుటలుకలు దగ్గరుదాఁకానే
నాఁటెఁ దొల్లె మోహము నవ్వులఁ బొద్దు గడప
చోటులేదు చలములు సోఁకినందాఁకానే ॥ ఇంద ॥

వొద్దు వొద్దు కొసరులు పొక్కబైతి రిద్దరును
సుద్దులెల్లా మేనులు సుక్కుదాఁకానే
కొద్దిమాలె కోరికెలు కొంకులుఁగొసరు లిఁక
పొద్దు లేదు పంతములు పొందినందాఁకానే ॥ ఇంద ॥

చాలు చాలు సిగ్గులు నమ్మతైతి రిద్దరును
తేలింపులన్నియు మీలో తేరుదాఁకానే
ఆలరి శ్రీవేంకటేశ. అలమేలుమంగానీవు
వేళతోఁగూడితిరి యీవేడుకొదాఁకానే ॥ ఇంద ॥ 131 ॥

## సాళంగం

నీ వెఱుఁగనివి లేవు నెఱజాణవు
మోవితేనె కడునైతే మొగచాటౌనయ్యా ॥ పల్లవి ॥

దగ్గరి కూడుట కంటె తలపోఁతలే ఇతవు
   వెగ్గళమైతేఁ గాదు విడువవయ్యా
సిగ్గుతో నవ్వుటకంటే చిమ్ముఁదిట్టులే యితవు
   బక్కన నీకు మొక్కేము పదరకువయ్యా || నీవె ||

యెనసివుండుటకంటే యెరవెరవే యితవు
   పనిలేదు పెనఁగక పదవయ్యా
తనిసి మాటాడుకంటే దవ్వులమాఁటే యితవు
   కొనకెక్కె వలపులు కొసరకువయ్యా || నీవె ||

కాఁగిట నిద్రించుకంటె కాఁకఁ బొరలు టితవు
   తోఁగితిఁ జెమటలచే తొలవయ్యా
పేఁగక శ్రీవేంకటాద్రి విభుఁడ కూడితి విట్టె
   దాఁగ వేఁక వేడుకలు దక్కితి నోయయ్యా ||నీవె||132||

## రేకు 1632 శంకరాభరణం

ఎంతైన మాన వివి యేమి సేతునే
   వింతల నాలోని గుట్టు వెళ్లవేసీఁబాయము || పల్లవి ||

మనసులోపలి మాట మతిలోనే దాఁచితేను
   తనువునఁ జెమటలై దైవారీనే
మునుకొన్నసిగ్గులెల్ల మోవిపై నణఁచితేను
   వెనక నవ్వువెన్నెలై వెల్లి విరిసీనే || ఎంతై ||

గక్కనఁ గోరికలెల్ల కాయములో దాఁచితేను
   చిక్కుల పులకలై చిగిరించీనే
మక్కువనా వలపులు మరుగునఁబెట్టితేను
   చిక్కని నిట్టూరుపులై చేగలు దేరీనే || ఎంతై ||

తమకములకుఁ గాక తలవంచుకొంటేను
జమళిఁ బరవశమై జాజు కొసినే
అమరి శ్రీవేంకటేశుఁ డంతలోనె కూడఁగాను
గములైన సంతసాలు కళలు మీరీనే || ఎంతై || 133 ||

## సామంతం

ఆసోదవుదాననన్నా నంటివిగాని
పాసి వుండలేఁ జుమ్మీ పాయకుందు గాని || పల్లవి ||

సారె(చాల?)[1] నీతో మాటలాడి చాలించఁ జాల నేను
తేలించి యొక్కమాఁటే తీతుఁగాని
ఆలించి నీతోడి నవ్వు అలసియు మానలేదు
కేలిఁ దలఁచి తలఁచి కేరుదుఁగాని || ఆసో ||

తగిలి నీవద్దనుండి తనియె(యు?) దు నా మనసు
సొగిసి నీమోము సారెఁ జూతుఁగాని
బిగువుఁగాఁగిట నిన్నుఁ బెనఁగియుఁ దమివోదు
అగవ డప్పటప్పటి కప్పళింతుఁగాని || ఆసో ||

గక్కన నీరతిఁ జొక్కి కంటికి నిద్దుర రాదు
పెక్కు రతిబంధములఁ బ్రేరేఁతుఁగాని
ఇక్కువ శ్రీవేంకటేశ ఇట్టె యెంత గూడినాను
అక్కరై నీమోవితేనె కొస గింతుఁ గాని || ఆసో || 134 ||

## ముఖారి

అంత మమ్ముఁ జెనకకు మందుకేమి
ఇంత నీతోఁ జెప్పనేల ఇప్ప దందుకేమి || పల్లవి ||

---

[1] ప్రాసభంగము

వాములుగా బొంకనేర వట్టిపంతా లాడనేర
   అమాటే మఱవకు మందుకేమే
   నీ మచ్చము లెంచ రాము నిన్నుఁ దడవఁగ రాము
   అముకొని మమ్ము నొవ్వే వందుకేమి || అంత ||

తప్పులు వట్టఁగనేల తారుకాణించఁగనేల
   అప్పుడే చెప్పేఁగాని అందుకేమి
   రెప్పలెత్తి చూడవద్దు రేసులు వుట్టించవద్దు
   చప్పుఁ జేసేవు వలపు సారె నందుకేమి || అంత ||

కొంగువట్టి తియ్యలేదు కూరిమి గొసరలేదు
   అంగవించి కాఁగిలించే వందుకేమి
   రంగగు శ్రీవేంకటేశ రవ్వసేయ నికనేల
   యెంగిలి సేసితి మోవి యిఁక నందుకేమి ||అంత||135||

## దేవగాంధారి

పిలువరే కృష్ణుని పేరుకొని యింతలాను
   పొలసి యారగించే పొద్దాయ నిపుడు || పల్లవి ||

వెన్నలారగించఁబోయి వీదులలోఁ దిరిగీనో
   యెన్నరాని యమునలో యీఁదులాడీనో
   సన్నల సాందీపనితో చదువఁగఁబోయినాఁడో
   చిన్నవాఁడాఁకలి గొనె చెలులాల యిపుడు || పిలు ||

మగువల కాఁగిళ్ల మఱచి నిద్దిరించీనో
   సొగిసి యావులఁ గాచే చోట నున్నాఁడో
   మెగువ నుట్లకెక్కి యింతులకుఁ జిక్కినాఁడో
   నగము వేఁడికూరలు చల్లనాయ నిపుడు || పిలు ||

చెంది నెమలి చుంగుల సింగారించుకొనీనో
ఇందునే దేవరవలె ఇంటనున్నాఁడో
అందపు శ్రీవేంకటేశుఁ డాడివచ్చె నిదె వీఁడె
విందుల మాపొత్తుకు రా వేళాయ నిపుడు ||పిలు||136||

## సామంతం

ఆకె నీకే తగు నమరుఁ బెండ్లికి
పోఁక ముడిచితిమి పొలఁతికే నేము || పల్లవి ||

కొండల వంటివి కోమలి కుచములు
బండగు రాలురప్పలుఁ గావు
దండనే నెమ్మోము తామెరవంటిది
గుండుమూఁకరేకులవలెఁ గాదు || ఆకె ||

మెలుఁతనెరిఁదురుము మేఘము వంటిది
అలరు గాలిగొట్టది గాదు
చెలువపు నడుమిది సింహమువంటిది
పొలసి అడవిఁగాఁపురమటు గాదు || ఆకె ||

సతిమేను మెఱుఁగు చాయ వంటిది
తతితో మెరిచటు దాఁగదు
యితవగు శ్రీవేంకటేశ యీ చెలికిఁ
బతివై కూడితివి పలుకెడగాదు || ఆకె || 137 ||

## శంకరాభరణం

ఏమిగట్టుకొంటి వింతి యేమనె నిన్ను
తామసించక నీ బాస తలఁచుకోరాదా || పల్లవి ||

యింటికిఁ బిలువవచ్చి యిటు నీవు రాకుండఁగా
వెంటనే కోపముమాని విచ్చేయరాదా
వంటువ నీ మోము చూచి నవ్వునవ్వెనిదె యాకె
దంటతనమునఁ గొంత తలయెత్తరాదా || ఏమి ||

కన్నులఁ దప్పక చూచీఁ గాంత నీ వూరకుండఁగా
పన్ని నీవే యెదురేఁగి పైకొనరాదా
మిన్నకైనా నీ మీఁద మెలపు మాటలు చల్లీ
వున్నతి నీ వందుకెల్లా నుత్తరువీరాదా || ఏమి ||

గక్కనఁ జెలియ నిన్నుఁ గాఁగిలించె ముందుముందె
చెక్కునొక్కి యాచనవు చెల్లించరాదా
మక్కువ శ్రీవేంకటేశ మంకుదేరి కూడె నాకె
అక్కడ మీముచ్చటలే యాడుకొనరాదా ||ఏమి||138||

రేకు 1624 అహిరి

అంటినా తన్నేమైనా నావగింజంతైనా మాట
కంటిచూపు తాఁ జూచె కన్నులలో నున్నవి (ది?) ||పల్లవి||

ఆయలేవే తనమాట కందాలు[1] చెప్పఁగవచ్చీ
చాయసేసుకొన్నఁ బోఁడు సాదించీని
చేయూరఁ దనమేనిచిన్న లివె చేనిపంట
కోయిలకాలే[2] చెప్పీఁ గోప మేఁటికనవే || అంటి ||

పోపివే తనుఁదావె పొగడీఁ దన నిజము
మానేనన్నాఁ బోనీఁడు మళ్లఁదీసీని

---

[1] 'అర్థాలు' కావచ్చునేమో. వ్యంగ్యముగ చెప్పుటలో 'అందాలు' కూడ సహజమే.
[2] పైరుకోయగా మిగిలిన మొదళ్లకు కొయ్యలు, కొయ్యలకాళ్లు, కోలెలు అని పేటికిపి .పల్లవారముగాలను. వానితోపాటు ఇదొకటి.

అనలేలే తనగుణ మదె గొండంటి మెత్తన
నానఁగానే కానవచ్చీ నయమైతేఁగనక || అంటి ||

కద్దులేవే తనకాఁక కాఁగిటనే చూపవచ్చీ
వొద్దన్నా మానఁడు నాపై వొట్లు వేసీని
వొద్దికె శ్రీవేంకటేశుఁ డొనగూడె తననేర్పు
తిద్దనేల నీరుకొలఁది తామెర గాదా || అంటి || 139 ||

## రీతిగౌళ

ఇతవైనప్పుడే పతి యీడకు వచ్చీఁ గాని
చతురుని నిందుకుఁగా జంకించనోపనే || పల్లవి ||

చనవుగల్లుమాట చక్కనై యున్నటాఁ జెలులు
మనసెనసిన పొందు మఱపుఁ గాదు
ననుపులేనిచోట నగవులకైనాను
పెనఁగితేఁ బలమెక్కు పిలువ నేనోపనే || ఇత ||

ముసిపి దీరనిచోట మోనమైనా నింపులే
సుసరమయిన చోటి సుద్దులే చవి
కసిగాటు మోహముతో కలగంప వలపులు
పిసికితేఁ బసురౌను పిలువ నే నోపనే || ఇత ||

చేరి సరసపు వేళఁ జేసినదెల్లాఁ జేఁత
యీరీతి శ్రీవేంకటేశుఁ డిటు గూడెను
వూరకే యిట్లఁ గాక వొకరీతి నైతేను
పేరుకొని పారెపారెఁ బిలువ నేనోపనే || ఇంత || 140 ||

## హిందోళవసంతం

సింగారరసములోనఁ జీకాకులేలే
అంగన నీవే నేను అనుమాన మేలే || పల్లవి ||

మాణికాల పెట్టెవంటి[1] మగువ నీనోర నన్ను
జాణవిమ్మారా లిన్నేసి చల్లఁదగదే
ఆణిముత్యాల చిప్పలయయింతలు (ల?) గన్నుల నన్ను
రాణించు వేఁడిచూపుల రమణి చూడకువే || సింగా ||

చల్లనిచందురువంటి సతి నీ మోమున నన్ను
చల్లు వెడబొమ్మలను జంకించనేలే
మెల్లగాఁ జిగురువంటి వివిగో నీ కరములు
వెల్లవిరిగాఁ బట్టితే విదిలించనేలే || సింగా ||

బంగారుబోనరివంటిపడఁతి[2] నీ కాఁగిటిలో
చెంగలింపు సిగ్గులనే చీఁకటు లేలే
రంగగు శ్రీవేంకటాద్రిరాయఁడఁ గూడితి నిన్ను
ముంగురుల నీలాలమునుఁ గింకనేలే || సింగా || 141 ||

## దేసాళం

పట్టువవే చలమింత పైపై నీవు
యెట్టయిన నీవు నేను యిద్దరము నొక్కటే || పల్లవి ||

---

[1] మాణికాల పెట్టెవంటిది నోరు. "మాణికాలపెట్టె నోరు" పదముల మధ్య 'మగువ' సంబోధనము మాటగ లేదు. అసాంప్రదాయికమైన సమాసమును ఈ వాఙ్మయమున క్రొత్తకాదు.

[2] 'బంగారు బోనరివంటిది కాఁగిలి' యగుట సహజము. ఆ బోనరి 'పడఁతిలో' అన్వయించినది. ఈ రెండు తావుల యందు నిర్బంధము సాహిత్య- సమాస సంప్రదాయములను భేదించినది కాబోలు.

చూడకువే వాఁడిచూపు చురుకనీ నా మనసు
ఆడకువే వేఁడిమాఁట ఆయమంటీవి
యేడనైనఁ గర్మఫల మెదిరికిఁ జేసినంత
తోడనే మరలివచ్చు దోసమిది వలెనా || పట్ట ||

దాఁచకువే నీ గుణము తమకించి విన్నదాఁక
కాఁచకువే కుచయుగముల కాఁకరేఁగివి
యేఁచకు ముయికి ముఖ యేడనుండినాఁ బోదు
రేఁచినదే వమ్ము సేసీ రిచ్చల యీమాయ || పట్ట ||

నవ్వకువే నీవు నన్ను నాఁగువారీ వలపులు
దవ్వులఁ జేయి చాఁచకువే తతి వచ్చెను
యివ్వల నిన్ను శ్రీవేంకటేశుఁడఁ గూడితి నిట్టె
జవ్వనము నీకు నాకు సరియే యీతగవు || పట్ట || 142 ||

ఆహిరినాట

చలువకు వేఁడికిని సరి సరి యింతేకాక
అలయించి మీఁది పొందు లవియేలే నాకు || పల్లవి ||

పిలిచినప్పుడు రాక బిగిసి వెనక వచ్చి
యెలమిఁ బైకొనఁగా నదేఁటికే నాకు
తొలుత రాళ్లవేసి తోడఁ బూవుల వేయఁగ
కలదా అందేమైన కానీవే తాను || చలు ||

నవ్వినప్పుడు నవ్వక నాతో మర్నాఁడు వచ్చి
ఇవ్వల సరసమాడీ నేఁటికే నాకు
నెవ్వగా నీరువట్టైతే నేయి చేతికివచ్చి మరి
అవ్వలఁ బన్నీరిచ్చితే అనువౌనా తాను || చలు ||

చూపులనే కరఁగక సోఁకులఁ గాఁగిటఁ గూడి
యేపునఁ గరఁగఁగా నదేఁటికే నాకు
పైపై శ్రీవేంకటాద్రి పతితో నే నొక్కటైతి
కోపాన నేనంటి నింతే కొసరేలే యిఁకను ||చలు||143||

భైరవి

మేలు మేలే జవ్వని మెచ్చితిఁ బో నిన్నును
తాలిమిఁ దెలిసెఁగాక తారుకాణ లేఁటికే || పల్లవి ||

కప్పుర మిచ్చె నంటివి కాఁకరేఁగె నంటివి
యెప్పటి కెప్పటి మాఁట యేది నిజమే
రెప్పలు మూసితివి రేసులుఁ జేసితివి
గుప్పిటి నీ వలపులు కొలఁదెంచఁగలనా || మేలు ||

కాలుఁ దాకించితివి గక్కన మొక్కితివి
యేల నీ కింత పగటు యేమందమే
యీలీల నీకు గొణఁగు యిందులోనే సణఁగు
లేలే నీ సుద్దు లివి లెక్కవెట్టవసమా || మేలు ||

చెఱఁగూ బట్టితివి సేసాఁ బెట్టితివి
యెఱఁగిన నీ చనవు నియ్య కొంటనే
మెఱయ శ్రీవేంకటాద్రి మేఁటనై నిన్నుఁగూడితి
తఱి నీ చేఁతకుఁజేఁత తరివచ్చెఁ గదవే || మేలు || 144 ||

రేకు 1625 పళవంజరం

అందుకే తా నెగ్గువట్టే నంతేకాక
పొందిన పతికి మీరే బుద్ధి చెప్పరమ్మా || పల్లవి ||

కోపగించితినటవే కొంగవట్టి[1] తియ్యఁగాను
వోపనంటాఁ బెనఁగితి నూరకే నేను
పైపైఁ దిట్టితినటే పచ్చిమాట లాడఁగాను
కోపులఁ బెదవులనే గొణఁగితిఁ గాక || అందు ||

కైకోనటవే నేను గబ్బితనాల నుండఁగ
ఆకడ నే నవ్వరి మోమైతిఁ గాక
దోకఁ దాఁ బిలిచినట్టి చోటికి రానటే నేను
యేకతానఁ దా నుండఁగా నింట నుంటిఁగాక || అందు ||

కూడివుండనటే నేను గొబ్బున నుమ్మగించఁగా
వాడుచు వాకిటికేఁగి వంతనుంటిని
వేడుక శ్రీవేంకటాద్రివిభుఁడు నన్నిటు గూడె
పాడిపంతా లెఱఁగనా భ్రమసితిఁ గాక || అందు || 145 ||

పాడి

ఓపమే చాలును యింతకోపమే నేము
చేపట్టి యిద్దరి సరిసేసీ దాను || పల్లవి ||

పడఁతిపైకోపాన పతి నేమైనా నందు
అడరి నిమ్మా (ష్టా?) రిఁ జేయకురే నన్ను
ముడికాఁ డిద్దరిమీఁద మొకమోటమే తనకు
అడఁచినా యిద్దరివా దాడకేలే నేను || ఓప ||

పట్టకురే నన్ను మీరు పలుమారు రమ్మనుచు
అట్టె సవతివద్ద నాతఁ డున్నాఁడు

[1] 'కొంగువట్టి' వ్రాయుబడి తప్పు

ఇట్టె కల్లఁగలిగితే యెవ్వరిఁ గోపించలేదు
అట్టిట్టు విభుని కెదురాడఁ దరి గాదు || ఓప ||

అంత గలితే మీరు ఆకెను రాకుండఁజేసి
చెంతలఁ దోదుకరారే శ్రీవేంకటేశు
యింతలో నా ఇంట నుండె యీతఁడిదె నన్నుఁగూడె
వింతసతులఁ గంటేను వేసటయ్యీ నాకు || ఓప || 146 ||

## భైరవి

పట్టివిడిచినమాట పడితాలించే నిదివో
యిట్టె నోరారుతువు నీ వెందరినైనా || పల్లవి ||

చాలులేరా నేఁడె నాకు సరివచ్చె నామతికి
కాలమందే నమ్మినట్టి కల్ల గలదు
కోలగాచి పందెమాడి కోపగించఁ జాలఁగాక
వోలి నీవురాన సతి వున్న దది గాదా || పట్టి ||

కద్దు లేరా నావొల్లి కల్లలే నీ వేమి సేతు
వొద్దఁ గాచుకుండకుంటే వూరకుందురా
చద్దికి వేఁడికి వాదు చవిగాదనుచుఁగాక
అద్దివో నీ వీఁపు మీఁద నంగన గాదా || పట్టి ||

తగులేరా నీకు నాకు తారుకాణించఁగ నేల
మొగమోట నున్నదే నా మోసము గాదా
నగుతా శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి నేఁడు
నిగిడి నీ శిరసుపై నేనే కాన || పట్టి || 147 ||

## పూర్వగౌళ

ఆతనితలఁపు గంటి రంత చాలదా నేఁడు
చేతిచెక్కుతోడ వట్టి చింతనకేలమ్మా || పల్లవి ||

వీడెమిచ్చెఁ జాలదా వేగించితే నేమాయ
తోడ మాటలాడకుంటే దోసమా యేమి
వాడికాయ సందడినే వలపింత చాలదా
సూడుఁబాడు పంతాలకుఁ జోటేదమ్మా || ఆత ||

అలనైతిఁ జాలదా అలిగుంటే నేమాయ
కాలుదొక్కని దొక్కటే కడమింతే పో
వేలు వెట్టి యిమ్ముగొనె వెనకకే చాలదా
నాలుక బెల్లాలు చూప నాయము గాదమ్మా || ఆత ||

యింటికివచ్చెఁ జాలదా యేడ నున్న నేమాయ
వొంటి మోవి పిప్పెయిన[1] దొక్కటె కాక
అంటి పట్టి శ్రీవేంకటాద్రిపతి నన్నుఁగూడె
వెంటఁ బాయలే మిఁక వెలితి లేదమ్మా || ఆత || 148 ||

## సాళంగనాట

వేళలేదు పొద్దులేదు వేగిరించీని
వోలవేసీఁ జూపులనే వూరకున్న మానఁడు || పల్లవి ||

అంతేపో వోయమ్మ అదేమే వీఁడు
వింతవావి నామీఁద వేసి నవ్వీని
యెంతయినఁ బోనీఁడు యెంగిలిమోవి మాఁటలు
దొంతులు వేరుచవచ్చి తొలమన్నా మానఁడు || వేళ ||

---

[1] పిప్పి + అయిన (కా.శ్రీ.)

పోపో అదేడమాఁట పొద్దువోదటే
 రేపుమాపు రమ్మంటా రేసు చల్లీని
 వోపనన్నఁ బోసీఁడు వుంబడిపొత్తు చేతుల
 మోఁపవచ్చి నాకుచాల మొక్కీనాను మానఁడు ॥ వేళ ॥

తగునే యేమని చెప్పె తానే వీఁడు
 మొగమోడితేనే చేయి ముంచి కూడెను
 నిగిడి శ్రీవేంకటాద్రినిలయుఁడు నన్నుఁ గూడి
 నగము సరసమాడి చాలునన్న మానఁడు ॥ వేళ ॥ 149 ॥

## సౌరాష్ట్రం

కడు నిన్ను దూరనోప కానీవయ్యా
 కడమలిన్నియుఁ బాసెఁ గానీవయ్యా ॥ పల్లవి ॥

నీ కితవైతేఁజాలు నీనెలఁత లేమన్న
 కైకొనేవ ౹ అందుకేమి కానీవయ్యా
 ఆకెకు నవ్వు వలవు ఆకె నీకు వలవనీ
 కాకు సేయకుంటేఁజాలుఁ గానీవయ్యా ॥ కడు ॥

యింటికి వచ్చిన మేలు యేడ నుండినా మేలు
 కంటిమి నీగుణమెల్లాఁ గానీవయ్య
 నంటున నిట్టె నవ్వు నవ్వకుంటే యాకెఁ జూపి
 కంటకాలాడకు చాలుఁ గానీవయ్యా ॥ కడు ॥

మాఁగినకోపము దీర మాఁటల బుజ్జగించితి
 కాఁగినకాఁకలు జారెఁ గానీవయ్యా
 పాఁగి నాకు సతమయి పరచిత్తము మానితి
 కాఁగిన శ్రీవేంకటేశ కానీవయ్యా ॥ కడు ॥ 150 ॥

రేకు 1626 వేళావళి

ఏమనిన మామాట మెగ్గులౌనో తప్పులౌనో
కామిని వొద్దనె ఇన్నిఁ గందువు రావయ్యా || పల్లవి ||

ముత్తెపుఁ జిప్పలలోన ముంగారు లవె ముంచె
పొత్తుల గాలి నువ్వుఁ బువ్వునఁ బుట్టె
నిత్తెమిది గాలిమాటో నీలిమాటో కానరాదు
అత్తి చెలి అనతిచ్చీ అడకు రావయ్యా || ఏమ ||

చెలఁగు నద్దాల మీఁద చిగురాకు లవె పుట్టె
పులుగు జక్కవలపై పూవులు వూచె
వలరాజుమాయ లివో వలపు మిక్కుటమిదో
తలఁచుకొందువు చెలిదండకు రావయ్యా || ఏమ ||

అందుకోలై దొండపంట నమృతరసము పుట్టె
చిందఁబోసె తీఁగెమీఁద చిమ్ముఁగళలు
అందపు శ్రీవేంకటేశ అంగనఁగూడితి విట్టె
దిందుపడ సతిఁ గూడ దినము రావయ్యా ||ఏమ||151||

బౌళి

బాపు బాపు కృష్ణా బాలకృష్ణా
బాపురే నీ ప్రతాప భాగ్యము లివివో || పల్లవి ||

బాలుఁడవై రేపల్లెఁ బాలు నీ వారగించఁగ
పాల జలనిధి యెంత భయపడెనో
ఆలించి తొదలుమాట లాడనేరుచుకొనఁగ
యీలీల నసురసతు లెంత భ్రమసిరో || బాపు ||

తప్పటడుగులు నీవు ధరమీఁదఁ బెట్టఁగాను
తప్పక బలీంద్రుఁ డేమి దలఁచినాఁడో
అప్పుడే దాఁగిలిముచ్చు లందరితో నాడఁగాను
చెప్పేటివేద్గాలు నిన్నుఁ జేరి యెంత నగునో ॥ బాపు ॥

సందడి గోపికల చంకలెక్కి వున్ననాఁడు
• చెంది నీ వురము మీఁది శ్రీసతి యేమనెనో
విందుగ శ్రీవేంకటాద్రి విభుఁడవై యున్న నేఁడు
కందువైనదేవతలఘనత యెట్టుండునో ॥ బాపు॥152॥

## పాడి

మీఁద మిక్కిలి పనులు మీ చిత్తము
యీఁదితిని మోహజలధిప్పుడే నేనయ్యా ॥ పల్లవి ॥

కన్నులఁ జూచినంతనే కరఁగితిని । యిఁక
నిన్ను నేము సోదించనేరమయ్య
యెన్నిలేవు నాయాస లెంచఁబోతేను । నీవు
మన్నించినకొలదీ మాకుఁ జాలునయ్యా ॥ మీఁద ॥

నవ్వులు నవ్వినంతనే ననిచితిని । ఇఁక--
నవ్వలిపనులు నిన్ను నడుగనయ్య
యెవ్వ రేమిబుద్ది చెప్పే రిటమీఁదను । నీవు
అవ్వలివ్వలినుం డెప్పుడైనా రావయ్యా ॥ మీఁద ॥

ఇంటికి వచ్చినంతనే యెనసితిని
వొంటి నిన్నుఁబాసి వుండనోపనయ్యా
నంటున శ్రీవేంకటేశ నన్నుఁగూడితి । నీ
వంటి నన్ను జెక్కు నొక్కి తది చాలునయ్యా ॥మీఁద॥153॥

## వరాళి

ఏమనా - జేయవయ్య ఇయ్యకొనే నిఁక నేను
నీ మనసు నేఁ దెలియనేర కింతే కాక || పల్లవి ||

కామించి చేయివట్టఁగఁ గాదనేనా నేను
యేమందురో మావారనే దిందుకే కాక
దోమటి నానవెట్టఁగఁ దోసేనా ఇట్టె నన్ను-
నామని సిగ్గులు ముంచె అందుకింతే కాక || ఏమ ||

కొంగువట్టి తియ్యఁగాను కోపగించేనా నిన్ను
పొంగేటి సవతులచే పోరుకే కాక
చెంగటఁ బిలువఁగాను చేరని నా గర్వమా
అంగపుఁ జమట నిన్ను నంటీనని కాక || ఏమ ||

మించిన నీ కాఁగి లిట్టె మెచ్చకున్న దాననా
ఇంచుక పరవశమై యిందుకే కాక
అంచెల శ్రీవేంకటేశ ఆదరించి కూడితివి
మంచిదానఁ గానా వొక్కమాఁట కింతే కాక ||ఏమ||154||

## సామంతం

కందమువో ఇఁకమీఁద కడమదొడమలెల్ల
చెంది నావద్దనే వుంటేఁ జెల్లదా పంతము || పల్లవి ||

తా నాడఁగ నేనాడఁగఁ దారుకాణ లేడనేల
పోనీవే కదుఁగడుఁ బొద్దు వోయను
మేని మీఁది గురుతులు మేనిమీఁదనుండఁగాను
నానఁ బెట్టీ నిజములు నవ్వరాదా ఇందుకు || కంద ||

తా ముట్టఁగ నే ముట్టఁగఁ దడబాట్లేడనేల
యేమి సేసీ జేయనీవే ఇంతలోనేమి
దోమటిఁ దనచేఁతను దొంతులనే వుండఁగాను
యేమరించి కాఁగిలించీ నిది మేలుగాదా || కంద ||

తాఁగూడఁగ నేఁగూడఁగ తమకము లిఁకనేల
చేఁగదేర రతులెల్లఁ జెప్పఁగ నేల
వీఁగక శ్రీవేంకటాద్రి విభుఁ డిట్టె నన్నుఁ గూడ
మూఁగిన మోవితేనెల ముయికిముయి గాదా ||కంద||155||

## లలిత

ఏ మంద మీకెతోడ నిందుకే వెరగయ్యా
యీామై పాదాలు గడుగ నిదియు నేమైనది || పల్లవి ||

ఇదివో కృష్ణుడు మా ఇంటిపాలు నేయిఁద్రాగి
చెదర రుత్తకుండలు సేసి పోఁగాను
యెదుట యశోదఁ దెచ్చి యిటె (ట్టె?) చూపఁబూతేను
అదన నీరాళ్లుఁ గూరా ళ (ళ్ల?) న్నియుఁబాలైనది||ఏమం||

అల్లవీది వాకలేమ అమ్మకుఁబండ్లగంప
కొల్లలాడీ(డె?) కృష్ణుఁడని కోరి చెప్పఁగా
చుల్లరపు టాగడాలు చూపఁబోతే గంపనిండా
పెల్లుమాణికా లున్నవి బేలుపోయ మాఁటా || ఏమం ||

పంతపు శ్రీవేంకటాద్రి పతియైన కృష్ణుడు
యెంతటి మాయలవాఁడో యేమిమందులో
అంతటిబాలుని పట్టియూరడిఁ బెట్టితిమని
చెంతల యశోద గూర చిన్నఁబోవవలసె ||ఏమం||156||

రేకు 1627 గౌళ

ఇందుకేఁగాఁగంటివమ్మ[1] యిట్టిదయ్యమును నీవు
ౘందువ నిందుకు నాజ్ఞ గలదో లేదో || పల్లవి ||

వెన్నలెల్ల తా మెసఁగి వేళ్ల తా క్రిష్ణుఁ డా ఇంటి-
చిన్నికోడలిమూఁతి నించి కే చమరె
వెన్న మూఁతి చూచి అత్త వేగమె కోడలిఁ గొట్టె
ఇన్నేసి ఆగడాలు యీతని వోయమ్మా || ఇందు ||

వాకరింటి పెరుగు దా గొగి రుత్తబాన లెల్ల
యెగ(క?)[2] సక్కేలకుఁ బొరుగింటఁ బెట్టెను
వాకరొాకరి మొత్తిరి హోరాహోరిగాఁగాను
కకపిక నవ్వుకొంటా కడనుండె నమ్మా || ఇందు ||

వొట్టుచు బాలునినోర వాకబానెఁడు జున్ను
పెట్టి తురిగి వచ్చె వూపిరి వెళ్లదు
యెట్టయిన నీవె సుమ్మీ యీపిన్నవానికిని
పట్టీశ్రీవేంకటపతి[3] బలువుఁడో యమ్మా ||ఇందు||157||

పాడి

మోనవోకు రమ్మలాల ముందెరిఁగి కృష్ణుఁడు
ఆనల[4] నవ్వే రెవ్వరి నంత పచ్చి సేసెనో || పల్లవి ||

---

[1] 'ఇందుకే' అను అవధారణముపై ద్రుతమునకు ప్రసక్తిలేదు. 'ఇందుకేనా' అనియుండవచ్చునేమో. వీరేనా బలరామకృష్ణులు. భాగ. దశమస్కంధం ప్రయోగం వలె కావచ్చు లేక 'ఇందుకుఁగా' అనియైన కావచ్చు.

[2] ప్రాసభంగము.

[3] పట్టు + ఈ శ్రీవేంకటపతి.

[4] 'కృష్ణుడు' దగ్గరనుండి ఈ రెండవపాదము పై చరణముల అర్థముతో అంత సులభాన్వయముకాదు.

యేకతానఁ జెవిలోన యెవ్వరికిఁ జెప్పరాని[1]
పైకాని బూతు లాడీని బాలుఁడావీఁడు
వోకాంతపండ్లాని[2] వాడి గొప్పై వున్నదంటా
చేకాని చేచాఁచీని శిశువా వీఁడు || మోస ||

ముంచి ముద్దువెట్టేనంటా మోవి నేమో సేయవచ్చి
పంచనుండేదుష్టుగాక పదుచా వీఁడు
అంచెల నప్పులప్పలని వచ్చి కాఁగిలించి
చంచుల మేనెల్ల గీరె సన్నమా వీఁడు || మోస ||

చలిగోసీనని వచ్చి సరి నాపయ్యద గప్పి (ప్ప?)
చెలఁగి కోకెల్లాఁ దీసె చిరుతా వీఁడు
తెలసి శ్రీవేంకటాద్రిక్రిష్ణుఁడు ఇందరి నిట్టె
కలగొనె మూలమూల కతకారి వీఁడు || మోస || 158 ||

సాళంగం

కావలసినపనులు కాకమానీనా నీవు
కావరాన ముకుఁదాట కాలుగుచ్చేవేలరా || పల్లవి ||

కానీ కానీ నీవేమన్నాఁ గాదనరా | యిట్టె
ఆనించక పిలువవద్దంటి మింతేరా
మేనవావి నీకు నాకు మెరసెఁ దొల్లె | నేఁడె
నానఁబెట్టె సెలవుల నవ్వవలెనటరా || కావ ||

---

[1] 'చెప్పరాని' అను ధాతుజ విశేషణము 'బూతుల'తో సమసింపవలసియున్నది. సమాసమధ్యమున 'పై కాని' పదములో వ్యవధానము ఇట్టి స్వతంత్ర సమాస పద్ధతు లక్కడక్కడ గలవు.

[2] ఓకాంత ఒకకాంత?

ఆయనాయ నిందరిలో ఆరడేలరా । నీవు
చాయలకు మొక్కఁగానే చాలునంటిరా
పోయినపొద్దులు వోయఁ బొందకుండేమా । నీవు
చేయి మించి ఇంతలోనే చెనకనేఁటికిరా ॥ కావ ॥

కంటిఁగంటి నీమాట కల్ల గాదురా । నీవే
ఇంటికి వచ్చితి వన్నీ నియ్యకొంటిరా
నంటున శ్రీవేంకటేశ నన్నుఁ గూడితి । ఇఁక
బంట (టు?) పంతమా ఇది ప్రతిన లేఁటికిరా॥కావ॥159॥

గుజ్జరి

అవ్వలిమో మిదియేల అలుక లింకా నేల
జవ్వని మీఁదఁ బ్రియము చల్లఁగదవయ్యా ॥ పల్లవి ॥

చెవి నీపై చింతకు చెక్కిటిచేయే సాక్షి
కలవిరహానకు మెయికాఁకే సాక్షి
నెలకొన్నయాసలకు నిట్టూర్పులే సాక్షి
తెలుసుకొందువుగాని ద్రిష్టింపవయ్యా ॥ అవ్వ ॥

నిండుఁగాఁతాళమునకు నిట్టూర్పులే సాక్షి
దండి తమకమునకు తబ్బిబ్బు సాక్షి
చండిపడ్డ కోరికెకు జాగరములే సాక్షి
ష్షండవెల్లా నిఁకనేల వొకటి గావయ్యా ॥ అవ్వ ॥

కాఁగిటికి లాచుటకుఁ గదిసియుండుటే సాక్షి
మాఁగినమనసునకు మనసే సాక్షి
పాఁగిన శ్రీవేంకటేశ పడఁతిఁ గూడితి విట్టె
నాఁగువారి వేడుకలు నవ్వు నవ్వవయ్యా ॥అవ్వ॥160॥

## దేవగాంధారి

బలిమిసేయుక నీవు పదవమ్మా
చెలియ నా మన విది చేకొనవమ్మా || పల్లవి ||

తనువు లేనిచోట నవ్వుకంటెను
జానిఁగి వాదులడుఁచుట సుఖము
మనసురానిచోట మాటలాడుట కంటె
మునుపనే తనలోన మోనమే సుఖము || బలి ||

ప్రేమలేనిపతిఁ బిలుచుటకంటెను
పామరై వేగించుట సుఖము
కామించవిరతిఁ గరఁగుటకంటె
అమారు కంటము నలముట సుఖము || బలి ||

వొల్లమి సరిఁగూచుండుటకంటె
చల్లఁగఁ దొలఁగుట సమ సుఖము
యెల్లగ శ్రీవేంకటేశుఁడు నన్నుఁ గూడె
కొల్లగ విదియే కోరుట సుఖము || బలి || 161 ||

## వాదరామక్రియ

అన్నియు నే నెఱుఁగుదు నందుకేమి
నన్ను నేసే యాకె నిన్నుఁ జిక్కఁ జూడరాదా || పల్లవి ||

కప్పురమిచ్చి యాకె గైకొనఁగ రాదా
అప్పుడే నా మోము చూచే వందుకేమి
చెప్పియంపినది యేమో చెలియి(య?) మాటలు విను
యెప్పుడు నీవద్ద నుందు దెందు వొయ్యే నేను || అన్ని ||

మొక్కులు మొక్కి ఆకెముచ్చట దేరుచరాదా
మొక్కుడు నాతో నవ్వే విందుకేమి
దిక్కులనే కోపగించి తిట్టే విన్నదిగో
అక్కడి దీవెనఁ బొందు అలిగేనా నేము ॥ అన్ని ॥
కాఁగిలించి ఆకె విట్టె కరఁగించరాదా
అఁగి నన్నుఁ గూడితివి అందుకేమి
మూఁగుచుఁ గామలాపురమునఁ[1] గంచిరాయఁడవై
చేఁగదేర నేలితివి శ్రీవేంకటేశుఁడా ॥ అన్ని ॥ 162 ॥

రేకు 1628 ముఖారి

చాలుఁబో యీ పొందే చవులు నీకును
అలించి యేమి సేసినా అయము సోఁకీని ॥ పల్లవి ॥
అచ్చపు గుట్టున నుండవయ్య నీవు । నీతో
హెచ్చి నిజమాడరాదు యీకాలము
ఇచ్చకము లాడువారే ఇతవు నీకు । నిన్నుఁ
బచ్చిగా నేమన్నాను పసురువేసీని ॥ చాలు ॥
అంటిముట్టి సరసా లేలయ్యా నీవు
యింటిచెట్టు మందు గాదు యీకాలము
వెంటఁదిరుగాడువారే వేడుక నీకు । నిన్ను
దంటనై నేనేమన్నాఁదగవు దప్పీని ॥ చాలు ॥
అలయించేవు రతి నేలయ్యా నీవు
యెలమిఁ గాఁగిలే చాలు నీ కాలము
బలిమి శ్రీవేంకటేశ పట్టి గూడితివి నన్ను
తొలఁగి విన్నేమన్నాను దోసము వచ్చీని ॥ చాలు ॥ 163 ॥

---

[1] ఈ కమలాపురం కడపజిల్లాకు చెందినది. (గౌ.శ్రీ.)

## రామక్రియ

అడుఁబోతే వచ్చి దోఁచి నంతే చాలు
యీడ నాకుఁదెలియుట కింగితమే చాలు || పల్లవి ||

చెప్పరావిమాఁటలకు నెలవినవ్వే గురుతు
అప్పటి విన్నడిగేనా అంతే చాలు
వుప్పతిల్లే కూరిమికి వున్సురనుటే గురుతు
ముప్పిరిఁ గొసరకుమీ మొదలిదే చాలు || అడ ||

వక్కన రమ్మనుటకు వవ్వలించుటే గురుతు
యెక్కుడు సుద్దుల కేమి యింతేచాలు
చిక్కి నాకు వేఁగుటకు చిరుఁజెమటే గురుతు
నిక్కి చూడకుమీ ఇఁక నేల్రాఁతే చాలు || అడ ||

దిమ్మురతిఁ జొక్కుటకు తేలగింపులే గురుతు
కమ్మర నలయించేనాకాఁగిలే
నెమ్మది శ్రీవేంకటాద్రినిలియుఁడనైన నన్ను
వుమ్మడిఁ గూడితివి యీ వొడఁబాటే చాలు ||అడ||164||

## సామంతం

ఇంకానా నేనూ యిస్సీ రోఁత |' తన-
వంతలాడేవారిపొందు వదలకుమనవే' || పల్లవి ||

అప్పడే నేనాడనా అడకు నే రానని
యిప్పడే పిలువనంపె యిదేమో కాక
చెప్పరమ్మ చెలులు చిల్లులాయఁ జిత్తము
తప్పనిపొంతనివాఁడు తాఁదానే కదవే || ఇంకా ||

త

కంటా నే నవ్వినా కాంతాఁ దానుఁ గూడుండఁగ
ఇంటికిఁ దానేల వచ్చె నిదేమో కాక
అంటకురమ్మ మీరు ఆయనాయఁ దగవులు
తుంటరి తన బాసలు తొల్లిటివే కదవే || ఇంకా ||

దగ్గరితే మొక్కినా తనలో నే మొకమోడి
యెగ్గుదీర బుజ్జగించీ యిదేమో కాక
అగ్గమై శ్రీవేంకటేశుఁ డంతలోనె నన్నుఁ గూడె
సిగ్గరిపెండ్లికొడుకు చేలువుఁడే కదవే || ఇంకా || 165 ||

## శంకరాభరణం

మూల నున్నవారి నీవు ముంగిట వేసితి । నీవే
నాలికాఁడ నేము నీతో నవ్వవచ్చితిమా || పల్లవి ||

యెగ్గువట్టేవాఁడవు ఇంటికి రమ్మననేల
బగ్గన నీయంత నీవే బదుకరాదా
సిగ్గువడేవాఁడవు చేయి మాపైఁ జాఁచనేల
కగ్గి దవ్వుల నుండఁగఁ గాదు గూడ దంటిమా || మూల ||

అంతకోపగాఁడవు ఆయము లంటగనేల
కొంత దొరతనములోఁ గూచుండరాదా
పంతమాడేవాఁడవు బడిబడి రానేల
కొంతవు నీకు బత్తి గొట్టానఁ బెట్టితిమా || మూల ||

కాఁగిలించేవాఁడవు కాఁకలు సేయఁగనేల
పేఁగని మంచితనమే నెరప రాదా
దాఁగక శ్రీవేంకటేశ దక్కఁ గూడితివి నన్ను
పాఁగినరతుల నిన్నుఁ బచ్చిగా నాడితిమా ||మూల||166||

## వేళావళి

తననంది వానందిఁ దలపోఁతలా
వెనకముందు మరి వినుకొనేఁగాకా ‖ పల్లవి ‖

వద్దనేనా నేనూ వడిఁ దా విచ్చేసితేను
గద్దరిమా కోపమెంత కటా కటా
అద్దలించఁగలమా అతనితో బలిమా
తిద్దరాని తనమేలు తెలిసేఁగాక ‖ తన ‖

యెదురాడేనా నేను యేమని తాఁజెప్పినాను
గదరుకోఁడోఁటది కటకటా
పదరేటిదాననా పతియౌత గాననా
అదనైన యందాఁకా నాలకించేఁగాక ‖ తన ‖

వొల్ల ననేనా నేను వూరకే తాఁగూడఁగాను
కల్ల దాఁ జేసెనంటినా కటకటా
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డిదె నన్నుఁ గాఁగిలించె
చెల్లించెఁ దనచనవు చెప్పకొనేఁ గాక ‖ తన ‖ 167 ‖

## నాదరామక్రియ

చేతనైనపాటిసేవ సేయఁ గలదాన నింతే
అతల నీచిత్తమెట్టో అది నే నెఱఁగను ‖ పల్లవి ‖

నిద్దిరించేవో కొంత నీ కన్ను లెఱ్ఱనున్నవి
వొద్దనే మంచమూ నదె వోవరి నదె
తిద్దుకొనేవో కస్తూరి తిరుమణి చెదరెను
అద్దమిదె మొకమదె అవ్వల నెఱఁగను ‖ చేత ‖

జలకమాడేవో నీవు సారె మేను చెమరించె
కొల నదె తడియొత్తుఁ గోకలూ నవె
వలెనో విడెము నీకు వాడి మోవి తెల్లఁబారె
కలయుడవ మదివో కడమ యెఱఁగను || చేత ||
విసరుకొనేవో నీవు అసురుసు రయ్యేవు
పసనైనసుర టిదె బయలూ నదె
పొసఁగ శ్రీవేంకటేశ పొందితివి నన్ను నిట్టె
పొసఁగితి నెసఁగితి బూటకా లెఱఁగను || చేత || 168 ||

రేకు 1629 వరాళి

వేళలేదు పొద్దులేదు వేగిరించే వింతలోన
నీలాగు లెఱఁగరు నిందలాడేరు || పల్లవి ||
చెక్కులు నొక్కకుమీ చేతిగోరు నాటుఁజేసు
యెక్కువ మావారు చూచి యేడదనేరు
పక్కన నవ్వకుమీ పడఁతు లిందరు రున్నారు
చక్కఁగా నిందరిలోన సందేహించేరు || వేళ ||
మించి పై నొరగకుమీ మేనితావు లంటుఁ జేసు
అంచెలఁ జుట్టాలు పక్కా లాడుకొనేరు
మంచానకుఁ దియ్యకుమీ మరి తురుము చ (చె?) దరి
చుంచుల మాయత్తవారు చొప్పవట్టేరు || వేళ ||
బెట్టిమాట లాడకుమీ పిమ్మట రట్టౌఁ జేసు
పొట్టఁ బొరుగువారెల్లఁ బొంచు వినేరు
గట్టిగా శ్రీవేంకటేశ కాఁగిటఁ గూడితి విట్టె
పట్టి నీ మాయ కిందరు భ్రమశున్నారు[1] ||వేళ||169||

---

[1] భ్రమసి+ఉన్నారు (కా.శ్రీ.)

## ఆహిరి

బలుగుండెదానఁగాన బదికేఁ గాని
మలసి విన్నెరగ్గైతి మనను నీదనవే || పల్లవి ||

యెడమాటఁ గొంత వొద్దు యెదురుండి కొంతవొద్దు
కడపితిఁ దను నేఁ గలసేనంటా
అడియూనలే నిండె అంతటాఁ దా రాడాయు
వడలేను విరహానఁ బ్రాయము నీదనవే || బలు ||

తనుఁ దలపోసి కొంత తనరూపు వాసి కొంత
పెనఁగితి నన్నుఁ దాఁ బిలిచీనంటా
వినుకలే ఘనమాయు విడెమూఁ దా నంపఁడాగు
దిన మొక్కయేఁడాయు దేహము నీదనవే || బలు ||

కలలోనఁ గూడి కొంత కమ్మలు నడపి కొంత
నిలిపితి దీమనము నీవే వేనంటా
పలికి శ్రీవేంకటాద్రిపతి దా విచ్చేసి కూడె
చలఁగితి సంతసాన చిత్తము నీ దనవే || బలు || 170 ||

## లలిత

తారుకాణ నివి ఇట్టె తప్పదు గాక
తారి తారి తమకానఁ దమకించేఁ గాక || పల్లవి ||

తరుణి విలువఁబోయి తానుసించి రాదాయు
వరుసెరిఁగి నాపతి వచ్చీనో కాక
అరిది నాయెడమక న్నదరీ నేఁ డిపు డిట్టె
సారిది నాప్రాణేశుఁ జూచేనో కాక || తారు ||

మక్కువఁ బతిఁ దలఁచి మర్మములు గలఁగె నే-
నక్కడఁ బతికిఁ దలఁపైతినో కాక
ఇక్కువైనదంతపుటింటిలోనే చప్పుడయ్యా
వుక్కుమీరి యీడనే తా నున్నాఁడోకాక ॥ తారు ॥

వరగఁ బరపుపై నాపతి కాఁగిటిలోఁ గూడె
గరిమ నిందాఁక కలగంటినో కాక
యిరవై శ్రీవేంకటేశుఁ డితఁ డెంతమాయలాఁడు
వరసములే నాతో జరపెనో కాక ॥ తారు ॥ 171 ॥

## శంకరాభరణం

నీళ్లడిచితే నేఁడేల రెండయా(య్యి?)
నోళ్లు మాలోనే నాడిగితిమి ॥ పల్ల ॥

దావగుమేనులే దవ్వుల నున్నవి
చూపు లొండొరుల సోఁకినవి
మాపుదాఁకా నేము మాటల నెడాడి[1]
పైపై నూరకె బడలితిమి ॥ నీళ్ల ॥

పెనఁగేవంతాలే చిగిసివున్నవి
మనసులు రెండు మాఁగినవి
వనిమాలి నేమే బానలుసేయుచు
తనివోక తిట్టే దప్పిగొంటిమి ॥ నీళ్ల ॥

కందువ మోహాలే కాఁగిళ్ల నున్నవి
అంది మోవికెంపు లంటినవి

[1] ఎడ+అడి=ఎడాడిదూరముచేసి మాటలాడి. 'మాటలన్' అనుదానికి 'ఎడాడి' లోని 'అడి'తో అన్వయము కాదోలు.

యెందును మీగుట్టు యెఱఁగమైతిమి
చెందితివి చెలి శ్రీవేంకటేశా || నీళ్ల || 172 ||

## శ్రీరాగం

ఘనుఁడా నీమన సెంతగట్టో కాక
నినుఁజూచి వెరగంది నేననేఁగాక || పల్లవి ||

నిట్టూర్పుగాలిచేత నిలువఁ గలదా యింతి
నెట్టనఁ జనుఁగొండలే నిలిపెఁగాక
వుట్టిపడుమదనాగ్ని కోరువఁగలదా మేన
బట్టఁజెమటయేరులే చల్లార్చెఁగాక || ఘనుఁ ||

తుఱుము చీఁకటి ముంచె దూరఁగలదా యింతి
నెఱయ మోముచంద్రుఁడు నెగడెఁగాక
తఱిఁ బులకవాములు తరుణి మోయఁగలదా
పిఱిఁదిబాఁశి గలుగ దీరమెక్కెఁ గాక || ఘనుఁ ||

వలపనేనావెక్కి వనిత యేమైనఁగాదా
బలిమధరామృతాన బతికెఁగాక
నెలపై శ్రీవేంకటేశ నీవిట్టె సతిఁ గూడఁగ
తెలిసి నీవురముపైఁ దిరమాయఁ గాక|| ఘనుఁ || 173 ||

## నాదరామక్రియ

పాటి పాటి జగడాలు పనిలేదయ్యా
మాటితే మీఁదటిమాఁట మీకుఁ జెప్పేనయ్యా|| పల్లవి ||

యిట్టె కోపగింతుగాని యింటికి రాకుండలేవు
వొట్టులు సత్యాలు నీకు నొమ్మనయ్యా

వట్టినటులే కాక వావిచడ మందుగద్దా
బెట్టి నిన్నుఁ బిలువఁగఁ బెనఁగకువయ్యా || పాటి ||
వెంగేనఁ దిట్టుదుగాని వేఁడుకొనకుండ లేవు
వెంగటి బొమ్మలజంకె వెల్లదయ్యా
అంగవించితే నీళ్లడచితే రెండాన
కొంగువట్టి తియ్యఁగాను గుట్టు నీకేలయ్యా || పాటి ||
గరిమె మెఱతుగాని కాఁగిలించకుండలేవు
పొరపొచ్చా లిఁక నీకుఁ బొనఁగదయ్యా
ఇరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
తెరమఱఁ గిఁకనేల తెలిసితివయ్యా || పాటి || 174 ||

రేకు 1630 ముఖారి

ఏమని విన్నవించేము ఇంతిభావ మిదివో
నీ మనసుకొలఁ దిఁక నెలఁతకుఁ బ్రియుఁడా || పల్లవి ||
గంధాన బొట్టువెట్టఁగఁ గాంతకు నిట్టూర్పు రేఁగె
పొందగుగాలికి నది పుట్టినిల్లంటా
విందుగాఁ దామెరిచ్చితే విరహ సూర్యుఁడు మించె
అందులోఁ జుట్టరికము లమరునంటాను || ఏమ ||
కలికి మేఘవన్నె గప్పితేఁ జెమటవాన
గలిగె నదియే తమకాలమంటాను
బలిమిఁ జిగురుపాన్పు వరచితేఁ బులకలు
వెలిఁ బూచె వసంతపువేళ వచ్చెననుచు || ఏమ ||

కాంత చంద్రశాల కేఁగ కన్నుఁగలువలు విచ్చె
పొంతనే వొండొకటికిఁ బొందౌనంటా
ఇంతలో శ్రీవేంకటేశ యిటు నీవు గూడఁగాను
సంతసాలు దైవారి చవులాయ నివియె ॥ ఏమ ॥ 175 ॥

రామక్రియ

ఏడనేడ నెవ్వతెచే యేమిచేఁతఁ బడితివో
నీడలు యెండలు నాతో నీవు నడపకురా ॥ పల్లవి॥

అక్కరై మాటలాడేవు అనురుసురు ననేవు
యెక్కడ నున్నది చిత్త మిది యేమిరా
పక్కన నవ్వునవ్వేవు పరాకు సేసుకొనేవు
కక్కసపునీవలపు కానరాదురా ॥ ఏడ ॥

దగ్గరి విడెమిచ్చేవు తలయు వంచుకొనేవు
యెగ్గుసిగ్గు ననుమానా లెంతగద్దురా
వొగ్గి కళలు చూపేవు వూరకైన వాడేవు
దిగ్గన నీవిధమేదో తెలియఁగరాదురా ॥ ఏడ ॥

కాఁగిటనే కలసేవు కన్నులును మూసేవు
నీఁగని నీ పొందులకు నిజమేదిరా
పొఁగిన శ్రీవేంకటేశ భ్రమఇంచి కూడితివి
వీఁగవు రతుల నిఁక వివరించరాదురా ॥ ఏడ ॥ 176 ॥

పాడి

అంగడిఁ బడెను వాదు లతివకు నీకుఁ బోదు
జంగిలినటులు మాతోఁ జాలు రారాదా ॥ పల్లవి ॥

వెన్నెల నెలవిఁ గాఁరీ వేడుకలు థైవారీ
యెన్నేవు చెలియకోప మిందులో నేది
కన్నులనే కప్పురాలు కరముల నుప్పరాలు
వన్నెకెక్కెఁ జెలియందు వడఁబడ నేఁటికి || అంగ ||

మేనిపైఁ గమ్మనితావి మించీ తేనెలు మోవి
యీ నెలఁత నీ మీఁద నీరసమేది
మోనముతోడి గుట్టు ముదితకు వట్టిరట్టు
కానఁబడి వుండఁగానుఁ గడమేలెంచేవు || అంగ ||

మాటలోనివెరగు మరునియింటిపొరుగు
చాటువ నింతికి నబ్బె చల మిందేది
పాటించి శ్రీవేంకటేశ పైపైఁ గూడితివింక
యేఁటికి వట్టి సుద్దులు యియ్యకోలు మాకు ||అంగ||177||

## గుండక్రియ

నీకునీవే పదరేవు నేనేమీనన్నను
కైకొని యేరా నీవు కన్నులు మూసేవు || పల్లవి ||

చేరలంతలుకన్నుల చేరి జంకించితినో
కోరి నిన్నుఁ బెదవుల గొణఁగితినో
కేరి నెలవుల నవ్వి కేరడమాడితినో
యేరా సిగ్గువడేవు యింతలోనే నీవు || నీకు ||

జక్కవ చన్నుల నిన్ను సారె నొరసితినో
వెక్కసపు మాఁటలు వెంగెములాడితినో
మక్కువ నీమేనిమీఁదిమచ్చము వట్టితినో
తక్కక యేరా నీవు తలవంచేవిపుడు || నీకు ||

కాఁగిలించి నీమేన ఘాతలు నేసితినో
తోఁగినరతుల నరిదూఁగనైతినో
దాఁగక శ్రీవేంకటేశ తగ నన్నుఁ గూడితివి
మూఁగుచు నేరా నీవు మఱచేవు మేను ॥ నీకు ॥ 178 ॥

## భైరవి

చల్లఁగా బతుకవయ్య నమ్మతైనపాటే చాలు
వొల్లకున్నా బుద్ధిచెప్పే వొడఁబాటు లేలా ॥ పల్లవి ॥

తొలుత రానికోపాన దూరితిఁగాక నిన్ను
వలపుగలంతేకాక వచ్చేవా నీవు
తలఁచి తలఁచి నీకే తగ వొప్పగింతుఁగాక
అలయించి నిన్నుఁదెచ్చేయంత బలిమేలా ॥ చల్లఁ ॥

తత్తరించి కొంగువట్టి తమి రేఁచితిఁ గాక నీ-
చిత్తము వచ్చినఁగాక నేసేవా నీవు
పొత్తులకూటమి నీకే పుణ్యము గట్టుదుఁగాక
బత్తి గొట్టాన బెట్టేటి పంతము నాకేలా ॥ చల్లఁ ॥

యెదుట నుండఁగా నిన్ను ఇన్నియు నవ్వితి నేను
అదనైనఁదాఁకఁగాక అంటేవా నీవు
ఇదివో శ్రీవేంకటేశ ఇప్పుడే కలసితివి
ముదమైన రతి చాలు మొక్కలములేలా ॥ చల్లఁ ॥ 179 ॥

## వరాళి

వద్దు వద్దు మాతోడ వైతాళాలు
వొద్ద నిన్నుఁ జెనకితే వొల్లననఁగలవా ॥ పల్లవి ॥

అసము దించని మాఁట లాడితే నాడుదుగాని
పసికి పిసికి వొట్టు వెట్టుకోకురా
పసురు వేసీ మోవి పలచనిచిగురాకు
కసిగాటు సేసితేను కాదనఁగఁగలవా ॥ వద్దు ॥

చెల్లినదొరతనాలు సేసితేఁ జేతువుగాని
కెల్లురేఁగి నీవు కోపగించుకోకురా
వొల్లు ముంటనే తిరీ ముసలమేఁటికి నే-
నిల్లిదె కాలుదొక్కితే నెదురాడఁగలవా ॥ వద్దు ॥

గుట్టునఁ గాఁగిట నన్నుఁ గూడితేఁ గూడుదుగాని
నెట్టుకొట్టి నీవంత నవ్వవద్దురా
ఇట్టె శ్రీవేంకటేశ యేలితివి రతులను
పట్టి కళదాఁకించితే భావించఁగలవా ॥ వద్దు ॥ 180 ॥

రేకు 1631. మాళవి

అరగించి కూచున్నాఁ డల్లవాఁడె
చేరువనే చూడరె లక్ష్మీనారసింహాఁడు[1] ॥ పల్లవి ॥

ఇందిరనుఁ దొడమీఁద నిడుకొని కొలువిచ్చి
అందపునవ్వులు చల్లీ నల్లవాఁడె
చెందినమాణికముల శేషునిపడగెమీఁద
చెంది వరాలిచ్చీ లక్ష్మీనారసింహాఁడు ॥ అర ॥

బంగారుమేడలోన పచ్చలగద్దియలమీఁద
అంగనలయూట చూచీ నల్లవాఁడె

---

[1] రేకులో అంతటా 'సింహ్వాఁడు' అనియే

రంగగుసొమ్ములతోడ రాజసపువిభవాల
చెంగట నున్నాడు లక్ష్మీనారసింహుఁడు ॥ అర ॥

పెండెపుఁ బాదము చాఁచి పెనచి వొకపాదము
అండనే పూజలుగొనీ నల్లవాఁడె
కొండల శ్రీవేంకటాద్రి గోరి యహోబలమున
మెండుగాను మెరసీ లక్ష్మీనారసింహుఁడు ॥ అర ॥ 181 ॥

రామక్రియ

వేఁగిరమా కోనతిరువెంగళేశ । నిండెఁ
దేగపు వలపు కోనతిరువెంగళేశ ॥ పల్లవి ॥

కాయమెల్లఁ బులకించె గక్కన నీచేయి నాపై
వేయఁగానే కోనతిరువెంగళేశ
బాయిటనే ఇదె నా గుబ్బలపై పయ్యదకొంగు
తీయకుమీ యంత కోనతిరువెంగళేశ ॥ వేఁగి ॥

కొల్లున నీవు నవ్వితే కొప్పువిరులు పైరాలె
వెల్లవిరిఁ గోనతిరువెంగళేశ
చెల్లెనీకు నామేనఁ జేసినచేఁతలు తేట-
తెల్లమాయ నిదె కోనతిరువెంగళేశ ॥ వేఁగి ॥

భావించి కూడితి విట్టె పంతములు వచ్చె మాకు
వేవేలుఁ గోనతిరువెంగళేశ
శ్రీవేంకటాద్రి మీఁద చిత్తమెల్లా గంటె నిదె
దేవుఁడ విన్నిటాఁ గోనతిరువెంగళేశ ॥ వేఁగి ॥ 182 ॥

## సామంతం

అప్పడే యెగ్గులు వట్టే నలిగితినా
తప్పకుండా మెదల సూత్రపు బొమ్మనా || పల్లవి ||

యేమన్న నూరకుందాన[1] నిఁక నేమి గావలెనే
దోమటిఁ దా నవ్వితే నే తోడు నవ్వేదా
తా మాటలాడెనంటా దగ్గరి నే మాటలాడ
కోమలమయినపెద్ద కొండసెలనా || అప్ప ||

తలవంచుకున్నదాన తనతో నేఁ గోపమేదే
నిలిచి తాఁ జూచెనంటా నిక్కి చూచేదా
అలసి తాఁ జేయివేసె అట్టె నేనూఁజేయివేయు
బలిమిఁ బంతాలతోడ పందమాడేనా || అప్ప ||

ఆఁగి తనకొమరాఁక నట్టె వుండఁగ తాను
కాఁగిలించినప్పడే నేఁగాఁగిలించేదా
చేఁగదేరఁ గూడె నిట్టె శ్రీవేంకటేశ్వరుఁడు
యేఁగించె (చ?) వెంట నే యింత తోడునీడనా||అప్ప||183||

## బౌళి

ఔననుమీ యిఁక నీకు నౌభళేశ
మోనమేల మాఁటలాడు మొక్కే నౌభళేశ || పల్లవి ||

కాయమెల్లఁ జెమరించె కడుబడలితి విదె
ఆయనాయఁ జాలుఁ గోప మౌభళేశ

---

[1] ఊరకున్న+దాన (రా.ప్ర.)

ఆయుములు గరఁగించి అండకు వచ్చితి నేను
మాయులేల నవ్వరాదా మాతో నాభశేశ || అన ||

మెఱుఁగుమోవి వాడె మిక్కిలి బుసకొట్టేవు
అఱిముఱి మఱపేల యాభశేశ
గుఱిగా నీకొనగోరు గుబ్బలు సోఁకించితి నీ--
మఱపులు చెల్లవిఁక మాను మాభశేశ || అన ||

కలసితి మిద్దరము కన్నులనె కెంపుదేరె
అలయుకు మిఁక నీవు ఔభశేశ
తలపోఁతలు మనకు తారుకాణ లివె వచ్చె
బలిమి శ్రీవేంకటాద్రిపతి యాభశేశ || అన || 184 ||

## సామంతం

సంగడిజాణతనాల నటకాడ
అంగడివలపు చల్లే వద్దమాడనోపరా || పల్లవి ||

కన్నులనే నవ్వినవ్వి కడుఁగొప్ప దువ్విదువ్వి
వెన్నెలమాయులు సేయ వస్తివా వోరి
చన్ను లంటకుమీయుంటే చాఁచేవు మానానకు
ఇన్నేసి నేరకుండితే నెట్టు బతికేవురా || సంగ ||

చెక్కులిటు నొక్కి నొక్కి చేతులు పై వేసివేసి
మక్కువనీచేఁత లిందు మాపే (నే?) వా వోరి
తొక్కకుమీ పాదమంటే దొరసె వావి యనేవు
యెక్కువమాఁటలు దయ్య మిచ్చేఁగా వోరి || సంగ ||

పానుపుపైఁ జేరిచేరి పైఁ గొంగు వేసి వేసి
పూనిన కళలు రేఁచి పొందేవా వోరి
మోనాన నే నుందుమంటే మొక్కి మొక్కి కూడితివి
కానీలే శ్రీవేంకటేశ కైవసమైతివిరా ॥ సంగ ॥ 185 ॥

## దేసాళం

కుందనపుఁబిల్లఁగోవి గోపీనాథా[1] ।[1] మాపైఁ
జిందేవు మోహరసాలు చిన్నిగోపీనాథ ॥ పల్లవి ॥

కొలనిలోపలిమాతో గోపీనాథా । యేల
కులికి నవ్వు నవ్వేవు గోపీనాథా
కొలువు మొక్కు మొక్కేము గోపీనాథా । నీ-
చలము చెల్లితేఁ జాలు జాణ గోపీనాథా ॥ కుంద ॥

గొబ్బన మాచీరలిమ్ము గోపీనాథా । మా
గుబ్బలపైఁ గాఁక రేఁగె గోపీనాథా
గుబ్బతిల్లీఁ దమకమే గోపీనాథా । నీ-
కబ్బితి మేమైనఁ జేయువయ్య గోపీనాథా ॥ కుంద ॥

కుప్పవడె మాసిగ్గు గోపీనాథా । మా-
కొప్పు జారె ముదువుగా గోపీనాథా
వొప్పుగ శ్రీవేంకటాద్రినుండి వచ్చి కూడితివి
అప్ప తొండామారేగుళ్ల ఆదిగోపీనాథా ॥ కుంద ॥ 186 ॥

[1] 'గోపీనాథ' అనుటయే లయ కనుకూలమేమో? ఈ పాటలో తర్వాతి పాటలోను అంతటా ఇంతే.

**రేకు 1632.** **లలిత**

కానకిక్కె వలపులు గోపినాథ | మన-
మనసొక్కటాయ నింక మదనగోపినాథా || పల్లవి ||

కొమ్మలువదారువేల గోపినాథా[1] | నీకుఁ
గుమ్మెలాయ మోమెల్ల గోపినాథా
కుమ్మరింపురాగాల గోపినాథా | అంత
చిమ్మకు నీవంతములు చిన్నిగోపినాథా || కాన ||

కోరనకోరికె చెల్లె గోపినాథా | యింకాఁ
గూరిమేల కానరేవు గోపినాథా
గోరు సోఁకనీయకుమీ గోపినాథా | నమ-
తారుకాణలాయ నిన్నుఁ దగు గోపినాథా || కాన ||

కొండుకపాయాలు నరి గోపినాథా | యిఁక
గుండెవట్టి వుండరాదా గోపినాథా
కొండల శ్రీవేంకటాద్రి గోపినాథా | పొందు
తొండమారెల్ల గూడె దొర గోపినాథా || కాన || 187 ||

**సామంతం**

ఏమని పొడఁబరచే పెట్టు నేనేవో కాని
సోమరి వలపులలో సుడిగొనున్నాఁడు || పల్లవి ||

దంతపు వెన్నెలలోఁ దగ నీవు మాటలాడఁ
గొంతవు నీ చూపులైతేఁ గొచ్చిపోరిని

[1] 'పదారువేల కొమ్మల గోపినాథా' అనుట సహజము. 'గోపినాథ'లోని 'గ' యతిస్థానము కావున 'కొమ్మలు' ముందుంచినారు. 'కొమ్మలు' వ్రాయసగాని తప్పు (కా. శ్రీ.)

యింతలో నీ చక్కఁదన మిటు దారామోనఁ జూపె
పంతవు నీ రమణుఁడు భ్రమసి వున్నాఁడు || ఏమ ||

సెలవి నవ్వుల నీవు సేమంతులు చల్లఁగాను
మొలకచన్నులు పైపై మొనలెత్తివి
మెలుపు నీ సొమ్ము లెల్లా మృదువులో వాఁడి చూపె
వెలినేమీననలేక వెరగైయున్నాఁడు || ఏమ ||

కందువకాఁగిట నీవు కలసి మెలఁగఁ గాను
ముందరనే నీ తురుము ముడి వీడీవి
చెంది పురుషోత్తమాన శ్రీవేంకటేశ్వరుఁడు
అందునిందు వచ్చి కూడి యలసివున్నాఁడు ||ఏమ||188||

## శంకరాభరణం

ఇంతి సేసినమేలు కిదియా । నీవు
వంతుకు వంతే వైపాఁ గాక || పల్లవి ||

వెన్నెలరేకులు వెదచల్లినదె
కన్నుల నీపయిఁగలికి
సన్నపు బొమ్మల జంకెన చీఁకటి
పన్ని నీ వేఁటికిఁ బతి[1] చల్లేవు || ఇంతి ||

తామెరచేతులఁ దగఁ బూజించీ
నామనిసన్నల నతివ
వేమరు సిగ్గులపెడమంచవుడే
గోమునఁ బతిగాఁ గురియించేవు || ఇంతి ||

[1] ఈ 'పతి' 'ప్రతి'కి వికృతి. ఈ పాటంతటా అంతే.

నెలఁతకుచంబుల నిమ్మపండు లవె
చెలఁగి కానుకిచ్చెను నీకు
బలిమి శ్రీవేంకటపతి విటు చేకొని
వలచవికెమ్మోవి పతి యిచ్చితివి || ఇంత || 189 ||

ముఖారి

పొత్తులమగఁడుగన వూనుకవచ్చితి నేను
బత్తిసేయ వద్దంటినా పట్టకుమంటిఁగాక || పల్లవి ||

పొలసి కన్నులఁ బతిఁ జూడఁగా వద్దంటినా
అలిగి వుప్పతించవద్దంటి గాక
మలయుచు నీవు మంచిమాటాడవద్దంటినా
వలవనినేరా లెంచవద్దంటిఁగాక || పొత్తు ||

కడ లేక పొందుసేయఁగా నే వద్దంటినా
వడిపెట్టి పెనఁగఁగ వద్దంటిఁ గాక
విడుముడిఁ గొలువులు సేయఁగా వొద్దంటినా
వడదాఁకె వెంటఁ దిప్పవద్దంటిఁ గాక || పొత్తు ||

కాంత యీతనికాఁగిటఁ గలయవొద్దంటినా
వంతల గుబ్బల నొత్తవద్దంటిఁ గాక
యింతలో శ్రీవేంకటేశుఁ డేతఁ డిట్టె నన్నుఁగూడె
వంతు వద్దంటినా జోలి వద్దంటిఁగాక || పొత్తు || 190 ||

బౌళి

నిజములే పచరించు నెమ్మది నిన్నాళ్లుఁ దాను
భజన నన్నియు నేఁడు బట్ట బయలాయనే || పల్లవి ||

పొద్దు వోయినఁదాఁకా పొలఁతితో మాటలాడి
నిద్దిరించి వుండినది నే నెఱఁగనే
సుద్దులు చెప్పేనంటా చూచి మేలుకొలిపితే
ఇద్దరు నన్నుఁ జూచి తామేల సిగ్గువడేరే || నిజ ||

చిదుముడి నిందాఁకా చెలికి సింగారించి
బడలి తానున్నది భావించనే
వడిఁ దలుపు దెఱచి వద్దికి నే వచ్చితేను
తడవి తమలోఁదాము తలలువంచేరే || నిజ ||

యింపుల శ్రీవేంకటేశుఁ డీవనితరతిఁ గూడి
సొంపుమొగచాటైనది చూడనైతినే
జంపులేక నే వచ్చి సరిఁగాఁగిలించుకొంటే
ముంపులఁ జూచి తామేల మొనసి నవ్వేరే ||నిజ||191||

కాంబోది

మగఁడు చెప్పినపని మగువకుఁ జేయవలె
తగవులన్నియు నేఁడు తలఁచుకో నీవే || పల్లవి ||

ఇప్పుడేల లోఁగేవు యింతిఁ దోడుకరమ్మని
అప్పణగా నీవు నాతో నానతియ్యవా
చెప్పట మరచితివో చింతతోఁ బరాకైతివో
తప్పులేదు నావల్ల తలఁచుకో నీవే ||మగఁ||

వెఱగులేల పడేవు విడె మాపె కిమ్మని
జఱసి కొలువులోన నన్న సేయవా
మఱి దొరతనమో మగువల మొరఁగేవో
తఱి యెఱఁగనా నేను తలఁచుకో నీవే || మగఁ ||

తెలుపుమనే వాకెఁ దెరవేయుమనెనవి
పలుకఁగ సిగ్గువడి భావించుకోవా
యిల నేలితివి మమ్ము నిద్దరి నీజాడలెట్టో
తలర శ్రీ వేంకటేశ తలఁచుకో నీవే ॥ మగఁ ॥ 192 ॥

రేకు[1] 1633. రామక్రియ

ఎడసిన నొకసక యెనసిన నొకసకి
పడఁతికి నెటువంటిభాగ్యమో కాని ॥ పల్లవి ॥

చింతాజలధిఁ బాసి చేరె నినుఁ జెలి యంటే
వంతచెమటజలధి వచ్చె నొకటి
చెంతల నీ విరహపు చీఁకటిఁ బాసె నంటే
కాంతకు తురుముచీఁకటి ముంచుకొనెను ॥ ఎడ ॥

కొండలంత కోరికెలు గొచ్చి నినుఁ గూడెనంటే
అండనే చనుఁగొండ లడ్డమాయను
వెండివలె దేహమెల్లా వెల్లఁబారి మానెనంటే
వెండి కంటెఁ దెల్లనాయఁ వెలఁదికి కన్నులు ॥ ఎడ ॥

మరునమ్ముల కంతలు మాని నినుఁ బొందెనంటే
సిరులపులకలచే చిల్లులాయను
సరుగ శ్రీవేంకటేశ సతిఁ గూడితివి నేఁడు
ఖరవై తొల్లిటివెల్లా నియ్యకోలే ఆయను ॥ ఎడ ॥ 193 ॥

శంకరాభరణం

నవ్వువచ్చీ మాకైతే నాఁటకపునిన్నుఁ జూచి
రవ్వలాయు నీ కతలు రాఁగారాఁగాను ॥ పల్లవి ॥

---

[1] ఈ రేకు అక్కడక్కడ చిల్లులు పడినవి. అక్షరములు చెడలేదు.

రమణుఁడు వచ్చెనంటే రాగము కన్నుల నుబ్బె
కొమరె పాయపు సిగ్గే కొసరీఁగాని
కమలాక్షి నీ గుట్టు కంటిమి నేమింతలోనే
చెమరించె చెక్కు లింకాఁ జెప్పవేమే మాకు ‖ నవ్వు ‖

పతి యెలుఁగు వింటేనే పచ్చి దోఁచెఁ గళలెల్ల
కతకారి మోనమేలో కదిమీ నిన్ను
సతి నీ వలపు మా యిచ్చలనె వెల్లవిరాయ
ఇతవై మై పులకించె నేల దాఁచే విపుడు ‖ నవ్వు ‖

అతఁడు దగ్గరితేనే ఆడితివి సరసము
కాతరాన నీకుచాలే కప్పేవుగాని
యేతరి శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్నుఁగూడె
యీతల నివ్వెరగైతి వెంతనేరుపరివే ‖ నవ్వు ‖ 194 ‖

## పాడి

[1]కూడి సుఖించుటకంటె కూడుదమనేదే ఇంపు
తాడుపడి వుండుకంటే తరితీపే ఇంపు ‖ పల్లవి ‖

దగ్గరి వుండుటకంటే దవ్వుల నినుఁ దలఁచి
అగ్గలపురతిఁ జొక్కే ఆసలే ఇంపు
సగ్గక పానుపుమీఁద చలివాసె వుండుకంటె
సిగ్గుతోడఁ గొనచూపు చిమ్ముటే ఇంపు ‖ కూడి ‖

సరికి బేసికి నీతో సరసములాడుకంటె
మరుగుచునుండే యెడమాటలే ఇంపు

[1] దివ్యమూర్తియగు వేంకటేశ్వరునితో ప్రత్యక్ష కామసుఖము అనుభవించుటకు వీలులే-
దని అన్నమయ్య మనోభావమే ఈ పాటగా వెలువడినదేమో.

సరుగ నీ మీఁదఁ జేయి చాఁచి కాఁకఁదీరుకంటె
వరుసఁ బూవుల చెండువాట్ల ఇంపు || కూడి ||

అగపడ్డరతులచే నలసి నిద్రించుకంటె
దిగువుఁ గాఁగిటిలోని ప్రియమే ఇంపు
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
పగటుల నుండుకంటే పచ్చిసేయు టింపు ||కూడి||195||

. ముఖారి

వింతవారివల్లనైతే వెసనిన్ని నమ్మితౌను
చెంతల నావల్లనైతే చిత్తమెట్టువచ్చునో || పల్లవి ||

తప్పకుండా నీ వొళ్లి తగవులే నెరపేవు
చెప్పరాదా నీమాట చెలులతోను
అప్పుడే ఱారె తెలిపే రాఁగాములెల్లా నీకు
చిప్పిల నే నేమనినా చిత్తాన నెట్టుండునో || వింత ||

వోపికతో నీకునీవే వూరకే మెచ్చుకొనేవు
చూపరాదా నీ సేఁత సుదతులకు
రూపించేరు వారే నీనేరుపులెల్లా నొక్కమాఁటే
దీపించ నే నేర్పరచితే నేమందువో || వింత ||

నిలువఁబెట్టేవు నీ నిజములే పలుమారు
తెలుపరాదా నీవొద్దితెఱవలకు
మెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
వెలయ నేఁ గొసరితే వేడు కెంతవుట్టునో ||వింత||196||

## నాదరామక్రియ

ఊరకేల భ్రమసేవు వొగినేల పొగడేవు
నేరమా నేమందరము నీకే తెలిసీని ॥ పల్లవి ॥

కతలు తొల్లె భూమిఁ గలవె కావా నేఁ డీ-
సతి నీతోఁ జెప్పఁగానే చవులాయను
గతులైన చూపులు కన్నుల సాజమే కాదా
తతి నాపె చూడఁగా నీమతి నాటేఁగాక ॥ ఊర ॥

అందరిచ్చేకానుకలు అరచేతిలోవేకావా
ఇందుముఖి యియ్యఁగా నీ కింపాయఁగాక
చిందేటి నవ్వు లింతులసెలవులవే కావా
చెంది యాపె నవ్వఁగా నీ కందమాయఁగాక ॥ ఊర ॥

వింతమొక్కులు లోకులవినోదములే కావా
యింతి మొక్కఁగా రతికెక్కెఁగాక
ఇంతలోన శ్రీవేంకటేశ నన్ను నేలితివి
చెంత నాపెఁ గూడఁగా నచ్చెరువాయఁగాక ॥ఊర॥197॥

## గుజ్జరి

సారె సారె మమ్ము నేల సాకిరివెట్టేవు నీవు
అరజముగా నిన్ను నౌఁగాదనఁగలమా ॥ పల్లవి ॥

చెప్పేటి మాటలెల్లాను చెవులొగ్గి వింటాగాక
తిప్పిచెప్పి నీ గుణాలు తిద్దఁగలమా
అప్పటప్పటికి యిచ్చలాడ నోపుదుముగాక
చొప్పలెత్తి నిన్నింతేసి సోదించఁగలమా ॥ సారె ॥

మాటిగా నీ సేసేచేఁత చూడఁగల మింతేకాక
ఫాటికి బేటికి నిన్ను సాగించేమా
యీటువెట్టి వొకమాటు మెచ్చరించు టింతే కాక
గాఁటమైన నీ మనసు కరఁగించఁగలమా || సార

నంటున నీ వునికికి నవ్వులే తగవుగాక
అంటిముట్టి యేమైనా విన్నాదఁగలమా
ఇంటిలో శ్రీవేంకటేశ యింతి నీవు గూడితివి
జంటలమిమ్మిద్దరి మెచ్చక మానఁగలమా ||సార||198

రేకు 1634. ఆహిరి

వనిత నీకుఁ గడవారము గాము
వొనరిన వలపులు వొక్కనరే సుమ్మీ || పల్లవి

వంచిన నా కనుఁగలువలకు చుట్టము నేఁడు
అంచెల నీమోముచంద్రుఁ డదియే సుమ్మీ
యించుకంత అనుమాన మిఁకనేల నీకునాకు
కంచపు పొత్తులు మోవిఁ గలనుఁజుమ్మీ || వని

నెలఁత నీ నడపు నెమలికి చుట్టము
మెలుపు నా నీలవర్ణమేమే సుమ్మీ
పలుకుల చిలుకలు పడఁతి నీకును నాకు
కులము పొఁగెన నొక్క గూఁటివాయ సుమ్మీ || వని ||

వనిత నా జవ్వన వసంతునికి చుట్టము
దినము నీ బాహులనే తీఁగెలే సుమ్మీ
యెనసితి శ్రీవేంకటేశుఁ డను నే నిదె
తనువులుఁదనువులు తారుకాణ సుమ్మీ || వని || 199

## రామక్రియ

ఎండమావి నీరుసేసే వేమే నీవు
అండనుండఁగాక దవ్వులైతే నవిగావా ॥ పల్లవి ॥

అలఁదు నిన్నుఁ బిలిచినదిగదె । నాకుఁ
బలిఁగాఁజిలుకలే పలికీఁ బోవే
తలి నిందుకే యలఁదు తా నవ్వీనే । అట్టె
వెలికితే నందు మారువెన్నెలలు గావా ॥ ఎండ ॥

తప్పకచూచీఁ గదె తగ నలఁదు । నా-
ముప్పిరిఁ జూపుల మారు మొల్లలే పోవే
చెప్పి చేయిచాఁచి నన్ను సేసీఁగదే
చిప్పిలు నాచేతి మారు చిగుళ్లుఁ గావా ॥ ఎండ ॥

అలమీఁ గాఁగిట నిన్ను నాతఁడే కదే । నేఁ
గలసినట్టే తీగెలు కలసీఁ బోవె
బలిమి శ్రీవేంకటాద్రిపతి నిన్నుఁ జొక్కించె
నిలువునఁ జొక్కించేనానేరుపులే కావా ॥ఎండ॥200॥

## వరాళి

నెంఁత నేమిచెప్పేవు నిన్నే చెప్పవలెఁ గాక
తిలకించి ఇటువలె దిద్దుకొన వశమా ॥ పల్లవి ॥

కన్నులనే మాటలాడి కప్పురాన వేసె నిన్ను
కన్నెఁ దెచ్చి యింతకళ్కిగాఁ జేసితివి
సన్నల చాయలనే చల్లె వలపులు నీపై
పిన్ననాఁడివి వెన్నతోఁబెట్టించితివేమో ॥ నెంఁ ॥

వేలనే మెచ్చులు మెచ్చి విరులు నీపై (పైఁ?) గుప్పె
బాలఁదెచ్చి యింతనేరుపరిఁ జేసితి
వాలిక చూపులు నీపై వంచె నొక్కమాటె నేఁడు
పోలికలు నాఁడె నూరిపోసితివేమో || నెలఁ ||

పిడికిట విడెమిచ్చి బిగువుఁ జన్నుల నొత్తి
పడుచుఁ దెచ్చిఁ దిట్టఁగాఁ గడుఁ జేసితి
అడరి శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
బెడఁగుటాన మొలవఁ బెట్టితివేమో || నెలఁ || 201 ||

## భైరవి

విరహతాపముచేత విసిగె నిందాఁకాను
యిరవై మొక్కులు మొక్కి నిదివో నీ దేవుఁడు || పల్లవి ||

చెంపలఁ జెమటఁగారీ సెలవుల సిగ్గు లూరీ
గుంపుగట్టి మూఁపుమీఁదఁ గొప్పఁజారీని
పెంపుడుఁజిలుక చేత పీఁటమీఁదఁగూచున్నది
ఇంపులోడఁ జిత్తగించు ఇదివో నీ దేవుడు || విర ||

మోమునఁ గళలు మూఁగీ ముక్కున నిట్టూర్పు రేఁగీ
వేమరుఁ జన్ను లురాన విఱ్ఱవీఁగీని
తామెరపువ్వు ధరించి దండనె కాచుకున్నది
యేమని మాటాడవయ్య ఇదివో నీ దేవుఁడు || విర ||

కాయమెల్లాఁ బులకించీ కాఁగిలిరతికిఁ బొంచీ
తీయని కెమ్మోవిమీఁద తేనెలు మించీ
పాయపు శ్రీవేంకటేశ పానుపుపై నిన్నుఁగూడె
యీయెడ నలమేల్మంగ ఇదివో నీ దేవుఁడు ||విర||202||

## పాడి

వెలయు నానతీవయ్యా వినే నేను
  తలపోఁతలో నీకుఁ దమకము గలదో || పల్లవి ||

పంచనున్న నీ సతితో పంతాలు నే నాడఁగాను
  మంచి మాటలెల్లా నీవు మాతో నాడేవు
  పొంచి ఎవ్వరైనా నిన్నుఁ బొగడఁగవలశో
  వించి నీదయ నాపై నిజాలకుఁ గలదో || వెల ||

చాయలకు నీ ఇంతితో చలము సాదించఁగాను
  సేయరాని వినయాలు సేసేవు నీవు
  నాయగాఁడవుగనక నమ్మించవలయుశో
  యీయెడ నిట్టె నీవు నన్నేలుకొనేవిధమో || వెల ||

అలమేల్మంగ నీచెలి ఆపెకు నే మొక్కఁగాను
  సులభుఁడవై నాకు సొమ్ములిచ్చేవు
  యెలమి శ్రీవేంకటేశ యెవ్వరైనాఁ జెప్పిరో
  వలెనని నీవు నాకు వలచిన తెరఁగో || వెల || 203 ||

## బౌళి

ఎంత బాసలు సేసినా యెవ్వరును నమ్మరు
  చెంత నీ మచ్చము ఆపెచేత నుంది గనక || పల్లవి ||

నీ వేలి వుంగరము నెలఁత దాఁ బెట్టుకొని
  వావి చెప్పి నీకుఁదాను వదినంటాను
  కావిరి నీవిఁక లోనుగాక వుండినాను నీ-
  దేవులనే అడుదురు తెలిప లిందరును || ఎంత ||

గద్దించి నీ మెడనున్న కంఠమాల దాఁ బెట్టుక
సుద్దులెల్లాఁ జెప్పని చుట్టమనంటా
బద్దుగాదనుచు నొడఁబరచి యేమిచెప్పినా
అద్దుక నీ పొందుదని ఆడుదురు సతులు || ఎంత ||

కడియాలు నీ చేతివి గక్కనఁ దాఁ బెట్టుకొని
అడియాలాలు చెప్పని అల నంటాను
అదరి శ్రీవేంకటేశ అలమేలుమంగను
జడియఁ గూడితి వాకెనవతెందు[1] రింతులు ||ఎంత||204||

[2]రేకు 1635. బౌళి

పదరంగవచ్చుఁగాని పంతమియ్యరాదు మరి
పొదిగి ఇంతేసి నీకు బుద్ధి చెప్పవలెనా || పల్లవి ||

అలుగఁ బోతే నీకే ఆదరించవలసీని
బలిమి చెల్లదు నీకుఁ బక్కన మాతో
తలవంచుకొంటేను తమకించ వలసీని
తెలిసినదే తేటతెల్లమిగావలెనా || పద ||

వుల్లసాన నవ్వఁబోతే వొడఁ బరచవలసీ
కల్లగా దివ్వటియట్టు గాదు మీఁదను
వొల్లక బిగియఁబోతే నువ్వరనవలసీని
యెల్లవారుఁ జూడఁగాను ఇంతేసి వలెనా || పద ||

---

[1] ఆకెనవతి + అందురు.

[2] ఈ రేకులో కుడి ప్రక్కన క్రింది భాగములో రెండు వైపుల రేకులు బిగించి అతికినారు. అక్షరములకు భంగములేదు. మొదటనే రేకు పగిలియుండుటచే చేసినపని కావచ్చునిది. దీనివలన ఈ రేకులో ఐదు పాటలే చెక్కినారు.

కాలుఁ దొక్కఁబోతేను కదు మొక్కవలసీని
చాలుఁ జాలు నీఁకనేల చలపాదాలు[1]
యేల యింక శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
మేలు మేలు సారెసారె మేలమాడవలెనా || పద || 205 ||

## ముఖారి

నీమన సింకా రాదు నే నేమి సేతురా
యేమాట కేమాట ఇంతేల దూరులు || పల్లవి ||

అంటినా నిన్నేమైన నందరిలోఁ బచ్చిసేసి
కంటకములాడితినా కపటాలెత్తి
వెంట వెంట నీ గుట్టు వెల్లవిరిసేసితినా
ఇంటిలోన నున్నదాన నీఁక నేలదూరులు || నీమ ||

రమ్మంటినా నిన్ను రమణివద్ద నుండఁగ
సొమ్మల మోవికెంపులు చూడఁబోతినా
నెమ్మది నీ యానలలో నేఁదప్పవట్టితినా
వుమ్మడినే వున్నదాన నూరకేల దూరును || నీమ ||

యీడ నన్నుఁ గూడి చిత్త మేడ నున్నదంటినా
వాడుమోము తెల్లఁ బారవద్దంటినా
యీడులేక శ్రీవేంకటేశ కూడితివి నన్ను
వేడుకతో నున్నదాన వేయేల దూరుదు || నీమ || 206 ||

[1] 'చలము, చలపాది, చలపాదితనము,' సహజములే. 'చలపాదము' అపురూపమే, అట్లైనగాని 'చలపాదాలు' రూపము ఏర్పడదు.

## దేసాళం

పూజ లందరుఁ జేసేదే పుష్పయాగము
అజి నర్జునుఁడు చేసినది పుష్పయాగము || పల్లవి ||

మొదల శ్రీసతిచేతి మోహనకమలమే
పాదల నీకెపుడును పుష్పయాగము
గుదిగొన మిమ్మిద్దరిఁ గూడించే మరువిరులు
పొదిగి పూజించిన పుష్పయాగము || పూజ ||

మాలాకారుఁ డిచ్చిన[1] మధురలో పూదండ
పోలింప నీకు నదె పుష్పయాగము
కేలితో నారదుఁ డొసగిన పుష్పయాగము
భూలోకమున నీకుఁ బుష్పయాగము || పూజ ||

తొరలి అలమేల్మంగతురుమువిరులే నీకు
పొరసి నీవురముపై పుష్పయాగము
సిరులతో మునులెల్ల శ్రీవేంకటాద్రీశ నీకు
పొరిఁ బొరిఁ జేసేరు పుష్పయాగము || పూజ || 207 ||

## రామక్రియ

ఎంత ఒట్టు సేసుకొనే విందుకుఁ గాను
వింతలుగా నన్ను నెట్టు వేఁదుకొనేవు || పల్లవి ||

అట్టె యాడనుండితేనే అలిగిన జాడలా
బెట్టిమాఁట లాడితేనే పెనుఁగోపమా

[1] 'ఇచ్చిన' అను ధాతుజ విశేషణము 'పూదండ'తో సమసించి 'ఇచ్చిన పూదండ' గావలసియుండెను. సమాసమధ్యములో 'మధురలో' అనువ్యస్తపదము చొరబడినది. ఇట్టి అసాధు సమాసములు ఈ వాఙ్మయములో కొల్లలు.

పొట్టఁ బొరుగున నుంటే పొంచులు వినుటలా
యిట్టు నట్టు వట్టి దూరు లేల దూరేవు || ఎంత ||

తప్పక చూచితేనే తగఁ జొప్పు వెదకుటా
నెప్పున నెందుంటివంటే నేరమెంచుటా
యిప్పుడు లోన నుండితే యెలయించిన చందమా
వుప్పతించి మమ్ము నేల వోవలు సేసేవు || ఎంత ||

సెలవుల నవ్వితేను చేరి యెగసక్కెమా
కలువల వేసితేను కాఁతాళమా
అలమేలుమంగ నేను అట్టె శ్రీవేంకటేశ
యెలమి నన్నుఁ గూడితి వేల సాదించేవు ||ఎంత||208||

## నాదరామక్రియ

తప్పితారినపనికి తగ నేమిసేయవచ్చు
చిప్పిల నేఁ గంటినంటా సిగ్గువడనేఁటికి || పల్లవి ||

చెక్కుపై చెమట చెలి చేతఁ దీసివేసితేను
మిక్కుటమై నంగడి నీమేన నిండెను
అక్కజపు గందవొడి యందుపైఁజల్లుకోవయ్య
చొక్కపు సతులు నీపై చొప్పలెత్తకుండాను || తప్పి ||

కొప్పు వేఁకము గాఁగాను కొమ్మ విదలించితేను
వుప్పతిల్లి విరులు నీవొళ్లిపై రాలె
దుప్పటి మఱఁగుగాను తోడనే కప్పుకోవయ్య
ముప్పిరిఁ గాంతలు నిన్నుఁ దప్పలెంచకుండాను || తప్పి ||

నిన్ను నలమేలుమంగ నెమ్మదిఁ గాఁగిలించితే
చన్నుల మీఁది కుంకుమ చాలా నంటెను
యిన్నిటా శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పన్నీరు చల్లుకోవయ్యా కన్నె లాడకుండాను ||తప్పి||209||

రేకు 1636 శ్రీరాగం

ఉమ్మడినే వుండినట్టే వుండనియ్యరా
కమ్మి యేమైనఁ బైఁడికత వో నా పొందులు || పల్లవి ||

మట్టులేక నీవు నన్ను మాటలాడించకురా
గట్టి వజ్రపుదంతాలగని మానోరు
చెట్టముట్టి నీవు నన్నుఁ జెమరింపించకురా
వెట్టయయిన వలపులవెల్లి వో నామేను || ఉమ్మ ||

మాటలాడి నీవు నన్ను మరిగిరపించకురా
కాటుక కన్నుల గీము గందు నామోము
ఆఁటదానఁ బెనఁగి నన్నలయింపించకురా
గాఁటపుటెల్లని గోళ్లగాతలు నాచేతులు || ఉమ్మ ||

బచ్చెనరతుల నన్ను భ్రమయింపించకురా
మచ్చుల పాయములోని మంపు నామతి
ఇచ్చట శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
నిచ్చ కల్యాణమునకు నెలవు నా పంతము ||ఉమ్మ||210||

పాడి

ఇంక నేలే కొసరు ఇదె అనురునురు
సంకెదేరె. తనకిన్నీ సరివచ్చె ననవే || పలవి ||

పనిలేనిపిలుపు బయలీఁతవలపు
వొనర నెంతసేసినా వొల్లనొల్లనే
మనసుముట్టనిమాఁట మాయామృగము వేఁట
తనకె ఇన్నియుఁ జెల్లు తతి వచ్చె ననవే || ఇంక ||

వచ్చి వెచ్చి నవ్వులు పసలేని రవ్వలు
తచ్చి వేసీ నా మీఁదఁ దనిసితినే
నిచ్చ నిచ్చ ఆసలు నెరులపై సేసలు
అచ్చుపడెఁ దన కిన్నీ నడ్డము లేదనవే || ఇంక ||

చెల్లుబడియానలు చెమటలసోనలు
కల్లగాదు యిందుకు నేఁ గరఁగితినే
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
మొల్లమాయ రతులివి మొక్కితి నే ననవే ||ఇంక||211||

## గౌళ

అందువల్లఁ గానవచ్చీ నన్నివేడుకలు నీకు
నందునుడిమోహమెల్లా చవిగొనరాదా || పల్లవి ||

సవతుల నిద్దరిని సరిఁ బెనఁగు మనేవు
యివల నీ కందువంక నేమివచ్చెను
జవళి నొకరొకరిసత్వ చూడవలసితే
తివిరి నీ కాఁగిట సోదించి చూడరాదా || అందు ||

పొలఁతుల మిద్దరిని పూఁచి పందేలాడించేవు
యెలమి నీ కందువంక నేమి వచ్చెను
నెలకొని వారివారి నేర్పు(ర్పు?) చూడవలసితే
కలదెల్లా యేకతానఁ గనుఁగొనరాదా || అందు ||

ఇంతుల నిద్దరి నొరయించేవు శ్రీవేంకటేశ
ఇంతసేయఁగా నీకు నేమి వచ్చెను
పంతాన నన్నేలితివి బత్తి వారిపయిఁ గలితే
అంతలోనే నీవు పెండ్లాడి చూడరాదా || అందు || 212 ||

## సామంతం

ఏమీ ననఁ బనలేదు యియ్యకొనుటే మేలు
కామించినవాఁడవు కలయఁగ నేరవా || పల్లవి ||

గట్టిగా నీవు సేసిన కల్లలైనా నిజముగా
నెట్టన నిలువఁబెట్టనేరవా నీవు
దిట్టవై వాడలోనతిఁ దెచ్చుకొన్నవాఁడవు
చుట్టరికాలు కలయఁ జూపి చెప్పనేరవా || ఏమీ ||

వచ్చి వచ్చి యాపె నెరవాదిఁ జేసినవాఁడవు
నిచ్చలునుఁ గొనియాడ నేరవా నీవు
కచ్చు పెట్టి వల పాడిఁగట్టు కొన్నవాఁడవు
దిచ్చరివై మమ్ము నమ(మ్మ?) తించఁజేయనేరవా || ఏమీ ||

పుక్కట నన్నిటా నీవు బోగించినవాఁడవు
నెక్కొని ప్రియము చెప్పనేరవా నీవు
యిక్కువ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
గక్కన నామోము చూచి కడు నవ్వనేరవా ||ఏమీ||213||

## హిందోళం

తానేల దూరీని దంటదాన నంటాను
మోనాన నుండితేను ముమ్మాటికి మొక్కనా || పల్లవి

చలములు సారె సారె సాదించ వద్దు గాక
తలఁపుకొలఁది నుంటే తగదనేనా
బలిమిఁబెనఁగితేను పంతమాడుకొందుఁ గాక
పిలిచి లాచించితేను ప్రియములు చెప్పనా || తానే ||

ఆయములు ముట్టి ముట్టి అలఇంచవద్దు గాక
చాయసేసుక వుండేను సమ్మతించనా
రాయడిఁ జన్ను లంటితే రవ్వగా జంకింతుఁగాక
నాయములు నడపితే వమవుతో నవ్వనా || తానే ||

బానలెల్లాఁ జేసి చేసి భ్రమయించవద్దు గాక
ఆనయిచ్చి కూడితేను అట్టె మెచ్చనా
నేసవెట్టి కూడినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
వేసరక వుండితేను వేడుక చెల్లించనా || తానే || 214 ||

## ఆహిరి

ఏరాలిఁ బొగడఁగా యేమీ ననము గాక
మీ రింతేసిబాణలు మీకే తెలుసునే || పల్లవి ||

జక్కవలు చన్నులట చందురుఁడు మోమట
వక్కణించి సింగారము వర్ణించేదేమే
ముక్కు సంపంగివువ్వట మొగిఁ గొప్ప తేఁటులట
మిక్కిలితగవరులు మీకే తెలుసులే || ఏరా ||

కరికుంభజగనట ఘన సింహమధ్యయట
ఖరవుగా నెరి గిది యెట్టు వోల్చరే
సరిగురు లురులట చకోరాలు కన్నులట
మెరమెచ్చుమాటలు మీకే తెలుసులే || ఏరా ||

చేతులు తామరలట చెమట లేమంచట
యేతులకు బురుణించ నింత యేఁటికే
యీతల శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
మీతరుణి బాగులెల్లా మీకే తెలుసుతే || ఏరా || 215 ||

రేకు **1637** శంకరాభరణం

ఎంతనేర్చెనే యీ కలికి
ఇంతులకేఁటికే ఇంతేసి పగటు || పల్లవి ||

చలములు నెరపుచు సవతుల దూరుచు
సలిగెలఁ బొరలీ జవరాలు
చెలువుని సొలయుచు చేతులు చాఁపుచు
కెలపుల నగవులఁ గెరలీని || ఎంత ||

సాటికిఁ బెనఁగుచు సణఁగులు రాల్చుచు
నీటున మురిసీ నెరజాణ
మాటల గునియుచు మదమున మొరయుచు
జూటుఁదనంబునఁజూచీని || ఎంత ||

మంతనమాడుచు మలయుచు నవ్వుచు
పంతములాడీ పసలాఁడి
యింతలో శ్రీవేంకటేశుఁడు నన్నేలె
పొంతనుండి ననుఁ బొగడీని || ఎంత || 216 ||

నాదరామక్రియ

చిత్తగించవయ్య నీకు సిగ్గులు వడఁగనేల
కొత్తగాను తనలోనికోరి కెంతగలదో || పల్లవి ||

వాలుకచూపులు నీపై వంచి మాటలాడీఁ జెలి
తాలిమిలేని మనసుతమి యెట్టిదో
వేళగాచి విన్నవించీ వేసర దెంతైనాను
వాలాయించి నీయెడకు వల పెటువంటిదో || చిత్త ||

చన్ను లొరయఁగను నీ సంగడిఁ గూచుండీఁ దాను
సన్నల నీతోడిరతిచవి యెట్టిదో
తన్నుఁదానె నవ్వునవ్వీ తనియఁదెంతైనాను
యిన్నిటా నీమీఁదటియేఁకట యేలాగుదో || చిత్త ||

గక్కనఁ బాదాలొత్తుతా కాఁగిలించీ నీ దేవుఁడు
వెక్కసమైన తన వేడు కెట్టిదో
యిక్కువ శ్రీవేంకటేశ యీకెను మన్నించితివి
మొక్కుతానే నెంచి మెచ్చీ ముదము బొందినదో ||చిత్త||217||

## వరాళి

అమరఁ జెప్పే వప్పటి అందరితోడా నీవు
తిమురుచు నీ సుద్దులు తేట పడకున్నవా || పల్లవి ||

అందెలరవళితోడ ఆపె వెంటరాఁగాను
విందువలె నా చప్పుడు వినకున్నారా
కందువ సొమ్ముల మాణికములు వెలుఁగఁగాను
అందులో చీఁకటితప్పె అణఁచఁగ వచ్చునా || అమ ||

కోవిలఁకూతలతోడ కోరి యాపె మాటాడఁగా
ఆవల పొరుగువారు ఆలకించరా
వావిలి పుష్పకోమలి వాసనలు నిండుకోఁగా
మూవంకల నీచేఁతలు మూసి దాఁచవశమా || అమ ||

గుట్టున నీవద్దనె కొలువై ఆపె వుండఁగా
చుట్టరిక మందరును చూడకున్నారా
ఇట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
ఒట్టు తొల్లిటాపె పొందాఉడి కెక్కఁ దగదా ||అమ||218||

## సాళంగనాట

ఎవ్వరికిఁ జెప్పేవే యీ సుద్దులు
నవ్వు వచ్చీ నిన్నుఁ జూచి నాకు నాకే యిపుడు || పల్లవి ||

చనవరిదానవు సముకానఁ బలికి నీ-
మనవులు చెప్పేవు మాటిమాటికి
వనిగల దానవు పాదాలు వట్టుకొని
పెనఁగే వాతనితోను పెద్దరికమునను || ఎవ్వ ||

నందునుడిదానవు చప్పన వుప్పన చేసి
విందులు చెప్పవచ్చేవు విభునికిని
పొందుగలదానవు పూసుకవాసుకవచ్చి[1]
గందము పూసేవు మేన కడు బత్తితోను || ఎవ్వ ||

చుట్టరికపు దానవు సొలసి కాఁగిలించేవు
యిట్టె నీవు శ్రీవేంకటేశ్వరుని
వట్టూడిగపుదానవు[2] వడి నన్ను నీతఁడేలె
మట్టుమీరి మెచ్చేవు మాకు నితవరివి || ఎవ్వ || 219 ||

---

[1] పూసుక + పాసుక.
[2] వట్టి + ఊడిగపుదానవు

## హిందోళవసంతం

జఱయుచు మీ వలపు సరిబేసులాయ నేఁడు
  గుఱిగాఁ బెఁ (బెం?) జెమటలు [illegible] మేనులను ||పల్లవి||

కొంకక నీ వూఁదినట్టి కొనగోరుతాఁకులకు
  జంకెన చూపులు నీపైఁ జల్లీఁ జెలి
  కొంకపు పయ్యదకొంగు పొరలఁదీసినందుకు
  మంకుల వొట్టుపెట్టి మారుకొనీని || జఱ ||

నంగడిఁ జన్నులమీఁద చాఁచిన నీపాదాలకు
  ముంగిటి సిగ్గులు పై పై ముంచీఁ జెలి
  ముంగురులు వట్టి తీసి మోవి చవిగొన్నందుకు
  కెంగేలు గిలించి గిలిగించీని || జఱ ||

శ్రీ వేంకటేశ కాఁగిట చిమ్మి రేఁగిన యందుకు
  నీ వదనాన బాగాలు నించీఁ జెలి
  చేవమీర నింతలోనె చేరినన్ను నేలితివి
  భావించి మెచ్చి మెచ్చి పంతమాడీని || జఱ || 220 ||

## మేఁచబౌళి

వట్టి విచారములేల వాడలు దిరుగనేల
  చుట్టమవయ్యేవుండి సూదువట్టరాదా || పల్లవి ||

యింతితోడ నవ్వినవాఁడ వింటికి రారాదా
  చెంతలనే యీాడ రచ్చ సేయుఁగ నేల
  పంతగాఁడ పైతేఁగన పడఁతులనెల్లాఁ గూర్చి
  చింతదీర తగవులు చెప్పించుకోరాదా || వట్టి ||

మోము చూచినవాఁడవు మొగిఁ గూచుండఁగరాదా
సాము లేమిసేసేవు సటలకును
నేమముగలితేఁగన నెలఁతలఁ గూడపెట్టి
కామ శాస్త్రములు చూచి గతి గనరాదా ॥ వట్టి ॥

మోవి యిచ్చినవాఁడవు ముచ్చటాడరాదా
శ్రీవేంకటేశ యేల సిగ్గు వడేవు
కావరమెక్కితేఁగన కాంతలను మందడిగి
భావములో కసటెల్లా బాపుకొనరాదా ॥ వట్టి ॥ 221 ॥

## ేకు 1638 బౌళి

చెప్పకుండితేఁ బోదిఁక చెలికత్తెలము నేము
కప్పి అన్నిటి కాపెనే కాఁగిలించరాదా ॥ పల్లవి ॥

తవిలి ఇంతులతోడ తారుకాణకు వచ్చేవు
వువిద నీ ఇంటిలోన నున్నది లేదా
వివరించి నిజములే వేమారు నెరపేవు
అవల నీ మేన నున్న దాపె సొమ్ముగాదా ॥ చెప్ప ॥

వోపుదునంటా నీవు వొట్లు వెట్టుకొనేవు
మాపుదాఁకా నాపెతోడ మాటలాడవా
పైపై నిట్టె మాతో బాసలు సేసేవు గాక
యేపొద్దు నాపె చింత నీయెదలోనఁగాదా ॥ చెప్ప ॥

పలుమారు యీ నేమమే పచారించవచ్చేవు
యెలమి యీమోవి ఆపె యెంగిలి గాదా
నెలపై శ్రీవేంకటేశ నేఁ డీకెఁగూడ్తి
అలరి యీపొందు లాపె అనుమతే కాఁ 222 ॥

## లలిత

మేలయ్యా నీభాగ్యము మెచ్చితి నేను
పొలించి మిమ్ముఁ జూచి పొగడేరు సతులు || పల్లవి ||

కొండలు(ల?) వంటి చన్నులు కొమ్మకుఁ గలిగితేను
నిండుఁ గళలు దేరీ నీ నెమ్మోమునను
దండి వేఁక మాపెకును తగు సంతోసము నీకు
వొండొరుల కెటువలె నొనగూర్చె దైవము || మేల ||

తీపులతో నాకె మోవి తేనేలు గారఁగాను
వోపికెతో మిక్కిలి నోరూరీ నూకు
రూపమెల్లా నాపెకు రుచులెల్లా నీకును
యేపున నిద్దరికిని యెట్టు గూర్చె దైవము || మేల ||

పెంపుడరఁటులవంటి పెందొడ లాపెకుఁగల్తే
ముంపునఁ బులక లెట్టు మొలచె నీమై
సంవద లాపెకు నాకు సమరతి నీకును
ఇంపుతో శ్రీవేంకటేశ యెట్టు గూర్చె దైవము||మేల||223||

## పాడి

నాకేల వెరచేవు నడుమ నీవు
నీ కిచ్చకురాల నింతే నిన్ను మీరేనా || పల్లవి ||

సారె జారేపచ్చడము చక్కఁగప్పవచ్చితిఁగా-
కీరీతి నీమేనఁ జొప్పలెత్తఁగవచ్చితినా
గోర దిద్దఁగ నామము కూరిమిఁ జూచితిఁ గాక
పోరి నొసలి లత్తుకబొట్లు చూచితినా || నాకే ||

ఆకుమడిచి నీమోవి కంది నే నిచ్చితిఁగాక
రేకగా మోవికెంపులు రేఁగఁగ నిచ్చితినా
పైకొని నీ చెమటలు పయ్యెద నొత్తితిఁగాక
కాకునేసి నిన్ను చన్నుఁ గవల నొత్తితినా || నాకే ||

కందువ నీచెవిలో నేకతము లాడితిఁగాక
నిందలు గడించి నేఁడు నీతో నాడితినా
యిందునె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
అందాలు సేసితిఁగాక యాఁటడి సేసితినా|| నాకే || 224 ||

రామక్రియ

తొల్లిటి నాకంటెను దొడ్డదా తాను
పల్లదాలు నేర్చితేనే బలిమి గలిగీనా || పల్లవి ||

రమణునియెదుటనే రాజసముచూపీని
తిమురుచు నిందుఁగాని తేటపడదా
తమకించి మురిసీని తా నిన్నాళ్లదేకాదా
కొమరె వయసైతే నెక్కుడుగర్వ మెక్కీనా || తొల్లి ||

మగఁడు లినఁగానే మాట లెన్ని యాడీనే
పగ టిందుఁగాని యేరుపడదాయనా
నగీ నూరకయైనా నాతులలోనెల్లాను
మిగులా వలచితేనే మేర మీరవలెనా || తొల్లి ||

శ్రీవేంకటేశువద్దనే చేఁత లెన్ని సేసీనే
కావర మిందునఁగాని కానిపించదా
యీవేళఁ దన్నుఁగూడి యీతఁడే నన్ను నేలె
వావి చెప్పి దీనివల్ల వన్నె వచ్చెనా || తొల్లి || 225 ||

## శంకరాభరణం

నే మేమనేము నిన్ను నీకేల సిగ్గువడ
దీమసాన మీరిద్దరుఁ దెలుపుకోరే ‖ పల్లవి ‖

చెలపల చెమటలు చెక్కుల పులకలు
వలపుకొలఁదిఁగాక వచ్చినటే
మలకలమాట లాడి మాతోనేల మొరఁగేవు
అలవాఁడే నీ విభుఁడు ఆడుకోఁగదే ‖ నేమే ‖

కనుఁగొన చూపులును కడలేనియాసలును
ననుపు కొలఁదిఁగాక నాటేనటే
మనసుమర్మాలు చెప్పి మమ్మేల నమ్మించేవు
పనివడి మగనికే బాస తీయఁగదవే ‖ నేమే ‖

నయగారి సేఁతలును నవ్వుల సొలపులును
ప్రియము కొలఁదిఁగాక పెరిగీనటే
నియతాన నీవు గూడి నేఁడు నన్నేలించితివి
క్రియ శ్రీవేంకటేశుకే కెరలించవే ‖ నేమే ‖ 226 ‖

## నాదరామక్రియ

తనుఁ దడవితేనే తడవఁగ వలెఁ గాక
చనవిచ్చి మిగులాను సాదించీ తాను ‖ పల్లవి ‖

అందరు సతులు మాటలాడుకోఁగా నీతఁడు
మందలించి సందుసుడిమా టాడీఁదాను
పొందుగాఁ గొమ్మలు వంచి పువ్వులు గోయఁగాను
మందెమేళమునను వేమరు నవ్వీఁదాను ‖ తనుఁ ‖

చెలు లొక్కరొకరే సింగారించు కొనఁగాను
అలరుచువచ్చి చీర లందిచ్చీఁదాను
పొలయుచు నేఁడు వనభోజనాలు సేయఁగాను
అలమి పొత్తుల నుండి ఆరగించీఁదాను ॥ తను ॥

మేరమీరి చెలులెల్లా మేడమీఁద నుండఁగాను
కోరి వరుసవెట్టుక కూడీఁదాను
యీరీతి శ్రీవేంకటేశుఁ డీమెయింటికి రాఁగా
పేరుకొని సేసలెల్లాఁ బెట్టీఁదాను ॥ తను ॥ 227 ॥

## రేకు 1629 లలిత

నే మంత నేరుతుమా నేరుపులు తనతోను
గామిడి సతులయందే కనుఁగొను మనవే ॥ పల్లవి ॥

బలిమిఁ జేసేపనులు పంతగత్తెలకుఁగాక
కలుపుకోలు గలుగుకాంతలకేలే
చలము సాదించేది మచ్చరపు వారికిఁగాక
సులభులై యుండిన చుట్టాలకేలే ॥ నేమం ॥

రా రాఁపుఁదనములు రవ్వలవారికిఁగాక
సారె నోజగలిగిన సతులకేలే
బీరములు నెరపేది బేసబెల్లులకుఁగాక
మేరతోఁ బెండ్లాడినమేనవారికేలే ॥ నేమం ॥

అలయించి కూడేది గయ్యాళిమేంట్లకుఁగాక
వలచిన గుట్టుతోడి వనితకేలే
యెలమి శ్రీవేంకటేశుఁ డీతఁడిట్టె నన్ను నేలె
సొలపులు మావంటి సుదతులకేలే ॥ నేమం ॥ 228 ॥

## మంగళకౌసిక

ఏమయ్య చూచినవారు ఇందరును నగరా
నీ మనసు గరఁగితే నిండుకుండ రాదా || పల్లవి ||

చెప్పరాని విన్నపాలు నేసుకొంటి నల్లనాఁడె
అప్పటి నేమిటికాడే వా మాటలు
చిప్పిలుఁజెమటలతో చేతులెత్తి మొక్కితిని
ఇప్పుడేల చేయిచాఁచే వింకా నీవు || ఏమ ||

ఇవల నీసేవసేసి ఇన్నిటా మండాడుకొంటి
అవియేల తలఁచేవు ఆసుద్దులు
చివురుఁ జేతులను నీ చెక్కు నొక్కి వేడుకొంటి
జవళి నేమిటికి నాసలఁబెట్టే విప్పుడు || ఏమ ||

ముట్టకుమనుచు నీతమ్ములము నేఁ జవిగొంటి
అట్టె విడువరాదా ఆకతలు
నెట్టన శ్రీవేంకటేశ నేఁడు నన్నుఁ గూడితివి
చుట్టమ నయితి నెంత చొక్కులఁ బెట్టేవు ||ఏమ||229||

## దేసాళ

నీవెంతసేసినా నీకె నిన్ను మీరీనా
కావరించేవు మచ్చము గనేనంటా నీకెను || పల్లవి ||

చలపట్టి నీవేల సాదించవచ్చేవు
నలినాక్షి గోర నూఁదె నవ్వుతా నిన్ను
మలసి యంతేసి దిమ్మరితిట్లు దిట్టేవు
చలిగొవఁ బన్నీరు చల్లెనంటా నీపెను || నీవెం ||

పంతములాడఁగ నేల పలుమారు నాకెతోను
వింతవింతమాటలాడే వేడుకకును
పొంతనుండి వూరకైనా బొమ్మల జంకించేవు
దొంతిఁబెట్టి పాదములఁ దొక్కెనంటా నీపెను || నీపెం ||

వాసులేల నెరపేవు వడి నలమేల్మంగతో
రేసువోఁ జుట్టరికమే వూనె నీకును
ఆసపెట్టి శ్రీవేంకటాధిప కూడితి విట్టె
సేసకొప్పు వంచి బత్తి సేసెనంటా నీపెను|| నీపెం || 230 ||

పాడి

పలుమారు మాకె(కు?) మాకె బాఁతిపడే మింతేకాక
తలఁకేవే కోరికలు దక్కివున్న విపుడు || పల్లవి ||

శిరసుపై సేసెపెట్టి చేత విడెమిచ్చి చెలిఁ
దెరవేసి రతికిని దిద్దుకొంటివి
తొరలించి యెవ్వరు పొందులు నీతో జేయకున్నా
సిరులతో మెఱచేవా చేతఁజిక్కి వేడక || పలు ||

పక్కఁబెట్టు కాపెతోడ పచ్చిమాటలెల్లా నాడి
చెక్కునొక్కి కైవశము సేసుకొంటివి
తక్కించి యెవ్వతె నీకుఁ దరితీపు సేసినాను
కక్కదలేవా నీకు కడుఁ దనివొందెను || పలు ||

మంచముపై నిడుకొని మనసు రంజిల్లఁ జేసి
పెంచి యలమేలుమంగఁ బెండ్లాడితివి
యెంచి నన్నుఁ గూడితివి యిప్పడే శ్రీవేంకటేశ
పొంచేవా నీవలపులు కొల్లలాయ నెదుట || పలు || 231 ||

## నాగవరాళి

ఊరకుండితేఁ గనక వుడివోవు పాయము
దూరి బుద్ధి చెప్పి పతిఁ దోడితేఁగదరే || పల్లవి ||
బడి వాయకుండితేనే భావములు గరఁగును
వొడలు సోఁకితేఁ దమి వుట్టిపడును
విడువక చూచితేనే వేడుకలు పెచ్చురేఁగు
చిడుముడి మాఁటాడితే సిగ్గు గొంతి దేరును || ఊర ||
సెలవుల నవ్వితేనే చేఁ(చెం?)గలించు మోహము
పిలిచి పేరుకొంటేనే ప్రియము వుట్టు
వలపులు చల్లితేనే వాడికలు దైవారు
చెలిమి సారెఁజేసితే చేతికి లోనౌను || ఊర ||
సరసము లాడఁగానే చవులు వెగ్గళమవును
గరిమలఁ బెనఁగితే కళలు నిండు
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
తిరమై వుండితే మోవితేనెకు[1]నోరూరును ||ఊర||232||

## రామక్రియ

ఇటుమీఁద నీవు మరి యేమిసేసేవు
చిటుకన నేమే అక్కచెల్లెండ్ల మైతిమి || పల్లవి ||
తతిగాని చెప్పేవు తగవులు నీకు నీవే
యితవరివలెనే యీకెకు నాకు
మతకారివాఁడవు నీ మర్మము నేనెఱుఁగుదు
సతుల మిద్దరమును సంతమైతి మిపుడు || ఇటు ||

[1] 'మోవి తేనెకు' వ్రాయసగాడి తప్పు.

నెట్టుకొని సాకిరై నిలిచేవు నీవే వచ్చి
చుట్టము వలెనే వుండి సొరిది మాకు
గట్టువాయువాఁడవు నీ కతలు నే నెఱుఁగుదు
గుట్టున బాసలు సేసుకొంటిమి నే నివుడు || ఇట ||

యీవేళ పొందులు విడే లిచ్చేవు చేత నీవే
భావ మరఁటి[1]వలెనే పైపై నీవు
శ్రీవేంకటేశ్వరుని చిత్తము నేనెఱుఁగుదును
యీవల నవతులమై యీడేరితిమివుడు || ఇట || 233 ||

రేకు 1640 సామంతం

ఎంత తమకపడేవు యింతలో నీవు
వింతగాఁ జెనకి తెరవేయఁగవలెనా || పల్లవి ||

బలిమేల సేసేవు వయ్యేదేల ముట్టేవు
అలరి మాట గరితే వానతిరాదా
పిలువఁగా వస్తి నింతే పెనఁగినదానఁ గాను
కలయు లోనికిఁ దీసి గడెపెట్టవలెనా || ఎంత ||

నన్నులేల సేసేవు సారెనేల నవ్వించేవు
చెన్నుగా వలసినట్టు సేయఁగరాదా
మన్నించఁగా నవ్వే నింతే ఘట్టుమీరేదానఁ గాను
మిన్నక నావొడి వట్టి మేడ యెక్కవలెనా || ఎంత ||

గోరనేల దూరేవు కొప్పేల దువ్వేవు
కూరిమిఁ బెండ్లాడితివి కూడఁగరాదా

[1] అరఁటివలె='పిల్లలు పెట్టినట్లు' అని యర్థము కాఁబోలు

యీరీతి శ్రీవేంకటేశ యెడసేటిదానఁ గాను
చేరి పచ్చడము గప్పి చెక్కు నొక్కవలెనా॥ ఎంత ॥ 234 ॥

## అహిరినాట

ఇందాఁకా నోరిచితి ఇంత చాలదా
కందువలెల్లాఁ దారుకాణించవలెనా ॥ పల్లవి ॥

కక్కస మేమిటికే కడు నవ్వనోపనంటే
వొక్కరీతి చాయసేసు కుండఁగవద్దా
తక్కరీఁడు తనచేఁత తనమనసే యెరుఁగు
వెక్కసమై నేనే యింత విచ్చి చెప్పవలెనా ॥ ఇందాఁ ॥

వేగిర మేమిటికే వెనకఁ బలిచేనంటే
చేగదేరకుండా గుట్టుసేయఁగవద్దా
ఆగడీఁడు తనసుద్దులవి దలఁచుకొమ్మను
తీగెసాగ నందరిలో తెలుపఁగ వలెనా ॥ ఇందాఁ ॥

చలము లేమిటికే విచారించుకొనేనంటే
కొలఁదితో నందు కియ్యకొనవద్దా
అలరి శ్రీవేంకటేశుఁ డంతలోఁ దా నన్నుఁ గూడె
మెలఁగి యింతలోఁ దన్ను మెచ్చు మెచ్చవలెనా॥ఇందాఁ॥235॥

## శ్రీరాగం

చెలులాల విభునికిఁ జెప్పరే బుద్ధి
చలపట్టి తను నింత సాదించవచ్చునా ॥ పల్లవి ॥

మాటలు పొంకములాయ మనసు లొక్కటులాయ
గాఁటపునేర్పు తనందే కానవచ్చెను

వోటలేక తనతో నే నూఁకొనేటిదానవా
యేఁటికిఁ జెప్పే సుద్దు లెంతవడైనాము || చెలు ||

నేనలు కొప్పున నిండె సెలవుల నవ్వు నిండె
అసలువెట్టఁగ తానే అన్నిటా జాణ
వేసరక చేఁతలు భావించి చూచేదానవా
వోసరించి నను నెంత వొరసీఁ దా నిపుడ || చెలు ||

కోరికలు దైవారె కూటములఁ దెల్లవారె
పారెకు వలపు తానే చవిసేసెను
యీరీతి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
వేలడి నింకా నెంత వెనఁగీ రతులకు || చెలు || 236 ||

## కురంజి

ఎట్టు మఱవఁగవచ్చు నిటువంటి నీసుద్దులు
చుట్టమవైతివిగా సులభాన నిపుడు || పల్లవి ||

నిగిడి నిన్ను జంకించి నే నాడినమాటలకు
నగితివిగా[1] నీవు నాతోను
జిగి నీటుజాలమీఁద చేతులు చాఁచినందుకు
మొగము చూచితిగా మోదముతో నేఁడు || ఎట్టు ||

ఇచ్చకముతో నీకుఁ జేయెత్తి మొక్కినయందుకు
మెచ్చితివిగా నీవు మీఁదమీఁద
పచ్చిగా పానువుమీఁద పాదములొత్తినందుకు
కుచ్చితిఫిగా కాఁగిట గురుతుగా నన్నును || ఎట్టు ||

[1] ఈ పాదము వ్రాత ప్రతిలో లేదు (?) — ఈ పాదము వాల చిన్నగా తోచుచున్నది

[1]వొక్కటై ఇందాఁకా కొలువులు సేసినయందుకు
తొక్కితివిగా పాదము దోమటిగాను
ఇక్కువ నన్నేలితివి ఇంతలో శ్రీవేంకటేశ
చిక్కితివిగా నాపాల చెల్లుబడి నివటా ॥ ఎట్టు ॥ 237 ॥

ముఖారి

బాపు బాపు మెచ్చితినే వడఁతి నిన్ను
రేపు మాపు నితనినే మరిగించుకొంటివి ॥ పల్లవి ॥

సేయరానివినయాలు సేసిసేసి రమణుని
వాయకుఁ దెచ్చుకొంటివి జాణవౌదువే
పాయకుండాఁ జెప్పరానిబాస సేయించుకొంటివి
నీయంతటి దెవ్వతె నెలఁతలలోనను ॥ బాపు ॥

కడలేనికతలును కారణాలుఁ జెప్పి పతి-
నొడఁబరు[2]కొంటివి వొద్దికాయనే
జడియక సేవసేసి చన విప్పించుకొంటివి
కడు నీగుణములు పొగడ నెట్టు వచ్చునే ॥ బాపు ॥

పలుమారు మోవితేనెపదనులు చూపి చూపి
వెలయఁ గూడితివి శ్రీవేంకటేశ్వరు
యెలమితో నన్ను నేలె యీతఁడే అప్పటి నేఁడు
బలిమి నీతో నెట్టు పచరించవచ్చునే ॥ బాపు ॥ 238 ॥

[1] 'ఒక్కటై'లో అచ్చుస్థానమైన 'వొ'కును, 'కొలువు' లో హల్లైన 'వు' కును యతి
[2] 'ఒడఁబరచుకొంటివి' వ్రాయువాని తప్పు. (కా. శ్రీ.)

## దేశాక్షి

కడవారు చెప్పితేను కడువెంగెమై వుండు
అడరి నీచేతులనే అంటి చూచుకోవయ్యా || పల్లవి ||

వనితచెవుల నున్న వజ్రాల కమ్మలవొత్తు-
లొనర నీచెక్కులపై నున్నవి నే డు
మునుకొన్నవలపుల ముద్రలవలె నున్నవి
తనర నీకు నివే(దే?) యిద్దము చూచుకోవయ్యా || కడ ||

కాంతనుదుట నున్నకస్తూరి వట్రువ బొట్టు
అంతలోనే నీనొసల నంటివున్నది
చెంత నీరతికి నీలచ్చైన[1] గురుతై వున్నది
వింతగా గోర గీరి నీవే చూచుకోవయ్యా || కడ ||

కలికికన్నుల నున్నకాటుకరేకలు నీ-
పలచనికెమ్మోవి పాఁగి వున్నవి
అలరి శ్రీవేంకటేశ ఆపె నన్నుఁ గూడితివి
చలివాయ నీపెదవి చాఁచి చూచుకోవయ్యా ||కడ||239||

## రేకు 1641 వరాళి

నాతో నేమినవ్వేవు నడుమ నే వద్దనేనా
కాతరాన, నియ్యరాదా కప్పురబాగాలు || పల్లవి ||

వేడుకకు వెలలేదు వేసాలకు గురిలేదు
ఆడవయ్యా మాటలెల్లా ఆపెతోడను

[1] త్రిగీతగం యిక్షరములు బాగా చెలుమెక్కినవి.

వాడిక రట్టైఱుఁగదు వలపు సిగ్గెఱుఁగదు
చూడరాదా ఆపెమోము సూటిదప్పకుండాను || నాతో ||

పాయము తప్పించదు భావము కొంచమెంచదు
సేయవయ్యా ఆపెవద్ద సేఁతలెల్లాను
కాయము తనివందదు గర్వము భయమందదు
వేయరాదా పందె మాపె వేయుమన్నట్టెల్లాను || నాతో ||

కోరిక చాయకు రాదు గుణము కొనితేరాదు
చేరవయ్యా రతి కాపె చిత్తము రాను
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
మేరమీరకుండరాదా మెచ్చినందాఁకాను || నాతో || 240 ||

గౌళ

ఇప్పటనుంటి మాటలేలరా వోరి
కొప్పువట్టి తీసినఁగా కోపము మానేది || పల్లవి ||

చెక్కులపైఁ జేఁతలెల్లాఁ జేసినయప్పుడుగా
తక్కక నే నాడినపంతము వచ్చేది
పిక్కటిల్లు నీమోవి పిప్పి సేసినప్పుడుగా
చిక్కించి నామనసు నెంజెరివి దీరేది || ఇప్ప ||

సిగ్గు వాపి ప్రియములు చెప్పించుకొన్నప్పుడుగా
తగ్గ కిందరిలో నాఁటదాన నయ్యేది
వొగ్గి చెప్పరానిపని కొడిగట్టించితేఁగా
నిగ్గుల నా కోరికలు నెరవేరేది || ఇప్ప ||

పాదాలపై యానకు లోఁబరచినప్పుడుగా
కాదనక నాచలము గానవచ్చేది
యీాదెస శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిటు
మోదమున నేఁడుగదా మొక్కులు చెల్లేది ||ఇప్ప||241||

## దేసాళం

కన్నులవందుగపై కానవచ్చె మీనుద్దులు
అన్నిటాఁ గడమ లేదు అనుమానాలేలా || పల్లవి ||

వెలఁది శిరసుమీఁదివిరులు నీపై రాలె
అలరి నీ చెమటలు ఆమెపైఁ జిందె
కలగంపలాయ మీ కందువైన వలపులు
యెలమి నప్పటి మాఁట లింకానేలా || కన్ను ||

ముదితకరకఁజ ముండేటఁ దగిలె నీకు
అదె నీ కంటనరులు ఆపెపై నిండె
యెదురులడి మించె ఇద్దరి మీసింగారాలు[1]
కొద దీరె మనసులఁ గొంచించనేలా || కన్ను ||

వువిదచన్నులు నీవురముపై వెలవెట్టె
వశీకరము[2] లాకెకాఁగిట కెక్కె
యువల శ్రీవేంకటేశ యిప్పడే నన్నేలితివి
చవులాయ మీరతులు చాటి చెప్పనేలా || కన్ను || 242 ||

---

[1] 'మీ యిద్దరి సింగారాలు' అనుట పాఠము.
[2] 'వశీకరములకె' అనుట పాఠము.

## శ్రీరాగం

చొక్కులఁబెట్టీ నేఁడు చూడవే తాను
పక్కన నిందరిలోన బయట వేతునా || పల్లవి ||

తను నేమో అంటినంటా తారుకాణించుమనీని
వెనకటినుద్ది వెల్లవిరి సేతునా
కొనచూపులఁజూచితే కొంగువట్టి పెనఁగీని
పనుపడ్డతనచేఁత పచ్చి సేతునా || చొక్కు ||

వాడి వట్టితినంటాను వూరకే సోదవిచ్చీని
కడలేనిదొర తన్ను కాకు సేతునా
తడవి నవ్వితినంటా తగిలి యానవెట్టీని
అడఁకువ తనగుట్టు అరడిఁబెట్టుదునా || చొక్కు ||

అట్టె చేయి వట్టితేను అడియాలా లిచ్చీని
రట్టుసేసి తన్ను రచ్చ నిట్టె వేతునా
యెట్టైన శ్రీవేంకటేశుఁ డింతలో నన్నేలినాఁడు
బెట్టి తనమోవియంటా పిప్పిసేతునా || చొక్కు || 243 ||

## రామక్రియ

ఇందరు నీపెద్దరికా లెఱుఁగుదురే
సందడి సరసమాడ చలమరి వాదువే || పల్లవి ||

వెంతనుండి యంటిముట్టి సేవలెల్లాఁ జేసేవు
యెంతచనవరివే యీతనికిని
బంతినుండి కూరలవలుచవులు చెప్పేవు
కాంతునిపై ఇంత బత్తిగలదాన వాదువే || ఇంద ||

వట్టివేసాలఁ బూసుక వాసుక వచ్చే వీతని-
కట్టు నిట్టుఁ బట్టమవు నాదువే నీవు
బట్టబయులు నడుమఁ బలుమారు మురిసేవు
దిట్టువాగెలఁ బెండ్లిపేరటాల వాదువే || ఇంద ||

కందువఁ బాన్పుపై నుండి కాఁపురాలు సేసేవు
చెంది దేవులతనము చెల్లనే నీకు
ఇందునే శ్రీవేంకటేశుఁ డేలె నను నీకతాన
పందెమా డీతని నింతవనిగొంటి వాదువే ||ఇంద||244||

## సామంతం

ఎటువంటి దొరతన మేమి నేరుచుకొంటివి
తటుకన నీకు నీవే తగ వెంచవలదా || పల్లవి ||

ఆరగించ రమ్మని ఆపె నిన్నుఁ బిలువఁగా
చేరి నీసతికి విందు చెప్పుమనేవు
నేరుపుతో వలచిన నీకుఁ బ్రియ మింతేకాక
యీరసపువనితలు ఇంత కోపఁగలదా ఎటు ||

వేడుకతో నప్పటిని విడెము నీకియ్యఁగాను
కూడా నున్నచెలి నందుకొమ్మనేవు
అడ నీవదినెమైతే ఆపె నీకు దొడ్డుగాక
యీడుజోడు సవతులు యింత కోపఁగలరా || ఎటు ||

ఆకె నీకాఁగిటఁ గూడి అట్టె నిన్ను మెచ్చఁగాను
మేకొని నీ దేవులనే మెచ్చుమనేవు
యీకడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
యీకడాకడిసతులు యింత కోపఁగలరా || ఎటు || 245 ||

## రేకు 1642 లలిత

చూడరమ్మ సతులాల సోబానఁ బాడరమ్మ
కూడున్నది పతిఁ జూడికుడనాచారి[1] || పల్లవి ||

శ్రీమహాలక్ష్మియట సింగారాల కేమరుదు
కాముని తల్లియట చక్కఁదనాల కేమరుదు
సోముని తోఁబుట్టువట సొంపుఁ గళ కేమరుదు
కోమలాంగి యీ చూడికుడుతనాచారి || చూడ ||

కలశాబ్ధికూఁతురట గంభీరాల కేమరుదు
తలఁప లోకమాతయట దయ మరి యేమరుదు
జలజనివాసియట చల్లఁదన మేమరుదు
కొలఁదిమీర యీ చూడికుడనాచారి || చూడ ||

అమరవందితయట అట్టె మహి మేమరుదు
అమృతము చుట్టమట ఆనందాల కేమరుదు
తమితో శ్రీవేంకటేశుఁ దానె వచ్చి పెండ్లాడె
కొమెరవయసు చూడికుడుతనాచారి || చూడ || 246 ||

## బౌళి

నమ్మితిఁగదవే నిన్ను నాకుఁ జెల్లెలవంటాను
కమ్మర నాతనితోడ కాకు సేతురటవే || పల్లవి ||

వింటినే నా చెవులను విభునితో నీ వాడఁగా
అంటలేదనుచునేల ఆనవెట్టేవే

---

[1] చూడికుడుత్త నాచ్చియార్ అని తమిళము. 'ఆముక్తమాల్యద' గోదాదేవిని స్తుతించే సంకీర్తన (కా.శ్రీ.)

దంటవు నీవామాట తలఁచుకొనవే నీవే
నంటున నే నాడేనంటే నాకే సిగ్గయ్యీని || నమ్మి ||

ఇట్టె కంటినే నాకన్నులెదుట . సన్నసేయఁగా
గట్టిగా నాకేల మతకము సేసేవే
రట్టడివి నీవే యాగుట్టు దెలుసుకోవే
వొట్టి నే నడిగేనంటే వొగి నవ్వు వచ్చీని || నమ్మి ||

నెఱఁ బట్టుకొంటిఁగదే నీవు లేక లంపఁగాను
గుఱిగాక యేల మఱుఁగులు వెట్టేవే
తెఱఁగి శ్రీవేంకటేశుఁడిద్దరి నేలినాఁడు
మఱి చూచుకొనేనంటే వెఱగయ్యీ నాకు ||నమ్మి||247||

వరాళి

వొద్దఁ గూచుండఁ గదవే వొడివట్టి తీసీని
గద్దించి సొలతురా కాంతునితోను || పల్లవి ||

చెలువుఁ డేమిసేసినా చేతికి లోనౌట గాక
చలము సాదింతురా సారె సారెకు
పిలిచి మాటాడితేను ప్రియము చెప్పట గాక
బలిమిఁ బెనఁగుదురా పంతముతోను || వొద్దఁ ||

[1]జఱశాతఁ డేమనినా సమ్మతించుట గాక
కఱకఱఁ బెట్టుదురా కాఁతాళానను
పఱపుపైకి రమ్మంటే బత్తిసేయుదురు గాక
వెఱగుతో జంకింతురా వేసటలోను || వొద్దఁ ||

[1] జఱపి+ఆతఁడేమనినా (కా.శ్రీ.)

శ్రీవేంకటేశుఁ డేలితే చేకొని మెచ్చుట గాక
యీవలిమోమోడుదురా ఇంతసిగ్గుతో
వేవేగ నవ్వఁగాను వేడుకపడుటగాక
పూవులచెండునఁ గొని పొంచిపొంచి వేతురా ||వొద్దఁ||248||

## కాంబోది

ఇచ్చకురాలఁ దొలుతే యేఁటికి లోఁగే నేను
నిచ్చ నాతో సరసము నేఁడుగాక యెన్నఁడే || పల్లవి ||

వొత్తి గుబ్బలు విసికే వొద్దన్నా మానఁడు
చిత్తము వచ్చినయట్టు సేయుమనవే
హత్తి వలచినదాన నౌఁగాదనఁగరాదు
తత్తరపునావయసు తన సొమ్ము గాదా || ఇచ్చ ||

లవి మోవి పెప్పేసీ లావణ్య మెఱుఁగఁడు
అలరి తా నాడినదే ఆట యనవే
కులమునాలను తనకోరిక మానుపరాదు
తలఁప నాభావమెల్లా తనసొమ్ము గాదా || ఇచ్చ ||

మనసు గరఁగించిని మట్టుతోడ నిలుపఁడు
యెనసినాఁ డేఁకఁ దనయిచ్చ యనవే
అనుగు శ్రీవేంకటేశు కడ్డమాడఁగరాదు
తనర నాసంతోసము తనసొమ్ముగాదా || ఇచ్చ || 249 ||

## కురంజి

నేరుతువే అన్నిటాను నెపాననే వలపించ
మేరమీరే వింతలోనే మెచ్చులాఁడి వాదువే || పల్లవి ||

తెరలోని కిట వచ్చి తిగెసాగ మాటలాడి
వొరసేవే రమణుని వూరకే నీవు
సిరిమించ నవ్వు నవ్వి చేఁతల నట్టే కదిసి
సరమాడే[1] వప్పటి జాణవౌదువే || నేరు ||

చెంతలనే కూచుండి చేతులఁ బాదా లొత్తుతా
మంతనాన యీతనిమర్మము లంటేవు
కొంత మోవిసన్న చూపి గుబ్బలు మెయి సోఁకించి
దొంతిఁబెట్టేవు పొందులు దొరవౌదువే || నేరు ||

వీడెము చేతికిచ్చితే వెసఁ బచ్చడము గప్పి
కూడేవు శ్రీవేంకటేశుఁ గూరిమితోను
యీడ నన్నేలె యీతఁడే యెఱుకలు సేసుకొని
జోడువాయ వెప్పుడును సుగుణవు నౌదువే ||నేరు||250||

## అహిరి

చల్లఁగా బతుకవయ్య జాణతనాలు నేర్తువు
యెల్లచోట నీకఁ దప్పు లెంచేమా నిన్నును || పల్లవి ||

నేను విన్నవినికికి నీవుండేవునికికి
కానీలేరా అన్నిఁ దారుకాణ వచ్చెను
ఆనలేల పెట్టేవు అమరనేల చెప్పేవు
దానికేమి యెవ్వరైనాఁ దడవేరా నిన్నును || చల్లఁ ||

చేరి నావూహలకు చేసేటి నీ చేఁతలకు
సారెకు నౌరా నేఁడు సరివచ్చెను

[1] 'సరసమాడే' వ్రాయుటనగానితప్పు.

యీరీతేల కిందుపడే విచ్చకాలేల సేసేవు
నీరపమైతే నొఁగాక నిలిపేరా నిన్నును || చల్లఁ ||

యిట్టె నేఁ గూడినందుకు యెన్నిక నీరతులకు
గట్టాయరా నీగుణాలు కతలాయను
నెట్టన శ్రీవేంకటేశ నీ వెంతవేఁడుకొనేవు
చుట్టమవైతివి యిఁక సోదించేరా నిన్నును ||చల్లఁ||251||

రేకు 1643 ముఖారి

ఎఱఁగవచ్చెనే నేఁడు యెమ్మెలెల్లాను
తఱియాయ విభునిపాదము లొత్తఁగదవే || పల్లవి ||

చలపాది తనమైతే సంగడిఁ గూచుండనేల
తలఁపు మానలేనికాఁతాళము గాక
అలుకే నిజమైతే ఆసలు చూపఁగనేల
కలిగిన వలపుల గతులు గాక || ఎఱఁ ||

కోపమే కలిగితేను కొసరు మాటాడనేల
రూపులేని కోరికలరుచులు గాక
రాఁపుల మచ్చరమైతే రమ్మని పిలువనేల
ఆఁపరాని తమకపుటలమట గాక || ఎఱఁ ||

సిగ్గులే నిజమైతే సేవలు సేయఁగనేల
అగ్గలపురతుల చయ్యాటము గాక
యెగ్గులేక శ్రీవేంకటేశుఁ డిట్టె నిన్ను నేలె
బగ్గన నిదెల్లా నీ భాగ్యమే కాక || ఎఱఁ || 252 ||

## మాళవిగౌళ

ఇంధరయ్యా విడేలు మీ కిద్దరికిని
పొందులు మఱవవద్దు పొసఁగిన చోటను || పల్లవి ||

ముచ్చటలాడఁగవలె మొగము చూడఁగవలె
మచ్చరమేటికి నాలిమగనికిని
కొచ్చి కొచ్చి నవ్వవలె కూడి మాడి వుండవలె
వొచ్చెము లెంచఁగవొద్దు వొనరినచోటను || ఇంద ||

కాఁపురాలు సేయవలె కాయములు సోఁకవలె
తోపునూపు డేమిటికి దొరలకును
యేపొద్దుఁ జెలఁగవలె ఇంటిలో మెలఁగవలె
కోపాలొద్దు చుట్టాలై గురియైనచోటను || ఇంద ||

రమ్మని పిలువవలె రతుల మెప్పించవలె
దొమ్మి జగడములేల దొడ్డవారికి
నెమ్మల శ్రీవేంకటేశ యీకె నీవూఁగూడితిరి
కమ్మరఁ జెప్పఁగ వద్దు కలసిన చోటను || ఇంద || 253 ||

## భైరవి

అవధరించవయ్యా ఆపె సేసే చేఁతలు
తిధిరి చేతులు చాఁచి దిట్టయేతులాఁడె || పల్లవి ||

చిక్కని నవ్వులు నవ్వి సెగ్గులు పైఁ జిలికించి
మొక్కీనిదె కొలువులో ముద్దరాలు
వెక్కసపుమాట లాడి వేడుకలు పచరించి
నిక్కసించీ రతులకు కీల్తకారివనిత || అవ ||

తేఁటలచూపులు చూచి తీపులు పైఁ బడనిచ్చి
నాటించీ గోరు నీపై నాలికత్తె
వాఁటముగా పై నొరగి వలుదచన్నుల నొత్తి
గాఁటపు సన్నలు సేసీ గయ్యాళి మగువ || అవ ||

దొంతరసాములు సేసి దోమటి మోవి దొడిగి
వింతగాఁ గాఁగిటఁ గూడీ వేసదా రికె
యింతలో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
రంతుసేసీ నిన్ను మెచ్చి రచనల తరుణి || అవ || 254 ||

వరాళి

నాతో నేమిచెప్పేవు నాయము లేమడిగేవు
కాతరించితే సతులు కదు మీరకుందురా || పల్లవి ||

వూడిగము సేసేయట్టి వువిదలతో నవ్వితే
యీడుజోడై నీ బుజ మెక్కకుందురా
వాడలోన దిరిగాడేవారితో జూజమాడితే
కూడెనపందెము నిన్నుఁ గొనకుందురా || నాతో ||

కొలువు సేసేవారితో కోరి సరసమాడితే
అలరి మాటకు మాట ఆడకుందురా
వెలుపలివారిఁ దెచ్చి వెస లోన నిడుకొంటే
చలపట్టి నీతోడి[1]సరికి రాకుందురా || నాతో ||

కడవారిచేత నీవు కానికె లందుకొంటే
సుడిగొని మోవి చవిచూడకుందురా

[1] 'తోడ' కావచ్చు.

కడఁగి శ్రీవేంకటేశ కమ్మర నన్నేలితివి
విడెమందుకొన్నవారు వియ్యమందకుందురా ||నాతో||255||

సాళంగం

చేయవే యతనివద్ద సేఁతలెల్లాను
దాయనే నీతో నేను తప్పు లెంచేనటవే || పల్లవి ||

చెలువుని సాలసేవు చేరి మాట లడిగేవు
కలికితనాలు నీకు గలవే కదే
పలుమారు నవ్వేవు పానుపుపైఁ గూచుండేవు
చలమున యీవిద్యలు సాదించితివి గదే || చేయ ||

కన్నుసన్నలు సేసేవు కాఁపురాన మెప్పించేవు
అన్నియు నీమేనికి నమరుఁ గదే
వన్నెలు వెట్టుకొనేవు వద్దఁ గూచుండవచ్చేవు
పన్నిలమాయలకు నేర్పరివి గదే || చేయ ||

మోవితేనె లడిగేవు మొక్కులెల్లా మొక్కేవు
రావాడిరతులకు రాజవు గదే
యీవేళ శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నిట్టె
దేవుల్లిందరికిని దేవరవు గదవే || చేయ || 256 ||

సామవరాళి

ఇద్దరము సరిగాదా ఇదివో నీకు
పెద్దరికా లెక్కించేవు ప్రియమా నీకు || పల్లవి ||

మగువకు ననమిచ్చి మాటలెల్లా నాడించి
తగవు. దిద్దవచ్చేవు తగునా నీకు

మొగనక్కేల కిద్దరి నెదురుబడి నిలిపి
జిగిఁ బంతాలు రేఁచేవు చెల్లునా నీకు || ఇద్ద ||

వెంటఁ బెట్టుకొని వచ్చి వెలఁది నెసకొలిపి
జంటలు సేయవచ్చేవు చలమా నీకు
దంటతనములు నేర్పి తారసిల్లఁ జేసి మమ్ము
వొంటి సిగ్గువరచేవు వుచితమా నీకు || ఇద్ద ||

పానుపుపై నాకెఁ బెట్టి బలిమి నన్నుఁ గూడేవు
పూని శ్రీవేంకటేశ అబ్బురమా నీకు
అనుకొని యిద్దరిని అక్కఁ జెల్లెండ్లఁ జేసి
నానఁ బెట్టేవు వలపు నగవా నీకు || ఇద్ద || 257 ||

## కు 1644 మేఘరంజి

నెట్టన రెంటికి వచ్చు నీ జాడలు
గట్టువాయతనమో కరుణించు విధమో || పల్లవి ||

చిత్తము రంజిల్లఁ జేసి చెక్కులఁ గస్తూరి వ్రాసి
హత్తి యెంత బుజ్జగించే వాఁటదానిని
ఇత్తలఁ జేసినకల్ల యేమైనాఁ దొల్లి కలదో
కొత్తలైన నీమంచిగుణ మిట్టిదో || నెట్ట ||

భావము సోఁకఁబలికి పన్నీరు పైఁ జిలికి
మూవంకలాఁ జొక్కించేవు ముద్దరాలిని
ఆవల మర్మములు నీయందు నేమైనాఁగలవో
నీవొళ్లఁ గలిగిననేరు పిటువంటిదో || నెట్ట ||

చేసిన సేవకు మెచ్చి చేతికి విడెమిచ్చి
బాస ఇచ్చి కూడితివి పంతగత్తెను
ఆసల శ్రీవేంకటేశ అది నీ వినోదమో
వాసికి నిందరి నిట్టె వలపించేసాజమో ॥ నెట్ట ॥ 258 ॥

హిందోళం

నెమ్మది నలుక దీర్చు నీవైనాను । ఆపె-
నిమ్మపండు చేత నంటు నీవైనాను ॥ పల్లవి ॥

యెఱఁగియు చిత్తములో యేఁటికో చింతించీ నీకె
నెఱవుగా నవ్వవయ్య నీవైనను
తఱి గందమిచ్చితే చేతనే పట్టుకవున్నది
నెఱవూఁత వూయువయ్య నీవైనాను ॥ నెమ్మ ॥

వొయ్యనే తలవంచుక వూరకే తా నున్నది
నెయ్యపుమా టాడవయ్య నీవైనాను
పయ్యదలోఁ దెచ్చినట్టిబాగా లట్టె వున్నవి
నియ్యంత[1] విడెమీవయ్య నీవైనాను ॥ నెమ్మ ॥

యెలమిఁ బానుపుమీఁద ఇంత గుట్టుతో నున్నది
నెలకొని కూడవయ్య నీవైనాను
కలసి శ్రీవేంకటేశ కాచుకున్నది సేసకు
నిలువునఁ బోయువయ్య నీవైనాను ॥ నెమ్మ ॥ 259 ॥

---

[1] 'నీయంతనియ్యంత' వింత్రికసంధి. 'నీయంతకు నీవే' అని అర్థము.

## గౌళ

అది లెస్స తెలుసుకో అప్పుడు విడువరాదు
  వెదకి నాపైఁ జేయివేసేవు నేఁడు || పల్లవి ||

వోపుదువా ఆపెతోను వొద్దఁ బెట్టా మాటలాడ
  యీ పొద్దున మా ఇంటికి యెట్టు వచ్చితి
ఆఁపఁగలవా కోప మాపె నిన్ను జంకించితే
  చూపుల నన్ను దప్పకచూచేవు నీవు || అది ||

సేయనోపుదువా ఆపె చేరి బాస సేయుమంటే
  యీయెడ నా చనుఁగవ యిట్టె అంటేవు
నాయానకు రాఁగలవా నమ్మకనంటే ఆపెతోను
  చేయిమీఁదుగా నాపై సేసలు వెట్టేవు || అది ||

నిలువఁగనోపుదువా నేర మాపె యెంచితేను
  కొలఁదిమీరఁగ నన్నుఁ గూడితివి
యెలమి నాపెకు పంతమియ్యకుండఁ గలవా
  నలి శ్రీవేంకటేశుఁడ నవ్వేవు నాతోను || అది || 260 ||

## రామక్రియ

కానీలే అందుకేమి కద్దా వోయి
  వూని యాకె నీ యింట నున్నదని వింటిమి || పల్లవి ||

పోలించ నీ కాపెకునుఁ బొందు గద్దని వింటిమి
  ఆలించి ఆమాట దోయవని వింటిమి
మేలేనని నీవు బాసలిచ్చితివని వింటిమి
  శీలముతో విందారగించితివని వింటిమి || కానీ ||

నంటున నాపెగోరు మేన నున్నదని వింటిమి
అంటువాయని చుట్టమవని వింటిమి
యింటిలో నేపొద్దు కాఁగి లెడయవని వింటిమి
దంటతనపు మీయేకతములెల్ల వింటిమి || కానీ ||

సేయరాని వినయాలు సేయుదువని వింటిమి
ఆయాలు మోచినరతు లవి వింటిమి
యీయెడ శ్రీవేంకటేశ యెనసితి విటు నన్ను
చాయల నన్ను మన్నించే సంగతులు వింటిమి ||కానీ||261||

వరాళి

మనసులో గుబ్బతిల్లీ మర్మము లెల్లా
కొనవేసీ చూపరాదు గురిలేని ఆస || పల్లవి ||

చేరి నీమోము చూచితే సెలవుల నవ్వువచ్చీ
వూరకే తలవంచుక వుండఁగరాదు
ఆరీతి నీవు దొరవు ఆఁటదాన నే నింతే
తారుకాణించఁగరాదు తలఁపులోవలపు || మన ||

చెవి నీమాటలు వింటే సిగ్గులెల్లాఁ జిమ్మిరేఁచీ
తవిలి పరాకుసేయఁ దగవు గాదు
యివల నీవు మగఁడ విటు నీకు నే నాలను
రవళి నాడుకోరాదు రతులలో సుద్దులు || మన ||

అంటి కాఁగిలించుకొంటే ఆయములెల్లా గరఁగు
అంటిననాతమకము అణఁచఁజాల
యింటిలోన శ్రీవేంకటేశ నన్ను నేలితివి
వెంట వెంట మాన్పరాదు వేవేలు వేడుకలు ||మన||262||

## శంకరాభరణం

చిత్తగించు మిదె చెలువుఁడవు
మొత్తపు వలపులు ముంచీని || పల్లవి ||

పుత్తడిఁ బోలినపొలఁతి నీ రూపము
చిత్తరువున వ్రాసీ నిదివో
గుత్తపు గుబ్బల గురిగా మోపుచు
బత్తులు చేసీఁ బలుమరును || చిత్త ||

వలరాజు ప్రతిమవంటిది నీపేరు
చలములఁ బలకలఁ జదివీని
అలరి వురంబున అచ్చుగా నొత్తుచు
సులభాన మోహము చూపీని || చిత్త ||

చక్కెర బొమ్మయినసతి నీకాఁగిలి
గక్కన కణఁజముగాఁ గట్టి
యిక్కువ శ్రీవేంకటేశ నిన్నెనయుచు
అక్కరదెలిపీ ననువుగను || చిత్త || 263 ||

రేకు 1645 రీతిగౌళ

నామోము చూచి చూచి నన్నేమి బుద్దెడిగేవు[1]
కాముకునకు నీతి యెక్కడనైనాఁ గలదా || పల్లవి ||

నెమ్మది నీతో నేను నేరుపుల మాటలాడి
వుమ్మడి వుండేఁ గాని వొరయనోప

---

[1] బుద్ది + అడిగేవు = బుద్దెడిగేవు.

కమ్మటి నీకు నిచ్చకపుఁ జేఁతలెల్లాఁ జేసి
సమ్మతి మొక్కేఁ గాని సాదించనోప ॥ నామో ॥

అప్పటప్పటికి నీతో నంకెలకు నవ్వు నవ్వి
కొప్పు దువ్వేఁగాని కడుఁ గొసరనోప
యెప్పుడు చూచినా నీకు యెవ్వతెనైనాఁ దెచ్చి
నెప్పున మెప్పించేఁగాని నీరవ మెంచనోప ॥ నామో ॥

వూడినట్లనే[1]కూడి కొలువులోపన నీచే
వీడె మందుకొనేఁగాని వెంగనకోప
యీడనే శ్రీవేంకటేశ యేలితివి కడపలో
పాడి నెరపేఁగాని పంగించనోప ॥ నామో ॥ 264 ॥

బౌళి

చూపవయ్యా నాకాపెను సోద్యమయ్యీని
మోపుగట్టీ నయాలు మోహమెంతగలదో ॥ పల్లవి ॥

తెరమఱఁగున నుండి తియ్యని మాట లాడి
తరితీపు సేసీని తా నెంత...దో
విరులు నీపైఁ జల్లి వేడుక నవ్వులు నవ్వి
తరవువెట్టీ వలపు తగ నెంత నేర్చెనో ॥ చూప ॥

పానుపుపైఁ బవళించి పదనుగా సన్న సేసి
నానఁ బెట్టీఁ దమకము నను పెట్టీరో
సోనలచూపులు చూచి చొక్కుల మొక్కులు మొక్కి
సొనఁబట్టీఁ గొనగోళ్ల చల మెంతగలదో ॥ చూప ॥

---

[1] 'కూడినట్లనే' వ్రాయుటగాని తప్పు (శా. శ్రీ.)

బలిమిగాఁ గాఁగిలించి భావము గరఁగఁజేసి
మొలపించీఁ బులకలు మొదమెట్టిదో
అలమె శ్రీవేంకటేశ అలమేలుమంగ యీకె
వెలయించె నీకరుణ వినోద మెంతటిదో ॥ చూప ॥ 265 ॥

## పాడి

రమణుఁడ నేఁడు నీరసమాయను
తమకించే విది మంచితగవాయను ॥ పల్లవి ॥

సారిది నీవు సేసినచొప్పు లెత్తి యాడఁగాను
విరులఁగొని యాపెను వేసేవు నీవు
మరిగి విన్న కతలు మర్మములు సోఁకితేను
మరునమ్ములు నడుమ మనికాయను ॥ రమ ॥

తలకొన్న నీ కళలు తరుణి చూడఁగాను
జల జలఁ బన్నీరు చల్లేవు నీవు
[1]చలరేఁగినయాసలు చిమ్మిరేఁగి మొలచితే
చలపాది వెడమంచు సందడించెను ॥ రమ ॥

కదిసిన నీ రతులు కాంత గడు మెచ్చఁగాను
వొదిగి గందము మేనఁ బూసేవు నీవు
పాది జవ్వనవన ముప్పొంగితే శ్రీవేంకటేశ
చెదరక వట్టిమాకు చిగిరించెను ॥ రమ ॥ 266 ॥

---

[1] 'చెలరేఁగిన' యతి గమనించేది (కా.శ్రీ.)

### కాంబోది

ఏఁటికి ననుమానము యెందాఁకాను
కూటమిగలచోటికి గుట్టు సేయగలదు || పల్లవి ||

వరుసకు నాపె నేఁడు వచ్చెఁగా నీవద్దికి
వెరవేది లోపలికి విచ్చేయరాదా
పరగ నాపై వలపు పండి పొల్లవోయీనా
దొరపాటివానికి దోసమే లేదు || ఏఁటి ||

ఆసతో నీమోము చూచీ నదివో యీ జవరాలు
సేసవెట్టి పెండ్లాడి చేకొనరాదా
బాసలు నాకిచ్చితేనే పరిసిపోయీనా
ఆసరిఁ గోడెకానికి నంటుముట్టు లేదు || ఏఁటి ||

పొరుగుపొరచి వచ్చి పొలసీ నీనేస్తగత్తె
గరిమ నీ పచ్చడము గప్పఁగరాదా
యిరవై శ్రీవేంకటేశ యెనసితి వీటు నన్ను
సిరులుగలవానికి చింతించఁదగదు || ఏఁటి || 267 ||

### ద్రావిళ భైరవి

నీతలఁపు లీడేరె నెలఁత నీకు దక్కె
రాతిరిఁ బగలు నింత రవ్వలేలా || పల్లవి ||

ఆపెతో మాటలాడితి వందుకొంటివి కానికె
పైపైఁ గొంకుదేరెను పలుకులేలా
మోపులుగా నవ్వితివి మొగము చూచితివి
మాపుదాఁకా నిఁక వట్టిమాఁటలేల || నీత ||

సతిఁ గొంగువట్టితివి సరసములాడితివి
సతమాయను మనువు సాదించనేల
యితవులు చేకొంటివి యింటి కిట్టె వచ్చితివి
కతలెల్లాఁ జెప్పి నిన్ను. కాతరించనేల || నీత ||

కూటములు మెచ్చితివి కొమ్మఁ బెండ్లాడితివి
సూటికెక్కె వలపులు సుద్దు లింకేల
యీటున శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
గాత్రాన నన్నేలితివి గరిసించనేలా || నీత || 268 ||

## నాదరామక్రియ

అప్పుడే కానఁగవచ్చి నాఁగాము లెల్లాను
చిప్పిలు జవ్వనముపై చేయివెట్టరాదా || పల్లవి ||

చండి పోరి నీవు నాతో సాములేల సేసేవు
వుండఁ బట్టదా నీకు నోజలోడను
కండగర్వ మెంతే నీకు గలిగితేఁగనక యీ—
కొండలవంటి చన్నులు కుచ్చి యెత్తరాదా || అప్ప ||

గుట్టుతోడ నవ్వు నవ్వి గురులేల వేసేవు
పట్టరాదా నీవొళ్లిపాయము నేఁడుఁ
బట్టబయ లీఁదేనని పంతము నీకింత గత్తే
కిట్టి నా నడుము పిడికిటఁ బట్టరాదా || అప్ప ||

తలపోసి నన్ను నిట్టె తమకించి కూడేవు
నిలుపరాదా మనసు నీయంత నీకు
యెలమి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
అలమేలుమంగ నేను అక్కున నించరాదా ||అప్ప||269||

రేకు 1646 సామంతం

మన్నించు మామాటలు మగువను దయనేలు
నన్నల రాఁపుసేయకు జవరాలిని || పల్లవి ||

చలపట్టి యెంచరాదు నడిఁబెట్టఁగారాదు
చెలరేఁగి కడుమోహించినకాంతను
అలఋంపించఁగవద్దు అన చెరుచఁదగదు
పిలువకే వచ్చినప్రియురాలిని || మన్నిం ||

చిమ్మిరేఁచఁ బాడిగాదు సిగ్గువరుచ దోసము
సమ్మతించి కాచుకున్న జలజాక్షిని
పమ్మి నవ్వనీదగదు పైకొనకుండు టొచ్చము
నెమ్మది సరసమాడే నేరుపరిసతిని || మన్నిం ||

బాసియ్య నది నేరమి పరాకుసేయుట నీతి
సేసవెట్టి కూడిన మచ్చిక సతిని
వాసితో వేంకటేశ వడి నలమేల్మంగను
తానువలెఁ గూడితివి తగిన యీయింతిని ||మన్నిం||270||

దేసాళం

తప్పులు వట్టఁగనేల తరుణులను
కప్పురముమోవి నిచ్చి కాఁగిలింతురు || పల్లవి ||

పెనఁగుచు రమణుఁడు ప్రియములు చెప్పినాను
చనవుగలసతులు జంకింతురు
తనిసి తమతమపంతము లీడేరినమీఁద
వెనక నవ్వటి మరి వేఁడుకొందురు || తప్ప ||

యెడయక నాయకుఁడు ఇచ్చక మాడినాను
కడుపొందైనవారు కాఁతాళి తురు
తడయక రతులను తమకు లోనైనవేళ
చిడుముడిఁ జేయరానిసేవలెల్లాఁ జేతురు ॥ తప్పు ॥

అసల శ్రీవేంకటేశ అయాలు నీ వెంతంటినా
సేసలు వెట్టినవారు చిమ్మిరేఁతురు
నీసరి నలమేల్మంగ నీవుర మెక్కినమీఁద
వాసుల నందరు నిట్టె వంతులకు వత్తురు ॥తప్పు॥271॥

## ఆహిరినాట

తగునా నీ కింతవేసిదంటతనాలు
నగినంతలోనె యాపలు వెట్టఁజెల్లునా ॥ పల్లవి ॥

కళికి తనపతికి గందము కానుకంపితే
బలిమిఁ దీసి యేల కంబానఁ బూసేవే
వెలయ నప్పటి నాపె విడెము వెట్టి యంపితే
పలుమారుఁ జెలులకు పంచిపెట్టనేఁటికే ॥ తగు ॥

మంచిపువ్వుదండ లాపె మగనికి నంపితేను
కొంచకేల నీమంచముకోటఁ జుట్టేవే
మించుఁగడియా లాకె మెలుఁతచే నంపితేను
పించెవు నీపాదమునఁ బెట్టవచ్చునటవే ॥ తగు ॥

యెనసి శ్రీవేంకటేశుఁ డిట్టె పొన్ను వేయించితే
మొనసి నీవేల పాదమునఁ దొక్కేవే
అనిశము నేలె నీతఁ డలమేలుమంగవు నిన్ను
తనిసి యాపెకు నిఁక దాఁచవచ్చునటవే ॥ తగు ॥ 272 ॥

శంకరాభరణం

అన్నిటా జాణఁడ వైతే నౌదువుగాని
కన్నచోటనెల్లాను కాంతను దూరకుమీ || పల్లవి ||

పంతములేలాడేవుఁ బయలేలీదించేవు
యింతేసికి నోపునా యీపె నీతోను
చెంత మోము వంచుకొని సిగ్గువడి నున్న నింతే
జంతల నాడినయట్టు సకియ నాడకుమీ || అన్ని ||

వేసాలేల సేసేవు వెగ్గళించేల నవ్వేవు
గాసిఁబెట్టితే నోర్చునా కామిని గోల
మూసినముత్తెమువలె మోనమున నున్న దింతే
యీసడపువారివలె నీకె నెంచకుమీ || అన్ని ||

జాగులేల సేసేవు చలమేల సాదించేవు
యీగతి నలమేల్మంగ యిచ్చగించునా
బాగుగా శ్రీవేంకటేశ బత్తితోఁ గూడె నింతె
భోగపు టెంతులవలె పాలఁతిఁ జేయకుమీ || అన్ని || 273 ||

సామంతం

అంతటి బలువురాల వౌదువే నీవు
చెంత నుండి మచ్చికలు సేయించుకొంటివి || పల్లవి ||

వలసినచోటికి వాసు లెంతురటవే
పిలిపించుకొంటివి ప్రియునిచేత
మలసే నీ పంతాలు మగనితోడనా
యెలమిఁ జేతికి విడె మిప్పించుకొంటివి || అంత ||

ఆసపడి వున్నచోట అలయింతురటవే
బాస సేఇంచుకొంటివి పతిచేతను
యీసట లీతరితీపు లిక్కడఁ జూపుదురా
రాసికెక్క నింటికిని రప్పించుకొంటివి || అంత ||

వొక్కటైనచోటికి వొడ్డించుకొందురటవే
చెక్కు నొక్కించుకొంటివి చెల్వునిచేత
వెక్కసపునేర్పులు శ్రీవేంకటేశుకొరకా
మిక్కిలి యీతనిచేత మెప్పించుకొంటివి|| అంత || 274 ||

## ముఖారి

ఇందాఁకా రాఁడంటా పతినేల దూరేవే
కందువ నెదురుకొని కాఁగిలించుకొనవే || పల్లవి ||

పగవారికైనాను పంతములిచ్చుట మేలు
మొగమోట మతిలోన ముంచుకొంటేను
జగడములాడినాను నగుతా నుండుట మేలు
పగటుఁ జుట్టరికము పాయరాకుండితేను || ఇందాఁ ||

కడుఁగోపినైనాను కనిపొగడుట మేలు
వడి నందుఁ బనిగొనవలసితేను
తడవవచ్చినఁ దానె తప్పించుకొనుట మేలు
వొడఁబాటు బాసలు వొనరి వుండితేను || ఇందాఁ ||

వె[1]క్కసియైన దొరను వేఁడుకొనుటే మేలు
యెక్కడా సుకము తన కెడవైతేను

[1] వెక్కసము+ఇ=వెక్కసము కలవాడు

చక్కని శ్రీవేంకటేశ్వరుఁడు నిన్నిదె కూడె
మొక్కుటమేలు రతి ముచ్చటైతేను ॥ ఇందాఁ ॥ 275 ॥

రేకు 1647 మాళవి

వాఁడు గదె ప్ర[1]హ్లాదవరదుఁడు
నాఁడాడినమాటలకు నవ్వీని చూడరే ॥ పల్లవి ॥

పంతములెల్లాఁ జెల్లించె ప్రహ్లాదవరదుఁడు
వంతుకెక్కించెఁ బ్రహ్లాదవరదుఁడు
బంతి విడేలు వెట్టెను ప్రహ్లాదవరదుఁడు
ఇంతటి నారమణుని నేమని చెప్పుదునే ॥ వాఁడు ॥

బలిమిఁ జన్ను లంటె నీ ప్రహ్లాదవరదుఁడు
వలపు నించెఁ బ్రహ్లాదవరదుఁడు
పలుకుఁబంత మీఁదేర్చెఁ బ్రహ్లాదవరదుఁడు
అలరించె నిన్నిటా నేమని పొగడుదునే ॥ వాఁడు ॥

పన్నుగ శ్రీవేంకటాద్రి ప్రహ్లాదవరదుఁడు
వన్నెగాఁ గూడెఁ బ్రహ్లాదవరదుఁడు
పన్నినమాయ దెలిపె ప్రహ్లాదవరదుఁడు
యిన్నిటా నీతనినుద్దు లె[2]న్నని నే మెత్తునే ॥వాఁడు॥276॥

దేసాళం

విరులదండలతోడి వి[3]ట్ఠలేశా! నీవు
యెరవులేనివాఁడవు యెపుదు విట్ఠలేశా ॥ పల్లవి ॥

---

[1] 'ప్రంహ్లాద' అనియే రేకులందంతటా కలదు
[2] ఎన్ని+అని
[3] 'విఠ్ఠలేశా' అనియే రేకులో కలదు. 'విఠలా' అనియు వ్యవహారమున గలదు

విచ్చేయు మా ఇంటికి విట్ఠలేశా। నీకు
విచ్చనవిడాయ నిది విట్ఠలేశా
విచ్చి చెప్పె నిటు నీకు విట్ఠలేశా। నాకు-
నిచ్చినబాస దప్పకు మిఁక విట్ఠలేశా || విరు ||

వీడె మియ్యఁగదవోయి విట్ఠలేశా। కడు-
వేడుకకాఁడవు నీవు విట్ఠలేశా
వీడుజోడాయ వలపు విట్ఠలేశా
పాడిఁ బంతాలెల్లఁ జెల్లె బాపు విట్ఠలేశా || విరు ||

విడిచేవు పోఁకముడి విట్ఠలేశా। యెంత
వెడమాయకాఁడవయ్య విట్ఠలేశా
కడఁగి శ్రీవేంకటాద్రిఁ గలసితివి
అడియాలముగ నన్ను నౌర విట్ఠలేశా || విరు || 277 ||

## రామక్రియ

చూడఁ జిన్నవాఁడుగాని సుద్దులైతే వేవేలు
వోడక వింతలుసేసీ వుద్దగిరి[1] కృష్ణుఁడు || పల్లవి ||

సెలవినవ్వులతోడ చెలులమోములు చూచి
పలికీ ముద్దుమాటల(లు?) బాలకృష్ణుడు
చలపాదిగొల్లెతల చనుఁగొండలతోడుత
తులఁదూచీఁ వలపులు దొంగాడుఁ గృష్ణుఁడు || చూడ ||

తప్పటడుగులతోడ తరుణలకెల్లాను
చిప్పిల ముద్దులుపెట్టీ చెన్నకృష్ణుఁడు

[1] వుద్దగిరి='ఉదయగిరి' కావచ్చు

ముప్పిరియాసలఁ బొంది ముదితలవాడిలోన
వొప్పగఁ జేతులు చూఁచీ నుద్దగిరికృష్ణుఁడు || చూడ ||

గట్టి వెన్నముద్దతోడ కాంతలను మరిగించి
పట్టపగలే కూడీ గోపాలకృష్ణుడు
ఇట్టె విజనగరాన యెమ్మెలెల్లాఁ జూపీని
చిట్టకపుఁ జేఁతల శ్రీవేంకటకృష్ణుడు || చూడ || 278 ||

బౌళి

అదరిపాటు వచ్చి అప్పుడే నీవు
పదిమారులును యేల పంతాలాడేవే || పల్లవి ||

వలపు నిలుపలేక వద్దనున్న చెలులతో
కలికితనాల నెంత కాఁతాళించేవే
బలువుఁడాతఁడు నీపై బత్తి చూచుకొంట గాక
సొలసి మలసి యేమి సోదించేవే || అద ||

విరహ మాఁపఁగలేక విభని[1] మొగము చూచి
మరులుకొలిపి యేఁటిమాట లాడేవే
సరసుఁ డాతఁడిచ్చినచనవే చూచుట గాక
తిరిగి తిరిగి యెంత తెలుపవచ్చేవే || అద ||

మనసు వారించలేక మచ్చిక శ్రీవేంకటేశుఁ
బెనఁగి కాఁగిట నెంత బిగింయించేవే
నను నిట్టె యేలినాఁడు ననుపే చూచుటగాక
పనివడి యింకా నెంత పచారించేవే || అద || 279 ||

---

[1] 'విభుని' వ్రాయుటగాని తప్పు (కా.శ్రీ.)

## నాదరామక్రియ

బుద్ది చెప్పవయ్య నేను పూఁచి వినేను
గద్దరిఁ గా నెపుడు సిగ్గరిదాన నేను || పల్లవి ||

ఆమగువకు నీవు అన్నిటా మోహింతు వంటి
యేమనవలెను నానతీవయ్యా
గామిడిదానఁ గాను కతలు నీవే నేరుపు
కామించి వచ్చిన వాసికత్తెనే నేను || బుద్ది ||

చాయల నాపెకు నీకు సరిఁ బొందుసేసితి
సేయవలసినపని చెప్పవయ్యా
రాయడించేదానఁ గాను రచ్చలఁబెట్టకు నీవే
పాయముతోడిమానాపతిదాన నేను || బుద్ది ||

కూడా నీతోనున్నాపెకూటములు చూచితి
చూడవలసిన వింకాఁ జూపించవయ్యా
వోడక భూపతిచెర్వువొద్ది శ్రీవేంకటేశ్వర
జాడ నన్నేలితివి యిచ్చకురాల నేను || బుద్ది || 280 ||

## శుద్ధవసంతం

చెప్పవయ్య నాతోను చెలి నీకెంత. చుట్టమో
తెప్పల భూపతిచెర్వు[1] తిరువెంగళప్పఁడా || పల్లవి ||

ముంచి తేనెలుగారేమోవినే మాటలాడీని
అంచగమన యెవ్వతో అదె నీతోను

---

[1] భూపతిచెర్వు=కోనేరు. కోన్+ఏరు. 'కోన్' అనగా 'ప్రభువు' అని తమిళము. 'ఏరి' అనగా చెరువు. అదియే తెలుగులో 'కోనేరు'. దానికి సంస్కృతీకరణమే "భూపతిచెర్వు" (స్వామిపుష్కరిణి) (గా.రా.). ఇది చింత్యము (కా.శ్రీ.)

చంచుల కనుఁదమ్ముల సారె సన్నలు సేసీని
యెంచరానివేడుకతో యిదె నీతోను || చెప్ప ||

చిప్పిలఁగ నోరూర సెలవుల నవ్వు నవ్వీ
అప్పటిని నే డెవ్వతో అదె నీతోను
వొప్పగ శిరసు వంచి వూరకే సిగ్గులువడీ
యిప్పు డిందరుఁ జూడఁగ యిదె నీతోను || చెప్ప ||

మొగిఁ జిమ్మి రేఁగ చన్నుమొనల మోహము చల్లీ
అగడుగ నెవ్వతో అదె నీతోను
జిగి నన్నుఁ గూడితివి శ్రీవేంకటేశుఁడ
చిగిరించ మొక్కి మెచ్చి నిదె నీతోను || చెప్ప || 281 ||

రేకు 1648 సాళంగం

ఏమిసేసు నాతఁడు యెందరికని వోపును
నేమములు నేర్పకురే నెలఁతలాల || పల్లవి ||

అక్కడనుండి వచ్చి ఆ పరాకైవున్నాఁడేమో
కక్కసించకురే వో కాంతలాల
నెక్కొని యలసి వచ్చి నిద్దురతో నున్నాడేమో
పక్కన లేపకురే పడఁతులాల || ఏమి ||

వలపు చవుల సోఁకి వడిఁ జొక్కివున్నాఁడేమో
బలిమిసేయకురే భామలాల
యెలమి నాపెకు బాస ఇచ్చి వచ్చినాఁడేమో
చలము సాదింకురే జలజాక్షులాల || ఏమి ||

తగిలి వారిరూపులు తలఁచుకొనీనో యేమో
అగడుసేయకురే యంగనలాల
జిగి శ్రీవేంకటేశుఁడు సింగారవనములోన
నగి కూడెఁ గోనేటిలో నన్ను నింతులాల|| ఏమి || 282 ||

## వరాళి

ఎంతేసి నేరిచినాఁడు ఇటు చూడరే
కాంతలాల దాఁగి వీఁపు గానరాఁగా నీతఁడు || పల్లవి ||

చెక్కులపై వడిసేటి చెమటలు చూడరే
చక్కనిమోములో సిగ్గు చల్లీఁ జూడరే
నెక్కొనఁగ బుసకొట్టే నేరుపులు చూడరే
పక్కనఁ దన నిజము పచరించీ నీతఁడు || ఎంతే ||

కడలేనితనమేనికళలెల్లాఁ జూడరే
అడియాలపుఁబులక లటు చూడరే
బెడిదమై జారిన వెనుఁదురుము చూడరే
వొడఁబరచీ నన్ను వొద్దికతో నీతఁడు || ఎంతే ||

తెల్లనికన్నుల మించుతేటతెలివి చూడరే
తొల్లిటిమోవిపై గురుతులు చూడరే
యిల్లిదె శ్రీవేంకటేశుఁ డిప్పుడు దా నన్ను గూడె
కల్లలు నిజముసేసి కరఁగించీ నీతఁడు || ఎంతే || 283 ||

## బౌళి

ఏల రట్టుసేసేవోయి యిదిగో ఆపె
తాలిమి సెగ్గరిదాన దండనున్నదాపె || పల్లవి ||

కోలుముందై మన మాడుకోనేటిమాటలెల్లాను
ఆలకించి వినవచ్చె నదివో ఆపె
వోలి సదమదములై వున్న మనపొందులెల్లా
వొలిమితోఁ జూడవచ్చె పొరుగున నాపె || ఏల ||

యీరీతి నేకతమున ఇద్దరము నుండఁగాను
కేరడాన నవ్వవచ్చెఁ గెరలి యాపె
సారె నొకరొకరము చనవులు మెరయఁగా
మేరమీరఁ దానువచ్చె మిక్కిలి నాపె || ఏల ||

యిత్తల నీవును నేను యెనయుచు నుండఁగాను
పొత్తులుగలయ వచ్చె పొదిగి యాపె
బత్తితో శ్రీవేంకటేశ పైకొన్న మేనవారము
కొత్తవావి చెప్ప వచ్చెఁ గొసరి యాపె || ఏల || 284 ||

గౌళ

ఏమిసేతునయ్యా నీ విందరికి సముఁడవు
ఆముకొని నినుఁ జూపి అందరి దూరీని || పల్లవి ||

యెట్టకేలకుఁ దనతో యెన్నఁడో నవ్వితివంటా
వట్టిసలిగెఁ బొరలీ వంతుకు నాపె
గుట్టున నొకకడ నీకొలువు సేసితినంటా
బట్టబయలు గర్వించి పరచీ సవతుల || ఏమి ||

తెరమఱఁగున నీవు ద్రిష్టించి చూచితివంటా
దొరతనాల మురిసీఁ దోడనె యాపె
ఇరవెఱఁగక నీవేమో మాటాడితివంటా
బెరసి పెచ్చు పెరిగీ ప్రియురాండ్లతోను || ఏమి ||

వూరకే యెప్పుడో పాదా లొత్తించుకొంటివంటా
తేరకె వేసాలుసేసీ దిక్కుల నాపె
గారవించి నేఁడు శ్రీవేంకటేశ నన్నేలితివి
దూరఁజూచి నీ పట్టపుతొయ్యలులఁ దాను॥ ఏమి ॥ 285 ॥

## సాళంగనాట

ఇదివో నీ భాగ్యము లిన్నిటా మెరసెనమ్మ
సదరాన నిటువంటి జన్మము గావలదా ॥ పల్లవి ॥

చెంతనుండి యాతఁడు నీ చెప్పినట్టు సేయఁగాను
పంతాలాడుకొననేలే పడఁతి
యింతటి సవతు లింద కియ్యకొని వుండఁగాను
సంతతము నీకుఁగల చలము లీడేరెనే ॥ ఇది ॥

సారెకు నాతఁడు నీ చనవు చెల్లించఁగాను
యీరీతి నెమ్మెలు చూప నింకా నేలే
నేరుపున సరివారు నీకింద నడవఁగాను
కూరిమితో నీవుగోరే కోరికె ప(ఫ?) లించెనే ॥ ఇది ॥

కుచ్చి శ్రీవేంకటేశుఁ డక్కున ని న్నుంచకుండఁగా
ఇచ్చకొలఁది నవ్వేవు యింతేసి యేలే
వొచ్చము లే కింతులెల్లా వూడిగాలు సేయఁగాను
తచ్చి నీవు పట్టిన వ్రతములు చేకూరెనే ॥ ఇది ॥ 286 ॥

## ముఖారి

ఏమిగాఁ జూచినాఁడే ఇప్పుడు నన్ను
వేమారు తను నంత వేసరించేదాననా ॥ పల్లవి ॥

కొప్పు దువ్వి న న్నితఁడు కొసరి వేఁడుకొనీని
అప్పటిమాటలకు నే నలిగేనటే
తప్పకచూచి నన్ను తగ నవ్వు నవ్వించీ
తప్పు లెంచి నేఁ దనతో తమకించేదాననా || ఏమి ||

పెనఁగి నావొడివట్టి ప్రియములు చెప్పీఁ దాను
వెనకటి సేఁతలకు విసిగే నటే
కనుసన్న సేసి నన్ను కమ్మటిఁ జొక్కించీని
మనసు సోదించి తనమర్మాలెత్తే దాననా || ఏమి ||

చేతులు చాఁచి నన్నుఁ జెనకి కాఁగిట నించీ
రా[1]తిటి పంతములకు రా[2]వాడేనటే
యీతల శ్రీవేంకటేశుఁ డీతఁడిట్టె నన్నునేల
యేతులకు నేఁ దనతో యెదురాడేదాననా|| ఏమి || 287 ||

## రేకు 1649 పాడి

అన్నిటా జాణఁడు దాను అదెఱఁగఁడా
కన్నెపాయపుమదము కారుకొనె ననరే || పల్లవి ||

చెలులచే నేనింకాఁ జెప్పిపంపవలెనా
తలఁపులోపలిమాట తా నెఱఁగఁడా
చెలప చెమట నిండె చెక్కులునుఁబులకించె
కొలఁదిలేని వలపు గుబ్బతిల్లీ ననరే || అన్ని ||

---

[1] 'రాత్రి' శబ్దము 'రాతిరి' కాగా దాని కడపటి వర్ణమునకు ఔపవిభక్తికమగు 'టి' ఆదేశముగా వచ్చినది కాబోలు. ఇది అపురూపము.

[2] రావు+ఆడేను. రావు=రాజసము, గాంభీర్యము ఇత్యాది అర్థముంతో నేటికి వ్యవహారమువగలదు. రాపైన మొగము ఇత్యాది వ్యవహారము సుప్రసిద్ధమే.

జిగిఁ గడితాన వ్రాసి చేతి కియ్యవలెనా
తగఁ జేసేపనులెల్లా తా నెఱఁగఁడా
నిగిడె నివ్వెరగులు నిట్టూర్పు లివె రేఁగె
చిగిరింపుఁదమకము చిమ్మి రేఁచీ ననరే || అన్ని ||

యితవైనరతులెల్లా యెచ్చరించవలెనా
తతి నాప్రియములెల్లా తా నెఱఁగఁడా
సతమాయఁ గూటము లిచ్చుటఁదా శ్రీవేంకటేశుఁ-
డతి సంతోషము నాకు నలవడె ననరే || అన్ని || 288 ||

## కాంబోది

ఊరకుండఁగదరే వువిదలాలా
మేరతోడివారికి మితిమీరవచ్చునా || పల్లవి ||

సలిగెగలవారికి సరసములాడవచ్చు
బలిమిగలవారికి పైకొనగవచ్చు
వలపుగలవారికి వాడికలు చూపవచ్చు
అలవోకవారికెల్లా ఆయా లంటవచ్చునా || ఊర ||

చుట్టరికపువారికి సుద్దులు చెప్పఁగవచ్చు
దిట్టతనపువారికి దీకొనవచ్చు
నెట్టుకొన్నవారికి నేరుపులు చూపవచ్చు
క[1]ట్టఁగడవారికెల్లాఁ గాఁతాళించవచ్చునా || ఊర ||

తగులుగలవారికి తమకము లెంచవచ్చు
సొగిసినవారికి సొలయవచ్చు

[1] కడ+కడ=కట్టగడ. అరసున్న విచార్యము.

అగపడి శ్రీవేంకటాధిపతి నన్ను నేలె
వెగటైనవారికెల్లా వేసరించ వచ్చునా ॥ ఊర ॥ 289 ॥

## సాళంగం

వేళైనదాఁకా మా విడిదికిఁబోయివచ్చే
డాలుమీర సిగ్గులు వడఁగనేల యిఁకను ॥ పల్లవి ॥

కొలువులో నుండి చెలి కొసరి మాటాడఁగాను
కలకల నవ్వు నవ్వి కాఁగిలించేవు
తిలకించి యిద్దరును తెరవేసుకొనరాదా
వలవనిజోలి యీడ వద్దు వద్దు ఇఁకను ॥ వేళై ॥

యేకతాన నుండి యాపె యెగసక్కేలు సేయఁగా
దాకొని తొడలపైఁ బాదాలు చాఁచేవు
లోకులు మెచ్చఁగ మేడలోనికైనఁ బదరాదా[1]
కైకొని పూరకుండఁ దగవు గాదు ఇఁకను ॥ వేళై ॥

గక్కన శ్రీవేంకటేశ కాంత నిన్నుఁ గూడఁగాను
ఇక్కడ నన్నేలితివి ఇంతలోననే
మక్కువ మీకు గలితే మా యింటికి రారాదా
పిక్కటిల్లీ వలపులు పెనఁగకు మిఁకను ॥ వేళై ॥ 290 ॥

## రామక్రియ

ఇద్దరును నొకటైతి రిఁకనేఁటికి
బుద్దులు బోదించఁబోతే వొసఁగీనా ఇపుడు ॥ పల్లవి ॥

---

[1] 'పోవు' ధాతువు రూపమైన 'పద' పై 'రాదా' అను ఘటకక్రియ చేర్చుట వింత. 'పోరాదా' వలె ఇది.

చేయెత్తి నీకు మొక్కె చెలియ కానుకలిచ్చె
చేయరాని విన్నపాలు సేసె నీతోను
నాయకుఁడ నీవాకెను నమ్మించితి వన్నిటాను
నాయములు చెప్పఁబోతే నవ్వు రాదా ఇఁకను || ఇద్ద ||

చేరి యాపె కూచుండె చిత్తము రా సేవసేసె
కూరిమి వేఁడుకొంటాఁ జెక్కులు నొక్కెను
నేరిపితి వీకతలు నీసొమ్ము సేసుకొంటివి
కారణా లడుగఁబోతే కడమ యేదిఁకను || ఇద్ద ||

సేసెవెట్టి నీపై నాకె చెలరేఁగి విడె మిచ్చె
ఆసతో శ్రీవేంకటేశ అక్కునఁ జేర్చె
వాసులెంచి నీవు నన్ను వలెనని కూడితిని
రాసికూటా లెంచఁబోతే రవ్వగాదా ఇఁకను ||ఇద్ద||291||

## కాంబోది

చెక్కుచేయిఁ దియ్యరాదు సిగ్గులువడక పోదు
ఇక్కువ నా తడఁబాటు నేమిసేతునే || పల్లవి ||

మొక్కఁగా వీడినకొప్పు ముడుచుకొనఁగఁబోతే
పక్కనఁ జన్నులమీఁదిపయ్యద జారె
దక్కెఁ దనపంతము తలఁచినట్టె ఆరు
యెక్కువనా తమకము నేమిసేతునే || చెక్కు ||

మీటఁగా గట్టినవీడెమెట్టు చక్కఁబెట్టఁబోతే
పాటించి బాహుమూలాలు బయటఁబడె
నూటఁబడఁ దననేర్పు చూచిన చూపు లీడేరె
యీటులేనినావలపు నేమిసేతునే || చెక్కు ||

వొరయఁగా వదలిన వొడ్డాణము పట్టఁబోతే
మురిపెపునాపోకముడి వీడెను
సరుస శ్రీవేంకటేశు సరసము నెరవేరె
యిరవైన పరవశ మేమిసేతునే || చెక్కు || 292 ||

## శంకరాభరణం

చూడవయ్య నీ సుదతివిలాసము
వేడుకకాఁడవు విభుఁడవు నీవు || పల్లవి ||

పున్నమవెన్నెల పోగులువోసీ
సన్నపు నవ్వుల జవరాలు
వన్నెలఁ గుంకుమ వసంతమాడీ
యిన్నిటాఁ గళలతో యీ మెఱుఁగుఁబోఁడి || చూడ ||

పాటించి తుమ్మెదపొఁజులు దీర్చీ
కాటుక కన్నుల కలికి
సూటి జక్కవల జోడలరించీ
నాటకపు గతుల నాభిసరసి || చూడ ||

అంగజు రథమున హంసలు (ల?) నిలిపీ
కంగులేని ఘనగజగమనా
యింగితపు శ్రీవేంకటేశ నిన్నెనసె
పంగెన సురతపు పల్లవాధరి || చూడ || 293 ||

రేకు 1650

శ్రీరాగం

వెన్నెలఁ గాయఁగాను వేసవందురా[1]
మన్ననలు చేకొని నెమ్మది నుండఁగదవే || పల్లవి ||

పగటున నాతఁడు పకపక నవ్వఁగాను
యెగసక్కెలెల్లా నీవు యేలాడేవే
తగినట్టెల్లా నవ్వుటఁ దగవులు నెరపఁగ
సగిడ నీ వింతలోనే నింద వేతురా || వెన్నె ||

పొదిగి నీ శిరసున పువ్వుల ముడువఁగాను
గుదిగొని నీ వతని గోర గీరేవే
వెదకి యతఁడు నీ వెంట వెంటఁదిరుగఁగా
పదిలాన మంచముపైఁ బవ్వళింతురా || వెన్నె ||

శ్రీవేంకటేశుఁడు నిన్ను జేరి కాఁగిలించుకోఁగా
చేవమీరి నీవేల సిగ్గు వడేవే
భావించి పెక్కురతులఁ బచారించి కూడినాడు
తావుల నీ నేర్పు చూపి తమకింతురా || వెన్నె 294 ||

మాళవిగౌళ

తనకేమే చెలియా దండకు రమ్మనవే
జునిగి తెరలో తొంగిచూడ నింత యేఁటికే || పల్లవి ||

వినఁగదె యీ మాట విభుఁడు యెవ్వతెతోనో
చెనకి గరిడీసాము సేసెనట

[1] వేసవి + అందురా = వేసవందురా.

కొనగోరు సోఁకెనట గొబ్బునఁ జెక్కులమీఁద
వొనరి సిగ్గున లోన నున్నాఁడట || తన ||

చూడవే యీతఁడే మరి సొగిసి వేరొకతెతో
వేడుక వసంతములాడినాఁడట
వీడక ఆకె తీగెట[1] వెంట్రుకలఁ జిక్కెనట
వోడ కొకరితోఁ జెప్పకున్నాఁడట || తన ||

అడుగఁగదె శ్రీవేంకటాధిపతి నాతోనే
యెడయక చెప్పి నన్ను నేలె నేఁడు
అడియాలాలాయనట అండనే యిద్దరి పొందు
జడియక యిన్నిటాను చరివాసినాఁడట || తన || 295 ||

బౌళి

మేలు మేలు కాంతలకు మేకుసేయ నేరుతువు
తాలిమితో నన్నిటా నాదరించనేరుతువు

పంతగాఁడ వౌదువు పదారువేలు సతుల
బంతిఁబెట్టి వొక్కమాటే భ్రమయించితి
యెంతవాఁడవైనా నౌదు వెమ్మెలకు సీతాదేవి-
నంతవట్టువారుఁ[2] జూడ నగ్గి బాస గొంటివి || మేలు

అలరుక్మిణిఁ బెండ్లాడి ఆకెయున్నను బోదిం (డిం?)చి
లలి సంతోసముగా సెలవు సేసితి
పొలసి సత్యభామకు పూవు దెచ్చి చేతికిచ్చి
యెలమి సవతులలో నెక్కుడు సేసితివి || మేలు ||

[1] తీగె+అటు (కా.శ్రీ.)
[2] అంతవట్టువారున్ = ఆ సమయమునకా ప్రాంతము నందున్నవారందరును

వీఁపున భూకాంత నిల్పి వేడుకతో శ్రీలక్ష్మిని
మోపుగా నే పొద్దు నురమున నించితి
కాపాడి మిక్కిలి నను( గరుణించి కాఁగిలించి
యేపున శ్రీవేంకటేశ యేలి మన్నించితివి ||మేలు||296||

## ఆహిరి

తలఁచిన తలఁపులు తలకూడీఁ గాక ఇఁక
కలిగిన నీ బత్తి కడమవడీనా || పల్లవి ||

యెవ్వతె రానికోపమో యెదలోనఁ బెట్టుక నే
నవ్వినాను వూరక వున్నాఁడవు నీవు
తవ్వితే నిసుకపాఁతరవంటిది వలపు
మవ్వపు వేడుకతోడ మాటలాడవయ్యా || తలఁ ||

వుమ్మడి నెందుకేఁగేవుద్యోగ మున్నదో నీకు
రమ్మని నేఁ బిల్వఁగాఁ బరాకు మానవు
చిమ్మిరేఁగి వూరేటిచలమవంటిది తమి
యెమ్మె చూప నెంతలేదు యింటికి రావయ్యా || తలఁ ||

అక్కడ నెక్కడిమాఁట లాలకించుకున్నాఁడవో
యిక్కువలు నే నంటినా యేమీ ననవు
చక్కని శ్రీవేంకటేశ జలధివంటిది యాస
యెక్కువ నన్నేలితివి యిట్టె వుండవయ్యా ||తలఁ||297||

## దేసాళం

రట్టడి కడపరాయఁ డిట్టె వీఁడు
గట్టిగా నేఁడిపుడు తగవు దేర్చరే || పల్లవి ||

చలము సాదించరాదు నముకానఁ గొంచరాదు
పలుమారు మాటలాడి పదరీ వీఁడు
మొలకచన్నులు నావి మొనలెత్తీఁదనమీఁద
చెలులార మాకు బుద్ధిచెప్పఁగదరే || రట్ట ||

పందెములడువరాదు పంతము విడువరాదు
కందువలు చూపి పొత్తుగలసీ వీఁడు
అందవు నాచూపు లివి అంటుకొనీఁ దనమీద
చందవు మావలపులు చక్కఁబెట్టరే || రట్ట ||

తమక మాఁపఁగరాదు తాలిమి చూపఁగరాదు
అమర గూడె శ్రీవెంకటప్పఁడు వీఁడు
చెమటల నామేను చేఁతసేసీఁ దనమీఁద
జమళి మమ్మిద్దరిని సారె మెచ్చరే || రట్ట || 298 ||

## సామంతం

కోరికె లీడేరె నేఁడు కోనేటిరాయ | ఇట్టె
కూరిముల వూటుకూరికోనేటిరాయ || పల్లవి ||

కుమ్మరించేవు సిగ్గులు కోనేటిరాయ | యీ–
కొమ్మలెల్లఁ జూడఁగాను కోనేటిరాయ
కొమ్ముువంటి కొనగోరఁ గోనేటిరాయ | మేను
కుమ్మెలుగా నొత్తకుమీ కోనేటిరాయ || కోరి ||

కొప్పగదు వెడజారె కోనేటిరాయ | నిండా
గుప్పేవు సెలవినవ్వు కోనేటిరాయా
కుప్పలింపుఁ జెమటలగోనేటిరాయ | యెంత
గొప్పవాఁడవయ్య నీవు కోనేటిరాయ || కోరి ||

కొండికపాయ మమరెఁ గోనేటిరాయ | పైఁడి-
గొండెలవచ్చడముతో గోనేటిరాయ
అండనే శ్రీవేంకటాద్రి నలరి నన్నేలితివి
కొండలలో నెలకొన్న కోనేటిరాయ || కోం || 299 ||

రేకు 1651 కాంబోది

ఏమి సేషించుకొంటివి యేమందు నిన్ను
కామించినవారికెల్లా కాఁతాళము వుట్టదా || పల్లవి ||

చీటి వ్రాసి యెవ్వతే నీ శిరసునఁ జెక్కినది
చాటువగా నేనది చదువుకొంటి
తాటించి నీ మోవెల్లా తన యెంగిలేయుట
ఆఁటది యీ మాట వింటే అంట సిగ్గు గాదా || ఏమి ||

కోరి ముద్దుటుంగరము కొంగుతోఁ గట్టినది
తేరి చూచి ఇది నేఁ దెలుసుకొంటి
బోరున నీమేను తానే భోగించినదనియేమో
బారచాఁచె నీకాఁగిలిపైఁ బంతము గాదా || ఏమి ||

పూవులదండ నీ మెడఁ బూఁచి సింగారించినది
శ్రీవేంకటేశుఁడ నేను భావించుకొంటి
నీ వొళ్లెల్లాఁ దనకే నిర్మాల్యమనుటది
యీవేళ నన్నేలితివి యిఁకఁ గొత్తగాదా || ఏమి || 300 ||

ముఖారి

ఇందాఁకా నేడ నుంటివి యెదురుచూచె నీకు
చిందీ నెలవి నవ్వు చిమ్మరేఁగుచు || పల్లవి ||

ముద్దుల పెదవిమీఁద ముక్కర గదలఁగాను
వుద్దండపు మాట లాడె నువిద నిన్ను
కొద్దిమీరి నొసలిపై కుంతలా లల్లాడఁగాను
గద్దించి బొమ్మల నీపై కాతరాననను || ఇందాఁ ||

మెఱుఁగుఁ జెక్కులమీఁద మించుఁజెమటలు నిండ
వుఱిముఱిమి చూచీని వొరసి చెలి
జఱసి చన్నులమీఁద జారుఁబయ్యదతోడ
గుఱిగాఁ జేతులు చాఁచి కొసరీ బీరాననను || ఇందాఁ ||

చక్కనిమేనెల్లా జొజుకొనఁ బులకించి
మిక్కుటమై కూడె నలమేలుమంగ
ఇక్కువ లంటి శ్రీవేంకటేశ నిన్ను మెప్పించి
చొక్కించె రతుల నేఁడు సులభాననను || ఇందాఁ || ౨01 ||

లలిత

నీ వల్లనే యీ చేఁతలు నెట్టన బాయిటఁ బడె
కావరించఁ జుమ్మీ ఇచ్చకము సేసితిఁగాని || పల్లవి ||

నవ్వొలించి వుండఁగాను పక్కనఁ దెరవేసితే
నవ్వు లేమి నవ్వేవు నాతో నీవు
యెవ్వలెకుఁ గాచుకుండే దెరఁగఁ జుమ్మీ నేను
చివ్వన నుపచారము సేసితిగాని || నీవ ||

వేళతో వేగించఁగాను విడేలు వద్దఁ బెట్టితే
ఏల సిగ్గులువడేవు యింతలో నీవు
వాలాయించి వేరొకతె వచ్చేది యెఱఁగఁజుమ్మీ
మేలిమి నా వూడిగాన మెప్పించితిఁగాని || నీవ ||

పురాన నలమేల్మంగ వుండఁగా నీకు మొక్కితే
వెరవు లేమి యెంచేవు వేసాన నీవు
నిరతి శ్రీవేంకటేశ నే నిన్నుఁబెండ్లాడితి
విరసముగాదు సుమ్మీ వేడుకగాని ॥ నీవ ॥ 302 ॥

బౌళి

నెరవేరెఁ బనులెల్లా నీ భాగ్యమాయ నిఁక
వెరగుపడి నీవేమి విచారించేవయ్యా ॥ పల్లవి ॥

నెట్టుకొని జవరాలు నీ పాదాలు గుద్దఁగాను
చుట్టి యెవ్వతె కెదురు చూచేవయ్యా
ముట్టి మడిచినయాకు మోవికి నందియ్యఁగాను
గుట్టున లోలో నేమి గోరేమయ్యా ॥ నెర ॥

సమ్మతించి నీతో నాపై సరసములాడఁగాను
కిమ్ముల నే మాట లాలకించేవయ్యా
కుమ్మెలుగా నురమున కుచముల నొత్తఁగాను
పిమ్మట నెక్కడ పెండ్లిపీఁట యెక్కేవయ్యా ॥ నెర ॥

అలమేలుమంగ నిన్ను నదె కాఁగిలించఁగాను
అలరి యేఁటికి వెరగందేవయ్యా
యిల శ్రీవేంకటేశ న న్నీకె యేలించఁగాను
నలువంక మరియేమి నవ్వు నవ్వేవయ్యా ॥ నెర ॥ 303 ॥

వరాళి

వెంగెమాడఁ బనిలేదు వెస నొకరొకరికి
సంగతాయ నీ పొందు జమళి నిద్దరికి ॥ పల్లవి ॥

హొత్తులఁ గూచుండి యాపె వూఁచి చేతికియ్యఁగా
ఇత్తల నీ వందిచ్చేవు ఇదివో నాకు
బత్తి నీవు నాపైని పడఁతికి నీ మీఁదను
హత్తి వున్న విద్దరిపుణ్యములు మంచివే || వెంగ ||

ఆకె దనతొడమీఁద నటు నిన్నుంచుకొనఁగ–
నీ కడ నీతొడపై నన్నిదుకొంటివి
నీకు నేను ప్రియమైతి నీ వాపెకు బాఁతైతివి
పైకొని ఇద్దరి తపః ఫలములు మంచివే || వెంగ ||

వెలినుండి వచ్చి యాకె వేడుక నిన్నుఁ గూడితే–
నలమేల్మంగనైన నన్నలమితివి
వలతువు నీవు నాకు వనిత నీకు మోహించె
యెలమి శ్రీవేంకటేశ యీరెండు మంచివే ||వెంగ||304||

హిందోళం

ఇందు కాపెను రప్పించు యెవ్వరైరేమి
విందులకుఁ దిరుగఁగా వెంగెమాడేనా || పల్లవి ||

యీపొద్దు వొంటె నుండఁగా యింటికి రమ్మంటేఁగాక
ఆపెతో మాటలాడఁగా అదేలనేనా
యేపున నీతలఁపోత యెఱఁగ కాడితిఁగాక
కాపురాలు సేయఁగాను కాదనేనా || ఇందు ||

విన్వెరగుతో నుండఁగా విన్నెంచరించితిఁ[1] గాక
యెవ్వతెకు మోహించినా యేఁటికనేనా

[1] 'విన్నెవ్వరించితి' అని కాలోబు ( కా.శ్రీ.)

నివ్వటెల్లు నీ గుణము నిశ్చయించనైతిఁ గాక
అవ్వలఁ బెండ్లి పనికి అరడి సేసేనా || ఇందు ||

పానుపుపై నుండఁగాను పాదము లొత్తితిఁగాక
యేనెలఁతకుఁ బొంచినా యెడచొచ్చేనా
కానిమ్మని నన్ను శ్రీవేంకటేశుఁడ కూడితివి
మానని చుట్టరికము మఱపించేనా || ఇందు || 305 ||

రేకు 1652 సాళంగనాట

సంతకూటాలవారెల్లా సతమయ్యేరా
మంతుకెక్కిన నామేలు మఱవకు మిఁకను || పల్లవి ||

పంతమాడేదానఁ గాను పలుమారు నీతోను
రంతుసేయని ఇచ్చకురాలఁ గాని
బంతికూటిసతులెల్ల పనికివత్తురా నీకు
వంతుకుఁ, బెండ్లాడినటువంటివారే కాక || సంత ||

కక్కసించేదానఁ గాను కాదుకూడదని నీతో
దక్కివుండే చిత్తములోదానఁ గాని
పక్కఁ గూచున్నవారెల్లా బందుగులౌదురా నీకు
గక్కన నీకు మేనరికపువారే కాక || సంత ||

వేసరించేదానఁగాను వేడుక శ్రీవేంకటేశ
ఆసతో నిన్నుఁ గూడిన అలఁగాని
వేసాలపొరుగువారు వేళకొదిగేరా నీకు
వాసి వింట(టి?) వరుసకు వచ్చేవారే కాక ||సంత||306||

## సామవరాళి

ఇంత గద్దా పట్టి రట్టు యెందాఁకాను
పంతము నెఱపుదురా పతితోను || పల్లవి ||

పిలిచితే రావలె ప్రియము చేకొనవలె
చలపాదితనమేలే సతికి
సులభాన నవ్వవలె సూటికిఁబెనఁగవలె
బలిమి చూపుదురా పతితోను || ఇంత ||

కరుఁబొందు సేయవలె కనుసన్న నుండవలె
గడుసుఁదనము లేలే కాంతలకు
అడరి మాటాడవలె అంకెకు లోఁగావలె
బడి బడి సొలతురా పతితోను || ఇంత ||

యింగిత మెఱఁగవలె ఇచ్చకము సేయవలె
వెంగలితనము లేలే వెలఁదికి
అంగవించి కూడితివి అలమేల్మంగవు నీవు
పంగింతురా శ్రీవేంకటపతితోను || ఇంత || 307 ||

## రామక్రియ

కంటిమి నేఁ డీకొత్తలు కన్నుల పండుగలాయ
జంటలైన మీలోని జాణతనా లెట్టివో || పల్లవి ||

కోమలపు నీకాంత గుబ్బలపై మెఱుఁగులు
మోమున నీకు గళలై ముంచుకొన్నవి
యేమి సూత్రమోకాని ఇందుకునందుకు నేఁడు
తామర మొగ్గల సొంపద్దముపై నిలిచెను || కంటి ||

కదు మంచి జవరాల కనుగవచేటలు నడుమ
నడుమ నీమోవిమీఁద నవ్వులాయను
యెడయక యీరెంటికి నేమిగారణమోకాని
అడరి కలువలనిగ్గంటెఁ జిగురులను || కంటి ||

అలమేలుమంగ నీయండఁ బాయకుండితేను
నెలవై శ్రీవేంకటేశ నీవు గూడితి
యెలిమి నాపై నీకు నెన్నటి పొందోకాని
కలసి మెఱుఁగుదీవె కల్పకముఁజెందెను || కంటి || 308 ||

## దేసాళం

అన్నిటా భాగ్యవంతుఁడ వౌదు వయ్యా
సన్నలు సేసీ నిదె చక్కని జవరాలు || పల్లవి ||

మోము చూచి నీ మీఁద మోహము చల్లీ నేఁడు
ప్రేమగల సేసపాల పెండ్లికూఁతురు
చేముట్టి సరసమాడి సేవలెల్లాఁజేయఁజొచ్చె
ఆమని నవ్వులతో మోహపు దేవులు || అన్ని ||

మల్లాడి యడుగులకు మడుగులు వరచీని
చెల్లుబడిగలిగిన చెలిమికత్తె
వుల్లము గరఁగను నీ వొడివట్టి పెనఁగీని
బల్లిదురాలైన నీ పాయరాని చుట్టము || అన్ని ||

గక్కన నిన్నుఁజూచి కాఁగిటఁ బాయక కూడె
మిక్కిలినేర్పుల యలమేలుమంగ
ఇక్కువతో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
పక్కఁ బాయ దక్కుమీఁది బంగారు పతిమ ||అన్ని||309||

## మాళవిగౌళ

దేవ దేవ జగన్నాథ దివ్యమూరితి
చేవదేరే సింగారాన చిత్తగించు మీఁకను || పల్లవి ||

కలికి పిఱుఁదు నీకు ఘనచక్రముల తేరు
బలుచనుగుబ్బల[1] పైఁడి కుండలు
అలరిననడపులె హంసవాహనములు
కెలన నీకెఁగైకొని గెలువుము మరుని || దేవ ||

వరుస మించుఁ బయ్యెద వ్రాతలపెనుటెక్కెము
యిరుదెసల చెక్కులె యివె యద్దాలు
మొరయుగంటలతోడిమొలనూళ్లె పగ్గములు
వరగ నీకెఁ బెండ్లాడి వచారించు వంతము || దేవ ||

కొదలేనిహారమునే కుచ్చుల వూదండలు
చదల నఁః మేల్కొంగే సామ్రాజ్యము
యెదుట శ్రీవేంకటేశ యీకె నిట్టె కూడితివి
వదలక మన్నించి వన్నెకెక్కు రతుల || దేవ || 310 ||

## బౌళి

కాంత వద్దనే వున్నది కాఁగిలించుకొమ్మనవే
వంతల నెవ్వరైనాను వలదనేరా || పల్లవి ||

యెన్ని వేసాలు నేసీనే యీతఁ డాకెకు వలచి
వెన్నెలలు వేఁడులంటా వెరగందీని

[1] 'గుబ్బలె'. అవధారణమున ఏకారము వీరిలో అరుదు

విన్నవారుఁ గన్నవారు వెస నవ్వేదెఱఁగఁడు
వన్నెల పూవుటమ్ములువాండ్లనీని || కాంత ||

యింత బూటకములేలే యీపె భ్రమలకు లోనై
కంతుఁడు దోసకారెని[1] కదు దూరీని
చెంతల నిందరిలోనా సిగ్గువడ నేరఁడు
పొంతనున్న చలిగాలి బూత మసీని || కాంత ||

ఆగడాలు నేర్చెఁగదె అలమేలుమంగఁ గూడి
సోగ కన్నులను నవ్వి సొంపు మీరీని
యీగతినె శ్రీవేంకటేశుఁ డిదె నన్ను నేలె
బాగుగా బెక్కురతుల పంతమాడీని || కాంత || 311 ||

## రేకు 1653 శుద్ధవసంతం

ఎంతకు నేరవు నీవు యేమిచెప్పేది
చెంతల నీ వేసాలకు సిగ్గయ్యీ నాకు || పల్లవి ||

తెలమఱఁగున నాపె దిష్టము కత చెప్పఁగా
వరుస మాచెలి విని వచ్చెను నేఁడు
శిరసెత్తి నీమాటలే చెల్లఁబెట్టే వప్పటిని
అరుదయ్యీ నిన్నుఁ జూచి అంతలోనే నాకు || ఎంత ||

సంగడిఁ గూచుండి యీపె సరసములాడఁగాను
చెంగటఁ జూచివచ్చి చెప్పె మాసతి
అంగడిఁబడ్డవలపు అంతలోనే దాఁచేవు
వుంగిటి నీవోజకు నవ్వులు వచ్చీ నాకు || ఎంత ||

---

[1] దోసకారి + అవి.

గక్కనఁ బాన్పుపై నాకె కాఁగిట నిన్నుఁగూడఁగా
ఇక్కువఁ దెలిసివచ్చె నిదె మాకాంత
వొక్కటై శ్రీవేంకటేశ వొగి నన్నుఁ గూడితివి
చొక్కి యలమేల్మంగను సొద్యమయ్యీ నాకు ||ఎంత||312||

## కాంబోది

అదుగరే ఆతనినే అవునోకాదో
వెడ వెడ మాటలెల్లా వేడుకలౌనా || పల్లవి ||

మనసురానిచోట మగుడి మగుడి వచ్చి
చనవులు నెరపితే సంగతులౌనా
పెనఁగుతా నుండఁగాను ప్రియములు పచారించి
చెనకఁబోతేఁ దనకు చేతికి లోనాదురా || అదు ||

చలము సాదించేవేళ చవులు సేసుకొని
పిలిచి విందుచెప్పితే ప్రియము లౌనా
వలపు చాలకుండఁగా వడివెట్టి వడివెట్టి
బలిమిఁ గాఁగిలించితే బత్తి సేతురా || అదు ||

సిగ్గువడివుండఁగాను చెక్కునొక్కి వేఁడుకొని
వొగ్గి విడెమిచ్చితేను వొడఁబాటౌనా
అగ్గమై శ్రీవేంకటేశుఁ డలమేల్మంగను నేను
కగ్గులేక కూడె నిఁకఁ గపటము లెంతురా ||అదు||313||

## పాడి

అడకుఁ బోయిరావయ్యా అన్నీ విన్నవించేఁగాని
యీాడ మాతోడిపొందులు యేకాలముఁ గలవే || పల్లవి ||

చిత్తము రంజిల్ల నీవు చెప్పినట్టల్లాఁ జేసి
మెత్తనిమాట లాడి మెప్పించె నాపె
గుత్తపు గుబ్బలు సోఁక కొప్పు నీకుఁ జిక్కఁబెట్టి
చిత్తజకేళికి నిన్నుఁ జిమ్మిరేఁచె నాపె || అడ ||

తనపైఁ బరాకుసేసి తమి నీకు బుట్టించి
వినయములనే దక్కఁగొనె నిన్నాపె
కొనగోళ్లు మోవ చెక్కులను జవ్వాది మెత్తి
కనుసన్న రతులకుఁ గైకొలిపె నాపె || అడ ||

తెరమఱుఁగుకుఁ దీసి తియ్యనిమోవి యొసగి
మరిగించె నలమేలుమంగే యాపె
గరిమ శ్రీవేంకటేశ కలసితి విటు నన్ను
సరసపునవ్వులను చవిచూపె నాపె || అడ || 314 ||

## సామంతం

ఆపెకు నీకుఁ దెలుసు నంతరంగపు సుద్దులు
కోపగించఁ బనిలేదు గోవిందరాజ || పల్లవి ||

యెంత చనవిచ్చితివో యీపెకు నీవు నేఁడు
వంతులు వాసులుఁ బట్టీ వడిగా నీతో
పంతగత్తె గానోపు పలుమారు నీకె నిన్ను
కొంతపుఁ జూపులఁ జూచీ గోవిందరాజ || ఆపె ||

యేరీతి వాడఁబాటో యీకెనీసందిఁ దొల్లి
మేరతో మాటాడి మందెమేళముఁ జూపీ
నేరుపరి గాఁబోలు నిన్నుఁ గదుఁబచారించి
కూరిములు గొసరీని గోవిందరాజ || ఆపె ||

బాసలేమి సేసితివో పలుమారు నీకె నీతో
రాసికెక్కఁ గూడి మేరలు మీరిని
వేసాలది గాఁబోలు శ్రీవేంకటాద్రి నన్నేలఁగా
గోస నాసచేసీని గోవిందరాజ || ఆపె || 315 ||

## కాంబోది

ఊరకే గుట్టుతోడుత నుండుటగాక
కూరిములు పచరించి కొసరఁగవచ్చునా || పల్లవి ||

దయదలఁచుక నీవే దండకు వచ్చితిగాక
నయాన నిన్ను రప్పించ నావసమా
నియతపు నీ బాస నెరవేర్చుకొంటిగాక
ప్రియమున నీ గుణము భేదించవచ్చునా || ఊర ||

లోకము మెచ్చవలసి లోనైతివిగాక
నాకు చేకొని నిన్ను గరఁగించే దాననా
యీకడ నీ కీర్తికి ఇటు నన్నేలితిగాక
దాకొని చిత్తము రా నేస్తము సేయవచ్చునా || ఊర ||

తగవెంచుకొని నన్ను తతిఁ బెండ్లాడితిగాక
తగుఁబొంతనాలు నీకు తలఁపించేనా
నగుతా శ్రీవేంకటేశ నన్ను మన్నించితిగాక
మిగులా నిన్నొరయుచు మెప్పించవచ్చునా || ఊర || 316 ||

## లలిత

మందలించి యతనికి మంచిదానివలెనే
యిందులోనే చూపేవే ఇతవు లెల్లాను || పల్లవి ||

అవ్వలి నీరమణుని నాడఁగలవెల్లా నాడి
నవ్వితిననే వవునే నాలికత్తెవు
పువ్వులను నొవ్వవేసి పుప్పొడి మోమునఁ జల్లి
నివ్వటిల్ల వసంతము నే నాడితిననేవు || మంద ||

చెనకులు మేన నిండా సేయఁగలవెల్లాఁ జేసి
పెనఁగితి ననేవేమే బేసబెల్లివి
కొనచూపులనుఁ జూచి కొంగువట్టి చేతఁ దీసి
లనువుగా వేఁడుకొంటినని యాడేవేమే || మంద ||

అలయించి రతిఁగూడి అంగము లెంగిలిచేసి
వలచినజాడనేవే వైపులాఁడివి
యెలమి శ్రీవేంకటేశు నిటు నన్ను నొనగూర్చి
తెలిపి యందరికిని ద్రిష్టము చూపేవే || మంద || 317 ||

## రేకు 1654 వరాళి

నవ్వు వచ్చీ మిమ్ముఁ జూచి నాకు నేఁడు
కువ్వలై వలపు గుదివచ్చినట్లాయను || పల్లవి ||

పెట్టినవయ్యెదకొంగు పెనుచెమటలచేత
గుట్టుతోడనే చెలికి గుబ్బల నంటె
పట్టరానిసిగ్గుతో నీ పచ్చడము గప్పుకొనె
నెట్టుకొన్న రమణుఁడ నీ భాగ్యము లాయెను || నవ్వు ||

మోవిదొండపండు సతిముంజేతి చిలుకచే[1]
కావరించి తొడుకఁగా[2] గంటి వడెను

[1] 'చిలుకచే = చిలుకచేయు' కావలె.
[2] 'తొడుకఁగా' అనునది అంతర్భావిత ప్రేరణార్థకముగానైన కావలె.

వావిరి సిగ్గుతో నీ వదనానఁ జిక్కించె
రేవగలు విభుఁడ కోరిన కోర్కులాయను || నవ్వు ||

జలజాక్షి నిలువెల్లా జవ్వనమదముచేత
చెలరేఁగి పులకలు చిమ్మ రేఁగెను
కలికి సిగ్గుతో నిన్నుఁ గాఁగిలించుకొనె నేఁడు
నెలవై శ్రీవేంకటేశ నీకు వేడుకాయను ||నవ్వు||318||

## పాడి

చెప్పరాదు నీవు వలచిన సొంపులు
లప్పలై రాలె గందము లగ్గదింపులు || పల్లవి ||

కలికి నీపైఁ జల్లీ కనుచూపులు
తలపోయ నీకవి తరితీపులు
తొలఁకించీఁ జన్నులను తోదోపులను
మలసితే మారుకొనీ మరుతూపులు || చెప్ప ||

చెంది నెలవులఁ జిమ్మీ చిఱునవ్వులు
యిందరిలో నీకు నవి యెడదవ్వులు[1]
కందువ నీతో సిగ్గులు కమ్మఁ బువ్వులు
దిందుపడ్డయీపెకొప్పు తేఁటికొవ్వులు || చెప్ప ||

కెరలి చేకొనీ నీ కాఁగిటిపొందులు
మరుగకు నీకు నవి మాటుమందులు
మురిపేనఁ గూడి యిచ్చె మోవివిందులు
యిరవై శ్రీవేంకటేశ యిదె సందులు || చెప్ప || 319 ||

---

[1] యెడదవ్వులు = హృదయమును తవ్వుటలు.

## రామక్రియ

నిరతపుజాణ వవుదు నేరుపరి వౌదువు
నరసమెంతాడేవు చాలు నుండఁగదవే || పల్లవి ||

వుక్కువంటిది నీగోరు వాగి నాటుఁజేసుఁ బతి
చెక్కులేల నొక్కేవే చెలియ
మొక్కకు అప్పటి నీ ముద్దుటుంగర మాతని-
చక్కనిపాదము లొత్తిఁ జాలు నుండఁగదవే || నిర ||

కొండలు (ల?) వంటి చన్నులు కుమ్మెలుగాఁ దాఁకుఁ జేసు
అండనేల కాఁగిలించే వతివా
పండే వాతని పక్కను బంగారువంటినీమేను
చెండిగాఁ గాఁకలు సేసీఁ జాలు నుండఁగదవే || నిర ||

అమ్ములవంటివి కన్ను లాయము లంటుఁ జేసు
వమ్మి యాతని చూచేవు పడఁతి
ఇమ్ముల శ్రీవేంకటేశుఁ డిటు నన్ను నేలినాడు
నమ్మతిగాఁ గూడితివి చాలు నుండఁగదవే || నిర || 320 ||

## సామంతం

సిగ్గువడి నీలో నీవే చిరునవ్వేల నవ్వేవు
అగ్గలమై మాతోనైనా నాలోచించరాదా || పల్లవి ||

వెలఁది నీచెవిలోన విన్నవించినయందుకు-
నలరి మారుత్తరము లానతీరాదా
చలివాయ గోర నూఁది సన్న సేసినయందుకు
తిలకించి యీపెచేతఁ దెలుసుకోరాదా || సిగ్గు ||

చీటి వా(వ్రా?) సి నీచేతికి చెలి యిచ్చినయందుకు
పాటించి యర్థములు చెప్పఁగరాదా
తాటించి ప్రియములు చెప్పి తప్పక చూచినందుకు
జాటరితనాన మేను సోద నియ్యరాదా || సిగ్గు ||

కాఁగిటిలో వినయాలు కాంత సేసినయందుకు
వేఁగదేర నిందరిలోఁ జెప్పకోరాదా
వీఁగక శ్రీవేంకటేశ వెస నన్నుఁ గూడితివి
మాఁగిన మోవి యిచ్చి మన్నించరాదా || సిగ్గు || 321 ||

## ఆహిరినాట

ఇటు నీకు మగఁడైతే నిది యలవాటులా
కటకటా జంకించేవు కనుగందదా || పల్లవి ||

సన్నలకు లోనైన జవ్వనపు మగవాని
కన్నుల నింత చూచితే కాఁడి పారదా
పిన్నదానవైనుండి బెట్టిమాట లాడేవు
చెన్నుఁడాతని వీనులు చీదరలు గొనవా || ఇటు ||

యేఁకటతోనుండేటి ఇచ్చకపురమణుని
కాఁకలనవ్వు నవ్వితే గరివడడా
వీఁకతో నీ నాయకుని వెసఁ జన్నుల నొత్తేవు
తేఁకువ నాతనిమే నొద్దికఁ గాయగావదా || ఇటు ||

చిత్తము కోమలమైన శ్రీవేంకటేశ్వరుని
తత్తరించి పొందితివి తమి రేఁగదా
యిత్తరి నన్నేలినాఁడు యిందరిలోపల నేఁడు
కొత్తలు సేసితే మతి గుబ్బతిల్లదా || ఇటు || 322 ||

## శంకరాభరణం

ఏమే యిది నీ వెఱఁగనిదా
కామించి పొలయఁగాఁ గసరుదురా || పల్లవి ||

నంటున నీతో నవ్వేరమణుని
గొంటుఁదనంబున గుంపింతురా
అంటుచు నీచన్ను లటు గని మొక్కఁగ
వెంటగా నానలు పెట్టుదురా || ఏమే ||

తమకపు టాసల తప్పక చూచితే
నముకానఁ బతిని జఱయుదురా
ప్రమదంబున నీ పాదము దొక్కఁగ
జమళి బొమ్మలను జంకింతురా || ఏమే ||

శ్రీవేంకటేశుఁడు చేరి కూడె నిను
లావగురతుల నలయింతురా
కావరించి మరిఁ గాఁగిలించఁగా
అవలఁ బంతాలాడుదురా || ఏమే || 323 ||

రేకు 1655 గౌళ

నీ గుట్టు దెలియరాదు నిందుక వున్నాఁడవు
యేగతి నీసేవ సేతు మెఱఁగించవయ్యా || పల్లవి ||

చెక్కులపైఁ జెమటలు జిగిమించి వూరఁ జొచ్చె
యెక్కడఁ దలఁచితివో యెఱఁగ నేను
చక్కని నీ కెమ్మోవి జడియుచు వసివాడె
వెక్కుమాట లెవ్వరితో బెఱసి యాడితివో || నీగు ||

విలువెల్లాఁ బరాకులె నెయ్యమునఁ గానుపించె
వల పెందునున్నదో నీవైపు దెలియు
తిలకింప నీ కన్నులతేటలలో కెంపు మీరె
తలఁక కెవ్వతెదిక్కు తప్పక చూచితివో || నీగు ||

సిగ్గులు మోమున ముంచి సెలవుల నవ్వు దేరె
వొగ్గి యెవ్వతెఁ గూడితివో ఇదెంచను
యెగ్గులేక శ్రీవేంకటేశ మమ్ము నేలితివి
కగ్గదేరె నెటువంటికతలు నేర్చితివో || నీగు || 324 ||

## దేసాళం

నే మెఱఁగమా అది నీవు చెప్పనేమిటికి
కాముకుఁడైనవాఁడవు కఱఁగఁగ నేరవా || పల్లవి ||

వక్కణలో నాపెకు వలచినవాఁడవు
గక్కన నింతేసి పొగడనేరవా
చిక్కించుక సేవలెల్లాఁ జేయించుకొన్నవాఁడవు
మిక్కిలి నీ వాపెను మెచ్చనేరవా || నేమెఱఁ ||

కోరి వేఁడి యాపెఁ దెచ్చుకొనిన యట్టివాఁడవు
గారవించి మన్నించ మిక్కడ నేరవా
కారుకమ్ముఁ బచ్చడము గప్పిన యట్టివాఁడవు
సారె సారె సిగ్గులెల్ల జరపఁగ నేరవా || నేమెఱఁ ||

చలమున నాకెమోవి చవిగొన్నవాఁడవు
సొలసి సొలసి లోలోఁ జొక్కనేరవా

కలసితి విటు శ్రీవేంకటగిరీశ్వర నన్ను
తలఁచి ఇద్దరిని సంతము[1] సేయనేరవా || 325 ||

## బౌళి

నీమాటలు నిన్నే మోచె నెంతపంతము చెల్లె
యేమనేవు మాతో నానతియ్యవయ్య యిపుడు || పల్లవి ||

వలచి యాపె నీమై వడిఁ జేఁతలు సేసితే
చెలితో మారుకుమారు సేసే నంటివి
సెలవి నవ్వులతోడ చేతులెత్తి మొక్కె నీకు
మలయుచు నీ వింక మారు మొక్కఁగలవా || నీమా ||

గుట్టుతో నాపె నిన్నుఁ గోరి తిట్టు దిట్టితేను
అట్టె మాటకుమాట లాడే నంటివి
బెట్టి యెలుఁగెత్తి నిన్ను బ్రియము చెప్పిపొగడె
పొట్టఁ బొరుగున నాపెఁ బొగడఁగఁ గలవా || నీమా ||

ఇచ్చగించి యాపె నీకు యెంగిలిమోవి ఇచ్చితే
ఇచ్చినందుకును సరి ఇచ్చేనంటివి
కొచ్చి శ్రీవేంకటేశుఁడ కూడి మడిచి యాకిచ్చె[2]
నిచ్చలు నిట్టె యాపెకు నీవూ నియ్యఁగలవా ||నీమా||326||

## రీతిగౌళ

అన్నిటా నాగుణమెల్లా నాతఁ డెఱుఁగు
నిన్ను మెప్పించనేర్చిన నెరజాణ నేను || పల్లవి ||

---

[1] 'సంతము' శాంతశబ్దభవము కాబోలు. అర్థమూ అదే.
[2] అకు + ఇచ్చె.

రెప్పలెత్తి చూచి నీవు రేసులు పుటించకువే[1]
యెప్పుడు రమణునికి ఇల్లాల నేను
చప్పనిమాట లాడి చవులు దప్పించకువే
చిప్పిల నీతో సాగుసేసిన దాన నేను || అన్ని ||

సెలవుల నవ్వునవ్వి సిగ్గులువరచకువే
తలఁపులో నుండే మేనదాన నేను
బలిమిఁ బట్టి పెనఁగి బయలీఁదించకువే
చలములకైతే నీతో సరిదాన నేను || అన్ని ||

మరిగించి నీ వింత మనను సోదించకువే
తిరమై శ్రీవేంకటేశుదేవుల నేను
పొరి నీ వాతనిఁ గూడి పొత్తులు గలపకువే
సిరుల నీ కొద్దికైన చెల్లెల నేను || అన్ని || 327 ||

## నాదరామక్రియ

సవతివి నీ విన్నిటా జాణవైతివి
వువిదరో యింటిలోన నుండె తనిసితిమే || పల్లవి ||

చనవరివాదువే సంగడిఁగూచుందానవు[2]
ననిచెనే మీ పొందులు నవ్వే రిద్దరు
యెనసి మేమైతేను యింతేసి నేరమైతిమే
మొనసి పెండ్లాడినందె మొగిఁ దనిసితిమే || సవ ||

పొందైనదాన వాదువే పూనుక వచ్చేవు నీవు
ముందే చుట్టాలవుదురే మొక్కులాడేరు

---

[1] 'రేసులు పుట్టించకువే' వ్రాయసగాని తప్పు (కా.శ్రీ.)
[2] ఉన్న+దానవు = ఉందానవు (కా.శ్రీ.)

పందేలు వేసి నీవలె బయలీఁదించ మైతిమె
కందువఁ గంకణములు గట్టి తనిసితినే || సవ ||

బత్తిగలదానవె పైపై సేవలు సేసేవు
పొత్తు మీకుఁ గలసునే బువ్వా లందేరు
యిత్తల శ్రీవేంకటేశుఁ డిటు నన్ను నేలినాఁడు
హత్తి సేసలువెట్టినయందె తనిసితిమే || సవ || 328 ||

కాంబోది

పడఁతి నింతె నన్నేల పచ్చిసేసీనే
తడఁబడ నీ సుద్దులు తనకే యమరునే || పల్లవి ||

బగ్గన నాలిమగనిఁ బలకలో వా(వ్రా?)సి తెచ్చి
సిగ్గువడఁగానే నాచేతి కిచ్చీనే
యెగ్గులేక యిది దన కెవ్వతె నేర్పెనో కాని
అగ్గమైన దొరలకు నవి వోజలటవే || పడఁ ||

గబ్బియాడోమాఁటలు చిల్కలకెల్లాను నేరిపి
వుబ్బించి మాయింటికాడ నొప్పగించీనే
జొబ్బిల నే పొస్తకానఁ జూచుకొనెనోకాని
నిబ్బరపుజాణనికి నేమ మిదియటవే || పడఁ ||

చప్పుడు సగినాల మంచముపై నన్నుంచుకొని
కప్పి తలవంచుకోఁగాఁ గాఁగిలించీనే
ఇప్పుడె శ్రీవేంకటేశుఁ డెక్కడఁ దెచ్చెనోకాని
తప్పులేవి ఘనునకు తగ నిదొనటవే || పడఁ || 329 ||

రేకు 1656 ఆహిరినాట

ఇంతి నేలుకోవయ్య యిది మొదలు
వంతు(త?)లకు బెట్టీ నిదె వలపుల వెదలు || పల్లవి ||

మగువ నీకుఁ గొనెమరులు
వెగటుగఁ గాముఁ డేసె విరులు
నిగితి వీడెఁ గొప్ప నెరులు
తగ నీకుఁ గానుకిచ్చె తనకుచగిరులు || ఇంతి ||

సుదతి నీ కెదురంపెఁ జూపులు
తుద నొక్క టొకటిపై తో దోపులు
మదితలపోత రేపుమాపులు
కదియ కింత సేతురా కడుఁ దరితీపులు || ఇంతి ||

మోవి నిండెఁ జిరునవ్వు మొలకలు
పూవకపూచె మేనఁ బులకలు
యీవేళ శ్రీవేంకటేశ యెనసితివి
సోవగా మాఁటలలోనఁ జుట్టుకు మలకలు || ఇంతి || 330||

తెలుఁగుఁగాంబోది

విరిదమ్మివాఁడేయు[1] విరహము వేఁడేయు[2]
పరగ నాతనికి పంతమియ్యరాదా || పల్లవి ||

వేఁడుకొనేవు చెలుల విభునిఁ గూరుచుమని
వేఁడుకోరాదా ఆ విభుని నీవే

[1] వాఁడి + అయు.
[2] వేఁడి + అయు.

పోఁడిమిఁ బగవట్టేవు పున్నమచందురు మీఁద
నేఁడే యీతని పాదాలు నీవు వట్టుకోరాదా || విరి ||
మరుని మీఁదుదీసి మరి మొక్కుకొనేదాన-
వరసి మొక్కఁగరాదా ఆతనికిని
బెరసి కోవిలలకు ప్రియముచెప్పేదానవు
సిరుల నాతనికే చెప్పరాదా ప్రియము || విరి ||
మంతనానఁ జిలుకతో మాటలాడేదానవు
ఇంతలో మాటాడరాదా యీతనితోనే
అంతటా శ్రీవేంకటేశుఁ డాతఁడే నిన్నుఁ గూడె
రంతు సేసేటిదానవు రతి సేయరాదా || విరి || 331 ||

పాడి

తలఁచుకోఁడుగాక తనలాగులు
ఇల రెంట దెప్పరాన ఇతనౌనా వలపు || పల్లవి ||
మనసేల రేఁచినే మర్మమేల దాఁచినే
చనుఁగవకేల చెయ్యి సారెఁ జాఁచినే
మొనసి యొకతె నురమునఁ బెట్టుకొన్నాఁడు
ననిచి యీపెయినాను[1] నగదా ఇందుకును || తలఁ ||
తరితీపేల సేసినే తమి యేల మూసినే
విరుల నేఁటికి నన్ను వేసినే
శిరసుపై నొకతెను చేరి యెక్కించుకొన్నాఁడు
అరసి యీపెఇనా[2]వెంగేలాడదా ఇందుకును || తలఁ ||
నన్నలవేల పాంచినే చలమేల పెంచినే
కన్నచోటనెల్లానేల గరిసించినే

---

[1] యీపె+అయినాను (కా.ప్రే.)
[2] యీపె+అఇనా (కా.ప్రే.)

నన్ను శ్రీవేంకటేశుఁడు నమ్మించి బుజాన మోచె
చిన్నిగోలదైనా రట్టు సేయుదా యిందుకును ||తలఁ||332||

ముఖారి

అన్నియు వేసాలే మీకు నలుకేడది
మన్నించు మా ముందరనే మతకము లేఁటికే || పల్లవి ||
వుప్పతిల్ల నాకె నీవు వొకరొకరి మొకాలు
రెప్పలెత్తి చూడఁగాను రేసులేడవి
తొప్పఁదోఁగుఁ జెమటలతోడ మీసెలవుల
చిప్పిల నవ్వఁగాను చింతలేడవి || అన్ని ||
సంగతిగా మీలోమీరు సరసములాడుకొంటా
కొంగులు వట్టుకుండఁగా కోపాలేడవి
యెంగిలి మోవులతోడ యేకమై పానుపుమీఁద
సంగతిఁ బెనఁగఁగా మచ్చరములేడవి || అన్ని ||
కైవసమై యిట్టె యీను కనుసన్నలకు లోలో
భావములు గరఁగఁగా వంతాలేడవి
యీవల శ్రీవేంకటేశ యెనసితిరి రతుల
చేవదేరెఁ బనులెల్లా సిగ్గులేడవి || అన్ని || 333 ||

దేసాళం

అట్టెకానీ అందుకేమి అవునోయి
తొట్టివున్నది మదము దొరవాదువోయి || పల్లవి ||
నిన్నుఁ బిలువవచ్చిన నెచ్చెలి చెక్కుపై గోరు
వున్నతి నేల తీసితివోయీ నీవు
అన్నిటా నీపాలిటికి అపె నేనైతినా
కన్నులార నీ సుద్దులు కానవచ్చెవోయి || అట్టె ||

చేదివ్వె తెచ్చిన నాచెలి చన్నులమీఁద–
నా దెస నేమో వా(వ్రా?) సితి వానావోయి
దాదాత నాపెకాంక్ష దానిపైఁ జూపితివా
వేడుగా నీసేఁత వెల్లవిరియాయ నోయి || అట్టె ||

చేకానుకిచ్చిన నాచెలియ మోవిమీఁద
కాకుగాఁ జేసితివట కద్దా వోయి
యీకడ శ్రీవేంకటేశ యిద్దరి మమ్మేలితివి
దీకొని నీ యాసోదాలు తెలిసితిమోయి || అట్టె || 334 ||

## నాదరామక్రియ

ఎంతలేదన్నా నవి ఏల మానీని
చెంతల నీవేడుకలు చెల్లింతువుగాక || పల్లవి ||

పలువుపై నీకు నాపె పాదములు గుద్దఁగాను
తలితోడి వలపులు దైవారవా
నెలి సురటి విసరి నిన్ను నిట్టె చూడఁగాను
గులిలేనికోరికలు గుబ్బతిలవా || ఎంత ||

వేసరక సారెసారె విడెము నీ కియ్యఁగాను
ఆసలు నీమతిలోన నల్లుకొనవా
రాసికెక్క నీతో సరసములెల్లా నాడఁగా
పోసరించి తమకము పొరిఁ బిక్కటిల్లదా || ఎంత ||

పాయక యేపొద్దు నాపె పక్కనే పండుండఁగాను
ఆయాలంటె పరవశమందదా మేను
యీయెడ శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చాయల నీజవ్వనము సఫలము గాదా || ఎంత || 335 ||

## రేకు 1657 ఆహిరి

చలమేల వద్దు వద్దు జాణఁడవు యీ పొద్దు
 మెలుఁగెత్తి విన్నవించే ఇంటికి రారాదా || పల్లవి ||

మమ్మునేల లోఁచేవు మర్మాలేల రేఁచేవు
 కమ్మర మాపైనేల కాలు చాఁచేవు
 తమ్మిపువ్వు కదువాఁడి దండనే వెన్నెల వేఁడి
 ఇమ్ముల నింతటనైనా ఇంటికి రారాదా || చల ||

నన్నలేల చేసేవు నడి యేల వేసేవు
 చన్నులపై వాఁ(వ్రాఁ?) తలేల సారె వా(వ్రా?) సేవు
 చిన్నిగాలికాఁక బెట్టు చిలుకలపలుకు రట్టు
 యెని(న్ని?)[1]మాయలు సేసేవు ఇంటికి రారాదా || చల ||

ఆసలేల పెట్టేవు అట్టె కొంగేల పట్టేవు
 వాసికి నాపాద మెంత వడి మెట్టేవు
 వేసరక నన్నును శ్రీవేంకటేశ కూడితివి
 యీసుద్దులన్నియు వింటి నింటికి రారాదా ||చల||336||

## నారాయణి

పులకల మొలకలపున్నమ[2] తోడనె కూడె
 అలివేణి నీపతితో నాడవే వసంతము || పల్లవి ||

మాటలు తేగెలువారె మక్కువలు చిగిరించె
 మూటలకొద్దినవ్వులు మొగ(గ్గ?) లెత్తెను

---

[1] ప్రావిభంగము.

[2] వైశాఖ శుద్ధ పూర్ణిమకు 'మొలకలపున్నమ' యని వ్యవహారము. చూ: 12 వ సంపుటము. పీఠికలో దాదర క్రింద. పుటసంఖ్య

వాఁటపు జవ్వనానకు వసంతకాలము వచ్చె
ఆఁటదానవు పతితో నాడవే వసంతము || పుల ||

చెమటరసము లూరె సిగ్గులు పూవక పూచె
తిమురుఁ దరితీపుల తేనె లుబ్బెను
క్రమమునఁ దమకముగద్దియు మదనుఁ డెక్కె
అవ __ క నాడవే వసంతము || పుల ||

కడుగోరితాఁకులు కాయము కాయలుగాచె
బడినే కెమ్మోవిని పండు వండెను
యెడలేక శ్రీవేంకటేశుఁడిట్టె నిన్నుఁ గూడె
అడరి నీపతితోనే ఆడవే వసంతము || పుల || 337 ||

## పాడి

ఎందు వోయీ మనబత్తి యెప్పుడునుఁ గలదె
వొందిలిఁ గొంతదడవు వూరకుండఁగదవే || పల్లవి ||

చనవుగల్గుకాంత జంకించి పతిఁ దిట్టితే
గునిసి నీవేల ఆపెఁ గోపగించేవే
వనజాక్షి! తలపోయు వారువారు నొక్కటే
వొనర నన్నిఁ జూతము వూరకుండఁగదవే || ఎందు ||

బాసలుకొన్నకామిని పైకొని పెనఁగితేను
యీసుతోడ నడ్డాలు నీవేల వచ్చేవే
ఆసల నిద్దరికిని అన్నీ సమ్మతులే
వోసరించి తెలుతము వూరకుండఁగదవే || ఎందు ||

సిగ్గులు విడిచినాపె శ్రీవేంకటేశుఁ గూడితే
యెగ్గులు వట్టుచు నీవేల నవ్వేవే

తగ్గుమొగ్గు లేమీ లేవు తమలోన నింపులే
వొగ్గి మనములాఁ[1] గూడె నూరకుండఁగదవే ||ఎందు||338||

## వరాళి

నవ్వేవారి నెఱఁగవు నాలుగుదిక్కులా నుండి
యివ్వల వాసి వద్దా ఇంతిరో నీకు || పల్లవి ||

సెలవి నవ్వులు నవ్వి చేసన్నలు సేసి
కలువపువ్వుల వేసి కాతరించేవు
వలవనిపతిమీఁద వట్టి బత్తి సేయఁగాను
కలిగినదేమే యిందు కాంతరో నీకు || నవ్వే ||

ఆయములు గోర నంటి ఆరజపుమాట లాడి
కాయము చేత నిమిరి గరిసించేవు
చాయకాని కింతలేసిచవులు వుట్టించఁబోతే
ఆయెడ నేమి లాభము అతివరో నీకు || నవ్వే ||

కప్పరపు విడె మిచ్చి కాఁగిటిలో రతిఁ గూడె
చిప్పిల శ్రీవేంకటేశుఁ జిమ్మిరేఁచేవు
అప్పుడే నన్ను నేలె ఆతనిపైఁ గొసరఁగా
చెప్పవే కూడినదేమి చెలియరో నీకు || నవ్వే || 339 ||

## మాళవిగౌళ

సూటిగాఁ దప్పక మోము చూడవయ్యా
చాటున నీ విందుకెంత జడిసివుండేవు || పల్లవి ||

[1] 'మనములాన్' అనునది 'మనములన్' అనుటకు సంగీత దీర్ఘము కావచ్చు. లేక 'మన ములోన్' అనియైనా వుండవచ్చు.

జిగిమించు సిగ్గులేల సెలవుల నవ్వులేల
మగువతో మొగమెత్తి మాటాడరాదా
మొగసక్కెలకు విన్ను యేమీ నన్నది గాదు
నిగిడి ఇంటిలోనే నీవేల లోఁగేవు ॥ నూటి ॥

ముంగిటివెరవులేల మొగమోట యింతయేల
అంగన యిచ్చినకాను కందుకోరాదా
వెంగేనకు నిన్ను నీకె వెస రట్టుసేయదు
వెంగట నీ విందుకేల చింతించుకొనేవు ॥ నూటి ॥

బట్టబయు లీఁదనేల భావించుకొననేల
గుట్టుతో నాపె నిట్టె కూడఁగరాదా
రట్టుగా శ్రీవేంకటేశ యిట్టె యాపె వంగించదు
మట్టుతో నేలితి వనుమానించనేమిటికి ॥ నూటి ॥ 340 ॥

పాడి

ఇంకనేలే మరఁగులు ఇన్నియునుఁ దేటపడె
వంకించి నివ్వెరగులు పడనేలే ॥ పల్లవి ॥

పొందైనయాపె నుద్దులు బొంకక చెప్పమంటేను
అందగారిమాటలేల ఆడీనే తాను
విందమంటా నే ననేకవేడుకలో నుండఁగాను
చెంది యందరిలోఁ దాను సిగ్గులు వడుదురా ॥ ఇంక ॥

వెల్లన నాపె నిందుకుఁ బిలిపించుకుండఁగాను
చెల్లఁబో వట్టిగుట్టు సేసీనే తాను
చల్లఁగా నిద్దరిఁ జూచి సంతోసించుకొందమంటే
పల్లదానఁ దలవంచి వరాకున నుందురా ॥ ఇంక ॥

చెలరేఁగి యాపెచేత సేసలు వెట్టించగాను
నలువంకఁ జూచి యేల నవ్వీనే తాను
యెలమి శ్రీవేంకటేశుఁ డిటు తానే నన్నుఁ గూడె
వలపు పొగడఁగాను వద్దందురా || ఇంక || 341 ||

రేకు 1658 మాళవి

నిన్నమాపే తనకు నేను లోననరే
యెన్ని చేసినాఁ జేసె ఇఁకనేలే వెఱపు || పల్లవి ||

పొలఁతు లిందరు దను పోది సేసి పొగడఁగా
అలయుచు నే వెంగేలాడే దాననా
పలుమారు వద్దివారు బత్తులు సేయఁగాను
నెలఁత నే నొక్కతెనే నిష్ఠూరినా || నిన్న ||

ఇంటికాడిసతులెల్లా యిచ్చకము సేయఁగాను
జంటనుండి నేనే కడుఁ జెండి పోరేనా
వెంటనే చుట్టరికాలు వీరెల్లాఁ జెప్పఁగాను
గొంటరితనాన నేను గొరబు సేసేనా || నిన్న ||

సేసవెట్టినవారెల్లా చేకొని పంతాలియ్యఁగా
యాసున నేనే యెలయించే దాననా
ఆనల శ్రీవేంకటేశుఁ డట్టె తా నన్నుఁగలసె
పొసరించి తనకు నే బుద్ధి చెప్పేదాననా|| నిన్న || 342 ||

మంగళకౌశిక

ఎక్కడెక్కడోసుద్దుల కెంత సేసేరు
నిక్కి యాపెఁ జూచితేను నింద నీపై వేయురా || పల్లవి ||

జవ్వనితో నీ వొకసన్న సేసితివంటాను
రవ్వలుగా నాడేరు రమణులెల్లా
వువ్విళ్లూర నీవుగన వొద్దఁ బెట్టుకుండితేను
చివ్వన సోబానఁ బాడి సేసవెట్టకుండేరా || ఎక్క ||

ఆపెమీఁద నీ చూపు లటు గొంత నాటెనంటా
మూపులు మూఁడై కొంగులు ముళ్లు వేసేరు
యేపునఁ దొడపై నీపు యీపె నెక్కించుకొంటేను
కాఁపురపు బాసికాలు కట్టకమానేరా || ఎక్క ||

పమ్మి యీపెపై నీవు పాదాలు చాఁచితివంటా
దిమ్మరై గి ఇందరు నీదేవు లనేరు
ఇమ్ముల శ్రీవేంకటేశ యేలితివి మమ్ము నిట్టె
కమ్మర నందురును నీ కైవశమే యనరా|| ఎక్క || 343 ||

బౌళి

కొమ్మ కెంత ఆసోదమో కొలువులు సేయవచ్చె
రమ్మని చేరఁబిలిచి రతిసేయరాదా || పల్లవి ||

చుట్టి చుట్టి నీతో నాకె సుద్దులు చెప్పఁగ వచ్చి
బట్టబయలెమ్మెలు చూపఁగ వచ్చిని
గుట్టుతో నుండఁగా నీకు కొప్పులు వెట్టఁగవచ్చి
అట్టె లోనికి బిలిచి ఆదరించరాదా || కొమ్మ ||

కమ్మటి నింటిలో నెల్లా కాఁపురాలు దిద్దవచ్చి
చిమ్మిరేఁచి ఇచ్చకాలు సేయవచ్చిని
తమ్మిపువ్వు గానుకిచ్చి తలఁపులు చెప్పవచ్చి
నమ్మతించి ఇయ్యకొని చనవియ్యరాదా || కొమ్మ ||

చలరేఁగి చలరేఁగి[1] సేవలు సేయఁగవచ్చి
మొలకనవ్వులు నవ్వి మొక్కవచ్చిని
యెలమి నన్నేలితివి యిప్పుడే శ్రీవేంకటేశ
బలిమి నాపెనుఁ గొంత పనిగొనరాదా॥ కొమ్మ ॥ 344 ॥

## భైరవి

నెలఁతరో రమణుని నేరమెంచనేఁటికే
చలము సాధించవచ్చే సతులకుఁగాక ॥ పల్లవి ॥

మగనాలికేటికే మంకుఁదనాలవొట్లు
తెగనాడే వీరిడికత్తెలకుఁగాక
మొగమోటదానికేలే మొనగోరితాఁకులు
అగడైనరతుల గయ్యాళిదానికిఁగాక ॥ నెలఁ ॥

గుట్టుతోడిదానికేలే గోరబు బొమ్మజంకెలు
రట్టడితనముల కరాళికిఁగాక
చుట్టపుదానికేలే సూదుఁబాదు సొలపులు
దిట్టతనమున నవ్వేతెక్కరికిఁ గాక ॥ నెలఁ ॥

పెండ్లికూతురుకేలే పెనఁగొన్న పంతములు
ధండితనాలను మేనదానికిఁగాక
అండనే శ్రీవేంకటేశుఁడాతఁడే నిన్నుఁ గూడె
బెండుసేయ. నీకేలే పెరవారికిఁ గాక ॥ నెలఁ ॥ 345 ॥

## దేవక్రియ

తానేతలఁచుకొని దయఁ జూచీని
ఆనించి కానుకలెల్లా నందియ్యరే ॥ పల్లవి ॥

---

[1] చెలరేఁగి చెలరేఁగి (తా.శ్రీ.)

మాటల ప్రేమిసేసీ మచ్చికగలితేఁ జాలు
పాటించి రమణుఁడే వంతమిచ్చీని
గాఁటాన నాతనినేల గాసిసేసేరే మీరు
చిటివా(వ్రా?)సి తనబాస చేతికియ్యరే || తానే ||

నడతప్రేమిసేసీ నమ్మిక గలితేఁ జాలు
విడువక తానే వచ్చి వేఁడుకొనీని
వడిఁబెట్టి మీరేల వట్టిదూరులు దూరేరే
ముడె[1]గట్టి తన నవ్వు ముంగిటనే పెట్టరే || తానే ||

తవనతప్రేమిసేసీ తానే కూడితేఁ జాలు
యివల శ్రీవేంకటేశుఁ డిట్టె యేలీని
తవిలి యీతనినేల తగవులఁ బెట్టేరే
జవకట్టి తనమేలు చాటి చెప్పరే || తానే || 346 ||

## నాదరామక్రియ

మంచివాఁడవయ్య నీవు మమ్మేల రట్టు సేసేవు
ముంచి నీకు మొక్కేము మన్నించవయ్యా యిపుడు ||పల్లవి||

పలికినట్టె నీతోఁ బలుకుమనేవు నన్ను
మెలుఁత కింతేసి మందెమేళమేఁటికి
బలిమితో వసంతము పైఁజల్లుమని యాడేవు
వలపులు గనమైతే వరుసదప్పేదురా || మంచి ||

సరికి బేసికి నీతో సారెఁ బెనఁగు మనేవు
తరుణిని నాకింత వుద్దండాలేఁటికి

---
[1]ముడెగట్టి=మూటగట్టి (ముడియునట్లుగా కట్టి) కావచ్చు.

వరగ జాఁడాలాడి వంద(దె?)ము గానమనేవు
మురిపెము గనమైతే మొక్కళము లెంతురా || మంచి ||

మెట్టినట్టి నీపాదము మెట్టుమనేవు నన్నిటు
పట్టపురాణి నాకింత ఫలమేఁటికి
యిట్టె శ్రీవేంకటేశ యెనసితివి రతుల
చుట్టరికము గలితే పొంట్లు సోదింతురా|| మంచి || 347 ||

రేకు 1659 భూపాళం

నావంక దోసము లేదు నలినాక్షులాల మీరు
కేవలమై ఇందుకు సాకిరినుండీ ఇపుడు || పల్లవి ||

విందులు[1] చెప్పవచ్చిన వెలది మోవి తీపంటా
అందుకొని చవిగొనీ నదివో తాను
ఇందు కిట్టె తమయుక్క యెరిఁగితే నేమియును
ముంద రెరఁగఁడు తాను మొక్కలీఁడు చూడరే|| నావం ||

నిమ్మపండ్లు చేతికిరే గానికియ్యఁగా నాచన్నుఁ
నిమ్మపండ్లు మంచివంటా నిక్కి తినీనే
వుమ్మడి నీ సుద్దులు మాయమ్మ వింటే నేమియును
కొమ్మలాల యీతఁడు కక్కూర్తికాఁడు గదరే || నావం ||

చేరి పిల్వవచ్చిననెచ్చెలి తనవేడుకంటా
యీరీతి నన్ను శ్రీవేంకటేశుఁడు గూడె

[1] ఈ చరణములన్నిటిలో మూడవ పాదమందు వరుసగా "యెరిఁగితే, వింటే, వింటే" అన్నవి చెలికత్తెవాక్యములు. దానికి తరువాతి "ఏమి" అనునది నాయకుని మాట. వేదర్థ-ములకు ముందున్నవాక్యములన్నీ నాయకుని గదుసుదనమును తెలిపే చేతలుగలవి.

సారె నిది మాయేలికెసాని వింటే నేమియును
కారుకొన్నజాణకాఁడుగదరె నేఁగిశాఁడు|| నావం || 348. ||

ధన్నాసి

ఇక్కడ నేమి సేసేవు ఘెంతవని గద్దు నీకు
గక్కన నాపెమేలు కందువు రారాదా || పల్లవి ||

చెక్కుచేతితోడిచింత చిరిచేఁదులవంత
ముక్కుమీఁది వేలు మరుముంగిటివాలు
అక్కజపుతలపోఁత అజాఁడు వా(వ్రా?)సినవా(వ్రా?)త
చొక్కపు నీసతిలాగు చూతువు రారాదా || ఇక్క ||

తప్పక చూచేటి చూపు తడఁబాటులోదోపు
ముప్పిరిశిరసువంపు మోచిదింపు[1]
చిప్పిల సిగ్గులమొక్కు చిత్తజాఁ డిడిన చిక్కు
చొప్పగ నీఇంతిలాగు చూతువు రారాదా || ఇక్క ||

చెదరునిరిఁగురులు చిమ్ముఁగూటపుగురులు
పొదిగొన్న అడియాన పూఁచినసేస
యిదివో శ్రీవేంకటేశ యింతలో బెండ్లాడితివి
సుదతి, నీదేవిలాగు చూతువు రారాదా || ఇక్క || 349 ||

గౌళ

ఎన్నిలేవు నీవిద్య లేమి సేసేది
ఇన్నిటా నీ మోహము నా యెడనే పూసేవు || పల్లవి ||

సందడించే పూఁడిగపు సతులెల్లా నుండఁగాను
గొందినుండి నన్ను నేల కొంగువట్టేవు

[1] మోచిదింపు='బరువుదించుట' కావచ్చు.

విందలకు వెఱచేవా నేమము నీకున్నదా
ఇందులో నీ పెద్దరిక మిప్పుడే చూపేవు || ఎన్ని ||

కప్పములు దెచ్చుకొన్న కాంతలెల్లా నుండఁగాను
చిప్పిల నామీఁదనేల చేయి చాఁచేవు
తప్పఁగులము లెంచేవా తగురూపాలు చూచేవా
ముప్పిరి నీ దొరతనములు పచారించేవు || ఎన్ని ||

కోరి కొలువులుసేసే కొమ్మలెల్లా నుండఁగాను
పేరుకొని వచ్చి నన్నే పెండ్లాడేవు
యీరీతి శ్రీవేంకటేశ ఇంతేసి విచారించేవా
గారవించి నన్నుఁ గడు కాఁగిట నించేవు|| ఎన్ని || 350 ||

## శుద్ధవసంతం

చెప్పఁగదె మీసుద్దులు చెవులార వినేము
తప్పక వలపులెల్లా తారుకాణ వచ్చెనా || పల్లవి ||

వేఁగినంతా నేకతాలు విభునితో నాడితివి
చేఁగదేర విడేలు సేసితివి
యీగతిఁ జుట్టరికా లిద్దరికిఁ గలసెనా
భోగపురతులకెల్లా పొంతనాలు గూడెనా || చెప్పఁ ||

యెదురుబడి నుండి యింపులుగా నవ్వితివి
మొదలఁ జూచుకొంటిరి మొకమొకాలు
సదరాన మీలో మీకు సగినాలు లెప్పాయనా
మదనతంత్రముల మీమనసు లెనసెనా ||చెప్పఁ||

గక్కనఁ శ్రీవేంకటేశుఁ గాఁగిలించుకొంటివి
చిక్కించుక సేవలెల్లాఁ జేసితివి
యిక్కువ నీతఁడె నన్ను యిచ్చగించి రతిఁగూడె
చొక్కపు మాపెండ్లికి సోబానఁ బాడిరా॥ చెప్పఁ ॥ 351 ॥

## హిందోళం

నీకే తెలుసునే నెలఁత యీ గరిమలు
దాకొని నీలోనీవే తలఁచుకోఁగదవే ॥ పల్లవి ॥

పిలిచి యీతనిముందు పేరుకుచ్చి దూరనేల
వెలయఁగ నంతలోనే వేఁడుకోనేలా
చలువయు వేఁడియును సరి నొక్కచో నుండునా
చలరేఁగి మరుఁడు చేసినచేఁతగాక ॥ నీకే ॥

పిక్కటిల్లఁ దొలిసారి బీరములాడఁగనేల
పక్కన నీవాతనికి పంతమీనేలా
నెక్కొని చీఁకటియు వెన్నెలాఁ గూడించవచ్చునా
చిక్కించుక మరుఁడు చేసినచేఁత గాక ॥ నీకే ॥

పొదిగి శ్రీవేంకటేశుఁ బొం దెలయించనేల
ముదమున నింతేసి మొక్కఁగనేల
కదిసి కల్లా నిజము గాడిఁగట్టవసమా
చెదరక మరుఁడు చేసినచేఁత గాక ॥ నీకే ॥ 352 ॥

## సాళంగనాట

అవులేవే యెమ్మెలేమి ఆడుకొనేవే
చివురైన మీఁద మరి చేమగాకపోదు ॥ పల్లవి ॥

నగవచ్చుఁగాని మరి నగినట్టె తమలోన
శింశుమారఁ బొందులు సేయరాదు
మొగమోటలుఁ గలవు ముంచి యంకెకు రాకుంటే
అగడు సేసేకోపము లణఁచఁగరాదు ॥ అవు ॥

మాటలాడవచ్చుఁగాని మాటలాడినట్లానే
మేటియైన రతులను మెప్పించరాదు
పాటించి మొక్కఁగఁదగు పంతములు మీరితేను
నీటునఁ బొట్టరికాలు నెరపఁగరాదు ॥ అవు ॥

పెనఁగఁగవచ్చుఁగాని పెనఁగినయట్లానే
చనవులు చెల్లించి జరపరాదు
యెనసితివి శ్రీవేంకటేశు కరుణయు మించె
ననునేలె నీతని మానఁగ నిఁక రాదు ॥ అవు ॥ 353 ॥

రేకు 1660 ఆహిరి

నీవిభుఁడు నిన్నుఁ జూచి నివ్వెరగుతో నున్నాఁడు
వేవేగఁ గాఁగిలించవే మోహనాంగి ॥ పల్లవి ॥

తియ్యనిమాటలతోను తేనెలేల చిందేవే
చయ్యాటపు సణఁగులచక్కెరబొమ్మ
నెయ్యపు చన్నుల పైఁడి నిగ్గులేల దులిపేవే
వుయ్యాల మంచము మీఁద నో మెరుఁగుఁబోఁడి ॥ నీవి ॥

పువ్వుల తురుములోను పుప్పొడి యేల రాల్చేవే
నవ్వుల మొల్లల మోహనపు లతిక
జవ్వనపు మదమున జాజర లేలాడేవే
రవ్వలైన వసంతపు రాజీవనేత్రి ॥ నీవి ॥

వడిగా నిట్టూర్పుల వాసన లెంత నించేవే
 కడుఁ జల్లఁదనమున కప్పురగంది
అదరి శ్రీవేంకటేశుఁ డాతఁడే నిన్నేలినాఁడు
 కడఁగి యేలలసేవే[1] కరికుంభ జఘన || నీవి || 354||

## మంగళకౌశిక

ఈ సుద్దు లెఱుఁగుదునా యిల్లాల నేను
 నానరున నుండి యేమి నవ్వేవు నీవు || పల్లవి ||
నేమములోఁ గాచుకుండి నీ కొలువు సేసె నీకె
 యేమి వోజలు నేర్పెనో యిందాఁకా నీకు
గామిడివి నీవు దొల్లె కతలకారి యాపె
 నామోము చూచి యేల నవ్వేవు నీవు || ఈసు ||
చనవరై పొస్తకాలు చదువుతానుండె నీకె
 మనసెందు మరపెనో మచ్చికె నీకు
యెనయు నానోదకాఁడ వేల యింపులాఁడి యాకె
 ననిచి నాతో నేమి నవ్వేవు నీవు || ఈసు ||
పానుపుపై నీవుండఁగా పాదాలు పిసికె నీకె
 పూని యెంతలయించెనో పొందుల నీకె
ఆనుక శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
 నానఁబెట్టి నాతో నెంత నవ్వేవు నీవు|| ఈసు || 355 ||

## గుజ్జరి

మంచివానితో నింత మంకులేఁటికి
 కంచము పొత్తు గలసి కైకొనఁగరాదా || పల్లవి ||

---
[1] ఏం+అం సేవే

పట్టపుదేవులనంటా పాయపుదాననంటా
ఱట్టుగా దూరనేలే యాఱడి పతిని
గుట్టుతోడివాఁ డతఁడు గుణము కోటిసేసును
చుట్టరికమే నెరపి సొంపు మీరరాదా || మంచి ||

ఆయ మెఱుఁగుదునంటా ఆతఁడు బాసిచ్చెనంటా
చేయివట్టి తియ్యనేలే చెలువునిని
దాయుగాఁ డతఁడు మంచితనమే నిలువెల్లా
చాయసేసుకొని మోవి చవిచూపరాదా || మంచి ||

భావ మెఱుఁగుదునంటా వచ్చిగాఁ గూడితినంటా
కావరించనేలే శ్రీవేంకటేశ్వరుని
యీవల నన్నేలినాఁడు యీతనికి సరిలేరు
వావులు గలయఁజెప్పి వద్ద నుండరాదా|| మంచి || 356 ||

## రామక్రియ

వనితలతోనేల ౦ట్టెగుట్టు
చనవిచ్చితే వలపు చప్పనయ్యీనా || పల్లవి ||

చెక్కు నొక్కినవాఁడవు సేసవెట్టితే నేమాయ
తక్కక నిమీఁదట తప్పు మోచినా
మొక్కరించుకొన్నవాఁడవు మోవి ఇచ్చితే నేమాయ
వెక్కసపు నీ పంతము వెలితయ్యీనా || వని ||

కరఁగించినవాఁడవు కాలుదొక్కితే నేమాయ
హొరయు నీగుణము వేరొక్కటయ్యీనా
సరి నవ్వినవాఁడవు చన్నులంటితే నేమాయ
గరిమఁ జుట్టరికము గడ్డెము వేసేరా || వని ||

పెండిలాడినవాఁడవు పెనఁగితే నేమాయ
దుండగవుఁదమకాన దొమ్మి సేసేరా
అండ శ్రీవేంకటేశ నీ వటు మెచ్చితేనేమాయ
కొండుకపాయవు నిన్ను కొంగువట్టేరా ॥ వని ॥ 357 ॥

## వరాళి

నీకే[1] తెలును నివి నీవు చేసిన చేఁతలు
జోకతే నీ మహిమలు చూడమఱచితిని ॥ పల్లవి ॥

చెక్కులమెఱుఁగు చూచి చిత్తానఁ దలఁచుకొంటా
ముక్కువ నీ కొప్పు చూడ మఱచితిని
చక్కని నీమోవి చూచి సంతోసానఁ దనివొంది
చొక్కపు నీగళరేఖ చూడమఱచితిని ॥ నీకే ॥

కచ్చుపెట్టి నీ నుదుటి కస్తూరి నామము చూచి
మచ్చపు నీమోవి చూడ మఱచితిని
అచ్చపు సింగారాల నమరిన రూపు చూచి
చొచ్చి నీమేను సోదించచూడ మఱచితిని ॥ నీకే ॥

నెట్టుకొన్న కళలతో నీనిలువెల్లాఁ జూచి
మట్టున నీ బుజాలు చూడమరచితిని
ఇట్టె శ్రీవేంకటేశ యిటు నిన్నుఁ గూడి చూచి
చుట్టి చుట్టి మర్మాలెత్తి చూడ మఱచితిని॥ నీకే ॥ 358 ॥

## పాడి

మాకేలయ్యా ఇంత నీతో మారుకొనను
చేకొని ఇట్టె అందాలు సేసుకొంట గాక ॥ పల్లవి ॥

---

[1] ఇది ఒకపాటి అధ్యాత్మ కీర్తనంలో వుండదగినది.

చెక్కులపై చెమటలు చిగిరింపుఁ బలకలు
మెక్కడి[1] వనెడిగితే నేమందువో
ముక్కున నిట్టూరుపులు ముంచిన మోముకళలు
నెక్కొనె నీకనియంటే నీచిత్త మెట్టుండునో || మాకే ||

కనుఁగొనల నిద్రలు కాయముపై యలపులు
ఘనమాయనంటే నెంత కాఁతాళింతువో
వెనుకొన్న సన్నలును వేవేలు తమకములు
పెనగొసీనంటే యెంత బీరములాడుదువో || మాకే ||

పెదవిపై వసివాడు పిక్కటిలుఁ బరాకులు
యిదివోయని చూపితే నెంత మెత్తువో
అదన శ్రీవేంకటేశ అట్టె నన్నుఁ గూడితివి
కదిసి గరిసించితే కైవస మెట్టాదువో || మాకే || 359 ||

## రేకు 1661 దేవగాంధారి

పలుకులు[2] నేర్చితివే పడఁతి
పలుకులు కప్పురపుభరణిలో నున్నవి || పల్లవి ||

విన్నపము చేసుకోవే విభునికిని । తొల్లె
విన్ననుద్దు లిఁకనేలే వేమారును
సన్నలైనాఁ జూపవే సముకానను
సన్నలు వెట్టుదురా సారె వలపులకు || పలు ||

మొక్కవే చేతులెత్తి ముమ్మారును
మొక్కలీఁ డతఁడు చూడ మొగమెత్తినా

---

[1] ఎక్కడివి+అని+అడిగితే.
[2] ఇది వాకోవాక్యము.

మిక్కిలి కాఁగిలించవే మేటివిభుని । యిపె
మిక్కిలి తీరిచెనే యిమ్మెయిఁ జనుజక్కవలు || వలు ||

బంతికిఁ బిలువవే నీపతిని । నేఁడు వూ-
బంతినే వేటులాడితి బలుమారును
చింతదీరఁ గూడితివి శ్రీవేంకటేశు-
చింతనీడ చల్లఁగదె చెప్పరే మీరు || వలు || 360 ||

## తెలుఁగుఁగాంబోది

మగువభావము చూచి మన్నించవయ్యా
వెగటుగా మోవితేనె విందువెట్టీని || పల్లవి ||

చెక్కుమీఁదఁ జేయివెట్టి సెలవుల నవ్వు నవ్వి
తక్కక తనమోహము దాఁచీఁ జెలి
వక్కనఁ బాపట దువ్వి పరాకులు పచరించి
గక్కనఁ దనసిగ్గులు గాదెఁ బోసీని || మగు ||

వాలుకరెప్పలు వంచి వదనానఁ గళరేఁచి
చాలా నీపైఁ దమకము జరపీఁ జెలి
తాలిమి నిట్టూర్పు చల్లి తలపోఁతలెల్లాఁ బెంచి
వోలిఁ దనయాసలెల్లా వొడిఁగట్టుకొనీని || మగు ||

పయ్యెద జారఁగఁదీసి పలుమారుఁగాఁగిలించి
నెయ్యమెల్లా నీమీఁద నెరపీఁజెలి
యియ్యెడ శ్రీవేంకటేశ యేలితివి యాకె నిట్టె
చయ్యన రతులెల్లాను జట్టి సేసీని || మగు || 361 ||

## గౌళ

ఇంతటివాఁడవయ్యీ నిన్నెట్టు గెలువఁగవచ్చు
కాంతల భ్రమయించేకనుకట్టువాఁడవు || పల్లవి ||

ముప్పిరి హస్తలాఘవములనే ఇంతి చన్నుల
చిప్పగతులాడేటి సిద్ధుఁడవు[1]
తప్పక మదనమంత్రాలనే చెమటవాన
రప్పించనేరిచిన ఇంద్రజాలవువాఁడవు || ఇంత ||

పలుమణులు సోఁకించి పడఁతిమైఁ బులకలు
వెలయఁగ మొలపించే విద్యవాఁడవు
పలచని కొనగోరిబదనికలు సోఁకించి
కళలు రేఁచి చొక్కించేగబ్బిటొరికాఁడవు || ఇంత ||

చిత్తజభూతము బంపి చెలుల నాకరిషించి
తత్తరించి కూడేటి భూతనాథుఁడవు
మత్తిలి శ్రీవేంకటేశ మన్నించితి విటు నన్ను
వుత్తమ వినోదాల యోగిపురుషుఁడవు || ఇంత || 362 ||

## భైరవి

ఎంచ నెట్టు వచ్చు నమ్మ ఇలమీఁద నీకొత్తలు
పంచశరు బలములే భామ సింగారములు || పల్లవి ||

తామరల విరులపైని తగుశాలిగర్భములు
ఆ మీఁద నరఁటులును అంగజు తేరు
చీమకదొంతరకొన సింహపుఁగొదమ వా(వ్రా?)లె
యేమని పొగడవచ్చు నింతిసింగారములు || ఎంచ ||

---

[1] ఈ సిద్ధుడు విప్రవినోదియా?

జక్కవల సరుసనే జంటతామరతూండ్లు
అక్కడ శంఖముమీఁద నమరెఁ బోక
చొక్కపు చిగురులును జోడైన యద్దములు
యెక్కువల కెక్కుడాయ నింతి సింగారములు || ఎంచ ||

ఇరవై సంపెఁగపువ్వు ఇరువంక శ్రీకార్యాలు
అరచంద్రుఁడుఁ దుమ్మిద లన్నిటిమీఁద
నిరతి శ్రీవేంకటేశ నీకాఁగిటిలోపల
గరిమఁ గీర్తన కెక్కె కాంత సింగారములు ||ఎంచ||363||

## ఆహిరి

ఆనతియ్యవే మాతో నానతిమన్ననలెల్లా
వూని సంతోసాన నిన్నుఁ బొగడేము గాని || పల్లవి ||

జల జలఁ జెమరించె జాజుకొనఁ బులకించె
తలఁపులోనివలపు దాఁచనేఁటికే
కళలు మోమున రేఁగె కానవచ్చెఁదమకము
చెలుల మింతే మాతో సిగ్గువడ నేఁటికే || ఆన ||

కొప్పు గడువెడఁజారె గురుతు లాడాడ నిండె
చిప్పిల నేఁడే పరాకుసేయనేఁటికే
దప్పిదేరెఁ బెదవుల దగదొట్టె నూర్పుల
యెప్పుడును నీవారమే యిఁక నేలే మఱుఁగు || ఆన ||

కన్నుల నిద్దుర దేరె గందపు బేంట్లు రాలె
సన్నలా చాయలా వట్టిసట లేఁటికే
యిన్నిటా శ్రీవేంకటేశుఁ డిదివో నిన్నుఁ గూడె
యెన్న నూడిగపువార మిఁక వేసాలేఁటికే || ఆన || 364 ||

రామక్రియ

చెల్లఁబో[1] సిగ్గు లేదటె చెల్లెల
అల్లన నిన్నెంచుకోవే అక్కరో నేఁడు || పల్లవి ||

నేసకొప్పేల వదలె చెల్లెలా
ఆసుద్ది బావ నడుగు మక్కరో నీవు
నేసితివే బలుచేఁత చెల్లెలా
ఆస నీవంటిదే కాదా అక్కరో నాకు || చెల్లఁ ||

చెంది నిన్ను నమ్మితిఁగా చెల్లెలా
అందుఁ బాలు గద్దు గదె అక్కరో నాకు
చిందువందాయ వావులు చెల్లెలా
అంది నీమారే నేను అక్కరో నేఁడు || చెల్లఁ ||

చిన్నదానవంటా నుంటిఁ జెల్లెలా
అన్నిటా నీవే పెంచితి వక్కరో నన్ను
చిన్నలు నీమేన నిండెఁ జెల్లెలా
అన్నిటా శ్రీవేంకటేశుఁ డక్కరో కూడెనో ||చెల్లఁ||365||

రేకు 1662 సౌరాష్ట్రం

నీవంటివారమే కామా నేమెల్లా నింత నేసేమా
కావరించి కడునేల గయ్యాళించేవే || పల్లవి ||

సిగ్గువడ్డదానవు శిరసు వంచుకుండఁగ
వొగ్గి పతితోనేల వొడ్డారించేవే
వెగ్గళించి ఇవేఁ గొన్నివేసాలు సేసేవుగాక
యెగ్గులేని సతులకు నివి వోజలటవే || నీవంటి ||

[1] ఇది అక్కా చెల్లెండ్ల సంవాదము. ఇద్దరికీ శ్రీవేంకటేశుడే నాయకుడు.

పంతపుదానవు నీ వప్పటి గుట్టు చూపక
కాంతుని నింతేసి యేల గరిసించేవే
యెంత లేదు ఇవిఁ గొన్నియెమ్మెలు నేసేవుగాక
ఇంతలోఁ జూచినవార లిది మెత్తు రటవే ॥ నీవంటి ॥

వొట్టు వెట్టుకున్నదాన వూరకే వుండుటగాక
కిట్టి శ్రీవేంకటేశుఁ గాఁగిలింతురటే
గట్టిగా న న్నితఁ డేలె కతలు చెప్పేవుగాక
యిట్టె సవతులకు నింత దగునటవే ॥ నీవంటి ॥ 366 ॥

## రామక్రియ

ఈతని గెలుచుటకు నిదే వుపాయము
నీ తగవులెల్లాను నెరపవే నీవు ॥ పల్లవి ॥

మనసు వచ్చినప్పుడు మాటలాడీఁగాని తాను
మునుప నాతనికెని మొక్కవే నీవు
ననుపైనవేళను నవ్వులు నవ్వీఁగాని
వొనరఁగ వద్దనే గూచుండవే నీవు ॥ ఈత ॥

యితవైతేఁ గనక తా నింటికి వచ్చీఁ గాని
చతురత నేసలు చల్లవే నీవు
తతిగొని మోవితేపు తానే చూపీఁగాని
మితిమీరఁ బొగడుచు మెచ్చవే నీవు ॥ ఈత ॥

తమకము రేఁగితేను తానే పెండ్లాడీఁ గాని
అమర నాతని గోర నంటవే నీవు
సమరతి శ్రీవేంకటేశ్వరుఁ డిదె నిన్నుఁ గూడె
సముకాన చేఁతలు పచారించవే నీవు ॥ ఈత ॥ 367 ॥

## ముఖారి

ఇంకానేల వట్టియాన లేమిటికిఁ బెట్టేవు
అంకెఁ జూచితే గురుతు లద్దములో నున్నవి ॥ పల్లవి ॥

యీతల నాపె నీవు యెదిరించినప్పుడే
చూతమువో మీలోని సుద్దులెల్లాను
మాతో నింతేసి యేల మరఁగులు వెట్టేరు
కాతరపుమీచేఁతలు కాయలుగాచున్నవి ॥ ఇంకా ॥

మనసిచ్చి మీరిద్దరు మాటలాడినప్పుడే
వినేముగా వీనుల మీ వేడుకలెల్లా
పెనఁగి మావద్దనేల బేరి జోకొట్టవచ్చేరు
దినము మీ సరితలు తీగెలు వా రున్నవి ॥ ఇంకా ॥

అలమేలుమంగ నీవు నంటికూడినప్పుడే
తెలియరాదా మోములతేటలెల్లాను
మలసి శ్రీవేంకటేశ మమ్ము నెంత మన్నించేరు
వలపులమీరతులు వాండ్లెక్కి వున్నవి ॥ ఇంకా ॥ 368 ॥

## హిందోళవసంతం

ఎటువంటివాఁడవయ్యా యేమయ్యా
తటుకన మొక్కితేను తలవంచేవు ॥ పల్లవి ॥

కొసరితే దోసమా కూరిమి గలుగుసతి
యెసగ సాదించేవు ఇందరిలోన
వుసురనఁదగదా వుడివోని విరహాన
కసుగాటు మాటల గరిసించేవు ॥ ఎటు ॥

చెనకఁగరాదా చేతికిలోనైనయాపె
పనివడి జంకించేవు వంతమాడుతా
తనిసి యులయరాదా తమకపుఁగాఁకలకు
పెనఁగుచు బిరానఁ బెచ్చురేఁగేవు || ఎటు ||

అలమితే నేమాయ అలమేలుమంగ నిన్ను
చలరేఁగి గుంపించేవు శ్రీవేంకటేశ
తలపోయవలదా తగిలినరతులను
పలుసోఁకులనుఁ గడుఁ బచ్చి సేసేవు || ఎటు || 369 ||

ఆహిరినాట

వట్టి విచారములేల వడఁబడ నిఁక నేల
నెట్టన నన్నేలుకొనే నేరుపు నీ దిఁకను || పల్లవి ||

కన్నుల నిన్నుఁ జూచితి కానుక చేతికిచ్చితి
యెన్నికలు మరియేమీ నెఱఁగ నేను
విన్నపముఁ జేసితి వేవేగ నీకు మొక్కితి
పన్ని నన్ను రక్షించేటి భారము నీ దిఁకను || వట్టి ||

ఇంటికి వచ్చితి నీకు నిచ్చకము లాడితి
దంటతన మెఱఁగ నీ తరుణి నేను
నంటునను వేఁడుకొంటి నయమే పచరించితి
వెంటగా నన్నమన్నించే[1] ప్రియము నీ దిఁకను || వట్టి ||

పొగడితి నన్నిటాను పొందులెల్లాఁ జేసితి
తగినవుపాయాలు దలఁచ నేను
నిగిడి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
మొగి నన్నుఁ గూడితివి ముదము నీ దిఁకను ||వట్టి||370||

[1] 'నన్ను మన్నించే' వ్రాయవలెగాని తప్పు. (కా.శ్రీ.)

శంకరాభరణం

చుట్టమైతే యీతనికి జోడై వుందువుగాక
జట్టి గొని ఇఁకనేమి సాదించేవే || పల్లవి ||

యెదుటఁ బిత్తమురానే యిచ్చకమాడుదుగాని
పదరి మాటాడకువే పలుమారును
మొదలఁ బదారువేలనుదతులవాఁ డతఁడు
వెదకి నీ విఁకనేమి వెంగెమాడేవే || చుట్ట ||

సెలవుల నవ్వుతానే సేవలు సేతువు గాని
మలసి చేచాఁచకువే మాటిమాటికి
తలఁకక చీఁకటి తప్పు చేసేవాఁ డతఁడు
చలపట్టి యిఁకనేమి చక్కఁ బెట్టేవే || చుట్ట ||

కైవసమై నీ విట్టె కాఁగిటఁ గూడుదు గాని
చేవమీరి యిఁక రట్టు సేయకువే
శ్రీవేంకటేశుఁడు సర్వ జీవాంతరాత్మకుఁడు
దేవులవు యిఁకనేమి తిద్దుకొనేవే || చుట్ట || 371 ||

రేకు 1663 ముఖారి

కానీవయ్యా అందుకేమి కాదనేమా నిన్నును
నానఁబెట్టి యందరితో నవ్వేవు నీవు || పల్లవి ||

చిత్తము నీకొకవంక చిమ్ముఁ జూపు లొకవంక
మత్తిలి యిప్పటి మాతో మాటలాడేవు
బత్తి నీ కెక్కుడనని భావించి నమ్మఁగవచ్చు
పొత్తులవిభుఁడవై పొదిగేవు నీవు || కానీ ||

చెనకు లొకరితోడ చేసన్న లొకరితోడ
పెనఁగులాట నాతో బెరయించేవు
ననుపు నీ కెందునని నలి నేర్పరపవచ్చు
తనివోనిచుట్టమవై తగిలేవు నీవు || కానీ ||

వలపులు వాడలోన వాడికలు వూరిలోన
కలసేవు నీవు నా కాఁగిటిలోన
యెలమి శ్రీవేంకటేశ ఇంపు లెట్టు గానవచ్చు
తలఁపు కొద్దివాఁడవై తనిపేవు నీవు || కానీ || 372 ||

ద్రావిళ భైరవి

నీవల్లనే కంటిమే నేఁడు యీ కొత్తలెల్లాను
భావించుక పైకొనేటి పడఁతియుఁ గలదా || పల్లవి ||

మగఁడు నాలుఁ గూడి మంతనము లాడేవేళ
యెగసక్కెలకు తొంగి యేల చూచేవే
సొగిసి మరుతంత్రానఁ జొక్కివుండేటివారి--
నగడుసేసేయట్టి ఆఁటదియుఁ గలదా || నీవల్ల ||

కందువఁ దామిద్దరును కాఁగిలించుకొన్నవేళ
గొంది నీవు వద్ద నేల కూచుండేవే
పొంది పానుపుమీఁద భోగించేయట్టివారి
అంది సిగ్గువరచేటి అతివయు గలదా || నీవల్ల ||

అట్టె శ్రీవేంకటేశుఁ డలమేల్మంగఁ గూడఁగ
గుట్టునఁ జన్నుల నెంత గుచ్చియెత్తేవే
తొట్టుకొని మోవులవిందులు చవిచూచేవారి
నెట్టనఁ బచ్చిసేసేటి నెలఁతయుఁ గలదా ||నీవల్ల||373||

## బౌళి

ఎంతరాతిమనసో నీకెవ్వ డిఁకఁ గరఁగీనో
పొంత సిగ్గువడీ నీతోఁబొందేటి వేడుకను || పల్లవి ||

కొప్పు వీడు[1] తెలుఁగదు కొంగు జారు టెలుఁగదు
తప్పక నిన్నుఁ జూచీఁ దరుణి
దప్పిదేరీఁ బెదవుల తడఁబడీఁ దత్తరాన
అప్పటనుండి మాటలాడీ నిబ్బరానను || ఎంత ||

చెలులనుఁ దలఁచదు చింత నిల్లు దలఁచదు
కొలువులు నీకుఁ జేసీ కొమరి
పులకలు మేన నించీ పొంగుఁ జెమటల నీఁదీ
బలిమి నీతోఁ బెనఁగీ పంతపుటాసలను || ఎంత ||

వెన నలయికెంచదు మేనకముం దెంచదు
పొసఁగ నిన్నుఁ గూడుచుఁ బొలఁతి
యెనగ శ్రీవేంకటేశ యేపురేఁగి రతులను
వసగా సరవిమాడీ బహుపరాకుననను || ఎంత || 374 ||

## దేశాక్షి

అంతదొడ్డదానవా అందరికంటె నీవు
మంతుకెక్క నీవే ముందు మాటలేలాడేవే || పల్లవి ||

వంతులకే పెనఁగేవు వాసులకే వచ్చేవు
ఇంతయుఁ గానవచ్చె నీ యెమ్మెలు నేఁడు
బంతినే సతులకెల్ల బాగా లొతఁ డియ్యఁగాను
చెంత నీవు ముందే వచ్చి చెయ్యేల చాఁచేవే || అంత ||

[1]వీడు టెలుఁగదు. భావార్థంలో 'ట' ప్రత్యయం (కా.శ్రీ.)

తప్పక మోము చూచేవు తగవులే వెదకేవు
చెప్పరాదే నీపగటు చెలులలోన
అప్పటిఁ బొత్తుల నాతఁ డందరిని నిడుకోఁగా
కప్పి ముందే కడి నీవు గక్కన నే లెత్తేవే || అంత ||

కొరతనాలు సేసేవు తొంటివావులు చెప్పేవు
సరవి నన్నిటా నీవు జాణవౌదువే
యిరవై శ్రీవేంకటేశుఁ డిందరినిఁ గూడఁగాను
పురమెక్కి ముందే రతి నోలలాడేవే || అంత || 375 ||

కాంబోది

ఒడుగరే చెలులాల ఆతనినే యీమాట
బడి వాసి వచ్చితేను బాసగొనవలదా || పల్లవి ||

చెలిమి వేరొకతెతోఁ జేసిన యీరమణుని
సొలసినఁగాక యీసులు దీరీనా
వెలినుండి వచ్చి వట్టివినయాలు సేసేవాని
చలములు సాదించక సమ్మతయ్యీనా || అదు ||

తగ నావద్దనుం డాపెఁ దలఁపోసే మగవాని
యెగసక్కేలాడక యింపు వుట్టీనా
అగడుఁజేఁతలు సేసి యమరఁ జెప్పేవాని
నిగిడి పంగించక నెఁ(నెం?) జిరివి దీరునా || అదు ||

యెందునైనా భోగించి యెంగిలైవుండినవాని
అంది పన్నీటఁ గడుగ కఁ(కం?) కె వచ్చీనా
జెంది నాతో నా సుద్దులు చెప్పేటి శ్రీవేంకటేశు
నందడిఁ గూడి నవ్వక చవి గానవచ్చునా ||అదు||376||

### మాళవిగౌళ

పట్టపుదేవులము ప్రాణేశ్వరి వీతనికి
రట్టు సేసితే నవ్వరా ఇట్టె ఇందరును || పల్లవి ||

యెనసి నీపతి బాస లెవ్వతెకో చేసెనంటా
మనసునఁ బెట్టుకొని మాటలాడేవు
పనివడి ఇఁక నొడఁబడక దిద్దఁబోతేను
నిను మోచిరాదా ఆనేరుపు నేరములు || పట్ట ||

యెఱిఁ గెవ్వతోమేనిసొ[1] మ్మితనిమై నుండఁగ
గుఱుతుగాఁ బట్టుకొని గుంపించేవు
వెఱపు దెలుపుకొని వెల్లవిరిసేయఁబోతే
మెఱయవా యిట్టెతే మీఁదఁ బుణ్యపాపాలు || పట్ట ||

శ్రీవేంకటేశుఁ డెవ్వతోచేతికి[2]లోనాయనంటా
కావరించి యీతనితో కాఁతాళించేవు
వేవేగ నిన్నుఁగూడే నీ విభునిఁ జూచి నవ్వితే
చేవదేర వానియందే చేఁతమోఁతలును || పట్ట || 377 ||

## రేకు 1664 సామంతం

నీవు చేసిన చేఁతలు నీవే తలఁచుకొనేవు
కావరించి నీతోఁ దారుకాణించనేమిటికి || పల్లవి ||

---

[1] 'ఎవ్వతెమేనిసొమ్మో' అనుట సహజము. సమాసాంతమునందు రావలసిన సందేహవాచకస్వరము (ఒ) సమాసమధ్యమున 'ఎవ్వతె' శబ్దముపై కూర్చుట అన్నమయ్య స్వాతంత్ర్యము. సందేహము 'సొమ్ము' పైగాక 'ఎవ్వతె' లోనే చూపదలచెనేమో?

[2] ఇదియు నంతే

ఇచ్చకమాడినందుకు ఇయ్యకొనవలెఁగాక
అచ్చట గరిసించి ని న్నడుగనేల
కుచ్చి కాఁగిలించఁగాఁ జేకొని లోఁగావలెఁగాక
పెచ్చువెరుగుచు నీతోఁ బెనఁగనేమిటికి || నీవు ||

చెక్కులు నీవు నొక్కఁగా చెలరేఁగవలెఁగాక
వెక్కసించి నీతో విఱ్ఱవీఁగనేల
గక్కనఁ బాదము దొక్కఁగా మొక్కవలెఁగాక
మిక్కిలి జంకించి మితిమీరఁగనేమిటికి || నీవు ||

కదు నీవు మన్నించఁగా కలయఁగవలెఁగాక
బడి బడి వట్టి సిగ్గు వడఁగనేల
కడఁగి శ్రీవేంకటేశ గక్కన న న్నేలితివి
అడరి మెచ్చుటగాక అలయనేమిటికి || నీవు || 378 ||

## హిజ్జిజి

నన్నేమి యడిగినే నాయకుఁడు నాకుఁ దాను
సన్నలఁ దన్ను దిద్దుక చాయకు దేవసమా || పల్లవి ||

వూరఁ జుట్టమైనవాఁడు వొదిగి వుండఁగనేలే
ధీరత యిండ్లవెంట్లఁ దిరుగుఁగాక
జీరదీయించుకొన్నాఁడు సిగ్గులువడఁగనేలే
వొరలేనివలపుల కోడిగట్టుఁ గాక || నన్నే ||

ఆసలు వెట్టినవాఁడు అనుమానించఁగనేలే
సేసవెట్టించు కందరిఁ జెనకుఁగాక
బాసలిచ్చినాఁడు ఇంకాఁ బంతాలు నెరపనేలే
వేసాలు మాని విచ్చనవిడి నుండుఁగాక || నన్నే ||

వేడుకపడినవాఁడు వెలుపు మఱపులేలే
వాడిక కిందరి గూడి వచ్చుఁగాక
యీడనె శ్రీవేంకటేశుఁడేలినాడు నన్ను నేఁడు
తోడఁ దోడ రతులకు దొరకొనుఁగాక ॥ నన్నే ॥ 379 ॥

బౌళి

కదు నిన్ను దూరవద్దు గర్వము తగవెంచదు
బడినున్నతరితీపు పంత మెంచదు ॥ పల్లవి ॥

మిక్కుటపుఁ దమకము మీఁదుగిందు మెంచదు[1]
వెక్కసపుటడియాస వేసటెంచదు
యెక్కువైన మోహము యెగ్గుసిగ్గు లెంచదు
పిక్కటిల్లినచలము ప్రియు మెంచదు ॥ కదు ॥

పీడనిచుట్టరికము వింతతన మెంచదు
వేడుక యెదిరివల్ల వెరపెంచదు
వోడక పై పై ను మొగమోటమేమీనెంచదు
యీడైన కూటమి అలయిక నెంచదు ॥ కదు ॥

మనసులో తలపోఁత మరియేమీనెంచదు
గొనకొన్నరతికేళి కొలదెంచదు[2]
యెనసితి విటు నన్ను యిదివో శ్రీవేంకటేశ
తనివోని సరసము తప్పేమీనెంచదు ॥ కదు ॥ 380 ॥

శ్రీరాగం

చూడవే వో చెలియరో జాట రీతఁడు
వేడుకలకు నవ్వులు వెదచల్లీ నీతఁడు ॥ పల్లవి ॥

---

[1] 'మెంచదు' వ్రాయసగాని తప్పు (కా.శ్రీ.)
[2] కొలది+ఎంచదు.

వొప్పయిన తనవేలివుంగరము నీదె యంటె
అప్పటి నానలువెట్టీ నానే యీతఁడు
కుప్పెతోడినవరముగురుతు నేఁ బట్టితేను
తప్పకచూచి నన్నుఁ దగునే తా నీతఁడు || చూడ ||

కట్టిన కంఠహారము కదుఁ గొత్త యిది యంటే
వట్టితారుకాణలకు వచ్చీ నీతఁడు
కట్టుకొన్న దిది దట్టి గాదు చీర యంటే
యిట్టె యీవిగా నాకు నియ్య వచ్చీ నీతఁడు || చూడ ||

కేలనున్నపూబంతి భోగించినది యౌనంటే
సోలిఁ దననేమములే చూపీ నీతఁడు
కోలాటపు పతిమల గొప్పసుర టోడదంటే
వేళతో నన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడు ||చూడ||381||

## పాడి

ఇందుకంటె నేమిసేలు నింకా నేను
నింద నీపైఁబడీఁ జుమ్మీ నీ చిత్త మింఁకను ||పల్లవి||

కొమ్మ నీ చూచినచూపే కొండ సేసుకొని నమ్మి
కమ్మి తలపోసుకొంటాఁ గాచుకున్నది
రమ్మన వెరచుఁగాని రాక కెదురుచూచీ
నెమ్మది వెరఁగించితి నీచిత్తమింఁకను || ఇందు ||

కొచ్చి మీనవ్విన నవ్వే కొంగుముడియుగా నెంచి
కచ్చుపెట్టి తమిలోఁడఁ గాచుకున్నది
అచ్చలాన జలిమిసేయదుగాని పొందుగోరీ
నిచ్చలు నీపై పరాకే నీచిత్త మింఁకను || ఇందు ||

కోరి పీవాడినమాటకుఁ గోటికిఁ బడిగెత్తి
గారవానఁ బానుపుపైఁ గాచుకున్నది
యీరీతి శ్రీవేంకటేశ యిట్టె నీవు గూడితివి
నీరూపే తప్పక చూపీ నీచిత్తమిఁకను ॥ ఇందు ॥ 382 ॥

మధ్యమావతి

సవతిగనక నీ జాడలెల్లాఁ గానవచ్చె
జవళిమాపొందు లివి సతమాయనిపుడు ॥ పల్లవి ॥

కాంతుఁడు నేనూఁ దారుకాణకు వచ్చితే నీవు
సంతసాకిరి చెప్పేవు జాణవౌదువే
వంతుల నిద్దరికిని వావి గూడునాయంటే
పంతము కొలఁదినేవు బాపురే నీవు ॥ సవ ॥

వొల్లనే మాలో బాసలవొడఁబా టడిగితే
గొల్లదోమటి నేసేవు గుణివౌదువే
ఇల్లిదె వొండొరులకు నీడౌనా యని యంటే
చెల్లుబడెంతేయనేవు[1] చెప్పరాదె నీవు ॥ సవ ॥

నమ్మి శ్రీవేంకటేశ్వరు నన్నుఁ గూరుచుమంటేను
దొమ్మి నవ్వులు నవ్వేవు దొరవౌదువే[2]
సమ్మతించి నేమే కూడి సరివయసులాయంటే
మిమ్ముఁ జూచుకొమ్మనేవు మేలుమేలే నీవు॥ సవ ॥ 383 ॥

రేకు 1665 దేసాళం

ఇంకనేది వుపాయము యెంచిచూచుకొనవయ్యా
పంకపుఁజెమటల గుబ్బతిలుతా నున్నది ॥ పల్లవి ॥

---

[1] చెల్లుబడి+అంతే+అనేవు.
[2] 'దొర' శబ్దము స్త్రీ పురుషోభయసాధారణమా?

కిన్నెర వాయించుకొంటా కెరలి తానములకు
తన్నుఁదానె మెచ్చి చొక్కుతా నుండఁగా
వున్నతి నీ వంతలోనె వొద్దికి వచ్చితేఁ జూచి
చెన్నుమీరఁ దలవంచి సిగ్గువడి వున్నది || ఇంక ||

పదములు చెప్పతాను పాడి యాయర్థములెల్లా
సుదుతులకెల్లాఁ జెప్పిచూపుచు నుండి
యెదుట నీమోము చూచి ఇంతలోనె మొఱఁగుచు
మదిరాక్షి చెక్కు చేయిమాటు చేసుకొన్నది || ఇంక ||

రతి చిత్తారు వా(వ్రా?)యుచు రాఁపువినోదములకు
అతిమదనకళల నలరి ఇట్టె
కతగా శ్రీవేంకటేశ గక్కన నిన్నుఁ గూడి
మితిమీరి సంతోసాన మెరయుచు నున్నది ||ఇంక||384||

## ముఖారి

నీయంతవట్టుకు మేలు నెమ్మి నిరువంకలాను
హాయము నెఁ(నెం?) జెరువులు భామలకిద్దరికి || పల్లవి ||

వొట్టె తన మగఁడంటా వొడివట్టె నిన్నొకతె
చెట్టవట్టి తీసీని చేరి యొకతె
పొట్టఁ బొరుగున వలపులు తీపులఁబడె
చుట్టమ వెప్పుడు నీవు సుదతు లిద్దరికి || నీయంత ||

వేడుకకాడవంటా విందువెట్టె నీకొకతె
వాడికెకు వీడెమిచ్చె వడి నొకతె
ఆడికెకు నడుమ నందతుకులాయఁ బ్రియాలు
కూడేటి నిధానమవు కొమ్మలకిద్దరికి || నీయం ||

మేనవాఁడవంటాఁ దాను మెచ్చి కూడె ని న్నొకతె
వూని కాఁగిలించుకొనె పొంచి యొకతె
నేను నీవుఁ గూడఁగాను నేరుపు నాపాలఁ జిక్కె
వూని శ్రీవేంకటేశుఁడ వువిదలిద్దరికి|| నీయం || 385 ||

## వరాళి

చూచి చూచి మాకు నేఁడు సోద్యమయ్యీని
యేచి నీమొగము చూచి యేమీననఁజాలనే || పల్లవి ||

చొప్పలెత్తి మాటలాడి సోగకన్నులనుఁ జూచి
వుప్పతించి పతి నెంత వొరసేవే
తప్పఁడు బొంకఁ డతఁడు తగవెరిఁగినవాఁడు
ఇప్పుడు నిన్నుఁ బెండ్లాడి ఇంత రట్టుకెక్కెనే || చూచి ||

పుక్కట సన్నలుసేసి బొమ్మలను జంకించి
చక్కనియీతని నెంత సాదించేవే
మొక్కలీఁడు గాఁడు పోఁడు మొగమోట గలవాఁడు
వెక్కసాన నితనితో వెల్లవిరియాయనే || చూచి ||

తరితీపులఁ జెనకి తమకము గదురేఁచి
ఇరవై శ్రీవేంకటేశు నెంత గూడేవే
తరలఁడు మరలఁడు తగ నన్ను నేలినాఁడు
సరసము నీతో నాడి సదమదమాయనే|| చూచి || 386 ||

## శుద్ధవసంతం

ఏల యెఱుఁగవోకాక యీకె నింత సేసితివి
నీలీల లిన్నియును నిన్ను మోచిరాదా || పల్లవి ||

పచ్చిమాటలాడి ఇంతిభావము గరఁగఁజేసి
ఇచ్చట సిగ్గులెల్లా బాయిట వేసేవు
రచ్చల సవతులెల్లా రమణి నాడుకొంటేను
నిచ్చలు నిదింతయును నిన్ను మోచి రాదా || ఏల ||

చెప్పరానిచేఁత సేసి చిప్పిలఁ జొక్కఁగఁజేసి
చొప్పలెత్తి మర్మాలు సోదించేవు
వుప్పతించి యిందుకుఁగా వువిదలు నవ్వితేను
నెప్పన నీ మహిమలు నిన్ను మోచి రాదా || ఏల ||

వెదరతులనుఁ గూడి వెరగందఁగాఁ జేసి
చిదుముడి వలపులఁ జిమ్మిరేఁచేవు
యెడనెడఁ దోడివారు యెగసక్కేలాడితేను
నిడివి శ్రీవేంకటేశ నిన్ను మోచిరాదా || ఏల || 387 ||

## సాళంగనాట

తక్కినవారి కింత తగునా నేఁడు
వెక్క[1](క్క?)సిగనక నిన్ను వేమారు దూరీని || పల్లవి ||

సరిగెగద్దు గనక సతి నీతో మారుకొని
మలసి వొద్దాఁ బెట్టా మాఁటలాడీని
బలిమికత్తెగనక పైకొని పెనఁగి నీవు
తలకొని చెనకఁగాఁ దప్పించుకొనీని || తక్కి ||

[1]'వెక్కసముగలవాదు' అనునర్థముతో 'వెక్కసి' అను తద్ధితరూపము ఈ వాఙ్మయమున అక్కడక్కడ గలదు. (మాడు పా. 275). 'వెక్కాసి' అనురూపము ప్రమాదభరితమేమో?

మనసెఱుఁగుఁగనక మగువ మర్మములెత్తి
కనుసన్నలనె తిట్టి గద్దించ్చీ[1] ని
మునుపటాలుగనక మొగిఁజన్నులంటితేను
వొనర సిగ్గున నీకు నొట్లువెట్టీని ॥ తక్కి ॥

బాసగొన్నదిగనక బడి నలమేలుమంగ
ఆసలిచ్చి రతిఁగూడి అలయించీని
నేసవెట్టితివి నాకు శ్రీవేంకటేశ్వర
వోసరించ కప్పటి నీవురముపై నిక్కీని ॥ తక్కి ॥ 388 ॥

## దేవగాంధారి

ఎన్నిపోలికలకు నీ విరవైతివి
వన్నెల పెండ్లికొడుకువలె నుంటివి ॥ పల్లవి ॥

పొలఁతులు నీవుఁ గూడి పువ్వుల వసంతమాడి
లలి సింగారపుఁ దోటవలె నుంటివి
బలువుగా నప్పటిని పన్నీట వసంతమాడి
తొలుకరికాలమువలె నుంటివి ॥ ఎన్ని ॥

కడలేనివేడుకతో కప్పురవసంతమాడి
వడిఁ జుక్కలలో చంద్రునివలె నుంటివి
జడిగొని కుంకుమవసంతములు సారెనాడి
గుడిగొని మాణిక్యాల కొండవలె నుంటివి ॥ ఎన్ని ॥

తిరముగ నీవు ముత్తెములవసంతమాడి
వరుసఁ బాలజలధివలె నుంటివి

---

[1] పూర్ణబిందువని తెలపడానికి తర్వాతి హల్లును ద్విరుక్తం చేసి వ్రాయడం రాగిరేకు వ్రాతలో సంప్రదాయం. 'గద్దింపీని' రూపం (కా.శ్రీ.)

నిరతి శ్రీవేంకటేశ నీవు నలమేల్మంగయు
సురతివసంతమాడి సోనవలె నుంటివి || ఎన్ని || 389 ||

రేకు 1666 లలిత

ముందరనున్నవలపు మొగిచాట్లాయఁగాక
పందెము వేసితే నాపాటిదయ్యీనా || పల్లవి ||

తెరవేసుకొని నీతో తియ్యనిమాటలాడి
తరితీపు వుట్టించె తరుణి
మరిగి యందుకే నీవు మరులు కొంటివిగాక
సరివట్టి చూచితే నాసాటి వచ్చీనా || ముంద ||

తలుపుమాటున నుండి తటుకనఁ దొంగిచూచి
తలఁపులోఁ దమిరేఁచీ తక్కరిచెలి
పలుమారు నందుకే బాఁతి పడితివిగాక
సరిగె చూపితే నా సవతు రాఁగలదా || ముంద ||

పచ్చడములోను చొచ్చి పక్కనఁ గాఁగిలించి
గచ్చుల ని న్నెలయించెఁ గరికి
అచ్చపు శ్రీవేంకటేశ అలమేల్మంగనయి నేను
ఇచ్చగించి కూడితే నాయీడు వచ్చీనా|| ముంద || 390 ||

పాడి

ఏల నాకు బాఁతిపడి యెంత వొడఁబరచీని
అలరీఁడు తను నెట్టు ఆసలఁబెట్టేనే || పల్లవి ||

యెదురు మాటాడరాదు యేమని అడుగరాదు
కదిసి తనచే నెట్టు కత వినేనే

కదిమి వొత్తఁగరాదు కాలు చేయి వేయరాదు
పదపడి నేనెట్టు పక్కఁబండేనే || ఏల ||

దారిదప్పి నవ్వరాదు తమ్ముల మీఁదఁగరాదు
పేరడిగా తన్ను నెట్లు పెండ్లాడేనే
గోర గీరరాదు కడుఁగొసరి తిట్టఁగరాదు
యీరీతివానితో నెట్టు యేకత మాడేనే || ఏల ||

తప్పక చూడఁగరాదు తను బాసగొనరాదు
ఇప్పుడే శ్రీవేంకటేశు నెట్టు వంచేనే
కప్పి యలమేల్మంగ నే కడు నలఋంచరాదు
దప్పిదేర నన్నుఁ గూడె తన్ను నెట్టు మించేనే ||ఏల||391||

బౌళి

ఎటువంటపరాకో యెరఁగలేవైతివి
తటుకన నిప్పు డిట్టె తలవంచుకొనేవు || పల్లవి ||

అండను న్నావెఁ జూడక అవల వేరొకావెను
కొండసేసి సారెసారెఁ గొనియాడేవు
దండిగా నది విని యాతరుణి జంకించితేను
వెండియు నీమోము వెలవెలఁజేసుకొనేవు || ఎటు ||

పాదాలొత్తే ఆపెను భావించక మరపున
మోదించి వేరొకావెను ముద్దాడేవు
ఆదెస నది చూచి నిన్నాకె యెరిఁగించుకొంటే
కాదనఁ జాలక నీవు కడు సిగ్గువడేవు || ఎటు ||

అలమేలుమంగ పురమందు నీకు నుండఁగానే
కెలసి భూకాంతఁ గాఁగిట నించేవు
అలరి శ్రీవేంకటేశ అందుకిట్టె నవ్వితేను
లలి నిద్దరితోను మేలములాడేవు || ఎటు || 392 ||

## వరాళి

ఇన్నాళ్లు నింత యెఱఁగ విప్పుడే నేర్చుకొంటివి
చిన్నదానపై ప్రియము చెప్పించుకోవలెనా || పల్లవి ||

మక్కువల నీవు నాతో మాటలాడినంతలోనె
చిక్కని మోవితేనె చిందీనటవే
చెక్కుచేతితోడ వట్టిసిగ్గులువడే వప్పటి
యెక్కుడుగా నిందువల్ల నేమి గూడపెట్టేవే || ఇన్నా ||

నాతో నీవంగవించి నవ్వు నవ్వితే నేమాయె
ఆతల నీవాసి గొంత అరగీనటే
కాతరించి చెలులతో కదునేకాంతా లాడేవు
యేతుల నేకాలము నీకివే వోజలటవే || ఇన్నా ||

యింకనైనా నేనన్నట్టె యియ్యకొనఁగదవే
జంకించి నీతోడివారు జరసేరటే
అంకెల శ్రీవేంకటేశుఁ డలమేల్మంగవు నీవు
లంకెలఁ గూడితివి ఈలాగు లివే మేలే|| ఇన్నా || 393 ||

## సౌరాష్ట్రం

నే నీకు వింతదాననా నీకేల వెఱపు
పూని యిచ్చకముసేసి పాదుగఁగరాదా || పల్లవి ||

పడఁతి నీకు నింతబాఁతిమైతేఁ జాలుఁగాక
తొడిఁబడ నీవొద్దికిఁ దోడితెచ్చేరా
అదరి యేమి చూచేవు అల్లార్చి యాపెదిక్కు
అడియాలమేమైనా నాడకు నంపరాదా || నేసి ||

వెలయ నీ కాపెమాట వేడుకైతేఁ జాలుఁగాక
పలుమారు నాడ నొడఁ బరపించేరా
పిలిచి పేరుకొనుచు ప్రియము లెంత చెప్పేవు
చెలరేఁగి వొక్కమాటే సేసవెట్టరాదా || నేసి ||

సరి నాపెరతి నీకు చవులైతేఁ జాలుగాక
తొరలించి తెచ్చి నీ పొత్తునఁ బెట్టేరా
ఇరవై శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
అరసి యాకెచే విడె మందుకొనరాదా || నేసి|| 394 ||

## దేసాళం

చూచేము మీ వేడుకలు సోబానఁ బాడేము నేము
యేచిన మీకోరికలు యీడేర్చుకోరయ్యా || పల్లవి ||

మంతనమాడేటివేళ మరఁగులు వెట్టుదురా
చెంత నొనగూడె నిఁక సిగ్గులేదవి
పంతాలు మీకు నీడెరె పాడివెట్ట నిఁకనేల
బంతినే మీ వలపులు పచారించుకోరయ్య || చూచే ||

సరసమాడే యప్పుడు జంపులకుఁ బనిలేదు
తెరవేసుకొంటిరి సాదించేదేమి
వెరవులెల్లా గంటిమి వేరే యిఁకఁ బొంకనేల
తరితీపుమీరతులు దక్కించుకోరయ్యా || చూచే ||

వీడెము లందుకొనియు విహారాలు సేతురా
జోడై వున్నారు ఇఁక సోదించనేల
యీడన శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
తోడఁదోడ మీ యెమ్మెలు తొరలించుకోరయ్యా ||చూచే||395||

**రేకు 1667** పళవంజరం

ఎక్కడ నేరుచుకొంటి విటువంటికతలు
మొక్కలపుదలపులు మోచుకొనఁగలవా || పల్లవి ||

పొత్తులమాట లాడేవు పూఁచి యేడ నేర్చితివో
బత్తితో నెవ్వరివని పంచుకొందుము
మొత్తమై యందరుఁ గూడి మొనచన్నుల నొత్తితే
వుత్తలపడక నీవు వోరువఁగలవా || ఎక్క ||

మూఁకలచూపులు చూచే[1] మోపులకొలఁదులుఁగ
తేఁకువ నెట్టేర్పరచి తీసుకొందుము
కాఁకల నిన్నొకమూఁటే కాంతలు కాఁగిలించితే
యేఁకట వేసరక నీ వెదురుకొనఁగలవా || ఎక్క ||

మూఁటనవ్వులు నవ్వేవు మొగి విచ్చుకుండాను
యేఁట యెందు మోచునని ఇయ్యకొందుము
కూటమి నిన్నిందరముఁ గూడి పెండ్లాడితిమి
పాటించి శ్రీవేంకటేశ బాసలియ్యఁగలవా ||ఎక్క||396||

---

[1] 'చూతువు – చూచెదవు' అను గ్రాంథికరూపములం 'వు' వర్ణకమునకు వైకల్పికముగ లోపము వచ్చినట్లే, నాటి వ్యావహారిక రూపమగు 'చూచేవు' లో గూడ 'వు' వర్ణకలోపమా? లేక వ్రాతలో లోపించెనా?

## తోండి

నేను తనకు నెదురా నేరుపరి కదుఁ దాను
రానంటా నన్నేల దూరీ రతివిరహమున || పల్లవి ||

పంతములాడేటివాఁడు బలిమి చూపుమనవే
మంతనాన విరులేసే మరునితోను
రంతులు నాతోనేల రవ్వగా వాదించుఁగాక
చింతలురేఁచేయట్టిచిలుకతోను || నేను ||

మేరతోనేల సాదించీ మించి కోపించుమనవే
సారె వెన్నెలల వేఁచే చందురుపైని
గోరడి నన్నేల కొని గుంపించి పైకొనుఁగాక
సారెకును విసరేటి చలిగాలిపైని || నేను ||

పెనఁగి కూడేటివాఁడు బీరము చూపుమనవే
కినిసి తొడరేవసంతునియెదుటా
యెనసి శ్రీవేంకటేశుఁ డెమ్మెలు మెరయుఁగాక
వెనకముందరితనవెలఁదులయెదుటా || నేను || 397 ||

## ఆహిరి

విన్నదాఁకా తహతహ విడువదేమోకాని
పన్ని సిగ్గువడైతే పచారించ నిన్నును || పల్లవి ||

ఇప్పుడేమేకతమాడె ఇంతి నీతో నిందాఁకా
చెప్పరానిమాటలైతేఁ జెప్పవలదు
తప్పక చూచె నదేమి దండ నుండి యూపె నిన్ను
కప్పి యది దాఁచేదైతే గాసిఁబెట్ట నిన్నును || విన్న ||

సన్నలేల సేసె నీతో జలజాక్షి యిందాఁకా
మిన్నక రహస్యమైతే మీలో నుండనీ
చిన్నినవ్వు నవ్వే నేమీ సెలవులఁ దానే యాకె
నిన్ను సోఁకివచ్చేదైతే నే నడుగ నిన్నును || విన్న ||

కానుక లేమిటికిచ్చె కలికి నీ కిందాఁకా
పూని గుట్టు సేసేదైతే పోరాడవద్దు
ఆనుక శ్రీవేంకటేశ అదేమీ నన్నేలితివి
కానియాకె అప్పణయితే కాఁతాళించ నిన్నును ||విన్న||398||

## ఆహిరి

ఏల తలవంచుకొనే వింతలో నీవు
నీలాగు నే నెఱుఁగుదు నీకేల వెఱపు || పల్లవి ||

తగవులఁ బెట్టేనా తారుకాణించవచ్చేనా
మొగము చూచి యాపెకు మొక్కితివంటా
మెగసక్కేలాడేనా యెరుకసేసుకొనేనా
పగటున నటు కొంగుపట్టితివంటాను || ఏల ||

తప్పులు నీపై వేసేనా తగుల నిన్నాడేనా
యిప్పుడే యాపెకుఁ గానుకిచ్చితివంటా
చొప్పులెత్తి చూపేనా సొంట్లు సోదించేనా
వొప్పగునీమోవి నెంగి లున్నదంటాను || ఏల ||

నెపములు వెదకేనా నీచేఁతకు నవ్వేనా
వుపమించి యాడానాడా నుండితివంటా
కృపతో నన్నేలితివి కెరలి శ్రీవేంకటేశ
నిపుణత నేరసేనా నివ్వెరైతివంటాను || ఏల || 399 ||

## ఛాయానాట

చెల్లఁబో తపసు వండి జడవేలయ్య
  కొల్లగా వలపు లమ్మీఁ గొనుకొనవయ్యా || పల్లవి ||

జఱసి బెరసి యాపె సగసములాడఁగాను
  నెఱిఁ బరాకైవుండేవు నీవదేమయ్యా
  తఱితోడ రతులకుఁ దరవులు వెట్టఁగాను
  మఱొకతెతో మాటాడ మరేలయ్యా || చెల్లఁ ||

చేయిముట్టి నిన్ను నాకె చెనకుచునుండఁగాను
  యేయెడ చూచేవు నీవు యిదేమయ్యా
  ఆయములు సోఁకించి ఆసలెల్లఁ జూపఁగాను
  చాయ సేసుకున్నాఁడవు సరి[1] నదేమయ్యా || చెల్లఁ ||

యెచ్చరించి నిన్ను నాకె ఇట్టె కాఁగిలించఁగాను
  పచ్చినవ్వులు నవ్వేటిపని యేమయ్యా
  ఇచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
  యిచ్చకుఁడ విద్దరికి నెట్టయితివయ్యా || చెల్లఁ || 400 ||

## రామక్రియ

వలపు సిగ్గెఱఁగదు వడి నేమిసేయవచ్చు
  అలసి యాడికలకుఁ గలఁగదు మనసు || పల్లవి ||

పిలిచి నీపైతేను ప్రియములు చెప్పే వాపెకు
  చెలి నిన్నాడేమాటైతేఁ జెప్పరాదు
  బలిమి నిందులకెల్లా పడిగెమట నీమోవి
  వెలయ నీకిది విని విఱుగదు మనసు || వల ||

---

[1] సరిన్ = ఎదుట కావచ్చు.

అడుగులకు మడుఁగు లటు నీవు వరచేవు
బడి నాపెగర్వమైతే పట్టరాదు
అదరి నీవు రాఁగాను ఆపె పాన్పుపై నున్నది
చిదుముదు నిది చూచీఁ జెదరదు మనసు || వల ||

నిగిడి మొగమోటలు నీవు నడపేవుగాని
తగ నాపెపంతాలైతేఁ దలఁచరాదు
నగుతా శ్రీవేంకటేశ నన్ను నిట్టె గూడితివి
తగిలి నీ కాపెరతిఁ దనియదు మనసు || వల || 401 ||

రేకు 1668 ముఖారి

ఏఁటికి గేలిసేసేవు ఇందరిముందరా మమ్ము
గాఁటాన నవ్వఁదడవా కాదనికాక || పల్లవి ||

జంకెనచూపుల నిన్ను సాదించఁదడవా
మంకుఁదన మేఁటికనేమాటకుఁగాక
కంకణాలచేయి వేసి కాకురేఁచఁ దడవా
అంకెల నాఁటది గబ్బియందురనికాక || ఏఁటి ||

వలపించి నిన్ను నిట్టె వంచుకొనఁదడవా
చలమరి ఇదియనేసడికిఁగాం
పెలుచుఁదనాన నీతో పెనఁగఁగఁ దడవా
యిల నాలుమగఁడనే యెన్నికకుఁ గాక || ఏటి ||

పంతములు నీతోను పచరించఁ దడవా
ఇంతరట్టు సేసేది యేలనికాక
చెంత నన్నుఁ గూడితివి శ్రీవేంకటేశుఁడ
యెంతైనా మెచ్చఁదడవా యెమ్మెలని కాక ||ఏటి||402||

## పూర్వగౌళ

పొందినవారము నేము బుద్దులు చెప్పక పోదు
పందెములు వేసి మీరు పంతాలు మెరయరే || పల్లవి ||

అగడుగా జగడించే రాతనికి నీకును
తగవు చెప్పే రావే తరుణి
మగవాఁడు పట్టఁజెల్లు మగువ దిట్టఁగఁ జెల్లు
వెగటున మీలో మీరు వెనకతియ్యకురే || పొంది ||

వుమ్మడినే పెనఁగేరు వుద్దండాలు మెరయుచు
సమ్మతించఁ జెప్పే రావే సకియ
దిమ్మరితన మాతనిది దిట్టతనము నీది
నెమ్మది నింకా మీరు నేర్పులు మెరయురే || పొంది ||

తత్తరించి అలిగేరు తమకించి కూడేరు
పొత్తునఁ గఁ పే రావే పొలఁతి
ఇత్తల శ్రీవేంకటేశుఁ డీతఁడు నన్నేలె మేలు
హత్తి యిద్దరు నిద్దరే అంకెల సాదించరే ||పొంది||403||

## శ్రీరాగం

ఆపెలాంచనము మోయనర్హమా నీకు నేఁడు
యేపున మీపొందు మాకు నెరిఁగించవలెనా || పల్లవి ||

కోమలిగుబ్బలమీఁదిగురిగింజపేరు
నీమెడ వేసుకొంటివి నేరుపుతోను
ఆముకొన్నమగవాఁడ వాఁటదానవయ్యేవా
యేమిటి కొకరిసొమ్ము ఇయ్యవయ్య ఇఁకను || ఆపె ||

కలికినొసలనున్న కపురుబేగడబొట్టు
పెలుచవై నీనుదుటఁ బెట్టుకొంటివి
చెలఁగి బలుదొరవు చెంచుదాన వయ్యేవా
యెలమి నెరవులసొమ్మియ్యవయ్య ఇఁకను || ఆపె ||

అంచగమన తురుమునందుండేపికిలికుచ్చు
మించఁగ నీకొప్పమీఁద నుంచుకొంటివి
కొంచక శ్రీవేంకటేశ గొల్లదాన వయ్యేవా
యెంచఁగ నన్నేలితివి సొమ్మియ్యవయ్య ఇఁకను ||ఆపె||404||

## సామంతం

ఇన్నాళ్లదాఁకా నీ వెందువోతివే
మన్ననలు మెఱయక మానుదురటే || పల్లవి ||

నెట్టన నాతనిమీఁద నిందలాడేదానవు
ఇట్టె తారుకాణిచ కేలుందానవే
పట్టపగలాయ నీతో పంతాలాడే విట్టె
కట్టుమట్టులు సేసే దిఁక మరియెన్నఁడె || ఇన్నా ||

పైకొని పిమ్మటనే పదరేదాన వెదుట
దీకొన కటు వెనకటితురటవే
కాకుసేసేనంటాను కాచుకున్నదానవు
యీకడ మొకమోటలు యిఁకనేఁటికే || ఇన్నా ||

యెగ్గులేపట్టేనంటా నెంచుకున్నదానవు
సిగ్గువడి యింత జాగుసేతురటవే
అగ్గమై శ్రీవేంకటేశుఁ డాతఁడిదె నన్నుఁ గూడె
కగ్గదేర నీయెమ్మెలు కానవచ్చెనే || ఇన్నా || 405 ||

## హిందోళవసంతం

ఇల్లాలిచేఁతలా యివియెల్లాను
కొల్లకత్తెవలెఁ బుచ్చుకొంటివి వుంగరము ‖ పల్లవి ‖

మందెమేళమున నీమగనితో సారెసారె
పందెము వేయుచు పకపకనవ్వేవు
చెంది నీమీఁది కతనిఁ జేయివట్టి తీసుకొంటా
కందువ లంటేవు యెంతగద్దివే నీవు ‖ ఇల్లా ‖

కమ్మటి గర్వమున నాగడములాడి యతని
దొమ్మిసేసి పెనఁగుతా తొడ యెక్కేవు
కమ్మఁబూవుబంతిని కళదాఁక వేసుకొంటా
చిమ్మేవు నీకొనగోర నెంత చేఁతలాడివే ‖ ఇల్లా ‖

పిక్కటిల్లు మదమున బిగువుఁజన్నుల నొత్తి
చెక్కునొక్కి బుజముపై జీరదీసేవు
అక్కరతో శ్రీవేంకటాధిపుఁడు నన్నుఁ గూడె
కక్కసించే విపుడెంతకలికివే నీవు ‖ ఇల్లా ‖ 406 ‖

## గౌళ

నేనా విన్నవించితి నీ చిత్తముకొలఁదిఁక
చేనిపట్టి వానిలోడఁ బెనఁగఁగఁగలవా ‖ పల్లవి ‖

కొప్పదువ్వేనంటాను కోరి వేడుకపడేవు
ముప్పిరి మరునమ్ములమూఁక లున్నవి
నెప్పనఁ గస్తూరిబొట్టు నెన్నుదుట దిద్దేవు
కప్పి బొమ్మలవిండ్లు కాచుకున్నవి ‖ నేను ‖

మోవితేనియలనుఁ గమ్ముకొని యానగించేవు
భావజుని చిగురాకుఁబట్టి మున్నది
మోవరాని మొగపులమొలనూ ళ్లంటేవు
తావుకొని చక్రము లాదండనే వున్నవి || నేనా ||

పంతముతో మూసినపయ్యద జారఁదీసేవు
వింతలె జక్కవ. లవే వేగు లున్నవి
యింతలో శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
సంతోసాలు మనసులో చాలుకొన్నవి || నేనా || 407 ||

రేకు 1669 ముఖారి

ఇంతవొలషక్షము నీవేల సేసేవు
పొంత[1] నీమరుఁడే మీకు వూఁటవడెనా || పల్లవి ||

మగువ లింద రుండఁగ మనసిచ్చి యాకెతోనె
మగిడి మగిడి నీవు మాటలాడేవు
తగులున ఇద్దరిని తలిగొని మదనుఁడు
పొగరుఁబువ్వుల నేసి పొందుసేసెనా || ఇంత ||

సవతులందరు నీతో సరసములాడఁగాను
నవముగా నాపెతోనే నవ్వు నవ్వేవు
కవగూడి మీలో మీకే కైవసము సేసేనని
జవళితోఁ గంతుఁడు బాసలు సేసెనా || ఇంత ||

వొరయుచు నీదేవుళ్లు వూడిగాలు సేయఁగాను
కరుణతో నీవాకెను కాఁగిలించేవు

---

[1] పొంతన్ + ఈమరుఁడే. పొంత + అని = పొంతని అని విరిస్తే నీరిద్దరికి, పొంత = సామీప్యము, పొందుకలదని చెప్పవచ్చు.

ఇరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
పురుఁడించి కాముఁ డిట్టె బుద్ధి చెప్పెనా ||ఇంత||408||

## పాడి

మీరైనా బుద్ధిచెప్పరే మెలుఁతలాల
దార దప్పనివానికి తగవులౌనటవే || పల్లవి ||

మంతనమాఁడేటివాఁడు మరేల రాదసేసీని
పంతగాఁడయినవాఁడు పైకొననేలే
వంతులు వెదకేవాఁడు వాసులెంచవలెనటె
ఇంతా విచారించుకొంటే నివి వోజలటవే || మీరై ||

చుట్టమైవుండేటివాఁడు చొక్కులఁ బెట్టనేఁటికే
నెట్టుకొన్నవానికి నేరమేడదే
జట్టిగొన్నవాఁడట చలము సాదింతురటే
దట్టపు దొరైనవాఁడు తమకించునటవే || మీరై ||

రతుల మెప్పించేవాఁడు రవ్వసేయనేఁటికే
చతురుడయినవాఁడు చలమేఁటికే
ఇతవై శ్రీవేంకటేశుఁడే నలమేలుమంగను
గతియై నన్నేలినాఁడు కాఁతాళించునటవే ||మీరై||409||

## బౌళి

మతకరితనములు మాతో నేమిటికి
తతివచ్చినందుమీఁద దాఁచవచ్చునా || పల్లవి ||

నను నడుగనేఁటికి నంటున నీ సుద్దులు
మనసెరఁగనికల్ల మరి వున్నదా

వెనకచుట్టరికము విచారించవచ్చేవు
తనవుసోఁకని యట్టి తగులాయ మున్నదా || మత ||

నేరుపుల నీమాటలు నేఁడు నాతో నెరపేవు
నోరెరఁగనియట్టి నుడువున్నదా
దారదప్పి నెవ్వైతెను దలఁచనని యూడే
కోరికెకులోనుగాని కూరి మున్నదా || మత ||

గిలిగించినా నీవు కేలిఁ బంతాలు చూపేవు
సెలవినవ్వుల రానిసిగ్గులున్నవా
నిలిచి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
కలసితివి నీవల్లఁ గడమున్నదా || మత || 410

## సామంతం

ఆతఁడే మన్నించీఁగాక అందుకేమె చెలులాల
కాతరించిపై కొంటే కడువేసటగాదా || పల్లవి ||

వేడుకతో నుంటేనే విన్నవించవచ్చుఁగాక
యేడో పరాకైవుంటే నెందుకెక్కును
కూడేబత్తి గలిగితే కొసరఁగఁ జెల్లుఁగాక
వీడు జోడై వుండఁగాను వెక్కసమైతోఁచదా || ఆతఁ ||

మచ్చికై తా నుండితేనే మాటలాడవచ్చుఁగాక
ఇచ్చగించకుండఁగాను ఇంత యేఁటికి
పచ్చిదేర నవ్వితేనే పట్టివెనఁగుటగాక
యెచ్చుకుందు లాడఁగాను యెరవులే కావా || ఆతఁ ||

తలఁపు గలిగితేనే తమకించవచ్చుగాక
చలముతో నుండఁగాను చవి యేడదే
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
అలమేలుమంగ నేను ఆస గడు మీరదా ||ఆతఁ||411||

## వరాళి

ఇల్లాలఁగనక నిన్నేమీననోపను
వుల్లములో బెట్టుకొని వుండితేనే చాలును || పల్లవి ||

అంతరంగములుగాను ఆపె నీవు నాడుకొన్న-
వింత వింత మాటలెల్లా వింటిమి నేము
చెంతల నీతో నవి చెప్పఁబోతే సిగ్గయ్యీని
మంతనానఁ దలఁచుకో మరి నీకు నీవే || ఇల్లా ||

చెంది మీరిద్దరు లోలోఁ జేసుకొన్న చేఁతలెల్ల
కందువ గన్నులెదుటఁ గంటిమి నేము
అందరిలోఁ జూపఁబోతే అవి గడుఁ బచ్చిదేరీ
పొందులుగాఁ గనుకో ఇప్పుడు నీకు నీవే || ఇల్లా ||

అట్టుగా మీకాఁగిటియాఁడి నింతయు
నెఱిఁగి గుట్టున బైకొని నవ్వుకొంటిమి నేము
నెట్టన శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
అట్టె నన్నేలితివి పాయకు నీకు నీవే || ఇల్లా || 412 ||

## దేసాళం

చెల్లఁబో యెన్నాళ్లైనాఁ జిన్నదానవా
వొల్లనె నీవాతని వొడివట్టరాదా || పల్లవి ||

వలపేల దాఁచేవే వాసులేల రేఁచేవే
  వెలయఁ బతికి విన్నవించరాదా
తలఁపేల మఱచేవు తమియేల విరిచేవు
  పిలిచి ఆయాలుసోఁక బెనఁగరాదా ॥ చెల్లఁ ॥

సిగ్గులేల పెంచేవే శిరసేల వంచేవే
  వొగ్గి నీ చనుమొనల నొత్తరాదా
తగ్గి యేఁటి కలసేవు దానికేల సొలసేవు
  వెగ్గళించి పొందు వెల్లవిరిసేయరాదా ॥ చెల్లఁ ॥

నేమమెంత సేసేవా నేలలేమి వా(వ్రా?)సేవే
  ఆముకొని సరసములాడఁగ రాదా
వేమరు శ్రీవేంకటేశు వెస నీవు గూడితివి
  ఆూమెయి నలమేల్మంగ విరవుకోరాదా ॥ చెల్లఁ ॥ 413 ॥

రేకు 1670 సామవరాళి

ఈపాటివాఁడవు నీ కిఁకనేల వెఱవు
  ఆపనులకే నీవు ఆసపడేవు ॥ పల్లవి ॥

తప్పక నిన్నుఁ జూచి తలపులో భావించి
  చిప్పిలఁగఁ జెమరించేఁ జెలియ
ఇప్పుడు నీ వది చూచి యెగపోసి దిగపోసి
  దప్పిదేరి వుస్సురంటాఁ దమకించేవు ॥ ఈపాటి ॥

నీచేయి వట్టుకొని నిలువ్వునఁ గరఁగుచు
  పూచినట్టు పులకించెఁ బొలఁతి
ఆచాయలకే నీవు ఆసలెల్లాఁ బెడరేఁచి
  తాచిన కళలతోనే దైవారేవు ॥ ఈపాటి ॥

మాటలు నీతో నాడి మచ్చికలందనివొంది
మేటికాఁగిలిచ్చీ నలమేలుమంగ
యీటున శ్రీవేంకటేశ ఇందుకే రతి మెప్పించి
పాటికి బేటికిఁ గడుసంతసిల్లేవు || ఈపాటి || 414 ||

## నాదరామక్రియ

ఏల వేసాలు సేసీనే యిప్పుఁడు మాతోఁ దాను
వోలి నన్నిఁటికి నోర్చి వూరకుండుఁగాక || పల్లవి ||

చెక్కుపై గోరిడితేను సిగ్గువడఁ దనకేలే
అక్కడివారు తన్ను నాడుకొనేరా
వెక్కసపు మగవాఁడు వెలితురా సతులకు
వుక్కుమీరి చట్టువలె నుండవలెఁగాక || ఏల ||

మోవి గంటిసేసితేను మూసుకొనివుండనేలే
తావు లెవ్వరైనాఁ జూచి తన్ను నవ్వేరా
చేవమీరిన దొర చెలులకు లోఁగుదురా
వావిరి నన్నిటా మాకువలె నుండుఁగాక || ఏల ||

వురముపై నెక్కితేను వుదుటులు తనకేలే
తరుణులెవ్వరైనానుఁ దగదనేరా
ధర నలమేల్మంగను తాను శ్రీవేంకటేశుఁడు
అరిదిఁ బువ్వును వాసనాసై యుండుఁగాక|| ఏల || 415 ||

## ఆహిరి

ఇచ్చకమే సేయవలె ఇన్నిటికి లోఁగావలె
తచ్చి ఇదె నీతి సుమ్మీ దంపతులకెల్లాను || పల్లవి ||

తగవులఁ బెట్టరాదు తమకించి యాడరాదు
మొగము చూచి చూచి మగవానిని
అగడు సేయఁగరాదు అలమటఁబెట్టరాదు
నగి నగియైనాను నాథుడైనవానిని ॥ ఇచ్చ ॥

అరజము సేయరాదు అలుకలే పెంచరాదు
నేరములే పై వేసి నిందు దొరను
గోర గిరఁగరాదు కోపము సేయఁగరాదు
కోరి వినోదానకైనా గుణియైనవానిని ॥ ఇచ్చ ॥

వేసరుకొనఁగరాదు వింతగాఁ జూడఁగరాదు
ఆసుద్దులకు శ్రీవేంకటాద్రీశుని
సేసతోఁ గూడితివి మించి యలమేల్మంగవు
బాసిచ్చి నిన్నేలిన యీపాయరాని వానిని॥ ఇచ్చ ॥ 416 ॥

## దేసాళం

సేయువయ్యా చేయఁగల చేఁతలెల్లాను
నీయంత లేవితగవు నేరుపఁగవచ్చునా ॥ పల్లవి ॥

తలఁపులు రూపించి ముందరఁబెట్టవచ్చునా
వలపు లంగడిఁబెట్టవచ్చునా తెచ్చి
పలుకులు మూటగట్టి బండారించవచ్చునా
చలమరి నీగుణాలు చక్కఁబెట్టవచ్చునా ॥ సేయు ॥

పట్టరానివయసున బయలీఁదవచ్చునా
పట్టినవ్వులెల్లా నానఁబెట్టవచ్చునా
కట్టఁగడ వావులెల్లా గాదెఁ బోయవచ్చునా
దట్టమైననీయాసలు తలఁగించవచ్చునా ॥ సేయు ॥

వుడివోనిపిలాపెలు వొడిఁబెట్టవచ్చునా
చిదుముడి పిరతులు చెప్పవచ్చునా
అదరి శ్రీవేంకటేశ అలమేలుమంగనేను
యెడయక నన్నేలితి నింక దూరవచ్చునా॥ పేయ ॥ 417 ॥

ముఖారి

చెలులాల మీకేలే చెల్లఁబో వొలపక్షాలు
మలసి సరిగాఁ జూచి మమ్ము నొడఁగూర్చరే ॥ పల్లవి ॥

అడనే వున్నాఁడు తాను అసలాసలనే పెట్టి
యేడలేని బుద్దులు మీరేల చెప్పేరే
వేడుకకు వలవఁగా వెన్నెలలు వేఁడులాయ
యీడనుండే యెంత బయలీఁదించేరే ॥ చెలు ॥

కన్నులఁ దప్పక కాఁకలే రేఁచీఁ దాను
ఇన్నియుఁ దెలిసి యేల యెడతాఁకేరే
చెన్నుమీరఁ దలఁచఁగా చిగురులు వాండ్లాయ
నన్నల నావొడివట్టి చవులెంత చూపేరే ॥ చెలు ॥

ఇప్పుడే యీడకు వచ్చి ఇంటిలో బందుండీఁ దాను
కప్పురమద్ది మీరేల గడెవెట్టేరే
తప్పనెలమేల్మంగను[1] తాను శ్రీవేంకటేశుఁడు
అప్పుడే నన్నలెనెంత అఱడిఁబెట్టేరే ॥ చెలు ॥ 418 ॥

పాడి

కాంతలాల యెటువంటోగామిడితనాలవాఁడే
కొంత గోర గీరితేనే గొబ్బునఁ దిట్టేనే ॥ పల్లవి ॥

---

[1] తప్పని+అలమేల్మంగను. ఈ వ్యావహారికసంధులిరు ఆవాఙ్మయములో కొల్లలు.

వొప్పగాఁ బదారువేలువువిదల నెట్టెలనే
కొప్పవట్టి నేఁ దీసితే కొచ్చి చూచీని
అప్పటి భూకాంతమగఁడటవే తా నిన్నిటాను
కప్పి నా చనుఁగొండలు కదువేఁగు లచీని || కాంత ||

యేడలేనిగొల్లెతల కెట్టు మగఁడాయనే
వేడుకఁ దమ్మ నిడితే వెడవీఁగీని
పాడితోడ నెనమండ్రు పట్టపుదేవుళ్లటవే
కూడి నేఁ దొడెక్కితే సిగ్గులు వడీని || కాంత ||

వీఁపునా రొమ్మునా నెత్తి వెలఁదుల మోచెనటె
పై పై నేఁ గాలు దొక్కితే బడలీఁ దాను
యేపున శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
తీపుమోవి చవిగొంటే తేనెలూరించీని || కాంత || 419 ||

రేకు 1671 మాళవి

పచ్చిమాట లాడేవు బయకాఁడా
గచ్చులు సేతురా నీవు కాతరీఁడా || పల్లవి ||

తలుపేల మూసేవు తమియేల రేఁచేవు
వెలలేని వలపుల వేడకకాఁడ
చెలుల నేలంచేవు సిగ్గులేల ముట్టేవు
కొలఁదిలేని రతుల కోడెకాఁడా || పచ్చి ||

కొప్పేల దువ్వేవు కొంగేల పట్టేవు
దప్పిదేరేకాఁకలదాయగాఁడా
తప్పక యేల చూచేవు తవనలేల పెట్టేవు
ముప్పిరిఁ గళలు రేఁచే మొక్కలికాఁడా[1] || పచ్చి ||

[1] మొక్కలము+ఇ+కాఁడు. ఒకే అర్థమున తద్ధితముపై తద్ధితము.

నవ్వులేల నవ్వేవు నయములేల చూపేవు
జవ్వనపుమదముల జాజరకాఁడ
యివ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
నివ్వటిల్లు చేఁతల నీటకాఁడ || వచ్చి || 420 ||

తెలుఁగుఁగాంబోది

నిండినజవ్వనమెల్లా నీచేతిది
చండిపెట్టి చూచి నిన్ను జంకించేనా || పల్లవి ||

వెలయఁగ నీవు నన్ను వేడుకఁ బెండ్లాడితివి
చలపట్టి నే నిన్ను సాదించేనా
చెలఁగి యెవ్వతెపొందు చేసినాఁ జేతువుగాక
తలఁపున నీపైఁగాఁతాళించేనా || నిండి ||

కందువ దొల్లె నీవు కంకణము గట్టితివి
యెందుకైనా నేనీతో నెదురాడేనా
విందవై యెవ్వరితో నవ్వినా నవ్వుదుగాక
నిందవేసి నిన్నుఁ గడునేర మెంచేనా || నిండి ||

కామించి నీవు నన్నుఁ గాఁగిలించి కూడితివి
యేమిసేసినా నదియేఁటి కనేనా
యీమేర శ్రీవేంకటేశ యెట్టున్నా నుందువుగాక
వేమారు నిన్ను నిఁక వెగ్గళించేనా || నిండి || 421 ||

కన్నడగౌళ

ఇందుకు నీ చిత్త మిఁక నెట్టున్నదో
కందువ బోలిఁ బెట్టక కరుణించవయ్యా || పల్లవి ||

తెరదీసి మోముచూచి తీపుమోవికే లాసి
సరసపుఁగాఁకల చలిగాసీని
తరుణి నీ కింతగాను తపములు చేసి చేసి
వెరవులు వెదుకుచు విరుల వేసీని ॥ ఇందు ॥

చేయివట్టి సన్నసేసి సిగ్గులెల్లాఁ గూడపెట్టి
దాయపు వలపులను దండగట్టీని
కాయజకేలికి నీకుఁ గమ్మటి వేడెలువెట్టి
ఆయములు ముట్టి ముట్టి యానలు వెట్టీని ॥ ఇందు ॥

కప్పరము నోరికిచ్చి కాఁగిటిరతుల మెచ్చి
యిప్పుడే పానుపు మీద యెడమిచ్చీని
చెప్పన శ్రీవేంకటేశ నిన్ను నిన్నిటాఁ దచ్చి
చెప్పరానిచేఁతలెల్లాఁ జేసి హెచ్చీని ॥ ఇందు ॥ 422 ॥

ఆహిరి

వేగిరమా యిప్పుడేమి విభుఁడవు నీవు నాకు
భోగించేయప్పుడే నీవు పొసఁగి వుండేవు ॥ పల్లవి ॥

ఘనుఁడవు నిన్నుఁ గడు కరకరించ నేఁటికి
మనసువచ్చినప్పుడే మాటలాడేవు
పనివడి గిలిగించి బడలించనేమిటికి
ననిచినప్పుడే నీవు నవ్వు నవ్వేవు ॥ వేగి ॥

వెంట వెంటఁ దగులుచు విన్నవించనేమిటికి
యింటికి వచ్చినప్పుడే యియ్యకొనేవు
దంటతనమున నీతోఁ దమకించనేమిటికి
నంటుగలయప్పుడే నావాఁడ వయ్యేవు ॥ వేగి ॥

కైవసము గమ్మనుచు కాఁతాళించనేమిటికి
భావించి చూచినప్పుడే పైకొనేవు
శ్రీవేంకటేశుఁడవు చిమ్మిరేఁచనేమిటికి
యీవేళ నన్నేలితివి యింకఁ నిట్టే మెచ్చేవు॥ వేగి ॥ 423 ॥

## రామక్రియ

తొల్లే నీయాల నేను దోసానకు లోనుగాను
చల్లనాయ నామనసు జరయనేలయ్యా ॥ పల్లవి ॥

బాసికము గట్టితివి భామకాలు మెట్టితివి
చేసినచేఁతలు నీకుఁ జెల్లెనయ్యా
బాసలెల్లా నీడేరె పచ్చినవ్వులు దైవారె
యేసుద్దులు విన్నవించ నిఁకనేలయ్యా ॥ తొల్లే ॥

పెండిలిపీఁ టెక్కితివి ప్రేమఁ జెక్కునొక్కితివి
అండనే సతికిఁ బతివైతివయ్యా
దుండగాలెల్లా దక్కె సంతోసాలు చేచిక్కె
చండిపెట్టి నిన్ను నంత సాదించనేలయ్యా ॥ తొల్లే ॥

పీడెము లందుకొంటివి పెలఁదిఁ గైకొంటివి
తోడనే నీకోరికెలు దొరసేనయ్యా
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
వోడక రతుల నిన్ను నొరయ నేలయ్యా॥ తొల్లే ॥ 424 ॥

## సామంతం

వేఁడుకోఁగాఁ జెలులతో విబ్బిఁగే వింతేకాక
నేఁడావె తానే వచ్చితే నీకేమన వచ్చును ॥ పల్లవి ॥

చలపాదితనములు సతులకు నింతేకాక
వలచినయట్టిమగవాని కేఁటికి
చెలరేఁగి యాపె నిన్ను చెనకి పైకొంటేను
నిలువున గరఁగక నీ వోర్వఁగలవా || వేడు ||

పనిమాలినవొట్లు పడఁతుల కింతే కాక
ననిచినయట్టిప్రాణనాథు కేఁటికి
మనసిచ్చి యాపె నీ మర్మములు ముట్టితేను
తనివోని తమకము దాఁచుకొనఁగలవా || వేఁడు ||

దిట్టతనపు మాటలు తెఅవల కింతేకాక
నెట్టన శ్రీవేంకటేశ నీకేఁటికి
గట్టిగా నిన్నాపె గూడి కాఁగిట నిట్టవుండితె
గుట్టెల్లాఁ జెప్పక మతి బెట్టుకొనఁగలవా|| వేడు || 425 ||

రేకు 1672 రీతిగౌళ

సరి నిచ్చకమాడితే చాయకువచ్చుఁ బనులు
నిరతపువారి కివి నేరుచుకొనవలయు || పల్లవి ||

సలిగెలఁ బొరలేటిసతితోను రమణుఁడు
చలము సాదించఁబోతే చండిపడును
వెలుచగుణముదానిఁ బిలిచి పెనఁగితేను
చలరేఁగి పంతములే చిమ్మిరేఁగును || సరి ||

మందెమేళపుటింతిని మస్తరించవలెఁగాని
ఇందరిలో జంకించితే యీమరేఁగును
నందునుడికత్తెకు నానలు చూపవలెఁగాని
గొందుల నణఁచఁబోతే గొణఁగుచుఁ దిట్టును || సరి ||

మొగమోట సతితోను ముచ్చటలాడుటే మేలు
వెగటు బంతాలైతే వేసటౌను
నిగిడి శ్రీవేంకటేశ నే డేకె నేరితివి
పగటులు నెరపితేఁ బచ్చిదేరుఁ బ్రియము || సరి || 426 ||

## భైరవి

ఇంకనైనా రాఁగదవే ఇదె నీ విభుఁడు వచ్చె
లంకెలఁ బెనఁగితేను సంకెలేక వుండును || పల్లవి ||

చనవులు గలిగితే చలము పనికిరాదు
మనసు లెనసితేను మంకులు మాను
తనువులు సోఁకితేను తలితో సిగ్గులు వీడు
కనుచూపులు నాటితే కాఁకలు చల్లారును || ఇంక ||

పలుకు లొడఁబడితే భయమేమియును లేదు
వలపు లొనఁగూడితే వాసులుండవు
కొలువులు గలిగితే కోరి యెడమాట లొద్దు
నెలవి నవ్వు లూరితే చింతలు పొదలవు || ఇంక ||

ఆయములంటితేను అరగొరలే లేవు
పాయక వద్దనుండితే పంగెము గాదు
యీయెడ శ్రీవేంకటేశు డెనసితి విపు డిట్టె
చేయిచ్చి నేసవెట్టితే సిలుగెల్లాఁ బాసును|| ఇంక || 427 ||

## బౌళి

ఆయులే నటలేఁటికి నవ్వటె నీవు
ఆయములు గరఁగినా ఆకె వుండఁగాను || పల్లవి ||

సేవలు సేసేనంటే సెలవయ్యీనా నీకు
అవల వేరొకతెపై నాస వుండఁగా
మోవితేనె లడిగితే మోహము వుట్టీనా
తావుకొని యాపె నీదండ నుండఁగాను || అయ ||

చెక్కులెంత నొక్కినాను సిగ్గులు మానీనా
చొక్కించి సతులెదుటఁ జూడఁగాను
మక్కువ నే జల్లితేను మనసు వచ్చీనా
చక్కఁగా నాపె చెయ్యి చాఁచుకుండఁగాను || అయ ||

వంతుకు నే నవ్వితేను వలపుల రేఁగీనా
సంతతము నాకె రతి చవి చూపఁగా
యింతలోనె శ్రీవేంకటేశ నన్ను నేలితివి
వింతగా నాకేఁ గూడవా వెసనే నుండఁగాను ||అయ||428||

## లలిత

ఒరుచుక ఇన్నిఁటికి నూరకుండుటే మేలు
యేరీతి వంచుకోవచ్చు నిటు నిన్ను విభుఁడా || పల్లవి ||

చందమామగుటకలు సారె నీ మంచితనాలు
పందెమాడే చెరకులు పనులు నీవి
సందేకాడమఱఁగులు చక్కని నీ చేఁతలు
యెందుకని దూరేము ఇఁక నిన్ను విభుఁడా || ఒరు ||

యెండమావులనీళ్లు ఇటు నీతో సరసాలు
వండవండనట్లు నీవలపులెల్లా
పండినబూరుగులు నీవచ్చిదేరే సిగ్గులు
చండిపెట్టనేల నిన్ను చలమరివిభుఁడా || ఒర ||

తంగేటిపైజున్నులు తచ్చన నీ పొందులు
ముంగిటనిధానాలు మోవితేనెలు

చెంగటఁ గూడితి విట్టె శ్రీవేంకటేశుఁడ నన్ను
పంగించనేల నిన్ను పాయరాని విభుఁడా ॥ ఒర ॥ 429 ॥

## సామంతం

తన కొంక చింత నాతలఁ పదిగాదుగాని
కనలి సవతులచే గాసిఁబడనోపనే ॥ పల్లవి ॥

దప్పిదేరేమోముతోడ తలవంచుకున్న నాకు
కప్పురమిచ్చి యాతఁడు కళరేఁచీనే
అప్పటిఁ బానుపుమీఁద నసురుసురనఁగాను
చిప్పిల మర్మములంటి సిగ్గువుట్టించీనే ॥ తన ॥

పట్టిన చలముతోడ పంతముతోనున్న నన్ను
బట్ట బయలు మాఁటాడి పలికించీనే
దిట్టతనము సేసుక తెరవేసుకుండఁగాను
చుట్టరికాలు నెరపి చొక్కించవచ్చీనే ॥ తన ॥

యెవ్వరి ననఁగలేక నివ్వెరగై నుండఁగాను
ఇవ్వల శ్రీవేంకటేశుఁ డిటు గూడెనే
నవ్వులకు నే నిటు సన్నలు సేసి మొక్కఁగాను
పువ్వుల వేయుచుఁ గదు పొందెలెల్లా జేసీనే॥ తన ॥ 430 ॥

## శ్రీరాగం

ఊరకున్నవానినేల వొడిపట్టుకొమ్మనీనే
మేరమీరి యాతఁడు మీరే యెరుఁగుదురే ॥ పల్లవి ॥

నగవతితో మారునగితే నమరునే
తగిలి చేయిచాఁచితే తమకించవచ్చునే

మొగము చూచితేను మొక్కవచ్చునేమరి
మొగి నింటికి వచ్చితే మోహించఁ జెల్లునే || ఊర ||

వొనరఁ బిలిచితేను వూఁకొనఁగఁదగునే
మనసు రా మాటాడితే మాటాడఁబోనఁగునే
యెనసి పొందు సేసితే ఇచ్చగించఁబాడియౌనే
చెనకితే వలపులఁ జెలరేఁగు టొప్పనే || ఊర ||

కాఁపురము సేసితేను కానిమ్మనఁ దొప్పదునే
పై పై నాసగించితే బాఁతిపడనగునే
యేపున శ్రీవేంకటేశుఁడింతలోఁ దానన్నుఁగూడె
తీపులమోవి యొసఁగితే మెచ్చఁగూడునే|| ఊర || 431 ||

రేకు 1673 దేసాళం

నేఁడు గొత్తలా నాకు నీ సుద్దులు
వేఁడి చూపితే వెన్న వేవేగఁ గరఁగదా || పల్లవి ||

కొనరక నీ చేఁతలు గుట్టు సేయవలెఁగాక
పిసికితేఁ గడుఁగడుఁ బసురుగాదా
పొసఁగ నీ గుణములు పొగడఁగవలెఁగాక
ముసుఁగులు వెట్టితేను ముగ్గు[1] వేయదా || నేఁడు ||

పాయరానినీమాటల బయలీఁదవలెఁగాక
నాయానకుఁ దీసితేను నాముకొనదా
చాయలకు నీ ప్రియము చవిగొనవలెఁగాక
రాయడించ జూచితేను రాఁపుకెక్కదా . || నేఁడు ||

---

[1] ముగ్గు=ముగ్గిన వాసన

కూడిననీకూటములు కూడపోయవలెఁగాక
అడా నీడా నెరపితే నంటుకొనదా
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
ఆదుకొనఁబోయితే నానందము గాదా || నేఁడు || 432 ||

## రామక్రియ

ఎంత బలిమికత్తెవు యేమే నీవు
మంతనమాడకుండాను మానివేవా నీవు || పల్లవి ||

కామించి యాతఁడు నాసంగడి గూచుండెనంటాను
యేమేమి మాటలాడేవే యింతలో నీవు
నీ మగఁడే నాచేతికి నిమ్మపండిచ్చెనంటాను
గామిడిచేఁత చేసేవు కానివే నీవు || ఎంత ||

ఇంతలో నాతఁడు మా ఇంటికి వచ్చెనంటాను
యెంతేసి నవ్వులు నవ్వే వేమే నీవు
దొంతరవలపులో నా తొడపైఁ బండున్నాఁడంటా
వంతములే నెరపేవు పైకొనుచు నీవు || ఎంత ||

కడఁగి పాన్పుపై నన్నుఁ గాఁగిలించుకొనెనంటా
యెడచొచ్చి కూడేవు యేమే నీవు
అదరి శ్రీవేంకటేశుఁడాతఁడు నీవాఁడంటా
బడివాయక వుండేవు వచ్చిదేర నీవు || ఎంత || 433 ||

## పాడి

ఇంత వచ్చిసేయనేల ఇల్లాల నేను
అంత వలసితే వెలయాండ్ల నడుగరాదా || పల్లవి ||

ముప్పిరి నాడఁగరాక ముంచి నే సిగ్గువడఁగ
చెప్పరానిమాటలకు చెవియొగ్గేవు
అప్పటని వేడుకైతె[1] నంగజశాస్త్రముల్లెల్ల
తప్పకుండాఁ జదువుక తనివందరాదా ॥ ఇంత ॥

యేడా రట్టుసేయక ఇన్నియు నే దాఁచఁగాను
చూడరానిచేఁతలకు నూటి చూచేవు
తోడనే నీకితవైతే తొయ్యలుల యంగాలెల్లా
కోడుగా నాటకసాలఁ జూచుకొనరాదా ॥ ఇంత ॥

పాయపు మదముతోడఁ బట్టి నేఁ బెనఁగఁగాను
సేయరానిపనులకు జేఁచాఁచేవు
యీయెడ శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
ఆయాలు చెలికత్తెల నాలోచించరాదా ॥ ఇంత ॥ 434 ॥

## సామంతం

చేలికొద్దివాఁడ అఁదుచెలియరో నీకు
రాతిరిఁబగలుఁబొంది రాఁపుసేయరాదా ॥ పల్లవి ॥

అండనుండి సొలసేవు అంతలోనె అలసేవు
నిండుఁ దగవరియైన నీరమణుని
వండిపెట్ట నోపుదువు సాదించనేరుతువు
బొండుమల్లెపాను పదె భోగించరాదా ॥ చేలి ॥

ంతములే మెరసేవు పలుమారు జరసేవు
మంతనాన నుండినట్టిమగవానిని
వంతులు వెదకుదువు వాసికేఁ బెనఁగుదువు
దొంతిబోనా లివిగో పొత్తుల నుండరాదా ॥ చేలి ॥

[1] 'వేడుకైతే' వ్రాయునగాని తప్పు (కా.శ్రీ.)

కప్పురము లిచ్చేవు కాఁగిటనే పుచ్చేవు
కప్పినయాసల శ్రీవేంకటేశ్వరుని
యిప్పుడు దా నిన్నుఁ గూడె యీతఁడిట్టె నన్నునేలె
చిప్పిలుఁగెమ్మోవి యిదె చేకొనఁగరాదా || చేరి || 435 ||

ముఖారి

ఇద్దరము మన్నారము యెవ్వరి మగఁడవయ్యా
వొద్దికఁ[1] బందేలు వేసుకొ(కు?)న్నార మిపుడు || పల్లవి ||

హత్తి నేము తగవు ని న్నడుగఁగవచ్చితేను
పొత్తులమాట లాడి పొదిపేవు
ఇత్తల నీవే కావా ఇంతసేసినవాఁడవు
బత్తిగలవాఁడు(వాని?)వలె పరాకు సేసేవు || ఇద్ద ||

జంట నొకరొకరము చనవులు మెరసితే
యింటిలోనే సరిగాను యింపు చల్లేవు
రెంటికి గురై వలపురేఁచినవాఁడవు నీవే
అంటి ఆయములుముట్టి ఆసలు చూపేవు || ఇద్ద ||

వరుస నే మొకమాటే వావులు నీకుఁ జెప్పితే
కెరలి మమ్మిపుడే కాఁగిటఁ గూడేవు
నిరతి శ్రీవేంకటేశ నీవే తగిలితివి
పరగ నాపై మన్ననే పచారించేవు || ఇద్ద || 436 ||

---

[1] ఈ పాదములో 'ఒద్దిక' లోని 'ఒ'కు 'వేసుకొన్నా'లో కకారోపరి ఒకారమునకు యతి చెల్లవలసియున్నది. అది సహజముకాదు.

## నాదరామక్రియ

ఏమయ్యా తాఁకితలఁప విడిపో నీవు
నేమపుఁ జెలిపై దయ నించే రిందరును ॥ పల్లవి ॥

పంతములాడదు నీతో బాసలు నిన్నడుగదు
యెంతేసి ప్రియాలు చెప్పీ నిందరిలోన
చెంతల నెప్పుడు నీ చిత్తమెట్లానున్నదో
కాంతఁ జూచితే మనసు గరఁగీ నందరికి ॥ ఏమ ॥

చలములు మెరయదు జగడించదెప్పుడును
చెలిమి యెంత నెరపీఁ జెలి నీతోను
యెలమి నీ విటమీఁద నెటువలె మన్నించేవో
పొలఁతి భావము చూచి పొగడే రందరును ॥ ఏమ ॥

పెనఁగ దెంతైనాను బిగిసి మాటాడదు
యెనసి కాఁగిటఁ గూడె యిట్టె నిన్ను
ఘన శ్రీవేంకటేశ నీకాయ మెంత చొక్కెనో
వనితఁజూచి. మొక్కవచ్చే రిందరును ॥ ఏమ ॥ 437 ॥

## రేకు 1674 ధన్నాసి

తగుఁదగు నీకు నివి తప్పుగాదు
జగడించేనా నేను సారెఁగొంచనేఁటికి ॥ పల్లవి ॥

చలరేఁగి నీవాపెకుఁ జెప్పిపంపిన సుద్దులు
యెలమి నాపె నాకు యెఱిఁగించెను
కలిగినపను లివి కమ్మటి దాఁచఁగనేల
వలదనేనా నేను వట్టి మఱఁగేఁటికి ॥ తగుఁ ॥

సుదతికి నీవిచ్చినసొమ్ము లన్నియును నాకు
ముదమున జూపి కడు ముచ్చటాడెను
గుదిగొన్న వలపులు గుట్టు సేయఁగనేల
యెదుటఁ గోపగించేనా ఇఁకఁ గొంకనేఁటికి ॥ తగుఁ ॥

మగువఁ గాఁగిటఁ గూడి మన్నించినమన్ననలు
పగటున మెచ్చి నాతోఁ బచారించెను
నిగిడి శ్రీవేంకటేశ నీవు నన్నుఁ గూడితివి
యెగసక్కెమాడేనా యిన్నిబాసలేఁటికి ॥ తగు ॥ 438 ॥

రామక్రియ

కైలాటాలు వెట్టవద్దు కాంతల మిద్దరము
మేలము లాడుచు నిన్ను మెప్పించుకోరాదా ॥ పల్లవి ॥

నగ వెంతైనా నీవు నాలికాఁడ వడిగితే
తగవైనాఁ జెప్పరాదా దయతో మాకు
వొగి నీమాటకు లోను వొట్లు వెట్టుకొన్నారము
మొగమిచ్చి నవ్వి మాచే మొక్కించుకోరాదా ॥ కైలా ॥

చూడవు కానుకదిక్కు సొరిదిఁ బట్టుకుండఁగా
వీడెమైనా నియ్యరాదా వేడుకతోను
జాడతో నీవారమై సమ్మతించి వున్నారము
జోడు గూడి మాకు నిట్టె చుట్టమవు గారాదు ॥ కైలా ॥

మానవు నీ వంతములు మాతో శ్రీవేంకటేశ
తెనెమోవైనా[1] నీరాదా దిష్టము గాను
అనుకొని కూడితివి అంతలో మ మ్మిద్దరిని
తానకమై నీరతులు తలఁపించుకోరాదా ॥ కైలా ॥ 439 ॥

[1] 'తేనెమోవైనా' వ్రాయవలసి తప్పు

## పాడి

ఇచ్చకము సేసుకొని ఇయ్యకొనుటగాక
రచ్చలోన సారె సారె రవ్వసేయనేల ॥ పల్లవి ॥

దొరయైనపతి సవతుల నెందరిఁ దెచ్చినా
మెరవులేని ఇల్లాలి కేల కోపము
సిరుల కొనగోరిలచ్చెన లెన్ని నించుకొన్నా
విరసము చేసుకొని వెంగెమాడనేల ॥ ఇచ్చ ॥

చలపాదిమగఁడు విచ్చనవిడిఁ దిరిగితే
వలఁచినదేవులకు వాదించనేల
వొలసి యెందరిచే సేవలు సేయించుకొన్న
బలిమితోడుత కడుఁ బంగించనేలా ॥ ఇచ్చ ॥

జిగి శ్రీవేంకటేశుఁడు చేరి యెంత పెండ్లాడినా
మిగులాఁ బంతకత్తెకు మీఱఁగనేలా
నగుతా నిన్నుఁ గూడె నాయకుఁ డీతఁడే నేఁడు
వెగటైన సిగ్గులకు వెరగందనేలా ॥ ఇచ్చ ॥ 440 ॥

## ఆహిరి

ఆకెకు నీకుఁ దగు నన్నిటా మెచ్చితి మిమ్ము
వాకున నేరుపరచి వక్కాణించనేలా ॥ పల్లవి ॥

సన్నలా చాయలా నాపె సణఁగులు రాల్చఁగాను
విన్నకన్నదుట్టినీకు వేడుక గాదా
వన్నెలాను వాసులాను వలపు నీపైఁ జల్లఁగా
ఇన్నిటా సంతోసము లింకఁ జెప్పనేలా ॥ ఆకె ॥

అకడా నీకడా నీతో నాపె పంతాలాడఁగాను
తైకొన్న పతివి నీకు ఘనతగాదా
మేకులకు మెచ్చులకు మేలము నీతో నాడఁగ
డోకగాఁ దరితీపులు చూపిచెప్పనేలా || అకె ||

మునుపా వెనకా నీకె మోహించి నిన్నుఁ గూడఁగా
ననుపై నేఁడు నీకు నవ్వులు గావా
నసుఁ గూడితివి నేఁడు నంటున శ్రీవేంకటేశ
వినయాలు పలుమారు వెనఁ జెప్పనేలా || అకె || 441 ||

ముఖారి

చెప్పరాదే నీ మోహము చెలియ నేఁడు
కప్పురవిడేలలోనే కంటిమి యిన్నియును || పల్లవి ||

పానుఁగ కాతనితోడ పొందు సేసితేనెట్టో
వినుకలికే యింత వేడుకపడేవు
చనవిచ్చి యుప్పటిని సరసమాడితే నెట్టో
కనుకలినే ఇంత కడుఁదమకించేవు || చెప్ప ||

పరగ నేకతమున బాసగొంటే నింకనెట్టో
తొరలింపుమాటకే హత్తుకోవచ్చేవు
సరవితో ననుపైతే జట్టిగానే దింకనెట్టో
చారవలకే ఇంత చొక్కి మెచ్చేవు || చెప్ప ||

తేనెమోవి సోఁకితేను తిరమయ్యు(య్యే?) దింకనెట్టో
పానుపు చేరినందుకే పసమించేవు
యీసెపాన విన్ను నన్ను నేలె శ్రీవేంకటేశుఁడు
అనుక నవ్వినందుకే అరుదందేవు || చెప్ప || 442 ||

### దేవగాంధారి

అందరికిఁ గలచాలే[1] యంగనలాల
పొందుసేయవలెఁగాక పోరాడనేఁటికే || పల్లవి ||

పట్టఁగరాదు మనసు పాయరాదు చెలిమి
ఇట్టి బుద్దులు చెలు లేమిచెప్పరే
జట్టి గొన్నవాఁ డతఁడు సమ్మతైనదాన నేను
చుట్టాలింతే మీరు మమ్ము జోడువాపనేఁటికే || అంద ||

మచ్చిక మానుపరాదు మర్మాలు దాఁచఁగరాదు
రచ్చవేసి నన్నునేల రాయడించేరే
మెచ్చి పెండ్లాడె నతఁడు మేనదానఁదొల్లె నేను
నెచ్చెలు లింతె మీరు నేరాలెంచనేఁటికే || అంద||

ఆస విడిపించరాదు ఆనంద మాఁపఁగరాదు
వేసరించి నన్నునేల వెంగేలాడేరే
సేసవెట్టి నన్నుఁ గూడె శ్రీవేంకటేశ్వరుఁడు
నాసరివారె మీరు నవ్వు నవ్వనేఁటికే|| అంద || 443 ||

రేకు 1675

### దేసాళం

తెలుసుకోవయ్యా నీవే తెల్లమిగాను
అలివేణితో నవ్వి ఆదరించు మిపుడు || పల్లవి ||

మొక్కలాన నొకమాట ముంచి యాపె సొలసితే
వెక్కసాలాడేవు నీవు వెల్లవిరిగా
యెక్కువైన కోవిలల యెలుఁగులు నిడివైతే
చక్కఁగా మరు నందుకు సాదించఁదగవా || తెలు ||

---

[1] పాలు లేక చాలు= 'వంశము, సంప్రదాయము, పద్ధతి, వరుస' అని లోకవ్యవహారము.

జవ్వనమదాన నాకె జంకించి చూచితేను
పువ్వులచెండునఁ దాకఁ బూఁచివేసేవు
పువ్వులెల్లా నమ్ముల పాదులలో బాణాలైతే
నివ్వటిల్ల వసంతునినేర మెంచఁదగవా || తెలు ||

తమకించి యాపె నిన్ను దండిగుబ్బల నొత్తితే
అమరఁ గాఁగిటిలోనే అలయించేవు
జమళి శ్రీవేంకటేశ జక్కవలు మదించితే
ౘమిరి యాచెలిని సాదించ నీకుఁదగవా || తెలు || 444 ||

వరాళి

ఎంతవాఁడైనాఁగాని యేమాయ నేఁడు
పొంత నీకు వలపించి పొత్తునఁ బెట్టెనే || పల్లవి ||

మాటలాడితేఁజాలు మట్టుకుఁదెచ్చె నతని
యేఁటికి మనికితము ఇంతిరో నీకు
నూటిగా నామో మతఁడు చూచితేఁజాలుఁగాని
వాఁటముగా నతని నీవనము చేసెనే || ఎంత ||

అండనిరిచితేఁజాలు అతని నొడఁబరచె
నిందుఁగాఁతాళ మేఁటికే నెట్టన నీకు
చండిసేయక కానుక చయ్యన నంటితేఁజాలు
పండిన మనసులోనివంపు సేయించెనే || ఎంత ||

చెవులొగ్గితేఁ జాలు చెప్పి నీతోఁ బొందుసేసె
తవల విచారమేలే ఇప్పుడు నీకు
తవిలి వచ్చి కూడెను తానె శ్రీవేంకటేశుఁడు
తవనఁ దప్పక నీకు దక్కి వుండఁజేసెనే|| ఎంత || 445 ||

యిదివో తేనెలమోవి యెంగిలినో రనఁగానే
అదన మాటాడుమనీ నప్పటేఁ దాను
పదరి అంటుముట్టని పరులాడే దెఱఁగఁడు
కదిసేటితన తమకమే యెంచుకొనీని || ఎంత ||

రతుల నా చన్నులు గీరకుమీ నీ వనఁగానే
తతిఁ గూడుమనుచుఁ గాఁతాళించీని
మితిమీర ననుఁగూడె మేను వొత్తేది యెంచఁడు
మతి శ్రీవేంకటేశుఁడు మదమే చూపీని|| ఎంత || 447 ||

## శ్రీరాగం

ఒక్కమనసుగా నీకె వొడఁబాటయ్యాఁగాని
అక్కరతోడుతఁ గడునండకు రావయ్యా || పల్లవి ||

చెలియసిగ్గులకును చెక్కిటిచేయిమాటు సాక్షి
లలి సంతోసాలకు పులకలే సాక్షి
చలివేఁడి అనలకు సన్నపు నవ్వులు సాక్షి
చలమేల మా మాటకు సరిచూచుకోవయ్యా || ఒక్క ||

నెట్టుకొన్నకాఁకలకు నిష్వేరగులే సాక్షి
చిట్టకపు చింతలకు చెమటే సాక్షి
దట్టపువలపులకు తడఁబాటే సాక్షి
గట్టిగా మామాట తారుకాణ చూచుకోవయ్యా || ఒక్క ||

తీరనికరఁగులకు తేటలచూపులు సాక్షి
మేరతోడిపొందులకు మెచ్చులే సాక్షి
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి కాంత నిట్టె
సారపు మామాటల నిజము చూచుకోవయ్యా ||ఒక్క||448||

' పాడి

ఎంతనేరుపరివి నిన్నేమిచెప్పేది
వింతవానివలెనే భావించేవా నీవు || పల్లవి ||

సారెకుఁ జూచేవాఁడవు సన్నలు సేసేవాఁడవు
ఆరమణిపేరు నన్ను నడిగేవా
గారవించి యట్టె వుడుగరలంపేవాఁడవు
యీరీతిఁ దల(న?)కుళ(ల?)ము తెలుఁగవా నీవు || ఎంత ||

యింటికి రప్పించేవాఁడ విచ్చకమాడేవాఁడవు
అంటి నాతో నాపెసుద్దు లడిగేవా
వొంటె నేకతములాడె వొరసె నవ్వేవాఁడవు
వెంటనే యాపె గుణాలు వెదకేవా నీవు || ఎంత ||

సరి నెడమాటలకు సతులనంపేవాఁడవు
తరుణి చెల్లెలంటా సిందలు గట్టేవా
సిరతి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
సరతి నన్నేలితివి చక్కటి దిద్దేవా || ఎంత || 449 ||

1676 దేవగాంధారి

ఏమని పొగడే మీదె నీరమణిని
కోమలపువయసుకోకిలవాణి || పల్లవి ||

దొంతులువెట్టేఁ దోడనె వలపులు
కొంతపుచూపులకోమలి
సంతనసేసీ సరసపుమాటల
వింతవేడుకల వెన్నెల పతిమ || ఏమ ||

విందులుచేసీ వేమరుఁ బ్రియముల
కందువనవ్వులకలకంటి[1]
బిందెల నించీపెకగుసిగ్గులు[2]
మందె మేళముల మదనునిశరము || ఏమ ||

పైరులు విత్తీ బలుతమకంబుల
మేరతో రతి నలమేల్మంగ
యీరీతి శ్రీవేంకటేశ నిన్నెనసె
సారపుగుణములజమళిమెఱుంగు || ఏమ || 450 ||

## ఆహిరినాట

ఏమిచేసినాఁ జేసితి విన్నిటా నీవేలికవు
నేమముమీరి తిట్టఁగ నీతియౌనా నాకు || పల్లవి ||

కొలువులో నాపెను కొంగువట్టితివంటాను
చలము సాదింతునా సారెసారెకు
మలసి నేఁ జూడఁగానే మర్మములంటితివంటా
అలుగవచ్చునా నీతో అలసైన నాకు || ఏమి ||

చన్నులంటి యిప్పటిని సరసమాడితివంటా
చెన్నుమీర నిటు రట్టు సేతునా నేను
సన్నలుసేసి మోవి చవులుచూపితివంటా
నిన్నును బంకించ నిఁక నేరుపౌనా నాకు || ఏమి ||

గక్కునను దెరవేసి కాఁగిలించుకొంటివంటా
వెక్కసమాడుదునా శ్రీవేంకటేశుఁడా

---

[1] 'కలకంఠి' శబ్దములో ఏకదేశమైన ఉత్తర పదమునకు తద్భవీకరణమా? ఇది.
[2] నించి+ఈ+పెకు+అగుసిగ్గులు.

అక్కర నలమేల్మంగనయిన నన్నుఁ గూడితివి
దక్కితి వింకఁ గొసరఁ దగవౌనా నాకు|| ఏమి || 451 ||

సాళంగం

ఇంత యేల దాఁచేవు నేమెరిఁగితే నేమాయ
పంతాలకే కాదా నిన్నుఁ బచ్చిసేసేది || పల్లవి ||

తరితీపులకెకాదా తరుణి నీవద్ద నుండి
పరి పరి విధముల పంతె మాడేది
వొరటులకే కాదా వొడివట్టి తీసి నిన్ను
సరసములాడుతానే జంకించేది || ఇంత ||

పెద్దరికాలకెకాదా పెనఁగులాడుతా నిన్ను
గద్దించి నవ్వులు నవ్వి కాఁగిలించేది
వుద్దండాలకే కాదా వోరికొట్లను నిన్ను
పెద్దబెట్టుగా నూరకె పేరఁదిలిచేది || ఇంత ||

యెమ్మెలకేకాదా రతి నెనసి యలమేల్మంగ
వుమ్మడిఁ బాయక కొలువులు సేసేది
నెమ్మది శ్రీవేంకటేశ నీవు నన్ను నేలితివి
ముమ్మాటికి గాదా నీ మోము చూచేది|| ఇంత || 452 ||

బౌళి

నాటిమాట నాటికాయ నాలితన మిపుడేల
కూటమి కియ్యకొనవే గురుతాయఁ బనులు || పల్లవి ||

చెప్పినట్టల్లాఁ జేసి చెలువుఁడు వేఁడుకొనె
తప్పలెంచకువే[1] ఇఁకఁ దరుణీ

[1] 'తప్ప లెంచకువే' వ్రాయుసగాని తప్ప (వా.ప్రే.)

దప్పిదేరే మోముతోడ దయవుట్ట మాటలాడీ
వుప్పతించి దూరకువే వొనగూడెఁ బనులు || నాటి ||

ఇచ్చకము నీకుఁ జేసి ఇంటికి వచ్చెనితఁడు
పచ్చిసేయకువే ఇఁకఁబడఁతీ
ఇచ్చె నీకు బాసలెల్ల నిందరుఁ జూడఁగానె
తచ్చనలు మరియేలే తలకూడెఁ బనులు || నాటి ||

తగవులెల్ల నెరపె తగిలె శ్రీవేంకటేశు-
డెగసక్కేన కోపునా ఇందువదన
నగుతానే నినుఁగూడె నయములు వచరించె
వెగటు లిఁకనేఁటికే వేడుకాయఁ బనులు|| నాటి || 453 ||

దేసాళం

ఎట్టు గెలువఁగవచ్చు నింతవాఁడవు
గట్టిగా నీవే మమ్ముఁ గరుణించవయ్యా || పల్లవి ||

చలము మెరసి నిన్ను జంకించేనంటేను
మలసేటిబిరపుమగవాఁడవు
వలపురేఁచి నిన్ను వంచుకొనేనంటేను
కలికికాంతలు పెక్కుగలవాఁడవు || ఎట్టు ||

పంతములాడి నిన్ను భ్రమఇంచేనంటేను
మంతుకెక్కిన రట్టడిమాసటీఁడవు
ఇంతలోనే మోవి లంచమిచ్చి చొక్కించేనంటేను
అంతకంతకును నీవు ఆసోదకాఁడవు || ఎట్టు ||

పట్టపుదేవులనె బలిమిఁ బెనఁగేనంటే
మట్టులేనిరతులదిమ్మరివాఁడవు
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నీవె
గుట్టుసేసేనంటే మేకుల యెమ్మెకాఁడవు॥ ఎట్టు ॥ 454 ॥

## పూర్వగౌళ

చూతమువో నీ బలిమి సుదతిబలిమియును
యీతలానాతలా మీరిద్దరు నున్నారు ॥ పల్లవి ॥

మంతనాన నాపె నీతో మాటలాడినప్పుడుగా
పంతములెల్లా నీవు పచారించేది
పొంతనుండి యప్పటినిపూఁచి నవ్వినప్పుడుగా
చింతదీర నీవాపెకు సేసవెట్టేది ॥ చూత ॥

శిరసెత్తి నీవంక చెలి చూచినప్పుడుగా
పొరిఁబొరి పొందుసేసి బోదించేది
సరుగన మాటలాడి చలివాసినప్పుడుగా
తరవాతి పనులకుఁ దమకించేది ॥ చూత ॥

తతి నిన్నుఁ గూడి యీకె తనిసినప్పుడుగా
చతురతఁ బవ్వళించి కతచెప్పేది
యితవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మితిమీరినయప్పుడుగా మెచ్చు మెచ్చేది॥ చూత ॥ 455 ॥

రేకు 1677 వరాళి

చెలులము నేము నీకుఁ జెప్పేబుద్దులు వినవే
చలివాసి వుందానవు చల మెటువంటిదో ॥ పల్లవి ॥

తప్పక చూచినవాఁడు దయసేయకమానీనా
ఇప్పుడేలే వేగిరము ఇంతిరో నీవు
ముప్పిరిగొ్ని చెమట మోమెల్లా నిండె నీకు
కప్పి నీ మనసులోనికాఁతాళ మెట్టెదో || చెలు ||

మక్కువచేసినవాఁడు మన్నించకమానీనా
వెక్కసాన దూరకువే వెలఁది నీవు
గక్కనను గెంపుదేరె కన్నుల తుదల నీకు
కక్కసించి తమకపుకాఁక యెంతవున్నదో || చెలు ||

చేయిచాఁచినవాఁడు సిగ్గుదేర్చకమానీనా
రాయడించకువే యిఁక రమణి నీవు
యీయెడ శ్రీవేంకటేశుఁడీతఁ డిట్టె నిన్నుఁ గూ-
చాయల మై పులకించె సంతోస మేరీతిదో|| చెలు || 456 ||

## ముఖారి

వలచినదాని కింత వాసులెంచనున్నదా
యెలయు నీవే పలికి విడెమియ్యఁగదవే || పల్లవి ||

సెలవుల నవ్వితేనే సిగ్గులు వదుదురా
అలమి చన్నులు చేత నంటితేఁగాక
పిలిచినంతటిలోనె పెనఁగులాదుదురా
తిలకించి కొంగువట్టి తీసితేఁగాక || వల ||

సన్నలు సేసితేనే సణఁగులాడుదురా
వున్నతితోఁ గొనగోర నూఁదితేఁగాక
కన్నులఁ జూచితేనే కాఁకలఁ దిట్టుదురా
పన్ని నీ మర్మాలు సోఁక బలికితేఁగాఁక || వల ||

పచ్చడము గట్టితేనే పక్కన నలతురా
  కొచ్చి సదమదముగాఁ గూడితేఁగాక
  ఇచ్చ నిన్ను శ్రీవేంకటేశుఁడేలె మీఁదుదురా
  అచ్చపుటలమేల్మంగ వారదైతేఁగాక || ఏం  457

## కాంబోది

ఇటువలెఁ జేసుఁబో యెంతవారిని వలపు
  ఓటుకన గుట్టుచూపి దప్పాలు దేరిసి || పల్లవి ||

తలవంచుకొన్న యాపె తమక మాఁపఁగలేక
  బలిమి నీ మోము తప్పక చూచీని
  తొలుతనే సిగ్గువడి తొయ్యలి ఆసలచేత
  వెలుచుమాటల నీకుఁ బ్రియము చెప్పీని || ఇటు ||

పంతములాడినయాపె పాయమువట్టఁగలేగ
  ఇంతలోననే నీకు జేయెత్తి మొక్కీని
  వంతువాసు లెంచుకొని వనిత కమ్మటి నేఁడు
  ఇంతలోనే పిలువకే ఇంటికి వచ్చీని || ఇటు ||

యెడమాటాడించేయాపె ఇట్టె ఆన మాన్పలేక
  తొడిఁబడ తానే నీపొందులఁ గూడీని
  అడరి శ్రీవేంకటేశ అలమేలుమంగ నీకు
  వుడివోనిరతి యిచ్చి వురమెక్కీని || ఇటు || 458 ||

## రామక్రియ

ఏమే చిన్నదానవా యింతిరో నీవు
  నీమగనిఁ జూడరాదా నిన్ను మెచ్చఁగాను || పల్లవి ||

శిరసేల వంచేవే సిగ్గులేల పెంచేవే
బెరసి యీతఁడు నీతోఁబెనఁగఁగాను
మరగి యేల పట్టేవే మాటలేల చుట్టేవే
అరుదై యీతఁడు సుద్దు లడుఁగఁగాను || ఏమే ||

చన్నులేల్ల మూసేవే సన్నలేల సేసేవే
చెన్నుమీర నిన్నితఁడు చెనకఁగాను
వున్నతి నెంత లోఁగేవే వొద్దిక యేల వీఁగేవే
వన్నెల నితఁడు నీకు వలవఁగాను || ఏమే ||

బలిమినేల నవ్వేవే పంతములేల తవ్వేవే
యెలమి శ్రీవేంకటేశుఁ డెనయఁగాను
అలమేలుమంగవు నీ వక్కున నెట్టారసేవే
మలసి యీతఁడు నీకు మరుగఁగాను || ఏమే || 459 ||

## ఆహిరినాట

ఈతనిమనసెల్లా నీ వెఱఁగనిదా
ఘాతల సోదించి యేల కాకుసేసేవే || పల్లవి ||

పొలసి యువ్విదెతోనుఁ బొందుసేయ ననఁగానే
చలపట్టి పతి నెంత సాదించేవే
అలుగననుచు నీతో నానలువెట్టుకోఁగానే
సొలపుమాఁటలో నేల సూదు వట్టేవే || ఈత ||

మక్కువఁ గడవారితో మాటలాడననఁగానే
వెక్కసాన నీవేల వెంగెమాడేవే
చొక్కి తనమేను నీకు సోదనలియ్యఁగానే
నెక్కొని యిప్పటి నేల నిందవేసేవే || ఈత ||

బెరసి నీమీఁద మరి పెండ్లాడననఁగానే
 పరకాంతఁ దెచ్చి యేల పైఁదోసేవే
యిరవై శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁ గూడె
 తొరలి నవ్వఁగా నేల ధ్వమ్మి సేసేవే ॥ ఈత ॥ 460 ॥

## కాంబోది

చెప్పఁగదరే యీమాట చెలువునికి
 ఇప్పుడు తనవుంగర మిదె నాచే నున్నది ॥ పల్లవి ॥

బాసలు సేయఁగనేల బయలీఁదించఁగనేల
 ఆసకొలిపి నామగఁడై నాఁడు తాను
వేసాలు నేనేమీనేర వెక్కసము లాడనేర
 సేసపా లివిగో నా శిరసుపై నున్నవి ॥ చెప్ప ॥

చెక్కులు నొక్కఁగనేల సిగ్గు విడిపించనేల
 వొక్కటై నాయింటిలోన నున్నాఁడు తాను
పక్కనఁదన్నుఁ దడవ పాడిపంతాలు దడవ
 చక్కఁగాఁ దన ముద్రలు చన్నులపై నున్నవి ॥ చెప్ప ॥

కలువల వేయనేల కదు వేఁడుకొననేల
 నలి శ్రీవేంకటేశుఁడు నన్నేలెఁ దాను
బలుములు చూపవద్దు పట్టి పెనఁగఁగవద్దు
 చలఁగి తనసుద్దులు చిత్తములో నున్నవి ॥ చెప్ప ॥ 461 ॥

రేకు 1678

## రామక్రియ

దానికేమిదోసము తప్పు లెంచఁ జెల్లదు
 అనుకొన్నమగవాని కాదరించవలయు ॥ పల్లవి ॥

మనసులు సోదింతురు మచ్చికలు చూపుదురు
కనుసన్న గావింతురు కాఁక సేతురు
గునుతురు సొలతురు గుట్టు దెలుసుకొందురు
కలు పతిమీఁద వలఁపు చల్లుదురు || దాని ||

ఆస రేఁతురు ఆయము లంటుదురు
బాస సేయించుకొందురు భ్రమయింతురు
పాసివుండ రొరతురు పైకొని పెనఁగుదురు
వాసి నింతు రిట్లానే వలపు చల్లుదురు || దాని ||

కడు సేవలు సేతురు కాఁగిటఁ గూడుదుగు
బడివాయకుందుదురు పైకొందురు
యెడయక శ్రీవేంకటేశ నన్నుఁ గూడితివి
వడి నావలె నిందరు వలపు చల్లుదురు || దాని || 462 ||

నాట

ఎట్టు నమ్మవచ్చు నిన్ను నింత కాతరీఁడవు
యిట్టె యేపొద్దును నాయింటనే వున్నాఁడవు || పల్లవి ||

అప్పుడే బాసచేసితి వాపె ఇటు పొలసితే
తప్పక చూచేవు మతి దలపోసేవు
ముప్పిరిఁ దలవంచేవు ముదిత పాట పాడితే
కుప్పళించి పెంజెమట గురిసేవు మేనను || ఎట్టు ||

ఆయెడఁ బంతమాడితి వాకె దండ గూచుండితే
కాయము సోఁకించేవు కరఁగేవు
నాయములు నడపేవు నడుమ నాపె నవ్వితే
పాయపు మదముతోడ భ్రమసేవెదుటను || ఎట్టు ||

అదరి నన్నేలితివి ఆస లాపె చూపితేను
కదుసిగ్గు విడిచేవు కాఁగిలించేవు
బడినే శ్రీవేంకటేశ పాయ కాపె నిలిచితే
గ్రడివోని రతులను వొరసేవు సారెను ॥ ఎట్టు ॥ 463 ॥

## భైరవి

పతితో విరహమంది పాడి పాడి సొలసేవు
అతనినీతగవులు అటువలెఁగదవే ॥ పల్లవి ॥

జక్కవలె చన్నులట చందురుఁడె మోమట
యెక్కుడి చుట్టరికమే యీారెంటికి
నిక్కి అలులే కురులు నీ నాసికమె సంపెంగ
వెక్కసపు నేస్తాలు వెగటాయఁగదవే ॥ పతి ॥

కరికుంభాలే పిరుఁదు ఘనసింహమే నడుము
సరిఁ బొందు లెటువలె జరగీనే
అరిది నెమలినడక అదివో నీ యూరు పాము
గరిమఁ జెలిమి యెట్టు కడతేరీనే ॥ పతి ॥

తామెరలె కన్నులాయ తగునీనవ్వే మంచాయ
ఆముకొన్నకూటము లెట్టబ్బునే యిఁక
శ్రీమహాలక్ష్మివి నీవు శ్రీవేంకటేశుఁడతఁడు
నేమపు పొంతనా లెట్టు నెరవేరెనే ॥ పతి ॥ 464 ॥

## మధ్యమావతి

మగవాఁడు భ్రమసితే మగువలు దెలిపేరా
తగులై వుండఁగానే తలఁచకుండుదురా ॥ పల్లవి ॥

కడుఁ జల్లనిచూపుల కాంత నిన్నుఁ జూడఁగాను
యెడలేనికాఁకలు నీకేల రేఁగెను
పుడివోనికొనగోర నూఁది యెచ్చరించఁగాను
అడరి నివ్వెరఁగులు అమరునా నీకు || మగ ||

సంతోసపుమాటలు సతి నీతో నాడఁగాను
ఇంతలోనే వెడచింత లేల వచ్చెను
వింత వింత నగవులు వేమారు నవ్వఁగాను
చెంతనుండి పంతములు చెల్లునా నీకు || మగ ||

వాడికకాఁగిట నిన్ను వనితఁ గూడఁగాను
యేడలేనితమకము లేల వచ్చెను
యీడనె శ్రీవేంకటేశ యీకె నిన్ను మెచ్చఁగాను
ఆడుకోలు బీరములు అందమౌనా నీకు || మగ || 465 ||

## శుద్ధదేశి

మొగమోటము దరచు మొదల నాకు
యెగసక్కె లాడనోప నీతని నేమందునే || పల్లవి ||

కడుఁ బ్రియాలు చెప్పఁగా కాదని పెనఁగరాదు
అడరి పైకొనఁగాను అలుగరాదు
విడియ మొసగఁగాను వేసారుకొనఁగరాదు
యెడసి ఇప్పుడు వచ్చె నీతని నేమందునే || మొగ ||

మోముచూచి నవ్వఁగాను మొనసి తిట్టఁగరాదు
దోమటి దొడుకఁగాను తొలఁగరాదు
చేముంచి చెనకఁగాను సిగ్గులు వడఁగరాదు
యేమరించి కాఁగిలించీ నీతని నేమందునే || మొగ ||

చనవు నాకియ్యఁగాను సమ్మతించననరాదు
పనులు చెప్పఁగాను ఓపననరాదు
యెనయుచు శ్రీవేంకటేశుఁ డిట్టె నన్నుఁ గూడె
యినుమడించె వలపు లీతని నేమందునే ॥మొగ॥466॥

ఆహిరి

ఎట్టోరుచుకున్నాఁడవో ఇటువంటివలపులు
దట్టపు నీశాంతానకు దయవుట్టీనాకు ॥ పల్లవి ॥

యెక్కడ నెప్పుడు నిన్ను నెవ్వతె సేసెనో నీ-
చెక్కులరేకలు చూచి చిమిడీ మతి
మొక్కలాన నప్పటి నీముంగురులు నొసలిపై
చిక్కువడ్డవెల్లాఁ జూచి చెమరించీ నేను ॥ ఎట్టో ॥

బెడిదమై మరెవ్వతె పెనఁగి నిన్నోడించెనో
కడునీయలపు చూచి కంపించీ నేను
తొడిబడ నగె మోవితుదనున్నగంటి చూచి
కడలేని చింతతోడ కంటగించీ మొగము ॥ ఎట్టో ॥

జట్టిగొని మరెవ్వతె చన్నుల నిన్నొత్తెనో
గట్టి నీవురము చూచి కరఁగీ గుండె
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
నెట్టన నీరతి చూచి నిగిడీ నానందము ॥ ఎట్టో ॥ 467 ॥

రేకు 1679 శ్రీరాగం

ఎటువంటిరాతిగుండె యీ చెలియది
ఇటులా బుద్ధిచెప్పినా నెంతైన గరఁగదు ॥ పల్లవి ॥

మగవాని నెంతకైనా మట్టుపెట్టుకొనవచ్చు
మగువల చలములు మానువరాదు
నగుతానే వంతగాని నయానకుఁ దేవచ్చు
జగడగత్తైను మరి చాయకుఁ దేరాదు || ఎటు ||

జూటరిపతిఁ దొక్కించి చుట్టముఁ జేసుకోవచ్చు
అఁటదానికోపము అణఁచరాదు
నీటున నుద్దండీని నేమానకుఁ దేవచ్చు
మేటిమొక్కలవుదాని మెప్పించరాదు || ఎటు ||

శ్రీవేంకటేశ్వరునిఁ జెనకి కూడఁగవచ్చు
భావించి సవతి నొడఁబరచరాదు
యీవేళ నన్నేలె నీతఁ డీతనితో నవ్వవచ్చు
కావిరి గర్వపు కాంతఁ గరఁగించరాదు || ఎటు || 468 ||

## కేదారగౌళ

మంచిదాయఁ గానీవే మనభాగ్యమాయ నది
కంచముపొత్తు లెటులాఁ గలసెనో కాని || పల్లవి ||

సెలవుల నవ్వు లూరె సిగ్గులు మోమునఁ గప్పె
అలరుచుఁ జెలులు యేకాంతమాడఁగా
తెలియరాదు మాట దీకొని యడుగరాదు
పలుకుఁబంతము లెట్టు ఫలించెనోకాని || మంచి ||

నిక్కెను మేనఁ గళలు నిలువెల్లాఁ బులకించె
చక్కఁగా లేకలు లోలో జదువుకోఁగా
పక్కన సోదించరాదు బలిమిసేయఁగరాదు
ఇక్కువ వలపు లెట్టు యీడేరెనోకాని || మంచి ||

చన్నులఁ జెమట నించె చవులు మోవి నెసఁగె
కన్నుల శ్రీవేంకటేశుఁ గనుఁగొనఁగా
యెన్నిక లూహించరాదు యెరుకసేసుకోరాదు
వున్నతిరతు లివెట్టు వుప్పొంగెనోకాని ॥ మంచి ॥ 469 ॥

## శంకరాభరణం

ఇద్దరును నొకటే యెప్పుడును
బుద్దులు చెప్పఁగఁ బొలఁతుల వశమా ॥ పల్లవి ॥

చక్కనిపతితో జరయుచు నాడేవు
యెక్కడిమాట లివేమిటికె
లక్కవంటివె లలనలమనసులు
గక్కనఁ గిరఁగును కరకరి యేలే ॥ ఇద్ద ॥

కందువ నాతనిఁ గడుజంకించేవు
యెందాఁకాఁ జల మేమిటికే
పొందగువయసులు పొద్దగు వింతలు
బిందెలఁ దగులొ పెనఁగఁగనేలే ॥ ఇద్ద ॥

శ్రీవేంకటేశ్వరుఁ జెనకుచుఁ గూడేవు
యీవలఁ బంతము యేమిటికే
వేవేలు సిగ్గులు వెన్నెలవంటివి
చేవలుదేరును చిదుముడి యేలే ॥ ఇద్ద ॥ 470 ॥

## వరాళి

ఆఁటది గూళయైతే నందేమున్నది
మాటుసేసుకొని ఆకుమడిచిచ్చేవేమే ॥ పల్లవి ॥

బత్తిసేసి నావద్ద పాయ కిత( దుండ(గాను
పొత్తుల మాటాడి నీవు పొదిగేవేమే
గుత్తపుగుబ్బల నన్ను( గుచ్చి కాఁగిలించ(గాను
హత్తి వూడిగాలు సేసే వప్పటి నీ వదేమే || అట ||

పాడితో( బగడసాలపందే లాత( డొడ్డ(గా
ఆడుమనుచు( బాసిక లందిచ్చేవేమే
వీడెము నా చేతికిచ్చి విందుల మో వియ్య(గాను
నోడల([1] బెట్టి పతికి నోరూరే వేమే || అట ||

శ్రీవేంకటేశు(డు నన్ను చిత్తగించి కూడ(గాను
వావులు చెప్పేవు సారె వాకిట నేమే
ఆవేళ దయసేసి అత(డు నిన్నేలితేను
దేవులవై వచ్చి నాతో దికానేవేమే || అట || 471 ||

## సౌరాష్ట్రం

ఇచ్చకపుమాటల యిల్లాల నేను
దిచ్చరిమాటలు నేర తెలుసుకో నీవే || పల్లవి ||

యిమ్ముల( జేసేపనులెల్లా( జేసివచ్చి నాతో
సమ్మతించ( జెప్పితివి చాలదా యిది
అమ్మరో యింకా నిన్ను నొ(గాదనేదేమి
దిమ్మరే(గె వలపులు తెలుసుకో నీవె || ఇచ్చ ||

చల్ల(గా నానావిధాన చవులెల్లా( జూచి వచ్చి
చెల్ల(బెట్టెవు[2] సుద్దులు చింత యే(టికే(కి?)

[1] నోడలన్ =
[2] 'చెల్ల(బెట్టేవు' వ్రాయసగాని తప్పు (కా.శ్రీ.)

వెల్లవిరి నింద నీపై వేయఁగా వచ్చేదేమి
తెల్లమాయఁ బనులెల్లా తెలుసుకో నీవే || ఇచ్చ ||

బూమెల్లాఁ దిరుగులాడె పొందులెల్లా నేర్చి వచ్చి
కామించి నన్నేలితివి కడమ లేవి
గోమున శ్రీవేంకటేశ కొసరఁగా నింకనేమి
దీమసాన నే నవ్విలి తెలుసుకో నీవే || ఇచ్చ || 472 ||

హిజ్జిజి

ఏల మమ్ముఁ జెనకేవు యెంతటివారము నేము
మూలనుండి నీవారమై మొక్కేము గాక || పల్లవి ||

యెగసక్కెలాడరాదు యెదురు మాటాడరాదు
నగనోపుదుమా నీతో నయముగాను
తగవులఁ బెట్టరాదు తారుకాణించఁగరాదు
జగడించఁగలమా వాయులా సన్నలను || ఏల ||

వరుసెలడుగరాదు వలపుచల్లఁగరాదు
సరసములాడేమా సమ్మతిగాను
తరవులు వెట్టరాదు తమకించి దూరరాదు
బెరసి కాఁగిట నిన్ను బిగిఇంచఁగలమా || ఏల ||

గుట్టుసేసుకుండరాదు కూడితే మానఁగరాదు
బట్టబయలీఁది నిన్ను పనిగొనేమా
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
పట్టెనచల మీడేరె పచారించఁగలమా || ఏల || 473 ||

రేకు 1680 రామక్రియ

ఇంత సేసెనఁగాక నీవేల చిక్కేవు
చెంతనే నే మున్నారము చేకొనఁగరాదా || పల్లవి ||

తెరవేసుకొని యాపె తేనెలమాట లాడితే
కరఁగుచుఁ గూడెనంటా కాఁతాళించేవు
విరులచెం డప్పటని వెలి నీపై వేసితేను
తరితీపునఁ జేఁబట్టి తమకించేవు || ఇంత ||

సోరణగండ్ల నాకె సొలసి నిన్నుఁ జూచితే
మేరతో లోనికిఁబోఁ దిమిరి తూరేవు
గారవించి నయముగా కలకలనవ్వితేను
ఆరసి మదనరతి కటు పదరేవు || ఇంత ||

అట్టె కొనగోర నిన్ను నవ్వులనుండి వ్రాదితే
గట్టిగా పా౯ పుచేరి కలసితివి
యిట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
గుట్టు సేసితే సారెకు కోరి వలచేవు || ఇంత || 474 ||

నాదరామక్రియ

ఇయ్యకొంటె నీ మాటలు యింకానేల
నెయ్యమెల్లాఁ గానవచ్చె నేర మెంచనేఁటికి || పల్లవి ||

వెలయ నందరితోడా వేసరక నవ్వేవు
చలమరిసరసాలు సాజమే నీకు
పిలువకతొల్లె వచ్చి పీఁటమీఁదఁ గూచుండేవు
బలిమి తమకములు వచ్చిదేరె నీకు || ఇయ్య ||

పొరిది నెందరినైనా సూటిగానే చూచేవు
తరితీపుల యాసలు తగవే నీకు
మరిగి నాతో నీవు, మాటలు నన్నాడించేవు
సురతాన నూరికెల్లాఁ జుట్టమవే నీవు || ఇయ్యి ||

కమ్మక యెందరినైనాఁ గాఁగిలించి కూడేవు
యిమ్ముల నిచ్చపోబనా లితవే నీకు
కమ్మర శ్రీవేంకటేశ గక్కన నన్నేలితివి
నెమ్మది నీ కీరితి నిండుకొనె నిపుడు || ఇయ్యి || 475 ||

## ద్రావిళభైరవి

కడఁగి యూతఁడు నీకుఁ గాచుకున్నాఁడు
వుడివోనిరతిఁ గూడె వోలలాడఁగదవే || పల్లవి ||

వెలయ మాటాడవలె విభునితో నవ్వవలె
చలపాదితనమేలే సతులకును
తలవంచుకొననేల తప్పులు వెదకనేల
పిలిచీ నాతఁడు నిన్నుఁ బ్రియముచేకొనవే || కడఁ ||

అంకెలో మెలఁగవలె ఆయము లంటఁగవలె
మంకుదన మింతయేలే మగువలకు
జంకెనలు చూపనేల సడిఁ బెట్ట నంతయేల
పొంకాన నెదురుచూచి పొత్తు కిట్టే రావే || కడఁ ||

గుట్టున నుండఁగవలె కూరిమిఁ బెనఁగవలె
వట్టి బింకా లివియేలే వనితలకు

చిట్టకములేల నిన్ను శ్రీవేంకటేశుఁడు గూడె
గట్టేయు[1] మీయెన్నికలు కాఁగిలించు'నవే ||కడఁ|| 476||

## దేసాళం

ఏల వొడఁబరచేవు యెందాఁకా మమ్ము
చాలుకొన్న మీగుణాలు సరియుబేసియునే || పల్లవి ||

నిండుక ఇందరిలోనా నీవు మంచివాఁడవే
కొండుకనీచేఁతలే గొరబు గాని
కొండలెల్లా నున్ననే కోరి దగ్గరి చూచితే
మెండుకొన్నరాలును మిక్కుటపు మాకులే || ఏల ||

అలరినమోవి అమృతమువంటదే
అలవోకమాటలే అగడుగాని
జలనిధియంతా మీరే చవిగొని చూచితేను
వొలుగులువారఁ గడునుప్పలై వుండును || ఏల ||

శ్రీవేంకటేశుఁడ నీవు చింతించ దేవరవే
ఏవేళా నీకృప గడు నెక్కుడు గాని
భావింప నన్నేలితివి బలిమి తెంకాయమీఁదు
చేవదేరు లోపలెల్లా జిగిమించుఁ దీపులు || ఏల || 477 ||

## సాళంగం

నీకెట్లైతవాయనో నే నెరఁగను
ఆకడ నిన్నాడుకోఁగా నరుదాయ నాకు || పల్లవి ||

---

[1] గట్టి + అయు.

కొత్తగా వేరొకసతి కొంగు నిన్నుఁ బట్టఁగాను
చిత్తమెల్లా నీరాయ సిగ్గున నాకు
వొత్తి యుటమీఁద నీకు నొట్లెల్లాఁ బెట్టగాను
మత్తిలి కోపము రేఁగె మచ్చరాన నాకు || నీకె ||

దాయక పాయక నిన్నుఁ దగవుకుఁ బిలువఁగా
కాయమెల్లాఁ జెమరించె కాఁకల నాకు
చేయిచాఁచి చేయరాని సేఁతలెల్లాఁ జేయఁగాను
చాయల పంతములెక్కె సముకాన నాకు || నీకె ||

అవ్వల నిన్నాకె గూడె అట్టె నన్నుఁ గూడితివి
నవ్వులు సెలవిఁ దేరె నంటున నాకు
దవ్వులనుండే తాను తమకము రేఁచఁగాను
చివ్వన శ్రీవేంకటేశ చిమ్మిరేఁగె నాకు || నీకె || 478 ||

ఆహిరి

ఏమిటికి వెరవవు యెంత గట్టువాయవు
బూమె లింత నేరకుంటే పొద్దెట్టు వేఁగీని || పల్లవి ||

సొలసి నిన్ను నేఁ జూచి చొప్పలెల్లా నెత్తితేను
వలపు చల్లితినంటా వడి నవ్వేవు
తలపోసి నీచేఁతలు తారుకాణ చేసితేను
నలి నిజమాడేనంటా నన్ను మెచ్చేవు || ఏమి ||

శిరసు ముట్టఁగా, నేను చేత నిన్నుఁ దోసితేను
సరసమాడితినంటా చనవిచ్చేవు
తెరవేసుకొని వొంటెఁ దేఁకువతో నుండితేను
నరవిఁ గూడఁ బిలిచే నన్న లనేవు || ఏమి ||

దగ్గరఁ గూచుండి నేను తలవంచుకుండితేను
సిగ్గువడివున్నదంటాఁ జెప్పకొనేవు
యెగ్గులేక శ్రీవేంకటేశ కాఁగిలించుకొంటే
బెగ్గిల నీరతుల మెప్పించితి ననేవు || ఏమి || 479 ||

ముఖారి

వింత వింత రుచులనె వేడుక పుట్టించవలె
ఇంతులనుఁ దోడుచూడు మిందు నొక్కొక్కతెనె || పల్లవి ||

జాడల నీవెంత నాతో సరసము నెరపినా
ఆడినమాటలు సారె నాడరాదు
వాడికె రతులకును వడి నప్పణ ఇచ్చితే
కూడినట్లనె మరి కూడరాదు || వింత ||

సేసవెట్టి నీ వెన్ని సేవలు సేయించుకొన్నా
చేసిన సేఁతలు మరి సేయరాదు
మోసలేక నీవు మర్మములు గిలిగించితేను
రాసి నవ్వినట్టు మరి రతి నవ్వరాదు || వింత ||

యేచిన చక్కఁదనాన యెదుట నీ వుండితేను
చూచినట్లనె మరి చూడరాదు
చేచేత శ్రీవేంకటేశ చేకొని నన్నేలితివి
లాచి మెచ్చినట్లా వొల్లఁగె[1] మెచ్చరాదు ||వింత||480||

సాళంగనాట

ఊరకుండగానే యేల వొక్కొక్కట గడియించేవు
మేరతో నుండితేనే మెచ్చనిదాననా || పల్లవి ||

---

[1] ఒల్లఁగె =

వొడయఁడ వందరికి వొకతెఁ జూచి నీవు
నడుమ నవ్వితే నేను నవ్వవచ్చునా
పడఁతినింతే నేను పక్కన వినయముతో
అడఁకువ నుండితేనే అలిగినదాననా || ఊర ||

వొనర మోహించి నీవు వొకతెగుణము లిట్టె
కొనియాడితే నేనుఁ గొనియాడేదా
నినుఁ బెండ్లాడినదాన నేను కడుసిగ్గుతోడ
'గొనరఁ దలవంచితే కినిసినదాననా || ఊర ||

వొక్కటై కాఁగిటఁ గూడి వొకతెకుఁ బ్రియపడి
మొక్కితే నేను నాపెకు మొక్కవలెనా
నిక్కపు శ్రీవేంకటేశ నీవేలినదాన నేను
చొక్కివుంటె నాపైపై నీసున నున్నదాననా ||ఊర||481||

## బౌళి

నీవే ఆలవైతివా నెయ్యమున నీతనికి
వావులు నేఁ జెప్పితేను వంకలొత్తే వేమే || పల్లవి ||

యిట్టె నాపతిమాటలు యెగ్గులు నేనెంచితేను
వట్టి చక్కట్లు చెప్పవచ్చే విదేమే
దట్టపుఁగాఁకలతోడ తప్ప కాతనిఁ జూచితే
పెట్టేవు మాటుగా జేయి బింకాన నిదేమే || నీవే ||

తగిలి యాతనిచేఁత తారుకాణ నేసితేను
బిగిసి లేదని యానవెట్టే విదేమే
నగుతా నాతనిమేను నాట గోర నూఁదితేను
వగచి మందులు వెట్టవచ్చే విదేమే || నీవే ||

కందువ నాతనిమేను కాఁగిలించి కూడితేను
సందడి నలపార విసరే విదేమే
యిందులో శ్రీవేంకటేశుఁ డీతని నే నవ్వితే
అందుకోలు జాణతనా లాడి మెచ్చే విదేమే ||నీవే||482||

## కాంబోది

ఏమిటికే చెలులాల యెంత నన్ను సోదించేరే
ప్రేమపునారమణుని బెడఁ బాయనోపనే || పల్లవి ||

మొగమోట గలిగితే మోవ నెంతాడినాను
నగవులే సెలవి నున్నతి మించును
తగవే నడపేనంటే తప్పఁదోవకుఁ దీసితే
వొగరై తోఁచుఁగాని వొడఁబాటై వుండదు || ఏమి ||

చుట్టరికమైనచోట సొల్లెంత మోపినాను
మట్టులేని సంతోషమే మతిఁ దోచును
అట్టె తాలిమి గలితే ఆయములు నాటించినా
బుట్టుకే లోనౌఁగాని గుణము విడువదు || ఏమి ||

కూడివున్నవేళను గురుతు లెన్ని చేసినా
వేడుకలైవుండుఁగాని వెత రేఁగదు
యీడనె శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నన్ను నేఁడు
జోడుగూడే వుండుగాని సూటిదప్ప దెపుడు ||ఏమి||483||

## వరాళి

పాయపువాఁ డతఁడూ పదుచుఁదనము నీది
చేయరాని వినయాలఁ జెలఁగఁగాను || పల్లవి ||

సిగ్గులు వడుదురటే చెలువుఁడు మాటాడితే
వొగ్గి తాఁ జేతికిలోనై వున్నాఁడు నీకు
వెగ్గళింతురటవే వెస నిట్టె మోహించి
తగ్గులేనిరతులకుఁ దమకించఁగాను || పాయ ||

శిరసువంతురటే చెనకి యాతఁడంటితే
సొరిది నిట్టె యెదురుచూచీ నీకు
గరిసింతురటవే కాఁకల నాతఁడు వొంది
పొరిఁబొరి నీ గుణాలు పొగడఁగాను || పాయ ||

చిన్నఁబోఁవుందురటే చేరి యాతఁడు గూడఁగా
కన్నులఁ జూచినంతనే కరఁగీ నీకు
ఇన్నిటా శ్రీవేంకటేశుఁ డేలినాఁడు నిన్నింతల
పన్ని పెనఁగుదురటె బాఁతిపడఁగాను || పాయ || 484 ||

## పాడి

కాంతలాగు ఇంకా మీఁదఁ గనేవు నీవు
చెంత నుండి నే నీకు చెప్పితి నీ సుద్దులు || పల్లవి ||

బలిమిఁ గొసరెనట పంతమాడెనట ఆపె
చెలి నీతో ఆమాట చెప్పదాయనా
చలము సాదించెనట సాటికి బెనఁగెనట
వెలదిసుద్దులు నీవు వినవా ఇంకాను || కాంత ||

యెద దట్టుకొనెనట యెమ్మెలల్లాఁ జూపెనట
యిదెల్లా నీ వంపినాపె యెచ్చరించదా

వుదుటున నవ్వెనట వూరకె జంకించెనట
కొదలేకివి[1] దెలుసుకొనవా ఇంకాను ‖ కాంత ‖

లోనికిఁ దా వచ్చెనట లోలో నిన్నుఁ గూడెనట
తానే నీ దూతిక మూసిదాఁచదాయనా
పూని శ్రీవేంకటేశుఁడ పొందితివి నన్ను నేఁడు
సోనల చంద్రకళలు చూడవా ఇంకాను ‖ కాంత ‖ 485 ‖

రేకు 1682 ముఖారి

ఆఁటది చేసినమేలు అది విచారించవైతి
గాఁటానఁ బెనఁగుదురా కాతరానను ‖ పల్లవి ‖

సింగారించుకొని యిట్టె చెలి నీ యిండకు రాఁగా
ముంగురులంటుదురా మొక్కలానను
సంగతిగా మోవి చూపి చవులు వుట్టించఁగాను
కొంగువట్టి తీతురా గొరబుగాను ‖ ఆఁట ‖

పుక్కిటివిడెముతోడ పొలిఁతి నీతో నవ్వఁగా
పక్కనఁ దినుకుదురా పొలిండ్లు
అక్కరలో నీకు విడె మందియ్యరాఁగాను
తక్కక గిలిగింతురా తత్తరానను ‖ ఆఁట ‖

కదు మోహమున నిన్నుఁ గాఁగిలించుకొనఁగాను
బడల నలయింతురా పచ్చిదేరను
అడరి శ్రీవేంకటేశ అంగన నిన్నుఁ గూడఁగా
తడవి వేగిరింతురా దప్పిదేరను ‖ ఆఁట ‖ 486 ‖

---

[1] కొదలేక + ఇవి

## దేసాళం

కూడుదు రారా ఇఁకేఁ గొరతలేల
వేడుకలు దైవారీ విడెమైనా నియ్యరా || పల్లవి ||

కద్దురా నీసుద్దులు కడఁగడల వింటిమి
వద్దురా యింతేల మమ్ము వలఁబెట్టేవు
ఇద్దరము వేగినంతా యిటువలె నుండఁగాను
నిద్దుర కన్నులఁ దేరీ నీవు నన్నుఁ జూడరా || కూడు ||

మేలురా నీగుణములు మిక్కిలిజాణ వాడవు
యేలరా నావద్దనుండే యెంతసేసేవు
కేలు రాజసాన నీవు గిలిగించి పట్టితివి
చాలు రాయడిసేసి చన్నులు ముట్టకురా || కూడు ||

పోకురా ఇఁకనెక్కడా పొంచి నన్నుఁ గూడితివి
యీకురా పరకాంతల కిట్టే చనవు
చేకూర నన్నేలితివి శ్రీవేంకటేశుఁడ
నీకు రమణి నేనైతి నెయ్యమెల్లాఁ జూపరా ||కూడు||487||

## బౌళి

నీవేల వంకించేవు నీకు నీకే
యీవలఁ బొడిమలు నీ కింకాఁ గట్టేర || పల్లవి ||

కందువ నివ్వరు వచ్చి కతలెల్లాఁ జెప్పేవు
అందరు నెఱఁగరా ఆ సుద్దులు
చెంది యాచారాలెల్లాఁ జేసుకొం నుందరను
విందు లెవ్వరైనా నీ మీఁద నాడేరా || నీవే ||

నలిరేఁగి యందరిలో నవ్వులెల్లా నవ్వేవు
చెలులకుఁ గొత్తలా నీచేఁతలెల్లాను
వలువలు వుట్టఁ గడు చదువులే చదివేవు
విలువున నిన్ను నిఁక నేరము లెంచేరా || నీవే ||

యీడనే కాఁగిట నించి యింతలో నన్నుఁగూడేవు
వాడవా రెరఁగరా నీ వలపెల్లాను
పాడివంతాలు చెప్పేవు పక్కన శ్రీవేంకటేశ
యేడనైనాఁ గల్లతనా లెంచేరా నీమీఁదను || నీవే || 488 ||

శంకరాభరణం

అలిమగనికి వొఁగాము లేదవి
మేలుగలిగితే మెచ్చుటగాక || పల్లవి ||

జంకించనేఁటికి సారెకు నే నీ—[1]
వంకలాడి కడు వలచితివి
మంకు గొల్లెతలు మందనుండి రాఁగా
కొంకక కూడితేఁ గూడితిగాక || అలి ||

అలుగనేఁటికి యివ్వడే నే నీ—
వలుకులకే భ్రమసితి
బలువ నీతల పదారువేవుర
కలిమిఁ గైకొంటేఁ గైకొంటిగాక || అలి ||

సాధించనేఁటికి చొక్కి నిన్నుఁ గూడి
సాధించి నీమోవి చవిగొంటి

---

[1] 'నీవంకలు + ఆడి' అని ఛిన్నపదములే. 'నీవంకలు = నీలోని లోపములు, ఆడి = ఎత్తిమాటి' కావచ్చు. ఛ్కృత మాతృకలో వంకలాడి రూపము, అప్రసిద్ధముగా తోచెడిని.

యీడేన శ్రీవేంకటేశ నీ వెవ్వరి
బోదించి పొందినాఁ బొందుదుగాక || అలి || 489 ||

## సాళంగనాట

కానీలేవే నీ విందరికంటె నెక్కుడా
నానఁబెట్టి వరిఁగాఁగ నవ్వు నవ్వవలెనా || పల్లవి ||

వంతులకే పెనఁగేవు వాసులకే తిరిగేవు
యింతటిలో నీకు నేఁడు యెమ్మె వచ్చెనా
కాంతలెల్లా వ్రాడిగాలు కదుఁ బలికేఁ జేయఁగా
దొంతరై నీ వితవితొడ యెక్కవలెనా || కానీ ||

మురిపెమే చూపేవు ముద్దులే గని (రి?) నేవు
దొరతనములే నీకు తొట్టుకొనెనా
పదుపక్కు నాడువారు వచ్చి నిలుచుండఁగాను
వొరసి యీతనిమీఁద నూఁదుకొనవలెనా || కానీ ||

కప్పరమే యడిగేవు కాఁగిటనే కూడేవు
దప్పితో రతులు మీకుఁ దడఁబడెనా
ఇప్పుడె శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్ను నేలె
అప్పుడె యీతనివురమందు నుండవలెనా || కానీ || 490 ||

## వరాళి

ఇరుమొనసూదివలె నెందుకొను నీమనసు
వొరసి నట్టనడుమ నున్నాఁడవు గాక || పల్లవి ||

చెనకి గోరనూఁదుచు చెప్పేనదె నీతోను
చనవులు మనవులు పారెకు నాపె

మన సక్కడనే కాక మామీఁద నున్నదా నీకు
చానిపి కన్నుల మమ్ముఁ జూచేవు గాక || ఇరు ||

సందడిఁ జన్నుల నొత్తి చవులు చూపీ నీతోను
పొందులును విందులును బోరున నాపె
కందువ లాడనేకాక కదునాస ఇందున్నదా
సందు నుడివలపులు చల్లేవు గాక || ఇరు ||

కూడి కాఁగిటిలోననే కూడపెట్టీ నీతోను
వాడికలు వేడుకలు వరుస నాపె
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
వోడక రతుల నింకా నొరసేవు గాక || ఇరు || 491 ||

రేకు 1683 లలిత

ఎవ్వరుండుటా నెఱఁగ వెంత సిగ్గువిడిచేవు
దవ్వు చేరువల నెంత తగవురా నీది || పల్లవి ||

నలిరేఁగి వూరకైనా నవ్వులు నవ్వ వచ్చేవు
చెలఁగి యెవ్వతె నీకుఁ జెప్పెరా యిది
చలమున నీచేతులు సారెకుఁ బైవేసేవు
తలపోయ నెటువంటితమిరా నీది || ఎవ్వ ||

కమ్మరఁగమ్మర నిట్టె కాఁతాళాలె నెరపేవు
నెమ్మది నెవ్వతె యంత నేర్పెరా యిది
వుమ్మడి నిందరిలోనే వొడివట్టి పెనఁగేవు
వమ్మి నేఁడు యెటువంటి బలువురా నీది || ఎవ్వ ||

కలువుకోలుగ నిట్టె కాఁగిలించి కూడేవు
పొలసి యెవ్వతె యెగపోసెరా నీకు

అలమేలుమంగను నే నవుర శ్రీవేంకటేశుఁడ
మొలచిన దెటువంటి మోహమురా నీది ॥ ఎవ్వ ॥ 492 ॥

## దేవగాంధారి

ఎంతటిమోహమో యేమని చెప్పేదు
వింతరతులఁ గడువెలయించేవు ॥ పల్లవి ॥

చెలవ చెమటలు చెలిపైఁ దొరుగఁగ
వలపులు చల్లేవు వరుఁడవు
మొలకల పులకల మోసులు నాటఁగ
కెలయుచు నిటు కాఁగిట నించేవు ॥ ఎంత ॥

నిట్టూర్పు సురటుల నెలఁతకు విసరుచు
గుట్టున వలపులు గురిసేవు
తెట్టెలమోవులతేనెలు గారఁగ
తొట్టుకొనఁగ విందులు వెట్టేవు ॥ ఎంత ॥

వెలయఁగఁ గాఁగిలి విడిదలసేయుచు
చెలఁగి కాఁపురము సేసేవు
అలమేల్మంగను అదె శ్రీవేంకట--
నిలయుఁడ పొందులు నెరవేర్చేవు ॥ ఎంత ॥ 493 ॥

## సింధురామక్రియ

మేలు మేలు నీ సుద్దులు మేనబావా
వోలవేయ కిఁక మాపై నో మేనబావా ॥ పల్లవి ॥

బచ్చన మాటలాడి పలుమారు నవ్వేఁగాను
మెచ్చితిఁగా నే నిన్ను మేనబావా

లచ్చెనలు మేననించి లావులఁ బెనఁగఁగాను
వొచ్చెము లేదంటిఁగా నీ కోమేనబావా || మేలు ||

దట్టమై నావొద్దనె సందడి నీవు సేయఁగాను
మెట్టితిఁగా నీ పాదము మేనబావా
చుట్టమవై నాకు నీ సొమ్ములెల్లాఁ బెట్టఁగాను
వొట్టు లేదంటిఁగా నీ కోమేనబావా || మేలు ||

తారిమితో వెంటవెంటఁ దగిలి నన్నేలితివి
మేలుగా శ్రీవేంకటాద్రిమేనబావా
ఆలనంటాఁ బొగడేవు అలమేలుమంగ నేను
వోలివెట్టితివి నాకు నోమేనబావా || మేలు || 494 ||

శంకరాభరణం

ఎగ్గులుగాఁ బట్ట కిఁక నీవూ
అగ్గలిక చెల్లు నాఁటదానికి || పల్లవి ||

కూరిమి గొసరి కొమ్మ నీమీఁదను
సారెకు వలపులు చల్లీ నదె
పేరుకొని యట్టె పిలిచీఁ గమ్మర
మేరతో నగఁదగు మేనదానికి || ఎగ్గ ||

అంటఁ గాఁగిలించి ఆయాలు సోఁకఁగ
నంటున నీతో నవ్వీ నదె
వెంటవెట్టుకొని వెనఁగీ నింతలో
వెంట రా నమరు యింటిదానికి || ఎగ్గ ||

అట్టె నిన్నుఁ గూడి యలమేలుమంగ
రట్టుగా నాసలఁ బెట్టీ నదె
గట్టిఁగా శ్రీవేంకటేశుఁడ నీతో
గుట్టు దగు సేసుకొన్నదానికి || ఎగ్గు || 495 ||

## మాళవిగౌళ

ఇంకనైనా వుపదేశమిప్పించుకో యాపెచే
సంకెలేక యిటువలె నటకాఁడవైతివి || పల్లవి ||

వెలలేనిమాఁటలెల్లా వేసరక నీవాడఁగ
సొలసి వేళ్ళాళికుఁ జూపీఁ జెలి
వెలికావి యాకెవలె నేరవైతివి మోనము
కలకాలమును నిట్టె కతకారివైతివి || ఇంక ||

పచ్చిదేర నూరఁగలపనులెల్లా జేయఁగాను
చెచ్చెర నవ్వల నన్నసేసీఁ జెలి
కొచ్చి నీవు నట్లానే గుట్టున నుండవైతివి
వచ్చి నేఁడు నీవుఁ గావడివాఁడవైతివి || ఇంక ||

కన్నచుట్టాలనెల్లాను కాఁగిలించుకొనఁగాను
మిన్నక యెక్కడనైనా మెచ్చీఁ జెలి
అన్నిటా శ్రీవేంకటేశ యలమేలుమంగ నేను
నన్నుఁ గూడితివి యిట్టె నాటకుఁడవైతివి ||ఇంక||496||

## మంగళకౌశిక

ఏమీ ననము నేము యిందుకు నిన్ను
దీమసాన నాపె గుట్టు తెలుసుకోవయ్యా || పల్లవి ||

చెప్పసిగ్గువడీ నదె చెలి నీతో మాఁటలు
అప్పుడే యేకతమున నడుగవయ్యా
తప్పగాదు మఱుఁగున దండనే వుండేముగాని
చప్పుడుసేయ కిద్దరు సందించుకోరయ్యా || ఏమీ ||

నవ్వఁగ లోఁగీ నదె నాతి నీ మొగము చూచి
అవ్వలను వెద్దువెట్టి అరయవయ్యా
ముమ్వంకలాను చెవులు మూసుకవుండేవుగాని
నివ్వటిల్ల నాసుద్దులు నీవు వినవయ్యా || ఏమీ ||

సన్నలే చేసీ నదె సకియ నీకాఁగిటికి
మన్నించి కలసితివి మరుగవయ్యా
యిన్నిటా శ్రీవేంకటేశ యిందే యెనసేముగాని
పన్నిన మీ వలపులు పచారించరయ్యా || ఏమీ || 497 ||

రేకు 1684 శంకరాభరణం

మాన చెప్పుగ నీ మతకములు
కానుకలిచ్చుట గరిసించుటలా || పల్లవి ||

మొగము చూచితే మొక్కఁగ వలదా
యెగసక్కెములని యెంచేవు
అగపడి తెలియక అడిగేనింతే
దగవులఁ బెట్టఁగఁ దలఁచితినా || మాన ||

వూరక పిలిచిన నూఁకొనవలదా
కేరడములనుచుఁ గెలసేవు
కారణము దెలిపి కప్పితి నింతే
గారవములే యివి కదు వెంగెములా || మాన ||

మెలుపునఁ గూడిన మెచ్చుఁగవలదా
చలములనుచుఁ గడు జరసేవు
యెలమితో శ్రీవేంకటేశ కూడితివి
అలమేల్మంగ నే అలయించితినా || మాన || 498 ||

## ఆహిరినాట

అదేల నీవాపెచేత నాడించేవోయి
సదరానఁ దన్ను నేను సాదించితినా || పల్లవి ||

పైపై నిన్నే వెంగెములు పలికి దూరితిఁగాక
ఆపెనేమైనాఁ గోపించి అంటినా నేను
రాపుల నిన్నే కొసరి రాయడించితిఁగాక
చాఁపుచుఁజేతులఁ దన్ను జరసితినా || అదే ||

తివిరి నీమేనునాఁట దిష్టించి చూచితిఁగాక
సవతెంటాఁ[1] గన్నులను జంకించితినా
పవళించుమని నిన్నే బలిమి సేసితిఁగాక
తవిలి కేరడముతో తన్ను నే నవ్వితినా || అదే ||

చలపట్టి నిన్నుఁ గోరి సన్నలు చేసితిఁగాక
తలకొస చెల్లెలంటాఁ దడవితినా
నెలవై శ్రీవేంకటేశ నిన్ను నే మెచ్చితిఁగాక
అలమేలుమంగను నే నట్టె తన్నించితినా || అదే || 499 ||

## దేసాళం

సేసపెట్టినాపె యేమిసేసినాఁ జెల్లు
రాపికెక్కె నీ సుద్దులు రావయ్య యింటికి || పల్లవి ||

---
[1] సవతి+అంటా (కా.శ్రీ.)

తమకించి పైకొంటేఁ దప్పులు వెదకరాదు
సముకానఁ గొసరితే జరయరాదు
నెమకి గోరనూఁదితే నేరము లెంచఁగరాదు
ప్రమదానఁ జే చాఁచితే పంతమాడరాదు ॥ నేస ॥

సొలసి కొంగువట్టితే సూదుకు దగులరాదు
తిలకించి చూచితేను దీకొనరాదు
వలచి తిట్టుదిట్టితే వానికిఁ బెనఁగరాదు
కలయుచు నవ్వితేను కాఁతాళించరాదు ॥ నేస ॥

రతుల నలఇంచితే రాఁపులు సేయఁగరాదు
సతమై పంగించితేను సాదించరాదు
ఇతవై శ్రీవేంకటేశ యే నలమేలుమంగను
అతివ లేమనినాను అవ్వఁగా దనరాదు ॥ నేస ॥ 500 ॥

## ఆహిరినాట

నీవు నేర్చితివో నెలఁతగుణములో
వేవేలు గనుఁగొని వెరగయ్యీని ॥ పల్లవి ॥

సాములు సేయుచు సరసపు మాటల
ప్రేమ మిదెవ్వతె పెంచీని
దోమటె దొడికిన తొయ్యలి యుండఁగ
యీమగు వేఁటెకే యిరవుకొనీని ॥ నివు ॥

కానుక లొసఁగుచు కమ్మరఁ గమ్మర
తానెవ్వ రిచటఁ దగిలీని
తోనె పెండ్లి కూఁతురు నిలుచుండఁగ
ఆనుక నీకేల ఆసపడీని ॥ నీవు ॥

కలకలనవ్వుచు(చుఁ?)గదుఁ బానుపుపై
చెలుములు తానేల చేసీని
అలమేలుమంగ నీ కదె వురమెక్కఁగ
బలు శ్రీవేంకటపతి యిది యొకతె || నీవు || 501 ||

## నాగవరాళి

ఇందుకుఁగానే యింతి యింత సేసెను
అందుకు _ ని ఆయములు నాఁటవు || పల్లవి ||

చల పెంతగలిగినా వరునితోడుత సతి
చలపట్టి పెనఁగక చవిగాదు
సొలసి పాయఁగరానిచుట్టరికమైనాను
పిలిపించుకొన్నఁగాని ప్రియము లమరవు || ఇందు ||

చన వెంతగలిగినా సారెకు మాఁటలాడ
సొనిపి దూరక రతి సూటిగాదు
ననిచి ఎట్టుండినాను నవ్వుతాను
కొనగోర చెనకినఁగాని సొంపు చేకూడదు || ఇందు ||

తగు లెంతగలిగినా తమకము పెడరేఁచి
జగడించి కలయక చక్కఁగాదు
మగువఁ గూడితి విట్టె మన్నించి శ్రీవేంకటేశ
అగపడియున్నఁగాని ఆసలు దైవారవు || ఇందు || 502 ||

## హిజ్జిజి

తెలుసుకొంద మన్నియుఁ దెల్లమిగాను
కొలచి పెండ్లిపీఁటపైఁ గూచుండుమనవే || పల్లవి ||

మనసులోఁగలమేలు మాటలలోఁ గానరాదా
అనపీపే నీవేల వద్దనే విపుడు
ననిచినతమకము నవ్వులలోఁ గానవచ్చీ
అనుమానా లిఁకనేల అండకు రమ్మనవే ॥ తెలు ॥

జిగిగొన్నమన్ననలు చేఁతలలోఁ గానరాదా
మొగము చూడనియ్యవే మొక్కులమేల
మిగులాఁ గాఁక గలితే మేనిమీఁద గానవచ్చీ
వెగటు లిఁకనేఁటికి విడియ మిమ్మనవే ॥ తెలు ॥

చొక్కపు వేడుకలెల్లా చూపులలోఁ గానరాదా
నిక్కి తెరదియ్యనీవే నేరమెంచక
యిక్కువ శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁగూడె
మిక్కిలి నివ్వెరగేల మేల మాడు మనవే ॥ తెలు ॥ 503 ॥

రేకు 1685 రామక్రియ

అన్నిటా పంతగత్తెవై తేనేమి
నన్నలనే మోవిచూపి చవిగొనఁ గదవే ॥ పల్లవి ॥

చలము లేమిటికే సాదించనేమిటికే
వలపులఁ బెనగొన్నవనితవు .
పిలిచీ నిన్నతఁడు ప్రియముచెప్పీనతఁడు
మలసి యలుకలెల్లా మానవే యింతటను ॥ అన్ని ॥

పంతములాడఁగనేలే బలిమిచూపఁగనేలే
చెంతలఁ బెండ్లాడిన చెలియవు
కంతుని గురుఁడతఁ డక్కరైన పతి యతఁడు
చింతలెల్లఁ దీర సేవసేయవే యింతటను ॥ అన్ని ॥

కెరలించే విదేమే గేలిసేసేవేమే
మరిగినయులమేలుమంగవు నీవు
సిరిగలవాఁ డతఁడు శ్రీవేంకటేశుఁ డతఁడు
నిరతిఁ గూడితి వింపు నించవే యింతటను ||అన్ని||504||

తెలుఁగుఁగాంబోది

ఇంక నీ మనసు యెనసె నావలపు
చింకించినంతనే జల్లనె మేను || పల్లవి ||

తలఁపులోన నిన్నుఁ దలఁచినమాత్రన
పులకల మొలకలు పొదలనివె
పిలిచి పేరుకొని ప్రియపడినంతనె
నిలువునఁ జెమటలు నిండె నివె || ఇంక ||

గుఱిగా నిను గనుఁగొనినయంతనె
గిఱిగొ(కొ?)న నూర్పులు కెరలె నివె
చిఱునవ్వులు గదుఁజిందెనంతనె
వెఱుగులు కన్నుల వెలసె నివె || ఇంక ||

కైవశమై నిన్నుఁ గలసినంతనే
భావపుముదములు బలిసె విదె
శ్రీవేంకటేశ నే జిగి నలమేల్మంగ--
సేవల నారతు నెసగె నివె || ఇంక || 505 ||

నాదరామక్రియ

తెలిసితి నీగుణాలు తేటతెల్లమిగాను
చెలరేఁగి నాకేల చెప్పేవు నీవు || పల్లవి ||

తలవంపులే చెప్పీ దగ నీసుద్దులెల్లా
పలికేయానతి[1] చెప్పీ బలునిందలు
లలి మైకాఁకలె చెప్పీ లాగుల నీ విరహము
పలుమారు నన్నే లోడఁబరచేవు నీవు || తెలిఉ ||

సెలవినవ్వులే చెప్పీ చిత్తములో యానందము
పులక జొంపాలే చెప్పీ బొందులెల్లాను
యెలమి శ్రీవేంకటేశ యిటు నన్ను నేలితివి
సొలపులేఁటికి తోడుచూపేవు నీవు || తెలి || 506 ||

## తెలుఁగుఁగాంబోది

ఓరువఁగదవే వొకయించుకవడి
నీ రమణుఁడు మన్నించీ నిపుడు || పల్లవి ||

వెన్నెలలే పో వేసవియెండలు
వున్నతి భువి విరహాలకెల్లా
వన్నిరే వెంబాల వెల్లువలు
కన్నులెదుట నివి కాలమహిమలు || ఓరు ||

వడిఁ జిగురులెపో వజ్రాయుధములు
బడివాసినదంపతులకును
సుడిగొనుపుప్పొడి చొక్కుమందు లివి
కడకమెరసె నివె కాలమహిమలు || ఓరు ||

మొనసిన విరులే పో. మోహనాస్త్రములు
చనవున నలిగిన జాణలకు

---

[1] అనతి = పద్ధతి, లోకువ; తరవాయి ఇత్యాదిగా కావచ్చు.

యెనసితి శ్రీవేంకటేశు నలమేల్మంగ
కనుఁగొన నింపాయ కాలముహిమలు || ఒరు || 507 ||

## ఛాయానాట

ఎంతవోరుపో నీది యేమి చెప్పేది
పంతాన జంకించితేను పచ్చినవ్వు ముంచెను || పల్లవి ||

చండిపెట్టి మాఁటలాడి సతి నిన్ను దూరఁగాను
నిండుకొనెఁ బులకలు నీ మేనను
కొండలవంటి చన్నుగుబ్బలు నిన్నొత్తగాను
అండనే నీమనసెల్లా నప్పుడే కరఁగెను || ఎంత ||

మునుకొని బలిమి నీ మోవి పిప్పి సేసితేను
తనివోని చెమటలు దైవారెను
పెనఁగి కరములను బిగ్గెఁ గాఁగిలించఁగాను
చెనకుల వలపులు చిమ్మిరేఁగె మీకును || ఎంత ||

కడలేనిరతులను కదిమి నిన్నుఁ గూడఁగా
జడిగొని సంతోసాలు జాజుకొనెను
అడరి శ్రీవేంకటేశ అంగన నిన్నుఁ గూడితే
కడు నీమోమునఁ జంద్ర కళలెల్లాఁ దేరెను ||ఎంత||508||

## పాడి

అందరము నందరమె అవుఁగాదనఁగలమా
పొందులు గావించ నేర్చు పుష్పాస్త్రుఁ[1] డొకఁడె || పల్లవి ||

[1] 'పుష్పాస్త్రు' కావచ్చు

బలిమికాఁడవు నీవు పాయపుదాన నేను
మెలుపురాలవంటివి మేఁటి చన్నులు
తలపోయ నీఁక మంచితనము లెట్టబ్బునో
వలరాచొక్కఁడె నేర్పు వైపులుగావింపను || అంద ||

నాములెక్కు నీ నవ్వులు నాతలము బెట్టిదము
గామిడి నా చూపులు కడు గబ్బులు
యేమని పొసఁగించే దెవ్వరిందు కోపుదురు
కాముఁడొక్కఁడె నేర్పు కైవసము సేయను || అంద ||

శ్రీవేంకటపతివి చేకొంటివి నీ దేవిని
హావిరి నావలపది వలవంటిది
చేవదేరేరతులను చిక్కుదేరే దేగతినో
భావజుఁడొక్కఁడె నేర్పు వంత మీదేరించను ||అంద||509||

రేకు 1686 శంకరాభరణం

తరుణి చిన్నగన తలవంచి నిదె
సరసములాడుచు చనవీరాదా || పల్లవి ||

పలచనియెలుఁగున బాడీఁ జెలి నిను
వెలినుండె నీవు వినవయ్యా
చెలఁగి విన్నఁగని సిగ్గువడీ నిదె
పిలిచి కాఁగిటను నించఁగదయ్యా || తరు ||

సరుసఁ గరంబుల వ్రాసీ నీపేరు
సరుసఁ గూర్చుకొని చదువవయ్యా
గరిమ నందుకే మరఁగున నవ్వీ
తెర నీ విప్పుడె తియ్యఁగదయ్యా || తరు ||

పొలయుచును దోఁగి చూచి నీ దిక్కు
బల బల సేసలు చల్లవయ్యా
కలసెను శ్రీవేంకటేశ నిన్నికె
యెలమి నీ కెమ్మోవి యియ్యఁగదయ్యా || తరు || 510 ||

## హిందోళవసంతం

మంచిదె నీ జన్మము మగువలలో నెల్లా
పెంచకె నీ కన్నులు పెద్దలాయఁగదవే || పల్లవి ||

మొక్క మిచ్చమాఁటలే మునుకొని ఆడియాడి
వెకలివైతివిగదె వెలఁది
చిక చిక నవ్వి నీవు విభునిఁ జిమ్మరేఁచఁగా
చికురము జారి కరుఁజీఁకటాయఁగదవే || మంచి ||

పుబ్బున నాతని దిక్కు పుడివోక చూచి చూచి
గబ్బివైతివి గదవే కలికి
నిబ్బరపు జవ్వనాన నీ విత్తని నొత్తఁగా నీ-
గుబ్బలు పొలించ పూవుగుత్తులాయఁగదవే || మంచి ||

వావులు చెప్పఁచు నీవు వరుసఁ గాఁగిట సించి
దేవులైతి గదె తెలువ
యీవేళ శ్రీవేంకటేశుఁ డితఁ డెట్టె నిన్నుఁగూడె
వేవేళకు నీ మోవి విందులాయఁగదవే || మంచి || 511 ||

## బౌళిరామక్రియ

గరిమ మీవేళ మీరు కాచుకున్నారు
యిరవాయ వలపులు యేమిసేతురయ్యా || పల్లవి ||

వడఁతి యిచ్చకురాలు పైకొనీ నీకెప్పుడును
కడలేని నీవైతే కాతరీఁడవు
బడి బడి నిద్దరును పాయరాని బందుగులు
యెడపుల పత్తులెల్లా నేమిసేతురయ్యా || గం ||

నెలఁత నీకు మేలుది నేమముతో నున్నది
నలి నీవైతే ప్రాణనాథఁ[1]
పొలసి మీకిద్దరికి పొరాని నేస్తాలు
యెలమి సంగడికాంత లేమిసేతురయ్యా || గం ||

శ్రీమహాలక్ష్మి యీకె జీగి నీవురమెక్కెను
నేమపు శ్రీవేంకటేశ నీవు పతివి
ప్రేమాన మీ కిద్దరికె పెండ్లిసోబనము
యీ మగువలునుఁ గూడి రేమిసేతురయ్యా ||గం||512||

నాదరామక్రియ

ఇదివో రమణుఁడ యెమ్మెలకు
సుదతి వేఁడుకొనీ సొమ్ములకు || పల్లవి ||

వెలఁది నిన్నుఁగవి వేడుకమాటల
వలపులు చల్లీ వాడికెకు
తొలుకరి మెఱుఁగులు తొలఁకేటి చూపుల
సొలపులు నించీ సూటులకు || ఇది ||

కాంత నీ యెదుట కందువ నవ్వుల
వంతులు వెట్టీ వాసులకు

[1] 'ప్రాణనాథుఁడవు' వ్రాయసగాని తప్పు' (తా. శ్రీ.)

వింత బాగులను వేడుక చెనకుల
పంతము చూపీ బలుములకు || ఇది ||

వనిత నీ కాఁగిట వ్రట్టువ చన్నుల-
మొన లటు చూపీ ముద్దులకు
యెనయుచు శ్రీవేంకటేశ నిను రతుల
వినయము చేసీ విందులకు || ఇది || 513 ||

## దేవగాంధారి

వద్దనేమా నిన్ను నేము వట్టిగజ రీడనేల
తిద్దవదు[1] నీగుణాలు తెలుసుకోరాదా || పల్లవి ||

తెలువ కానుకంపగాఁ దెచ్చిన చెలుల మింతె
అలిముటి జాణతనా లాడనేఁటికి
తలఁగు మొలఁగులేల దవ్వుగా దాపెకు నీకు
పిలిదియ్యకున్నదిదె పెనఁగఁగరాదా || వద్ద ||

చెలిమారు వ్రూడిగాలు సేయఁగవచ్చితి మింతె
బలిమితో మాకొంగు పట్టనేఁటికి
కలగంఫ సటలేల కాచుకున్నదాకె నీకు
పలికి యూపె వొడఁబరచఁగరాదా || వద్ద ||

పడఁతివద్దికి నిన్ను బట్టి తీసితి నింతె
యెడచొచ్చి మమ్ము గూడ నింతయేఁటికి

[1] తిద్దు + అవదు = తిద్దవదు = దిద్దువడదు కావచ్చు. 'అగు' ధాతువుపై వ్యతిరేకార్థమున 'అవదు' రూపము ఈ వాఙ్మయములో అపురూపమే. తిద్దవలదు, తిద్దవద్దు, తిద్దరాదు రూపములేమైనా వ్రాయసకానిచేతిలో పొరపాటైనవా?

కదఁగి శ్రీవేంకటేశ కలసితి వాకె నిట్టె
జడియకుండా మోవి యంచము లియ్యరాదా ||వద్ద||514||

ముఖారి

ఇంచుకించుక వింటివి యీడా నాడా నాడుకోఁగా
కొంచించి నాలోఁ బలుకఁ గొంకేవు నీవు || పల్లవి ||

తత్తరించి లోలోనే తలపోయునేమిటికి
చిత్తములోఁ గలమాట చెప్పరాదా
గుత్తపు గుబ్బల నిన్ను కోమలి నాట నొత్తెనో
కొత్తగాఁగా సిగ్గువడి కొంకేవు నీవు || ఇంచు ||

దంటవై దిమసమున దాఁచుకొననేమిటికి
నంటున వెల్లవిరిగా నవ్వరాదా
బంట (టు?) పంతపురతుల భామ విన్నోడించెనో
గొంటవై వచారించక కొంకేవు నీవు || ఇంచు ||

తాటించి పరాకునేసి తలవంచనేమిటికి
మాటగా నా మో మిట్టె చూడరాదా
యీటున శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
కూటమి నాకెఁ[1] గూడెనో కొంకేవు నీవు ||ఇంచు||515||

రేకు 1687

గౌళ

ఏపేల కాఁతాళించి వెంఁతమఁ దిట్టేవు
వోపంలో సిగ్గువడవద్దా యీపెకును || పల్లవి ||

---

[1] 'అకెయుఁ' అనుదానిలో 'యు' లోపించిన రూపమేమో?

కొప్పుదువ్వుకొనఁగాను కోమలిఁ జూచి నీవు
చిప్పిలఁగ వెరగంది చెమరించేవు
గొప్పయైన పయ్యెదలో కుచములు గానరాఁగా
ఒప్పుగా సిగ్గులు వడవొద్దా యాకెకును || నీవే ||

చీర గట్టుకొనఁగాను చెలియవద్దికి వచ్చి
వూరకే చొక్కుచు నిట్టూర్పు వుచ్చేవు
తోరమైన మెఱుఁగారుతొడలెల్లా గానరాఁగా
ఓరుపుతో సిగ్గువడవొద్దా యాపెకును || నీవే ||

పఱపుపైఁ బండుండఁగా పక్క నీవూఁ బవళించి
అఱిముఱి రతిఁగూడి యలసేవు
మఱియు శ్రీవేంకటేశ మర్మములు గానరాఁగా
ఒఱపుతో సిగ్గువడవొద్దా యాపెకును || నీవే || 516 ||

## దేశాక్షి

ఏల వూరకుందానవు ఇద్దరముఁ జూచేము
మూలల నొదుగనేల మొక్కవే నీ పతికి || పల్లవి ||

చెంగావిచీర గట్టి చెమటలు గారఁగాను
అంగమలయు వచ్చితి వద్దమరేయి
సంగతిఁ గొలువున్నాఁడు సవరాజ్యమేలుదువు[1]
ముంగై మురువులచేత మొక్కవే నీ పతికి || ఏల ||

ఏంచినయానోదముతో నిద్దుర గంటఁబెట్టక
మంచమెక్కేవు కాఁదారి మాఁదారి పొద్దు
మించి మోవితేనె నీకు మీఁదెత్తుకొనున్నాఁడు
ముంచి కొలుదువుగాని మొక్కవే నీ పతికి || ఏల ||

[1] సగము + రాజ్యము = సవరాజ్యము అదియా?, లేక 'సర్వరాజ్య' శబ్దవికారమా?

సరసపురతులను సాములెల్లాఁ జేయుచును
విరతిఁ గాఁగిలించేవు నిశివేళను
అరిది శ్రీవేంకటేశుఁడట్టె మమ్మెల్లా నేలె
మురిపె మేమిటె కేఁక మొక్కవే నీపతికి || ఏల || 517 ||

## శంకరాభరణం

వినయమే మేలు విట్టివీఁగుకంటె
వెనుతమకాలు బేలవైతివి || పల్లవి ||
చెలరేఁగి నీకు సేవలెల్లాఁ జేసి
జలజాక్షి నిన్ను సాదించెను
పలుకుఁబంతము పడఁతి కీడేరె
బలిమికాఁడవై భ్రమసేతివి || విన ||
చెంతనుండి యాకె సెలవుల నవ్వి
కాంత నీ మనసు కరఁచెను
శాంతముననే సకియ గెలిచె
వింత మదమున విరహివయితి || విన ||
చెలిమితోఁ గూడి శ్రీవేంకటేశ ని--
న్నలమేలుమంగ వలపించెను
చలువతోడనే సతి వురమెక్కె
తలపుల నాకు దక్కితివి || విన || 518 ||

## దేసాళం

మేలు మేలు[1] అన్నిటాను మెచ్చితి నిన్ను
నాలితో నూరకుండితే నవ్వినంతే ఫలము || పల్లవి ||

---

[1] తాళ్లపాకవారి పల్లవి, 1,3 చరణములందు కడపట 'అంతేఫలము' అని రెండవ చరణము కడపట 'అంతఫలము' అని రేకులోవున్నది. రెండవ చరణము కడపటనున్నదే సహజమని తోచుచున్నది.

నగుతానే వచ్చి నీవు నాకు నాపెకును నేఁడు
తగవులు చెప్పఁగానే తనిసితిని
మొగసక్కెతే లాడేను యేమి వచ్చి నిందువంక
మొగము చూచితేను మొక్కినంతే ఫలము || మేలు ||

సమ్మతించ సిద్ధరిక సరిక బెపెకి నీవు
నమ్మి కలియ్యఁగానే ఆనందించితిని
కమ్మటనేలదు [illegible] పనికి
కమ్మి నావద్ద [illegible] న్నంత ఫలము || మేలు ||

వొట్టుక పానుపుమీఁద వొకరొకరిఁ దెలిపి
యిట్టె కాఁగిలించితేనే యిరవైతిని
నెట్టన శ్రీవేంకటేశ, నెమ్మది మమ్మేలితివి
అట్టె నేసచల్లితే పెండ్లాడినంతే ఫలము || మేలు || 519 ||

## ఆహిరినాట

చెలులాల యేమి బుద్ధిచెప్పరే నాకు
పిలుచుకరాఁగదరే ప్రియుని నిక్కడికి || పల్లవి ||

తలఁపు లోలోననే దాఁచవచ్చుఁగాక మరి
వలపు దాఁచవచ్చునా వడి నెందైనా
చల మెప్పుడైనాను సాదించవచ్చుఁగాక
వలరాజు సాదించవచ్చునా పుడమిని || చెలు ||

వన్నె లెమ్మెలుఁ జూపవచ్చుఁగాక తొడెఁబడ
చన్నులు చూపవచ్చునా సటలోనను
పన్నిన పంతమే కడుఁ బచారించవచ్చుఁగాక
సన్నల దమకము పచారించవచ్చునా || చెలు ||

వేడుకతో గొలువులో విడె మియ్యవచ్చుఁగాక
యేడనైనా మోవితేనె లియ్యవచ్చునా
యీడనె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
కూడుమనవచ్చుఁగాక కొంచుమనవచ్చునా ||వెలు||520||

బౌళి

మగవాఁ డెటుండినా నమరుఁగాక
తగవుదప్పవచ్చునా తరుణులకు || పల్లవి ||

కొలఁదిలో గూరిములుగొసరుట యింతేకాక
బలిమిసేయుచు నిన్నుఁ బట్టవచ్చునా
వొలిసి నొల్లములైనా వొద్దనే వుండుట గాక
తలఁగ వచ్చునా మరి తరుణులకు || మగ ||

వొట్టినమోహములోడ నొడఁబరచుట గాక
దిట్టతనము.. నిన్నుఁ దిట్టవచ్చునా
యెట్టు సేసినా మరి యిచ్చకమాడుటగాక
దట్టించి మీరవచ్చునా తరుణులకు || మగ ||

మొక్కుచుఁ బ్రియములోడ ముందర నుండుటగాక
వెక్కసమై నీపై తప్పు వేయవచ్చునా
యిక్కువతో శ్రీవేంకటేశ నన్ను నేలితివి
తక్కి యలుగవచ్చునా తరుణులకు || మగ || 521 ||

రేకు 1688 శ్రీరాగం

విట్టు నమ్మించవచ్చునే ఇప్పుడు నిన్ను
చుట్టి చుట్టి రమణుని సొలయవచ్చేను || పల్లవి ||

ముసుఁగు దెరచి నీమో మిత్తఁడు చూడఁగాను
కొసరే విదేమిటికే కొచ్చి కొచ్చి
మొసఁగి పానుపు మీఁద నిందాఁకా విద్దిరించితే
పొసఁగ రతులయలపులవి యాడేవు || ఎట్టు ||

మలఁగుపై నొరగుచు మాటలు నీతో నాడితే (ఁ?)
బలియుచుఁ జూచేవేమే పొంచి పొంచి
కొలువున నిందాఁకా కూచుండి వచ్చితేను
పొలసి యెవ్వతోచింతఁ బొరలే వనేవు || ఎట్టు ||

కడనుం డేతెంచి నిన్నుఁగాఁగిలించి కూడితేను
మెడయెత్తి నవ్వేవేమే మెచ్చి మెచ్చి
యెడయక శ్రీవేంకటేశుఁ డిందాఁకా వచ్చితే
వడఁతి దొరకకుండే పైకొనె వనేవు || ఎట్టు || 522 ||

పాడి

నవ్వేవారి నెఱఁగవు నడుమ నిన్ను
రవ్వచేసి యింతేసి రాజసము చూపేమా || పల్లవి ||

వాసులకే వచ్చేవు వంతులకే పెనఁగేవు
సేసవెట్టితినంటానే చెలఁగేవు
నీసరివారమేకామా నేమెల్లా నాతనికి
ఆ సుద్దు లందరితోడా వాదుకొనేమా || నవ్వే ||

దగ్గరఁ గూచుండేవు దంటమాట లాడేవు
యెగ్గు సిగ్గులు నెంచక యెదిరించేవు
[1] కగ్గవి నవతులముకామా నీకు నేఁడు
వెగ్గళించి వంతములు వెదచల్లేమా || నవ్వే ||

చేవమీరఁ జూచేవు చిరునవ్వు నవ్వేవు
కావరించీతనిఁ గూడి కడు మించేవు
శ్రీవేంకటేశుఁ డీతఁడు చెనకుచు మమ్ము నేలె
యీవేళ మేనరికాన యెమ్మె చూపేమా ॥నవ్వే॥523॥

### ఆహిరి

ఆయనాయ నీ జాడల కడ్డాలాడేనా
రాయడించ కిఁకఁ గాతరాలేల యియ్యెడల ॥ పల్లవి ॥

కలికితనాల లేనికత గడియించనేల
కలసినదాఁకా నెక్కడిసటలే
లలి నింత చాలదా నీ లాగరిచేఁతెల్లాఁ గంటి
కల కల నగక ఇక్కడికి రారాదా ॥ ఆయ ॥

జగడా లదేలే నీ చక్కఁదనాలఁ జూటక
యెగ నక్కేలింతటనే హెచ్చె ననేరా
అగడాయఁ గటకటా ఆడానీడా నీ యాన
తెగనాడఁజెల్ల దిఁక తెరదియ్యరాదా ॥ ఆయ ॥

సరసాన సారెసారె చల్లనికాఁకలె
గరగరఁగా తరగరి తనాలా
ఆరసి శ్రీవేంకటేశ అట్టె నన్నేలితివి
కరకరి యేల చక్కటి నంటరాదా ॥ ఆయ ॥ 524 ॥

### సౌరాష్ట్రం

మనసుకు మనసే మరి సాక్షి
తనివోని తమక మింతటా రానులాయను ॥ పల్లవి ॥

కల గని చెలితోను కామిని యాడుకొనఁగా
కళలు మోమునసెల్లాఁ గడు నిండెను
యెలమి నాకెను నీవు యేమిసేసితివోకాని
పలుకరాక ముదము పచ్చిదేరె నదివో || మన ||

తనతలఁపులోరతి దండవారితోఁ జెప్పఁగ
తనువునఁ బులకలు దట్టమాయను
పొనుఁగనిమీలోనిభోగము లెటువంటివో
పెనఁగకే వలపులు పెనురాఁపు లాయను || మన ||

నిన్నుఁ జూచి మంతనాలు నెలఁతలతో నాడఁగ
చిన్ని నవ్వు సెలవులఁ జిందఁ జొచ్చెను
ఇన్నిటా శ్రీవేంకటేశ యీకె నెంత గూడితివో
యెన్నరాకె[1] నేరుపులు ఇటు వహి కెక్కెను ||మన||525||

## కాంబోది

ఏఁటికి వేఁగిరపడే విప్పుడే నీవు
సూటిగా నిద్దరిదిక్కుఁ జూడఁగరాదా || పల్లవి ||

వెలయఁగ నే వెనక విన్నవించేఁగాని నీకు
చెలరేఁగి యీపెమాట చెప్పనీరాదా
తలకొని మరి నీవు దగవు దిద్దేవుగాని
వెలుచుక సుద్దులెల్లా వినరాదా || ఏఁటి ||

సిగ్గరిదానను మరి సేవలెల్లాఁ జేసేఁగాని
యెగ్గులే సంగతులెల్లాఁ దెలుసుకొనేవుగాని

[1] యెన్నరాకె = ఎన్నుటకు వీలుగాకయే.

దిగ్గన సంగతులెల్లాఁ దేలుసుకొనేవుగాని
అగ్గమై మా కోరికె లడుగరాదా || ఏఁటి ||

కూడితి [1]శ్రీవేంకటేశ గురుతయ్యేఁగాని నేను
ఆడ నాపెఁగూడి గోర నదుమరాదా
జాడతో మాలో మమ్ము సంతము[1] సేసేవుగాని
పాడిపంతా లొండొరులఁ బచారించరాదా ||ఏఁటి||526||

బౌళి

ఇంతటిది గలిగితే పిడేరు వలపులు
వింతతనముగానిదే వెస ఘనురాలు || పల్లవి ||

వొగ్గి రమణుఁడు తన వొడివట్టి తీసినాను
సిగ్గుతోడ నుండినదే చెలియు
కగ్గులేక యాతఁడే కాతరించి పెనకితే
అగ్గమై వోరిచినదే యన్నిటా నేరుపరి || ఇంత ||

కూరిమితోడుతఁ బతి కొంగువట్టి పెనఁగితే
మేరలు మీరనిదే మెలుఁత
కోరి మర్మములెల్లా కొనగోర నంటితే
ఆరీతి నాడుకోనిదే యన్నిటా నేరుపరి || ఇంద ||

కప్పి శ్రీవేంకటేశుఁడు కాఁగిలించి కూడితేను
వొప్పుకొని పాయనిదే వువిద
తప్పక వోచెలులాల తమలో నమ్ముతులైతే
అప్పుడే గుట్టుసేసిన దన్నిటా నేరుపరి || ఇంత || 527 ||

[1] 'శాంత' శబ్దభవము కావచ్చు.

రేకు 1689 సామంతం

నే నటువంటిదాననా నిజమాడేదానను
తా నెట్టైనా నుండుఁగాక తలవంచనేఁటికే || పల్లవి ||

అన్నిటాఁ గొసరితేను అట్టి తనతోనే కాక
కన్నవారితోనెల్లా కారణమేమే
విన్నటమండి తన్ను నిందలాడితి ననీని
వన్నెకాఁడేమిసేసినా వట్టి వెరపేఁటికే || నేన ||

తతిఁ బంతము చూపినా తనవొద్దనేకాక
ఇతరకాంతలవద్ద నేమి గలదే
మితిలేక మాయింట నెమ్మెలు మెరసితిననీ
అతి రాజసపువాని కంత లోఁగనేఁటికే || నేన ||

కదు వలసినా తనకాఁగిటలోననే కాని
యెడసి తెరలో నుండనేమిటికే
బడి నన్ను శ్రీవేంకటపతి కూడిమెప్పిననీ
యెడవాయకున్నవాఁడు యింతవేసా లేఁటికే ||నేన||528||

మాళవిగౌళ

మానటేలా[1] మీరేమైనా మగిడి మగిడి నేఁడు
గోన నానచేసి యేల కొంచేవు నీవు || పల్లవి ||

వేడుకకు నాకె నీపై వెసఁ జాఁచె నింతె చేయి
పాడివంతా లిందుకేల పచారించేవు
ప్రోడగన యాపె నిన్ను భొమ్మల బెంకించితేను
వోడక ఇందుకునేల వొరసేవు నీవు || మాన ||

---

[1] ఇది వ్యావహారికరూపము కావచ్చు.

తమకాన నొకమరి తడవె నింతె మాట
సముకాన సారె నేల సాదించేవు
అమరుఁ గనక ఇంతి ఆయములు ముట్టితేను
ప్రమదాన నింతేసి పరచేవు నీవు || మాస ||

తరుణి అడియాసల తప్పక చూచె నింతె
గరిమ నప్పటి నేల కాఁతాళించేవు
ఇరవై శ్రీవేంకటేశ యేరీతి వాకె మొక్కితే
బెరసి యుప్పటి నెంత పెనఁగేవు నీవు || మాస || 529 ||

## బౌళి

చెలులము నేమైనాఁ జెప్పవలె బుద్ది నీకు
అలుకలు పనిలేవు[1] ఆటుడీఁ బెట్టకువే || పల్లవి ||

మంతనాననున్నవేళ మరి తగదే సిగ్గులు
పంతములాడేటివేళ భయములేల
సంతోషమైనప్పుడు చలపట్టఁగూడదు
రంతుల దూర కతని రమ్మనవే ఇంటికి || చెలు ||

యెదురుఁబడివుండి యేల సాకిరు లడుగ
ఎదుటులు నెరపుతా నొద్దుకోవద్దు
చతురులాడేచోట[2] జగడాలు పనిలేవు
పదరనేల యిట్టె పతి కిచ్చులాడవే || చెలు ||

[1] 'పనిలేవు' అను బహువచనము అరుదుగా లోకమున్నది.

[2] చతురులు = ఎగతాళి మాటలు; ఎత్తిపొడుపు మాటలు, వక్రోక్తులు ఇత్యాదిగా అర్థములలో మాండలికముగా ఈ పదము ప్రసిద్ధము.

కూడితిరి మీ రిద్దరు గుంపెన లిఁకనేఁటికే
యీడైన చుట్టరికాన కెగ్గులేడవే
వేడుకతోడ నిన్ను శ్రీవేంకటేశుఁడు పెండ్లాడె
జాడతో యీతనిమీఁద (ఁ) జల్లవే యీసేసలు ||చెలు||530||

## సామంతం

మమ్ముఁ జూచి నీకేల మఱుఁగులు సేయ నింత
సమ్మతించి ఇఁకనైనా చనవీయరాదా || పల్లవి ||

పరాకున నీవుండఁగా పాదములొత్తినాకె
మరిగి ఇంకనైనా మాటాడరాదా
కరి కరిఁబెట్టరాదు కాఁకల సొలయరాదు
తరుణి వినయానకే దయఁ జూడరాదా || మమ్ముఁ ||

పవళించి వుండఁగాను బాగా లియ్యవచ్చి నాపె
అవల నేమి చూచేవు అందుకోరాదా
జవళి జండెపెట్టదు చలము సాదించదు
జవరాలివ్వాడిగము సారె మెచ్చరాదా || మమ్ముఁ ||

సిగ్గుతోడ నీవుండఁగా చెనకవచ్చి నాపె
యెగ్గులేదు కాఁగిటిలో నెనయరాదా
నిగ్గుల నిట్టె పాగడీ నిన్ను శ్రీవేంకటేశుఁడ
అగ్గవు టలమేల్మంగ నాదరించరాదా ||మమ్ముఁ||531||

## బౌళి

విచారించుకో నీవే వెనకా ముందరా నించి
పచారించి విభుఁడవు[1] పంతమ్మాడవలెనా || పల్లవి ||

---

[1] 'విభుఁడవు' వ్రాయసగాని తప్పు (కా.శ్రీ.)

అండనుండి యిచ్చకములాడేవారము గాక
మెందుకొని నీమాట మీరేవారమా
నిందుకొనఁ బ్రియములు నెలఁతలు చెప్పితేను
కొండవంటిదొరకును కోపగించఁ దగదు ॥ విచా ॥

ననుపుతో మోముచూచి నవ్వేవారముగాక
కినిసి వూరకె తమకించేవారమా
తనవారైన యట్టితరుణులు విర్రితేను
ఘనుఁడైనవానికి కాదనఁగఁదగదు ॥ విచా ॥

సేవలెల్లాఁ జేసి బుద్ధి చెప్పేవారముగాక
వావాత దూరి నిన్ను వంచేవారమా
ఆవేళ నలమేల్మంగనయి నిన్నుఁ బెండ్లాడితి
శ్రీవేంకటేశ నీకు సిగ్గువడఁ దగదు ॥ విచా ॥ 532 ॥

## వరాళి

చెప్పవయ్యా ఇఁక నేమిసేతము మనము నేఁడు
చెప్పరానివలపులు చిగిరించఁ జొచ్చెను ॥ పల్లవి ॥

వేడుకకు వెల దేమి వెన్నెల చేతికి రాదు
ఆడేటిసవతిమాట[1] అందము కాదు
వీడె మియ్యవచ్చేవు విభుఁడవు నీవైతే
నీడనుండే యులసేను నే నిన్నుఁ జూచి ॥ చెప్ప ॥

కోరికె కేడ మొదలు కుచా లెప్పుడుఁ గదలు
నేరుపుతోడియాసలు నిండువెదలు

[1] 'సవతి ఆడేటిమాట' అనుట సహజము.

చేరేవు నీవయితే నేసవెట్టినవాఁడవు
నీరులేక మురిఁగేను నిందుఁ జెమటలను || చెప్ప ||

సిగ్గుల కేడ నెలవు చేకొన నీవు గలవు
అగ్గమైన రతికి కాయమే వొళవు
నిగ్గుల[1] శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
దగ్గరకే కూడితిమి తలఁపులో నిన్నును ||చెప్ప||533||

రేకు 1690 ఆహిరి

ఏమి సేతమె చెలి ఇవి నిన్నేఁపఁగఁ జొచ్చె
నీమగనిఁ దోడితెచ్చే నిమ్మలాన నుండవే || పల్లవి ||

చిత్తజునడిదాలైన చిగురాకులె మేయఁజొచ్చె
హత్తి కోవిలల కెందు నాజ్ఞ లేదు
బత్తిలేక వసంతుని పంటలెల్లా పీటఁ బుచ్చె
కొత్తలైన చిలుకల కొవ్వు మాన్పలేరు || ఏమి ||

పోరుచుఁ జెఱకువింటి పూవులమ్ము లంటఁ జొచ్చె
అరయ తుమ్మిదలకు నాజ్ఞలేదు
నేరుపుతో చందురువెన్నెలలు గ్రోలఁజొచ్చె
టీరపుఁ జకోరాలదింక ముదుపలేరు || ఏమి ||

మదనవేదాలెల్లా మాటల నములఁజొచ్చె
అదె శారికల కెందు నాజ్ఞ లేదు

---

[1] ఈ మూడు, నాలుగు పాదములలో అన్నమయ్య తాను 'అలమేలుమంగ' కాదలఁచిన సంకల్పమును చెప్పకొనెనా? అనిపించుచున్నది. ఈ సంకల్పము యాతనికున్నట్లు పలుతావుల స్ఫురించుచున్నది.

కదిసి యింతలో శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ గూడె
యెదిరించి వీరెల్లా నేమిఁజేయలేరు ‖ ఏమి ‖ 534 ‖

## వరాళి

కలదిది సహజము కాంతలకు
నెలకొని యెటు కృప నించేవో కాని ‖ పల్లవి ‖

నవము లెఱుఁగుదురు నేర్పు లెఱుఁగుదురు
వుపమ లెఱుంగుదు రువిదలు
కపట మెఱుంగరు కాంతుని పొలతురు
యిపుడేఁక నీమన సెటువున్నదో ‖ కల- ‖

కూరిమి మఱవరు కూటమి మఱవరు
వోరువు మరవరు వువిదలు
పోరులు మఱతురు పొరిఁ బతిఁ గలతురు
చేరి యేమి ఇఁకఁ జేయఁగఁగలవో ‖ కల ‖

పొరుగుకు వత్తురు భోగించవత్తురు
వొరిమెకు వత్తురు వువిదలు
వెరవుతోడ శ్రీవేంకటేశ్వరుఁడ
యిరవుగఁ గూడితి వింపుమరేదో ‖ కల ‖ 535 ‖

## భైరవి

ఏఁటికి నన్నెలయించి .యింత చేసేనే । తన-
కూటము. లబ్బినదాఁకా కొలువులు సేసేనే ‖ పల్లవి ‖

తమకించవద్దు గాని· తనపనులు నామేను
చెమరించినందాఁకాఁ జేసేనే

భ్రమయించవద్దుగాని పక్కనఁ దానామీఁద
మమత పుట్టినందాఁకా మాటలాడేవే || ఏఁటి ||

వేసరించవద్దుగాని వేడుకతోఁ దా నాపై
పెనవెట్టినందాఁకాఁ[1] తేరి చొక్కవే
పాసివుండవద్దుగాని బత్తిచేసినందాఁకా
లాసి తనతోనే తొంగలాడేనే || ఏఁటి ||

చలపట్టవద్దుగాని చనవిచ్చినందాఁకా
కొలువులోఁ దొడమీఁదఁ గూచుండేనే
మెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నన్నుఁ గూడె
వెలసినందాఁకాను వేడుకచేసేనే || ఏఁటి || 536 ||

బౌళి

ఏల సాదించేఁ దాను యెఱఁగమి సేసుకొని
వాలాయించి ఆ సుద్దులు వా(వ్రా?) సితినే నేను || పల్లవి ||

మూలనుండి తనతోను ముచ్చటకే యూరకోఁగా
అలకించి వింటినే యిపుడే నేను
కేలిసలుపుచు లోలోఁ గిలకిలనవ్వుకోఁగా
వోలిఁ దమవాకిటనే వుండితినే నేను || ఏల ||

పట్టె మంచముపైఁ దాను పండుండఁగాఁ జెలులను
అట్టె సాక్షిపెట్టితినే యిపుడు నేను
దిట్టలై వెరులు చిక్కుదీసుకోఁగా వాడ కేఁగి
గుట్టున మెలుకసేసుకొంటినే నేను || ఏల ||

---

[1] 'పెనవెట్టినందాఁకా' వ్రాఁతమువాని తప్పు (రా. ప్ర.)

రంగుగఁ దామిద్దరును రతుల నలయఁగాను
అంగములు ముట్టితినే యపుడు నేను
అంగవించి శ్రీవేంకటాధీశుఁడె నన్నుఁగూడె
సంగడి నేసలు పైపైఁ జల్లితినే నేను ॥ ఏల ॥ 537 ॥

వరాళి

ఎందుకైనా నోపుదువు యేల దింకాలాడేవు
మందలించి చెనకితే మానుమనేవా ॥ పల్లవి ॥

పొలుగలయాకె నీతో పంతములే యాడేఁగాని
కాలు దాఁకించితే నీవు కాదనేవా
చేలకొంగు వట్టి నిన్ను సిగ్గులే పరచేఁగాని
వాలాయించి పెనఁగితే వద్దనేవా ॥ ఎందు ॥

తగవెఱిఁగినయాపె తప్పకె చూచేఁగాని
వాఁగి నొట్టువెట్టితే నోపననేవా
అగపడి యిప్పటిని అయములే ముట్టేఁగాని
తగిలి కొప్పువట్టితే తగదనేవా ॥ ఎందు ॥

గక్కనఁ గూడి యాపె కప్పురమె ఇచ్చేఁగాని
వొక్కటై విడెమిచ్చితే వొల్లననేవా
వుక్కున శ్రీవేంకటేశ వూరకె చింతించేఁగాని
వెక్కసాలేమియాడినా వివననేవా ॥ ఎందు ॥ 538 ॥

వాదరామక్రియ

మాచేయట్టి చెలులెల్లా సోద్యమందేరు
చేచేత మీమోహములే చెప్పిచూపేఁగదవే ॥ పల్లవి ॥

పంతము లాతఁ డాడఁగ పక్కన నీవు నవ్వఁగా
వింతగాఁ జెమట వెల్లివిరిసీఁగదె
మంతనపుఁజేఁత లివి మరొక రెఱఁగరాదు
బంతి మీ సరసములు పచ్చి. దేరీఁగదవే || చూచే ||

చేరి యాతఁడు చూడఁగ సిగ్గులు నీవు చల్లఁగా
సారె మోమునఁ గళలు జడిసీఁగదే
తారుకాణఁ బెట్టరాదు తగవు దేరుచరాదు.
కూరిము లిద్దరివిని కుప్పలాయఁగదవే || చూచే ||

శ్రీవేంకటేశుఁ డంటఁగా జీగిఁ జన్నుల నొత్తఁగా
కోవరపుతత్తరాలు గురిసెఁగదే
యీవేళఁ గూడితిరి మిమ్మేమీ ననఁగరాదు
తావుల మీరతులెల్లా దైవారీఁగదవే || చూచే || 539 ||

రేకు 1691 ముఖారి

ఆపెవద్దికేలంపుదు వద్దో మము సారె సారె
కైపుసేతు రాచెలికత్తేల నం (యం?) దరిని || పల్లవి ||

పడఁతి మోనాన నవ్వి పక్కన దాఁచెఁగాని
వొడికాన విన్నపాన కుత్తరమీదు
నడుమ నెట్టుగన్నెర(రు?) ననలు పై వేసెఁగాని
బడి నీవు పిల్చేవంటే పక్కన రాదాయను || ఆపె ||

తగ నిన్నుఁ బేరుకొంటే తల దువ్వుకొనెఁగాని
అగపడి యుండుఁ గొంత యాస చూపదు
అగదుగాఁ బువ్వులగుత్తి యట్టె పై వేసెఁగాని
మగటిమి నీ కమ్మవు మారుగమ్మ పెట్టదు || ఆపె ||

మిక్కుటపుఁ గేల యీగెమి[1] బెల్లగము బెట్టఁగాని
ఇక్కువ నీ సుద్దులకు నేమీ ననదు
అక్కర శ్రీవేంకటేశ ఆకె యలమేలుమంగ
ఇక్కడఁ గూడితివి నీవిటు నిండుకుండెను ||ఆపె||540||

## దేసాళం

చిత్తగించవయ్యా యీ సిరులెల్లాను
హత్తి నీ భాగ్యములే అన్నిటా మెరసెను || పల్లవి ||

చక్కఁదనమే కాదా సతికి సింగారము
చెక్కుటె చెయ్యే కాదా చెలువమెల్లా
నిక్కఁజన్నులే కావా నిండినగంభీరములు
వొక్కటొక్కటే పొగడ నువిదలవసమా || చిత్త ||

చవ్వనపాయమే కాదా జడిగొన్న మోహనము
నవ్వేటి నవ్వులే కావా నానా భోగాలు
పువ్వుల కొప్పే కాదా పొందులెల్లా రేఁచేది
ఇవ్విధాన వర్ణించ నీ తరుణులవశమా || చిత్త ||

కన్నులచూపులే కావా కాఁగిటఁ గూడించినవి
సన్నలమోవులే కావా చవులయ్యేవి
అన్నిటా శ్రీవేంకటేశ అలమేల్మంగైనదికె
మన్ననమీరతు తెంచ మా బోంట్లు నేరుతురా ||చిత్త||541||

## పాడి

ఇటువంటిరమణిని నెంతసేసేవే
అటు నిటు నవ్వఁగాని అలుగఁడుగదవే || పల్లవి ||

---

[1] 'పిగె మెల్లనవానికి' గ్రామ్యవ్యవహారం. (వా. శ్రీ.)

వొడ్డారములాడఁడు వొడివట్టితీసె నిన్ను
  వెడ్డువెట్టె వేఁడుకొంటే వేసరవేలే
  జిడ్డుదేర నీవతనిఁ జేసిన చేఁతల కెల్లా
  వొడ్డించుకొనీఁగాని వోపననఁడుగదే || ఇటు ||

తత్తరించఁ డేమిటికి తములమొసఁగి తాను
  బత్తి నీపైఁ జేయఁగాను పంతించవేలే
  యెత్తినమదాన నీవు యెంత కరకరించినా
  హత్తుకవున్నాఁడు గాని అలయఁడు గదవే || ఇటు ||

చండి చేసి పెనఁగేఁదు సన్నలనే మోవి చూపి
  నిండుఁ గాఁగిటఁ గూడఁగా నివ్వెరగేలే
  అండనె శ్రీ వేంకటేశుఁ డతఁడు నీరతులను
  దండిగా మెచ్చీఁగాని తలఁచఁడు గదవే || ఇటు || 542 ||

## సౌరాష్ట్రం

ఏమని విన్నవించేము యెందాఁకా నీతో
  దోమటి దొడుకవయ్యా తొలుసారె చెలిని || పల్లవి ||

చెప్పరానిమోహము చిత్తములో నున్నది
  కుప్పలించే మదమెల్లా గుబ్బలపైనున్నది
  కప్పిన కాఁకలెల్లాను కాయముపై నున్నవి
  చొప్పుతోనే రావయ్యా చూతువు యీచెలిని || ఏమ ||

ఘనమైన అడియాస కన్నులనే వున్నది
  మునుకొన్న సంతోసము మోముననే వున్నది
  పెనగొన్న మాటలెల్లా పెదవిపై నున్నవి
  కనుగొందువు రావయ్యా కమ్మటి యీచెలిని || ఏమ ||

కడలేనితమకము కాఁగిటిలో నున్నది
చిదుముడి సిగ్గులెల్లా సెలవుల నున్నవి
బడివే శ్రీవేంకటేశ భామ నిట్టె కూడితివి
యెడయకువయ్యా ఇట్టె యీ చెలిని || ఏమ || 543 ||

## పాడి

మాయలేల చూపేవు మాముందరనే
నీయింపు లివియెల్లా నేనెరఁగనా || పల్లవి ||

వేడుకకు నాపె నీపై వేలఁగొని మీఁటితేను
పాడిపంతా లింతలోనే పచారించేవు
యీడ మాముందరఁ గాఁగా యెగ్గులువట్టేవుగాక
కూడి యేకతానవైతే కోపగించఁగలవా || మాయ ||

నవ్వుతా నప్పటి నాపె నంటున బంకించితేను
ఇవ్వల వాసులెంచేవు ఇప్పుడే నీవు
యెవ్వరైఁగా నాడేరంటా యేఁటికో లోఁగేవు గాక
పవ్వళించేపానుపుపై పట్టి పెనఁగేవా || మాయ ||

వలచినయాపై నిన్ను వడిఁ గాఁగిలించితేను
కలసితివి నన్నిట్టె కాతరానను
నిలిచి శ్రీవేంకటేశ నే నలమేలుమంగను
చెలఁగే విట్లా నందూఁ జిత్తగించిమెచ్చేవా ||మాయ||544||

## లలిత

చెలుల మిద్దరికిని సేవలు సేసేవారము
యెలమి నీతలఁ పానతియ్యవయ్య యిఁకను || పల్లవి ||

సోయగపుఁ జూపు చూచి సొంపులు నీకురేఁచి
పాయకున్నది నీవద్ద బడఁతి నేఁడు
మోయరాని మోపులాయ మోహములన్నియుఁగూడె
చేయఁగలవనురికఁ జెప్పవయ్య మాకును ॥ చెలు ॥

తమకపుమాట లాడి తనువుపై చేఁఇ వేసి
ప్రమదమె చల్లీ నీపై భామిని నేఁడు
గుమురులై పులకించె గుట్టున మతి గరఁగి
సముకాన నియ్యవయ్యా చనవులు మాకును ॥ చెలు ॥

సెలవుల నవ్వు నవ్వి సిగ్గులు వలచఁజేసి
మెలఁగుచుఁ గూడె నలమేలుమంగ
చెలరేఁగి వేఁడుకలు శ్రీవేంకటేశ్వర
కలకాలమును మేలే కదవయ్యా మాకును ॥చెలు॥545॥

రేకు 1692 రీతిగౌళ

కోరిన కోరిక లిట్టె కొనసాగక మానవు
నేరుపులెల్లా నేఁడే నించవలెఁగాని ॥ పల్లవి ॥

పొలఁతులెదుట నీవు పొద్దు వోనిమాట లాడి
వలపులు రేఁచితివి వాఁటముగాను
తలవంచుకొని ఇఁకఁ దప్పించుకొంటేఁ బోదు
వెలయు రతుల విఱ్ఱవీఁగ వలెఁగాని ॥ కోరి ॥

సిగ్గువడేవారివద్దఁ జేయరానిచేఁత సేసి
వెగ్గళము నవ్వితివి వేడుకగాను
బగ్గన నింతటిమీఁదఁ బరాకు సేయఁగరాదు
కగ్గులేక రతి కొడిగట్టవలెఁగాని ॥ కోరి ॥

చెలికత్తియలతోడఁ జేరి యేకతములాడి
చిలికితివి యాసలు శ్రీవేంకటేశ
అలమేలుమంగ నేఁడి తొంగాదనఁగరాదు
యెలమి రతికిఁ జనవియ్యవలెఁగాని || కో || 546 ||

శుద్ధదేశి

ఆనతియ్యవయ్యా మాట అమర కోడించుకొని
పీనులారా నే నది విని మెచ్చేఁగాని || పల్లవి ||

వచ్చిదేర నవ్వి నీకుఁ బాదము లొత్తుచు నింతి
విచ్చనవిడి నన్నియు విన్నవించెను
కచ్చుపెట్టి నీవు నట్టె కన్నులా[1] నోరా వింటివి
పెచ్చి ఇందువంకను మేలేమి గంటివయ్యా || ఆన ||

చిమ్ముఁ జూపులనుఁ జూచి చేతివిడెమిచ్చి లేమ
యెమ్మెలఁ దనవలపు లెరుకసేసె
నమ్మతించితివి నీవు సరికి బేసికి నిట్టె
కమ్మర నీకేమి దారుకాణవచ్చె ననియా || ఆన ||

యేకతానఁ గాఁగిలించి ఇట్టె యలమేలుమంగ
దాకొని శ్రీవేంకటేశ తలఁపించెను
ఆకడ నన్నేలితివి అవియు నియ్యకొంటివి
కైకొని అందునా నేమి గట్టుకొంటివయ్యా ||ఆన||547||

పాడి

నే మెఱఁగమా యేమే నీ ముద్దులు
మాముందరనే యెంత మాయలు సేసేవే || పల్లవి ||

[1] నోరా=నోటిమంచి వచ్చినట్టిమాటలను

బలిమిఁ గొంగువట్టితే పంతానకే పెనఁగేవు
చలమేల పతితోను సతులకును
తలఁపులో వలపులు దట్టమైవుండఁగాను
వెలిబింకాలేల పెంచి వింతలు సేసేవే || నేమె ||

చెక్కు నొక్కి వేఁడుకొంటే సిగ్గులనే పొరలేవు
వెక్కసమింత యేఁటికే విభునితోను
పుక్కిట నీముచ్చటలు పురవురమునఁగాను
మొక్కలపుగుట్టుతోడ మోనమేల చూపేవే || నేమె ||

నంటునఁ గాఁగిలించితే నవ్వులే నవ్వేవు
వెంటనే వేసాలేల శ్రీవేంకటేశుతో
యింటనే యులమేల్మంగ వితనాలవైయుండఁగా[1]
దంటతనముల నెంత తరితీపు సేసేవే || నేమె || 548 ||

## వరాళి

తగదని చెప్పరే తరుణులాల
వెగటుఁ జేఁతల లేనివేసాలు చేసీని || పల్లవి ||

సుద్దులడిగినవాఁడు సారిది వినవలదా
వొద్దిక నేఁ జెప్పఁ బోతే నొద్దుకొనీని
అద్దుకొని తనమర్మమందు నేమైనా నున్నదా
పొద్దువోక తానే మాటపోలిక లెంచీని || తగ ||

సన్నలు చేసినవాఁడు సనవియ్యవలదా
చెన్నలర నే నంటితే సిగ్గువడీని

[1] వితని + అలవు

యెన్నరానిగిరిగింత లేమైనా నందున్నవా
తన్నుఁదానే విఱ్ఱవీఁగి తప్పించుకొనీని ॥ తగ ॥

చేరఁ బిలిచినవాఁడు చెక్కు నొక్కవలదా
తారి గుబ్బల నొత్తితేఁ దప్పించుకొనీ
అరీతి శ్రీవేంకటేశుఁ డలమేలుమంగ నేను
నేరుపుతో నన్నుఁగూడి నీటులు చూపీని ॥ తగ ॥ 549 ॥

## నాదరామక్రియ

నీవు మగవాఁడవు వెరజాణ వన్నిటాను
యే విధాన మన్నించినా నియ్యకొనేవారము ॥ పల్లవి ॥

యెక్కువ తక్కువలై యెటువలె నుండినాను
చక్కనే నీమాఁటలు సబలోనను
వక్కణ లడుగనేల వంకలొత్తి దిద్దనేల
నెక్కొని యాచరితలు నీకే తెలుసును ॥ నీవు ॥

నించిన చలముతోడ నేరిచినా నేరకున్నా
మంచివే నీచేఁతలు మహిమీఁదను
పొంచి యివి చూడనేల పోలిక వెదకనేల
అంచ నెట్టైనా నీ కన్నియు నమరుమ ॥ నీవు ॥

చెంది యెగసక్కేలైనా చిత్తము వచ్చినవైనా
అందములేని నవ్వులు అతివలకు
నిందలేల శ్రీవేంకటనిలయ వన్నేలితివి
కందువ విదెల్లా నీకుఁ గలిగినగుణము ॥ నీవు ॥ 550 ॥

## మంగళకౌశిక

వట్టికాతరాన నీవు వసివాడే రింతేకాక
చుట్టరికము నెరపి సొంపులెల్లా రేంచద || పల్లవి ||

చెప్పినట్టు సేసేనని చిత్తము నీ సొమ్మని
అప్పుడే విన్నవించదా ఆపె నీతోను
యెప్పుడు నలుగనని యిచ్చకము సేతునని
ముప్పిరి నొడంబరచి మోహమెల్లాం జూపదా || వట్టి ||

తానే నీవై యుండేనని దక్క వలచితినని
ఆనలెల్లాం బెట్టదా ఆపె నీతోను
మానలేనిపొందులని మఱంగులు వెట్టనని
కానుకలు నీకు నిచ్చి కదు బత్తి సేయుదా || వట్టి ||

వెంగెములాడనని వెన నిన్నుం బాయనని
అంగజ కేళిం గూడదా యాపె నీతోను
రంగుగా శ్రీవేంకటేశ రతికెక్క చనవని
సింగారించుకొని వచ్చి సేసలెల్లాంబెట్టదా || వట్టి || 551 ||

రేకు 1693 హిజ్జిజి

ఏల మమ్ము నొరసేవు యేలికవు నీవు మాకు
కోలుముందుగా మేలుకొద్ది చుట్టరికము || పల్లవి ||

మన్ననగల కొలందే మందెమేళమంతయును
చన్నులు వచ్చినయంతే జవ్వనము
కన్నులు గొప్పలయితే మొగము చక్కనై మించు
విన్నవించే నేర్పుగలితే వీనుల కింపౌను || ఏల ||

బలిమిగలయంతే పంతమెల్లా నీదేరు
వలచిన పాటే వాడికయును
సెలవినవ్వులలోనే చేఁతలెల్లా నేరుపడు
పిలుపులు చవులైతే ప్రియములు నాటును ॥ ఏల ॥

వేడుకతోడి లంకె వెక్కసపుఁదమకము
వ్వాడిగమెంత అంతే వుబ్బుఁజెమట
కూడితివి నన్ను నేఁడు కొంకక శ్రీవేంకటేశ
యీడైనరతులైతే యిచ్చకమై వుండును ॥ ఏల ॥ 552 ॥

## ఆహిరి

ఏమని చెప్పదుమయ్యా ఇంతి నీపైగల బత్తి
నేమానఁ బూనుక వచ్చి నీకుఁ గానేయిపుడు ॥ పల్లవి ॥

నిడువాలుఁ జూపు చూచి నీమనసు నాటెనని
పొడిఁబడే నంతలోనె పొలఁతి
కదునవ్వఁగా నీకుఁ గాఁక రేఁగెనోయని
వుడివోని తలపోఁత నుస్సురసీని ॥ ఏమ ॥

మచ్చిక మాటాడి నీమర్మము సోఁకెనోయని
కొచ్చి కొచ్చి లోలోనె కొంకీఁ జెలి
తచ్చి గుబ్బల నొత్తఁగా తనువు నొచ్చెనోయని
విచ్చనవిడె నవ్వడే వెరగందీని ॥ ఏమ ॥

నిన్ను వేగినంతాఁ గూడి నిద్దురలేదోయని
కన్నులు దేలగింపుచుఁ గాఁతాళించీని
ఇన్నిటా శ్రీవేంకటేశ యీపె నీవురమెక్కి
నన్నలా చాయలా నీకు సారె మొక్కీని ॥ ఏమ ॥ 553 ॥

## ముఖారి

ఎట్టు నేరుచుకొంటివే యెమ్మెలెల్లాఁ జూపఁగ
పెట్టిరా వెన్నతోడను పిన్ననాఁడే మీవారు ॥ పల్లవి ॥

ఇద్దరి మన తగవు దిద్ది తేరిచినవాఁడు
వొద్దనే వున్నాఁడుగదే వువిద
పెద్దరికే లింతులతో బెట్టుగా నాడుకొనేవు
సుద్దులు నీచేత విని సోద్యమయ్యీఁగదవే ॥ ఎట్టు ॥

జంటై మనమాటలకు సాకిరియైన చెలులు
వింటా నున్నారు గదవే వెలఁది
వెంటనే నే జాణనంటా వికవిక నవ్వేవు
కంటిమి నీగుణములు కతలాయఁగదవే ॥ ఎట్టు ॥

కందువ నిన్నూ నన్నుఁ గాఁగిటఁ గూడినవాఁడు
యెందును శ్రీవేంకటేశుఁ డితఁడే కదే
ముందే దొరతనాన మురిపెము చూపేవు
అందిపొంది నీవేసా లగడాయఁగదవే ॥ ఎట్టు ॥ 554 ॥

## కాంబోది

ఎటువంటిదాననే యేమే నీవు
సటలు నేసే వాతఁడు చనవియ్యఁగాను ॥ పల్లవి ॥

కన్నులనే సొలసేవు కాఁకలనే యలసేవు
మన్నించి యాతఁడు నీతో మాటలాడఁగా
నన్నలనే వొరసేవు సముకాన బిరసేవు
మిన్నక యుప్పటిఁ దాను మించి నవ్వఁగాను ॥ ఎటు ॥

కూరిములు గొసరేవు కుంచెవట్టి విసరేవు
చేరి యాతఁడే నిన్ను జెనకఁగాను
నేరుపులు చూపేవు నెపములే మోపేవు
కోరి నీకు విడెము గక్కున నియ్యఁగాను || ఎటు ||

పంతములే యాడేవు పదములు పాడేవు
యింతలో శ్రీవేంకటేశుఁ డెనయఁగాను
సంతోసాలు నెరపేవు చవులెల్లాఁగరపేవు
బంతినే రతులు తాను పచారించఁగాను || ఎటు || 555 ||

సాళంగం

చేకొని వ్రాడిగాలెల్లాఁ జేయింపుకొనవయ్యా
యీకడఁ గొలువవచ్చె నిదివో నిన్నును || పల్లవి ||

పంతగాఁడవై వొంటె నీపానుపుపై నుండఁగాను
మంతనమాడవచ్చెను మగువ
చెంతల నీ మేనెల్లాఁ జెమరించియుండఁగాను
ఇంతలో విసరవచ్చె నిదివో నీకును || చేకొ ||

గరిమతో సంతోసానఁ గదుమించి నీవుండఁగా
సరసములాడవచ్చె సకియ
తరుణలపైఁ గాంక్ష తలపోయుచుండఁగాను
అరుదుగా నిన్ను బెండ్లాడవచ్చె నిపుడు || చేకొ ||

ఆదిగొని నిద్రలేచి ఆనందాన నుండఁగాను
పాదము లొత్తఁగ వచ్చెఁ బడఁతి
యీదెస శ్రీవేంకటేశ ఇంతి నిట్టె కూడితివి
మోదముతోడుత నీకు మొక్కవచ్చెఁగూర్మిని ||చేకొ||556||

పాడి

ఇంతకంటె నేమిసేతు విఁక నీవు
పంతము చేకొంటివి పడఁతిచే నీవు || పల్లవి ||

వచ్చి వచ్చి నిన్నుఁ జూచి వలపులఁ గొసరఁగ--
నిచ్చితివి చనవు నీ వింతికిని
పచ్చిదేర నప్పటని పానుపుపైఁ గూచుండి
మచ్చికనుద్దులు విని మరుగఁజేసితివి || ఇంత ||

సారె సారె జూజమాడి సరిఁ బొద్దుఁ గడపక
చేరి మన్నించితి విట్టె చెలియను
గారవించి యిప్పుడును కాయము గాయము సోఁక
పేరడి నీతో సరి పెనఁగఁజేసితివి || ఇంత ||

కూడి మాడి నీకాఁగిట గురుతులు ధరించఁగ
వోడక దొరఁ జేసితి వువిదను
యీడనె శ్రీవేంకటేశ యిట్టె నవ్వు నవ్వుచు
వేరుకైనరతులను వెలయఁజేసితివి || ఇంత || 557 ||

రేకు 1694 శుద్ధవసంతం

అప్పటి నీ సుద్దులెల్ల అడుగఁ బుత్తెంచె నన్ను
తప్పకచూచినవాఁడు తాఁగాఁడా || పల్లవి ||

నగుతా నందకు వచ్చి నాకు నాపెకును
తగవు చెప్పినవాఁడు తాఁ గాఁడా
జిగిమాపయ్యెద లంటి సిగ్గుల నేము నవ్వఁగ
అగడు సేసినవాఁడు అప్పటి తాఁగాఁడా || అప్ప. ||

జమళిపాముమీఁద పరపాన వాఁపె నన్నుఁ
దమిరేఁచినవాఁడు తాఁగాఁడా
ప్రమదాన విద్దరికి వంతములు సరిచేసి
తములమిడినవాఁడు తాఁగాఁడా || అప్ప ||

అరసి యక్కచెల్లెండ్లమైనమ మ్మింతలోనే
సవేర్చి కూడివాఁడు తాఁగాఁడా
యిరవై శ్రీవేంకటేశుఁ డింటిలోననే వుండి
తిరమై మన్నించివాఁడు దేవుఁడు తాఁగాఁడా ||అప్ప||558||

ముఖారి

ఏల నాను లెక్కించేవు యెరఁగవా నీవేమైనా
గలిసేసితే[2] నేమైనాఁ గేరడమే కాదా || పల్లవి ||

వంతమాడరాదుగాక బలువైన నా చన్నులు
యెంతటి కొండలకైనా యెక్కుడే కాదా
వంతువెట్టరాదుగాక వాఁడినా కనుచూపులు
కంతునియమ్ములకంటె కరు వాఁడిగావా || ఏల ||

సరివెట్టరాదుగాక సంతతము నాతురుము
గరిమఁ జీఁకటికంటె ఘనమే కాదా
పురుడించరాదుగాక పొందైన నాకరములు
పొరిఁ దీగెలకంటె నబ్బురములే కావా || ఏల ||

రట్టు సేయరాదుగాక గుట్టున నాపిరుఁదులు
తొట్టి పులివాలకంటె దొడ్డలే కావా

---

[1] 'గెలిసేసితే' వ్రాయుటలో తప్పు (రా.శ్రీ.)

ఇట్టె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
మెట్టిన మనపొందులు నేరుపులే కావా || ఏలి || 559 ||

బౌళి

ఇప్పటివేడుకే చూచి నిదివో తాను
అప్పటప్పటికి తన కాడికలై వుండవా || పల్లవి ||

చేతులారాఁ జేసేచేఁత చెప్పితే సిగ్గయ్యీ వాకు
అతనినే యడుగరే అతివలాల
కాతరపు మగవాఁడు కాదు గూడదనరాదు
యీతల నెవ్వతె విన్నా నేతువలెత్తేఁడరా[1] || ఇప్ప ||

నోరునిండా మాటలాడె నాడుగరా దందరిలో
చేరి పతి నడుగరే చెలులాల
దూరినా నియ్యకొనఁడు తూరవలచినవాఁడు
కారణాలు చెప్పఁబోతే కడవారు నవ్వరా || ఇప్ప ||

అక్కు మోవఁ గాఁగిలించె నట్టె వెరగయ్యీని
మొక్కి తన్ను నడుగరే ముదితలాల
ఇక్కువ శ్రీవేంకటేశుఁ డితఁడే నన్నుఁ గూడె
తక్కక ఇందు కిందరు తప్ప కిట్టె చూడరా ||ఇప్ప||560||

కాంబోది

తరుణిచేసిన చేఁత తగవే కాదా
సరికి బేసికి నిన్నుఁ జలము సాదించెను || పల్లవి ||

ఇట్టె కానుకిచ్చి యూకె యెదుటనే వుండఁగాను
కట్టుఁగడ యూపెనే చక్కఁ జూచేవు

[1] ఏతువలెత్తి + అడరా

దిట్టగనక యీకె నీ దిమ్మరి చేఁతలకు వేఁతఁ
బట్టిన నిమ్మపండు నీపై నిట్టె వేసెను ॥ తరు ॥

కేలువట్టుకున్నయీపె కిలకిల నవ్వఁగాను
మూలనున్న యీపెతోడ ముచ్చటాడేవు
తాలిమి గలదిగాన తగ నీ పరాకు దేర
కోలుముందుగా నిన్ను కొనగోర నొత్తెను ॥ తరు ॥

పోదిఁ గాఁగిలించినాపె పొంతనే వుండఁగాను
పాదమొత్తేయీపెను గొబ్బన గూడేవు
యీదెస శ్రీవేంకటేశ యీకె నేరుపరిగాన
మొదమున నీకు నిట్టె మొక్కుమొక్కి కూడెను ॥తరు॥561॥

పాడి

నీవేల జంకించేవు నెలఁతలదిక్కు చూచి
కావరించి సవతులు కాఁతాలించవలదా ॥ పల్లవి ॥

సంగడి నుండి నీతో సరస మాకె యాడఁగా
అంగనలు దూరి నిన్ను నాడకుందురా
సింగారాలు చూపి చూపి చలరేఁగుచుండఁగాను
కొంగువట్టి తీసాకెతో[1] గుంపెంచకుందురా ॥ నీవే ॥

కొసరుచు నాకె నిన్ను కుచముల నొత్తఁగాను
కసరి యింతులు గొణఁగక వుందురా
మిసిమి దనసరిగె మెరయుచునుండఁగాను
పసగాఁ జేతులు చాఁచి పంతమాడ కుందురా ॥ నీవే ॥

[1] తీసి + ఆకెతో

కందువనుండి నిన్నాపె కైవసమై కూడఁగాను
అంది చెలులెల్లా సొలయుకవుందురా
ఇందుకె శ్రీవేంకటేశ ఇంతులెల్లాఁగలసెరి
ముందరియాపెను ఇట్టె మోచి దించకుందురా ||నీవే||562||

## లలిత

ఔలే నిజము నిష్ఠూరమందురు లోకమువారు
నీలాగులు దడవితే నేఁడు సిగ్గయ్యీనా || పల్లవి ||

పచ్చల వోవరితోన బంగారు పీఁటల మీఁద
పచ్చిదేర నవ్వదా పడఁతి నీతో
తచ్చి నన్నెంత చూచేవు తలఁచుకో ఇంకా నీవే
అప్పటి సుద్ది చెప్పితే నాయములు సోఁకెనా || ఔలే ||

పరగఁ దెరమాటున పక్కనే పవళించి
సురటి విసరదా సుదతి నీకు
అరుదందనేల నీలో నన్నియును తెలుసుకో
ఇరవుగాఁ జెప్పితేనే యెగసక్కె మాయునా || ఔలే ||

వుడివోని నీకాఁగిట వొద్దికైన రతులను
బడివాయక కూడదా భామం(ల?) తోను
అడరి శ్రీవేంకటేశ అట్టె నన్ను నేలితివి
వడి నిన్ను మెచ్చితేనే వలపులు రేఁగెనా || ఔలే || 563 ||

రేకు 1695

## రామక్రియ

ఈపెను గలుగుటింక మేల నీవు లేదాయు
మాపుదాఁకా నీవెంత మనసు చూచేవు || పల్లవి ||

వొడ్డాఁ బెట్టా మాటలాడె వువిద జంకించఁగాను
వెడ్డువెట్టె నీవెంత వేఁడుకొనేవు
వడ్డివారీనా ఆపె వలపులేమైనాను
యెడ్డవై నేఁడాఁట దానికేల కిందుపడేవు ॥ ఊపె ॥

సరికి బేసికి నింతి చలము సాదించఁగాను
అరుదుగా నింతేసి ప్రియాలు చెప్పేవు
గరివడీనా తనకందువైన ననుపెల్లా
మరిగి యిల్లాలికేల మతిలోఁ గొంకేవు ॥ ఊపె ॥

కోరి వేఁడియాపె నిన్ను కుచముల నొత్తఁగాను
సారె సారె నీ వెంత చనవిచ్చేవు
యీరీతి శ్రీవేంకటేశ యేలితివి నన్ను నేఁడు
చేరి పెండ్లికూఁతు కెంత సేసేవు చవులు ॥ఊపె॥564॥

కేదారగౌళ

నేఁడు నాభాగ్యమే కాదా నీ చిత్తము వచ్చినది
పోఁడిమి నిందుకుఁగానే పొగడేము నిన్నును ॥ పల్లవి ॥

యెవ్వతె బుద్ధి చెప్పెనో ఇంటికి వచ్చి వాతోను
నవ్వి సరసమాడేవు ననుపుగాను
రవ్వైతి నన్నేలుమని రాయంచేఁ జెప్పిపంపితి
చివ్వన నిన్నాళ్లు వచ్చితివా ఇయ్యేడకు ॥ నేఁడు ॥

యేమి దలఁచుకొంటివో ఇట్టె నన్నాదఁబరచి
కామించి చూచేవు నన్నుఁ గాతరాననను
వేమారు నిన్నా మొన్నా విన్నపాలెల్లాఁ జేసితి
ప్రేమాన నిట్లాఁ దొల్లి పెట్టితివా సేస ॥ నేఁడు ॥

మనసెట్టు గలిగెనో మమకరించి[1] నీవు
యెనసితి విటుఁ నన్ను ఇంతలోననె
అనువై శ్రీవేంకటేశ ఆసపడె నేమం[illegible]
తనిసె నెందుండే యెపుడు [illegible]వా || నేఁడు || 565 ||

## పూర్వగౌళ

తానేల యెగ్గులువట్టీ తనమన సెరుఁగును
యే నెపమూ నెంచను యీడకు రమ్మనవే || పల్లవి ||

సవతిపై కాఁకల వేసారి తను దూరితి
వివరించి చూచుకొంటే వింతా తాను
సులిగించినాఁడందుకు పక్కన జిన్నఁబోయి
ఇవలఁ దా మంచివాఁడే యీడకు రమ్మనవే || తానే ||

ఆకె యెమ్మెలెల్లాఁ జూచి అరడి తనుఁ బెట్టి
పైకొని తెలుసుకొంటే పగలా తాను
దాకొని బాసలుచేసి తనలోనే కరఁగుచు
యేకపోఁ దనకునేల యీడకు రమ్మనవే || తానే ||

అక్కతోడి వరసలు నట్టె తన్ను నాఁగితి
ఇక్కువఁ దలఁచుకొంటే యెరవా తాను
చిక్కి నన్నుఁ గూడినాఁడు శ్రీవేంకటేశ్వరుఁడు
యిక్కడా నక్కడా నేల యీడకు రమ్మనవే ||తానే||566||

---

[1] 'మమకారము' 'మమకరమై' దానిపై నేర్పడిన వింత నామధాతువు. సంబంధము లేకున్నా 'మమకరించి' వలె కాదోలు.

## భైరవి

వేడుకకాఁడవు నీకు వెరపేఁటికె
యీడువెట్టి నీ సుద్దుల కేమి వినవుమయ్యా || పల్లవి ||

ఇంటిలోన నాకె మాట యేమని చెప్పెనో నీకు
వెంటవెంట వచ్చి నన్ను వేఁడుకొనేవు
దంటమైనవాఁడవు దైన్యమేఁటికె నీకు
గొంటు నీసుద్దు లెవ్వలెకునుఁ జెప్పవయ్యా || వేడు ||

సరుగన నాకె యేమి సన్న సేసెనో నీకు
అరుదుగా నన్నుఁ గడు నాదరించేవు
ఓరుదుగలవాఁడవు ప్రియము చెప్పఁగనేల
మెరవుల నీసుద్దు లేడాఁ దడవుమయ్యా || వేడు ||

ఇప్పు డిట్టె యూపె గుణమేమి నేర్చెనో నీకు
కుప్పళింపు జెమటతోఁ గూడితి నన్ను
వొప్పు శ్రీ వేంకటేశుఁడ వొద్దుకోనేఁటికె నీకు
కప్పి నీసుద్దులు నే మగడు నేయుమయ్యా ||వేడు||567||

## వరాళి

ఎలిమి నీరమణుఁడు ప్రియము చేకొనఁగదె
కొలచితేఁ దమకము కుప్పలై నిలుచును || పల్లవి ||

ఇచ్చకమెఱఁగనట్టి ఇంతి పొందు నేసేతేను
మచ్చరము రేఁగును మగవానికి
విచ్చనవిడె నూరకె వెంగెములే యాడితేను
వచ్చి వచ్చి యేడాలేనివాసులే పుట్టును || ఎలి ||

చెంతనుండి కూడని చెలితోడ నవ్వితేను
పంతములే మిగులును పతివద్దను
రంతుచేసి యేకతాలు రచ్చలవేసితేను
చింతతోడ మిగులును సిగ్గులే వెరపును || పెరి ||

సమ్మతించఁజాలనిసతిఁ గాఁగిలించితేను
యెమ్మెలే మించు శ్రీవేంకటేశునకు
కమ్మి యాతఁడె నన్నేలె కతలిట్టె చెప్పితేను
నెమ్మిన మలరఁ గడు నెయ్యములే పుట్టును ||పెరి||568||

## కాంబోది

ఏఁటికిఁ బొడిఁబడేవు ఇంతమనికితముతో
సూటిగా వినేవారు చూచి ఇట్టె నవ్వరా || పల్లవి ||

కలలో నెవ్వతో నిన్నుఁ గాఁగిలించుకొనెనంటా
వెలయు మాతోఁ జెప్పేవు వేసాలకు
కలికిపై వల పెంత గలిగినవాఁడవు
తొలుతె కాళ్లకు మొక్కి తోడి తెచ్చుకోరాదా || ఏఁటి ||

తరుణి యెవ్వతో నీ తలఁపునఁ బారెనంటా
తెరలి మాతోఁ జెప్పేవు కేరడాలకు
మరిగి యాపెమీఁదను మచ్చిక గలవాఁడవు
ఇరవుగా బాస ఇచ్చి ఇంటఁబెట్టుకోరాదా || ఏఁటి ||

దేవులు యెవ్వతో నేఁడు దిష్టముగాఁ గూడెనంటా
శ్రీవేంకటేశుఁడ నన్నుఁ జేరి కూడేవు
తావున నాపెపై నింత తగులుగలవాఁడవు
[illegible] || ఏఁటి || 569 ||

రేకు[1] 1696 వరాళి

నాకేల లోఁగేవు నడుమ నీవు
పైకొని నే నిందుకుఁగా పచారించేనా || పల్లవి ||

కలికిఁ బొరుగావెనుఁ గని నామోము చూచేవు
వలచి తెచ్చుకోఁగాను వద్దనేనా
మొలకచన్నులు గదుమొనలంటాఁ బొగడేవు
కులికి పట్టిచూడఁగా కోపగించేనా || నాకే ||

సారె నాపె నవ్వఁగాను సన్నలఁ జూపవచ్చేవు
చేరి కాఁగిలించుకోఁగా చేయువట్టేనా
చేరఁ దీసి కన్నులంటా చిత్తగించి భ్రమసేవు
అరసి పెండ్లాడఁగా నేఁగాదనేనా || నాకే ||

వెస నాపె మాటాడఁగా వినుమని నన్ననేవు
వసముచేసుకోఁగాను వారించేనా
కొసరి శ్రీవేంకటేశ కూడితివి నన్ను నిట్టె
పసగాఁ జనవియ్యఁగా పంతమాడేనా || నాకే || 570 ||

మాళవిగౌళ

ఇంతిపైఁగలుగు బత్తి ఇఁక మాకుఁ జెప్పనేల
వింత నీ నవ్వులలోనే వెసఁ గానిపించెను || పల్లవి ||

గాఁటమై మాచెలిమీఁదఁ గలిగిన మోహమెల్లా
తేటలవిమోము చూచే తెలిసె మాకు

[1] ఈ రేకు రెండవ ప్రక్క 'లాళి' రాగము పాట 1, 2 చరణాల మధ్య కొంతము పెట్టెపైకి లేచినది. అక్షరములకు ఇబ్బందిలేదు.

తాటించి నీ మనసులో తమకములెల్లాను
మాటలు నీవాడేయందే మరి తెల్లమాయను || ఇంతి ||

మలసి యాసకియును మన్నించేమన్ననలెల్లా
తిలకించి చూచినందే దిష్టమాయను
కలకాలమును నీవు కైవసమై వుండేదెల్లా
పలుమారు నీవున్నభావాననే తోఁచెను || ఇంతి ||

అప్పటి నీవాదరించే ఆదరము లెల్లాను
కప్పురమీఁగానే యెరఁగఁగ వచ్చెను
ఇప్పడిట్టె శ్రీవేంకటేశ ఇంతి నేలితివి
వొప్పలు నీరతులలో నొగి సరివచ్చెను || ఇంతి || 571 ||

## పాడి

మమ్మేల సాదించేవు మాటెమాటకి
యెమ్మెల కాతఁడే నీ యెదుట నుండఁగను || పల్లవి ||

బలిమిగలదానవు పంతాన మగనితోనే
పిలిచి సాములునేసి పెనఁగవమ్మా
చెలఁగి మాపైనేల చేతులు చాఁచేవు నీవు
కొలఁదిమీర నాతఁడే గురి నీవుండఁగాను || మమ్మే ||

బింకముగలదానవు బిగిసి యాతనితోనే
సుంకుమోపి నీవుదుటు చూపవమ్మా
మంకు నీపెద్దరికాలు మాతో నింత యేమిటికి
వంకలొత్త నాతఁడే నీవద్దనుండఁగాను || మమ్మే ||

నేరుపరిదానవు నేఁడు శ్రీవేంకటేశుతో
 కూరిమిఁ గాఁగిట నించి కూడవమ్మా
 పారె నన్నేలె నితఁడు సలిగెలు నెరపేవు
 పోరచి నాతఁడే నీకు బుద్ది చెప్పఁగాను ||మమ్మే||572||

ఆహిరి

నీమనసెట్టున్నదో నే నెరుఁగను
 గామిడైనా నాయఁగాని కాంతలో నవ్వితిని || పల్లవి ||

సంగడి జాణతనాలు సతి నీతో నాడఁగాను
 వెంగెమైనా నాయఁగాని వింటానుంటిని
 సంగతిగా నెలుఁగెత్తి సారె నిన్నుఁబాడఁగాను
 పంగెనైనా నాయఁగాని పైపై మెచ్చితిని || నీమ ||

ఆసరేఁచి ఆకె నీ యాయాలు ముట్టఁగాను
 దోసమైనా నాయఁగాని తొంగి చూచితి
 వోసరించ కప్పుడే నీ వూడిగాలు సేయఁగాను
 వేసాలైనా నాయఁగాని వేడుకపడితిని || నీమ ||

నెమ్మది శ్రీవేంకటేశ నిన్ను నాకె గూడఁగాను
 యెమ్మెలైనా నాయఁగాని ఇయ్యకొంటిని
 కమ్మర నన్నేలితివి కందువ కాపె రాఁగాను
 దొమ్మిమైనా నాయఁగాని తొల్లె రమ్మంటివి ||నీమ||573||

రామక్రియ

నీవంటి వలపే కాదా నెలఁతలకెల్లాను
 కావరించి సవతులఁ గాకు సేతురా || పల్లవి ||

రవ్వలేలసేసేరే రమణుని తోడత
అవ్వల నెవ్వతో మొక్కె నాతనికంటా
యివ్వలఁ గొలువులు నీ విత్తనికిఁ జేసేవేళ
నివ్వటిల్ల నాపెవచ్చి నిన్ను వెంగెమాడెనా || నీవం ||

వంతములేలాడేవే పైకొని నీ వితనికి--
నింతలో నెవ్వతో విడెమిచ్చె నంటాను
కాంతవు నీ వితనికిఁ గాఁపురము సేసేవేళ
సంతనాన నాకె నీతో మచ్చరించ వచ్చెనా || నీవం ||

సెలవినేల నవ్వేవే శ్రీవేంకటేశ్వరుని
లలి నెవ్వతో యీతని లాలించెనంటా
కులికి మీ రిద్దరునుఁ గూడి రతిసేసేవేళ
చెలఁగి యీపె మిమ్ము సిగ్గులు వరచెనా ||నీవం||574||

పాళి

ఏఁటికిఁ బంతాలాడేవు యిప్పుడు మాతో
గాఁటవు నీ బలిమెల్లాఁ గానవచ్చె నిపుడె || పల్లవి ||

మచ్చిక నీకాఁగిటికి మనసుపెట్టినయీకె
కొచ్చి కొచ్చి యెప్పుడునుఁ గూడకుండీనా
కచ్చుపెట్టి సారెసారెఁ గానుకలిచ్చిన యీపె
చొచ్చి మట్టరికమెల్లాఁ జూపకుండీనా || ఏఁటి ||

చలముమెరసి నీతో సన్నలు చేసిన యీపె
సులభాన మోవి చవిచూడకుండీనా
వలపులు నీ మీఁద వదలక చల్లినాపె
చలివాయ నీపైఁ జేయి చాఁచకుండీనా || ఏఁటి ||

ననుపున నీ వద్ద నవ్వులు నవ్వినయాపె
అనువుగా నిన్నుఁ బెండ్లియాడకుండీనా
యెనసితి విటు నన్ను యిదివో శ్రీవేంకటేశ
కొనగొనలనే తానూఁ గొసరకుండీనా || ఏఁటి || 575 ||

## రేకు 1697 సామంతం

ఆయనాయ నుండరే యంగనలాల
పాయకువాని నంతేసి పరచఁగఁగలనా || పల్లవి ||

నిచ్చ నిచ్చ నాతనిపై నేరము లెంచేదాననా
మెచ్చి మెచ్చి వలపుల మెరతుఁగాక
రచ్చవేసి చెలులెల్లా రమణుని నాడేరేమే
విచ్చనవిడె నవ్వెల్లా వినఁగలనా || ఆయ ||

సారెసారె నాతని జరసేటిదాననా
చేరిచేరి కాఁగిటఁ జేకొందుఁగాక
తారుకాణఁ బతి నెంత తప్పు లెంచే రిదియేమే
వూరకే నే నిందుకుఁగా వొడ్డారించఁగలనా || ఆయ ||

నవ్వి నవ్వి శ్రీవేంకటనాయకుఁ దిట్టేదాననా
తవ్వి తవ్వి రతులెల్లా దాటింతుఁగాక
ఇవ్వల నన్నుఁ గూడెను యీతని సాదించేదేమే
వువ్విళ్లూర మీ బుద్ధుల కొడఁబడఁ గలనా ||ఆయ||576||

## దేసాళం

మగువలఁ జేకొనక మానవచ్చునా
నిగిడి సరసముల నేరుపరి యితఁడు || పల్లవి ||

దప్పిదేరి మోవినంటా తప్పులెంచనేఁటికే
కొప్పు జారెనంటాఁ బతిఁ గొసరనేలే
రెప్పలు దేలించెనంటా రేసులు చూపకువే
యెప్పుడుఁ బదారువేల నేలినవాఁడతఁడు || మఁగఁ ||

వాడె నలమోమనుచు వక్కణ లడుగకువే
తోడఁ జెమరించెనంటా దూరకువే
వేడుకకాఁడనుచు వెంగెము లాడకువే
మేడెపు గొల్లెతలకు మేఁటి మగఁడతఁడు || మఁగఁ ||

నిట్టూర్పు లేడవని నేరము లెంచకువే
వొట్టేఁ బులకలనుచు నొరయకువే
పట్టపు దేవుళ్లను బహుసతిజనులను
వెట్టలేక కూడేటి శ్రీవేంకటేశుఁ డతఁడు ||మఁగఁ||577||

పాడి

చెప్పఁ గొత్తలాయ నీ చేసేటి కాఁపురము
దప్పిదేరే మోవితోడ తలవంచకువే || పల్లవి ||

కొడిమెలెన్నుచు నిన్నుఁ గోపగించి నంటాను
పడఁతికేల లోఁగేవు పంతగాఁడవు
అడరి నీ మర్మమెల్లా నాపెచేత నున్నదా
ఒడిశాపె[1] దిక్కే నీవు సారెకుఁ జూచేవు || చెప్ప ||

యీవలా నావలా యేతువలెత్తినంటా
దేవులకేల కొంకేవు దిట్టవాఁడవు

[1] ఒడిసి + ఆపె దిక్కే.

భావించ నింతి నీపాలిటె దేవరాయనా
కావరించి మాట కతి కడవఁగఁజాలవు || చెప్ప ||

దంటతనమున నిన్ను దప్పఁలెంచీనంటాను
ఇంటెయాపెకేల వీఁగే వింతవాఁడవు
నంటున శ్రీవేంకటేశ నన్ను నేలితివి నేఁడు
అంటెముట్టె యాపెనే అప్పణడిగేవు || చెప్ప || 578 ||

## హిజ్జిజి

నీవంటెదే కాదా నెట్టన నేఁ డాపె యాస
దేవులవైతే మరి తెలుసుకోరాదా || పల్లవి ||

పతివద్ద నుండెనభామనేల పిలిచేవే
కుతిలకుడిచి వట్టి కుచ్చితానను
ఆతనిఁ గూడఁగ నీకు ననువు గావలసితే
వెతదిర నొకతెర వేసుకొనరాదా || నీవం ||

యింతి విడెమియ్యఁగాను యేల సన్నచేసేవే
కాంతునిపై నీవు వట్టి కాతరానను
యింతవేడుకైతే నీవు నితనిపచ్చడములో
కాంతకు మఱుఁగుగాను కప్పఁకొనరాదా || నీవం ||

పరగఁ దామిద్దరునుఁ బవళించియుండఁగాను
అరసేవేలే వట్టి యాగడానను
గరిమ శ్రీవేంకటేశుఁ గైకొనఁగ మనసైతే
నిరతి నావలిపక్క నీవుండరాదా || నీవం || 579 ||

## కన్నడగౌళ

ఎప్పుడు కరుణఁ జూచే వీయింతిని
కుప్పళించి మాఁటలనే కొసరీ నిన్నును || పల్లవి ||

చిక్కనితేనెలు మోవిఁ జిప్పిలఁగాఁ జెలి నిన్ను
పెక్కు ప్రియములు చెప్పి పిలిచీ నిదె
మిక్కిలి చెమటలెల్లా మేన నిట్టి తురుగఁగా
పిక్కటిల్ల రతులకుఁ బెనఁగీ నీతోను || ఎప్పు ||

తామెరలవాసనలు దట్టముగా దొలఁకఁగా
కోమలపుఁజేతులఁ జెక్కు నొక్కీ నిదె
కామించి కుచముల కాంతలు నీపైఁ గప్పఁగా
దీమసాన నొడివట్టి తీసీ నిన్నింటికి || ఎప్పు ||

నంటున నవ్వు వెన్నెలనామము సెలవి నిండఁగా
అంటి చెవిలో నేకతమాడీ నిదె
జంటల శ్రీవేంకటేశ సమరతి నేసె నిన్ను
వొంటి నలపార్చి యిప్పు డొడఁబరచిని || ఎప్పు || 580 ||

## ముఖారి

బతుకరయ్యా మీరు వచ్చిదేరను
కతలుఁ గారణాలుగాఁ గంటిఁగా యామేలు || పల్లవి ||

యెలమి నేనుండఁగానే యాకె వచ్చి నీతోను
మలఁగుమలఁగుననే మాటలాడను
అలనీదేవులో యాకె ఆకె చెలికత్తెయో
కలిగె నీకు నేఁడు కంటిఁగా యామేలు || బతు ||

దండ నేనుఁ జూడఁగానే తా వచ్చి నీమేను ముట్టి
చండిపెట్టి పెనఁగుతా సన్న చేసెను
మెండగు నీచుట్టమో మెలుత నీ పొరుగాపో[1]
గండికాఁడ నీకు నబ్బెఁ గంటేఁగా యీమేలు || బతు ||

నీతో నేనుఁ గూడఁగానే నెట్టన వచ్చి యీసతి
యేతుల నిన్ను నెనసి యింతచేసెను
జాతిగలకొలమాపో చనవరి వెలయాలో
ఘాతల శ్రీవేంకటేశ కంటేఁగా యీమేలు ||బతు||581||

## రేకు 1698 ఆహిరి

ఏమేమి సేసినాను ఇతవే కాక
కామించి మీరును నిచ్చకము లాడవలదా || పల్లవి ||

ఇద్దరిమాతలఁపులు నేకమై వుండఁగాను
సుద్దులేమి చేప్పేరే సుదతులాల
కొద్దిమీరి వలపులు కోటకొండలై వుండఁగా
అద్దో పాయవచ్చునా ఆలికి మగనికి || ఏమే ||

యెప్పుడు నాతఁడు నేను ఇయ్యకొనివుండఁగాను
తప్పకచూచే రదేమే తరుణులాల
వొప్పుగు వేడుకలలో నోలలాడుచుండఁగాను
అప్పుడే దూరవచ్చునా ఆలికి మగనికి || ఏమే ||

రవ్వ మొక్కరొకరము రతిఁ జొక్కియుండఁగాను
నవ్వేరేలే యిప్పుడిట్టె నాతులాల

[1] పొరుగాపె + ఓ

ఇవ్వల శ్రీవేంకటేశుఁ డీతఁడు
అవ్వలేమి నెంచనేలే ఆలికి మగనికి || ఏమే || 582 ||

## బౌళి

ఊట్టు సేసుకొనకు మాఁటడియేల నీకు నీవే
పట్టితినింతే నీకొంగు బయలీఁదనేఁటికే || పల్లవి ||

అంటుకొని నీ వేపొద్దు నాపె వెంటఁ దిరుగఁగా
నంటున నీమోము చూచి నగరాదా
బంట (టు?) పంతమా యేమైనాఁ బచారించ నీతోను
అంటి నింతే సన్నకు సన్నంత కెక్కు డేఁటికి || ఊట్టు ||

సంతము నీవు నాపె సరసము లాడఁగాను
మంతనాన నే నొక మాటాడరాదా
దొంతిపూఁటా యేమైనా తొడరి బలిమిసేయ
కొంత కొసరితి నింతే గురిసేయ నేఁటికి || ఊట్టు ||

ఆరితేరి యాపె పెండ్లియాడి వచ్చియుండఁగాను
కూరిమి నీ కాఁగిట నేఁ గూడరాదా
మోరతోపా యేమైనా మొక్కితి శ్రీవేంకటేశ
థారుకాణంచితి నింతే తమకించ నేఁటికి || ఊట్టు ||583||

## పాడి

ఆనతిచ్చితే నేమాయ నందుకేమే
పూని నేమెంతడిగినా నూరకుండేవేమే || పల్లవి ||

చక్కఁగా నీయాతనిసందివావి మెట్టిదంటే
చెక్కుచేతితో సిగ్గున జెందేవేమే

పిక్కటిల్లి మీ మేనుల పెంజెమట గారినంటే
తక్కక ఇంతటిలోనే తలవంచేవేమే || అన ||

గట్టిగా నీతో నాతనికతలు నేఁ జెప్పఁగాను
గుట్టుతో నుందానవు వూఁకొనవేమే
జట్టిగా మీముందరను సరివిడేలు వెట్టితే
నట్టనడుమ నూరకె నవ్వు నవ్వేవేమే || అన ||

తెలిసి చెలులమెల్లాఁ దెరమరఁగు వేసితే
చులుకఁగాఁ బెనఁగుచు సొలసేవేమే
యెలమి శ్రీవేంకటేశుఁ డింతలోనె నిన్నుఁగూడె
చలివాయఁ బొగడితే సారె మెచ్చేవేమే || అన || 584 ||

కాంబోది

అడుగవే నాగుణము అది తానే యెరుఁగును
అడరి నేఁ గలపుకోలై వుండనటవే || పల్లవి ||

పంతమాడవద్దుగాని పైకొని రమణుఁడు దా
వంతుకు నవ్వి తిట్టితే వద్దనేనటే
వింతసేయవద్దుగాని వేడుకతో నూడిగాలు
యెంత సేయించుకొన్నాను ఇయ్యకొననటవే || అడు |

గుట్టుసేయవద్దుగాని కూడిమాడె నాతోను
గట్టిగాఁ బెనఁగితేను కాదనేనటే
రట్టుసేయవద్దుగాని యిట్టె రతి నేకతాన
యెట్టు సేయించుకొన్నాను యెగ్గులెంచేనటవే || అడు

వాసి చూపవద్దుగాని వడి శ్రీవేంకటేశుఁడు
ఆస నెంత గూడినాను అలసేనటే
వేసరించవద్దుగాని వెలయ నన్నేలినాఁడు
చేసిన మేలెల్లానుఁ జేకొనటవే ॥ అదు ॥ 585 ॥

## నట్టనారాయణి

ఏల వేసాలు చేసేవు యెఱఁగనివానివలె
ఆలేమ వదినెయంటా నానలు వెట్టేవు ॥ పల్లవి ॥

నీవు నాపె యేకతాన నిలుచుండి నన్నుఁగని
చేవమీర సన్నలేల సేసేవిపుడు
దేవి దేవరావలె దిష్టముగా మిమ్ము గంటి
కావరాన నే నేమైనా కాఁతాళించి తిట్టేనా ॥ ఏల ॥

మేడమీఁద మీరిద్దరుఁ గూడియుండి నన్నుఁగని
అడకేల పిలిచేవు అప్పటినన్ను
వీడని దంపతులని వెస మిమ్ముఁ దెలిసితి
పాడిదప్పి నిన్నేమైనాఁ బచ్చిసేయవచ్చేనా ॥ ఏల ॥

పీఁటమీఁద నొండొరులు పెనఁగుతా నన్నుఁగని
మాటువెట్టి నన్ను నెంత మన్నించితివి
చాటి శ్రీవేంకటేశ యీసతి లక్ష్మియనివింటి
నీటున నిన్నేమైనా నేరములెంచేనా ॥ ఏల ॥ 586 ॥

## రీతిగౌళ

తమ జాడలేల మాను తతు లొనగూడితే
మమకారములు సేసి మరిగేముఁగాక ॥ పల్లవి ॥

వెలయఁగ మదనునివింటినారిఁ దగిలితే
కలువ పువ్వులేకావా కాఁడిపారేవి
అలరి మిక్కిలివిరహపువేళ వచ్చితేను
చిలుకపలుకులే కావా చిమ్మిరేఁచేవి || తమ ||

లావుగా వసంతకాలము లెదిరించితేను
కోవిలకూఁతలే కావా గురిదాఁకేవి
వావి గలపినచోట వలపులగ్గలమైతే
చేవైనమనసే కాదా చింతసేసేది || తమ ||

సటలకలిగినాను చెంద్రోదయమయితే
పటికపురాయే కాదా బాద(ధ?) పెట్టేది
యిటు శ్రీవేంకటేశుఁడు యేలినాడు నన్ను నేఁడు
అటు చల్లగాలే కాదా అలపార్చేది || తమ || 587 ||

రేకు 1699 రామక్రియ

ఎంత వేగిరకాఁడ వేమయ్యా నీవు
వంతురాకతొలుతనే వలపు చల్లేవు || పల్లవి ||

మొక్కనని చేతులు మొగి నుద్యే(ద్యో?) గించఁగానె
దిక్కన నందుకు ముందే దీవించేవు
అక్కరతో నవ్వు నవ్వ నాఖతపడఁగానే
చక్కఁగా చేముంచి నీవు సరసమాడేవు || ఎంత ||

తొడిఁబడ మాటలాడ దొరకొనే ననఁగానే
చిడుముడి నప్పుడే మెచ్చితివనేవు
అడరి నీమోము చూడ ఆసపడేననఁగానే
జడియక నామోము సారెఁ దోఁగిచూచేవు || ఎంత ||

చన్నుల నొత్తేనని సవరించుకొనఁగానే
వున్నతిఁ గాఁగిట నించి వొద్దికయ్యేవు
చెన్నుగా శ్రీవేంకటేశ నేసవెట్టేననఁగానే
నన్ను నేలి నీవు కంకణము గట్టేవు || ఎంత || 588 ||

## శుద్ధదేశి

ఏమిచెప్పే[1] వాకెసుద్ది యేరా నాతోను
నేమము గలదియైతే నిందుకొని యుండును || పల్లవి ||

యెమ్మెలు చెప్పకొనేది యెందైనా నొకతెగాని
వుమ్మడి నిల్లాలైతే నూరకుండును
నమ్మిక బాసడిగేది నడుమంత్రపుదిగాని
ఇమ్ముల మేనదియైతే నెదురాడకుండును || ఏమి ||

కోపగించుకొనియేది కోటికి నొకతెగాని
కాఁపురము సేసేదైతే కాఁగకుండును
ఆపసోపానఁబడేది ఆరడికత్తెయుఁగాని
వోపి బత్తి గలదైతే వొద్దికతో నుండును || ఏమి ||

కావరించి తిట్టేది గయ్యాళి యొకతెగాని
వావివర్తనదియైతే వచ్చి మొక్కును
శ్రీవేంకటేశ నన్నుఁ జేరి కూడితివి నేఁడు
దేవులైనది యైతేను దీని కిట్టె మెచ్చును || ఏమి || 589 ||

## ఆహిరి

తరుణిఁ జూచి నాకు దయవుట్టెను
పరగ నెందాఁకా నెంత పరచితివయ్యా || పల్లవి ||

---

[1] ఈ పాటలో 'ఒకతెగాని' అనుదానికి 'ఎవ్వరోగాని' అను వర్థముగా తోచుచున్నది.

నిలువునఁ బులకించె నిండాఁ జెమటగారె
చెలి నేమిసేసితివి చెప్పవయ్యా
అలకలెల్లాఁ జెదరె అయములు గరఁగెను
సొలసి నీ బలిమెంత చూపితివయ్యా || తరు ||

కన్నులకుఁ గెంపెక్కె కడు నిట్టూర్పులు రేఁగె
కన్నె నవ్వు డేమంటివో కదవయ్యా
చెన్నుమీరె నలపులు సెలవుల సిగ్గుదేరె
మిన్నక నీ నేర్పు లెన్ని మెరయించితివయ్యా || తరు ||

పఱపుపైఁ బవళించె పచ్చిదేరె మేనెల్లా
గుఱిగా నీసతినెట్లు గూడితివయ్యా
నెఱయ శ్రీవేంకటేశ నిండె కళలు మోమునఁ
జఱసి సరసమేమి జరపితివయ్యా || తరు || 590 ||

## సామంతం

ఎవ్వరుండే రౌఁగరు యెదుట సిగ్గువడవు
పువ్వులనే వేసేవు పూఁచి పూఁచి || పల్లవి ||

వెస నాపెమాటలు వినవేడుకయ్యానో
కొసరుచు నడిగేవు కొచ్చి కొచ్చి
యెసగ మోముచూడ నేఁకటతో నున్నాడవో
ముసుఁగువట్టి తీసేవు ముంచి ముంచి || ఎవ్వ ||

మలసి సరసమాడ మనసాయనో నీకు
కెలయుచు నవ్వేవు కేరికేరి
ఛలివాసి వెగావితేనె చవి నీకుఁ బుట్టెనో
పొలయుచు వేఁడేవు పొంచి పొంచి || ఎవ్వ ||

అట్టె యాపె చన్నులపై ఆస నీకుఁ బుట్టెనో
గుట్టుతోడఁ గొలచేవు కోరి కోరి
నెట్టన శ్రీవేంకటేశ నేఁడలమేల్మంగ యాకె--
నిట్టె కూడి నన్నేలితి వెంచి యెంచి || ఎవ్వ || 591 ||

## కేదారగౌళ

నీ వొళ్ళిదే కల్లగాక నెలఁత యేమిచేసు
యేవిధమైనా నాయ నేమిసేయవచ్చును || పల్లవి ||

గుట్టుతోడెయాఁటదానిఁ గొంగువట్టి తియ్యఁబోతే
తిట్టవద్దా యాపె నిన్ను దిష్టముగాను
పొట్టఁ బొరుగాపెతోను పూఁచి నవ్వఁబోతేను
యెట్టు చేసినాఁ జేసె యేమి సేయవచ్చును || నీవొ ||

వొరుపుది గలదియుంటా వొకటొకటాడితేను
గిరవద్దా ఆపె నీ మై కేరడానను
వ్రాలిలోనిసతి నీవు వొంటెనుండి పిల్చితేను
యేరీతి మీరినా మీరె నేమిసేయవచ్చును || నీవొ ||

చెప్పినట్టు సేసునంటా సిగ్గులువరచితేను
తప్పులెంచవద్దా నిన్నుఁ దమకానను
అప్పుడే శ్రీవేంకటేశ ఆపె నిట్టె కూడితివి
యెప్పుడు మెచ్చినా మెచ్చె నేమిసేయవచ్చును ||నీవొ||592||

## గౌళ

ఇందవయ్యా కానికె ని న్నింతి దోడితెమ్మనె
పొందైనచోటను పొసఁగఁగవలదా || పల్లవి ||

వలచినదిగనక వనిత నిన్నుఁ బాసి
యెలమి దూరితే నెగ్గులేల పట్టేవు
చెలఁగి పెక్కుసతులఁ జేసుకొన్నవాఁడవు
పలుమారు మాఁటలఁబడ కిఁకఁబోవునా || ఇంద ||

అనుపైనదిగనక నగుతా నీతోఁ బెనఁగి
చెనకితే నాఱడేల సేయవచ్చేవు
వొనర నెందరికైనా నొడిగట్టినవాఁడవు
తనివోని చేఁతలకుఁ దప్పించుకోవచ్చునా || ఇంద ||

వురముపైదిగనక వువిద నీరతులను
వొరసికూడితేనేల వొద్దుకొనేవు
సరవి శ్రీవేంకటేశ జారపురుషుఁడవు
తిరమైన చన్నులతో దీకొనఁగవసమా || ఇంద || 593 ||

రేకు 1700 ముఖారి

ఎంత వేసరించవచ్చు యేపొద్దు నిన్ను
పంతగాఁడ నీ చిత్తము భాగ్యము నాది || పల్లవి ||

నిచ్చ నిచ్చ నీకు నవ్వు నేరుపఁగఁగలనా
కచ్చు పెట్టె నీయుంతనే కలితేఁగాక
మెచ్చులుగా వలపులు మెడఁగట్టఁగలనా
పచ్చిగా నాయందు నీకు బత్తి గలితేఁగాక || ఎంత ||

వొడివట్టి నిన్నొద్దఁ గూచుండఁ బెట్టఁగలనా
బడి నీయుంతనే నన్నుఁ బైకొంటేఁగాక
గుడిగొనఁ, జెమటలు కురియించఁగలనా
కడలేని తమితోడ గరఁగితేఁగాక || ఎంత ||

మలసి బలిమిచేసి మరిగించఁగలనా
చెలిమి నీయంతనే చేసితేఁగాక
యెలమి శ్రీవేంకటేశ అలమేల్మంగనై నేను
కలసితి నింకా నీవే కరుణింతు గాక ‖ ఎంత ‖ 594 ‖

## సాంళగం

ఎంతటివాఁడవు నీవు యేమని మెత్తుము నిన్ను
పంతములు చెల్లించి పైకొంటివి నన్నును ‖ పల్లవి ‖

సన్న సేయవచ్చుఁగాక సంగతికి వచ్చితేను
యెన్నికతోడుతఁ జనవియ్యవచ్చునా
పన్ని నవ్వవచ్చుఁగాక పైకొని పెనఁగితేను
నిన్నువలెఁ కూరిములు నించవచ్చునా ‖ ఎంత ‖

పొందు సేయవచ్చుఁగాక పొంతనుండి మొక్కితేను
చెంది చెప్పినట్టెల్లాను సేయవచ్చునా
అందుకొనవచ్చుఁగాక అట్టె వీడెమిచ్చితేను
యిందే నీవలెను మోవియ్యవచ్చునా ‖ ఎంత ‖

చేయి వేయవచ్చుఁగాక చేరి కాఁగిలించుకొంటే
ఆయములంటుతు కలయఁగవచ్చునా
యీయెడ శ్రీవేంకటేశ ఇట్టె నన్ను నేలితివి
నాయమెరిఁగి నీవలె నమ్మించవచ్చునా ‖ ఎంత ‖ 595 ‖

## బౌళి

ఇంతిపై మొగమోటాన నేల లోఁగేవు
సంతసాన నీవు నాపె సంది సేయరాదా ‖ పల్లవి ‖

చెలరేఁగి చెలరేఁగి సేసలు చల్లీ నాకె
 సెలవి నవ్వి నీవేల సిగ్గువడేవు
 నిలువ దమకములు నిండుకున్న వాకెమీఁద
 పిలిచి సరికి బేసీఁ బెనఁగరాదా || ఇంతి ||

వచ్చి వచ్చి నీ మీఁద వసంతమాడీ నాకె
 తచ్చి తలవంచి యేల తడఁబడేవు
 మచ్చికతోఁ బులకలు మలగొన్నవాకెమేన
 పచ్చి సరసా లెదురుబడి నాడరాదా || ఇంతి ||

సారె సారె నిన్ను గట్టిచన్నుల నొత్తీ నాకె
 కూరిమి నీవేల యింకా గుట్టుచేసేవు
 యీరీతి శ్రీవేంకటేశ యేలితి వాకె, కాఁగిట
 మేరతోడ నీడుజోడై మెలఁగఁగరాదా || ఇంతి || 596 ||

పళవంజరం

నిండుకొనియుండినదే నేరుపుగాక
 కొండుక పాయపువానిఁ గోపగించవలెనా || పల్లవి ||

యేదో సతులతో నీ వేలాటాలాడితివంటా
 ఆడరానిమాటలు నే నాడవచ్చునా
 వేడుకకానికి మరి వివరించ నేడ పాటి
 చూడ నందుకుఁ దోడు నిష్ఠురము గావలెనా || నిండు ||

చాయలఁ బొరుగాపెకు సన్నలు చేసితివంటా
 చేయరానిచేఁతలు నేఁ జేయవచ్చునా
 దాఁగుగాఁడైనవానికి దాక్షిణ్యమేమున్నది
 రాయడి నిదీఁ గొంత రవ్వ సేయవలెనా || నిండు ||

యెవ్వతెకైనా నీవు యిచ్చకముసేతువంటా
నవ్వరాని నవ్వులు నే నవ్వవచ్చునా
యివ్వల శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
అవ్వల నింకా రతి నలయించవలెనా ‖ నిందు ‖ 597 ‖

## భైరవి

చెలువుఁడు చేసినట్టె సేయరాదా
సొలతురా నయములే చూపుదురు గాక ‖ పల్లవి ‖

సరసమాతఁ డాడఁగా సణఁగు రాలుతురటె
వరుసతో నిచ్చగించవలెఁ గాక
శిరసెత్తి మాటాడఁగా సిగ్గులు వడుదురటె
సరగ మోహములు రేఁచఁగవలెఁగాక ‖ చెలు ‖

చెక్కులాతఁడు నొక్కఁగా సెలసి జంకింతురటే
వక్కణతోఁ గడుమెచ్చవలెఁగాక
దక్కి చేయిచాఁచఁగాను తప్పించుకోఁదగునటే
యెక్కువ నీమోవితేనే వియ్యవలెఁగాక ‖ చెలు ‖

కళ లాతఁ డంటఁగాను కాఁగిట మలతురటే
యలసినట్లాఁ గూడవలెఁగాక
యెలమి శ్రీవేంకటేశుఁ డేలె నలయింతురటే
కెలపు రతులనే చొక్కించవలెఁగాక ‖ చెలు ‖ 598 ‖

## భౌళి

అతఁ డొక్కటి సేయఁగా అట్టె వొకటిసేయ-
కీతరిఁ జేకొనరాదా యెలయించనేఁటికి ‖ పల్లవి ‖

ముప్పిరి నీరమణుఁడు మోహములు చల్లఁగాను
రెప్పలెత్తి చూడరాదా రేసులేఁటికి
తెప్పలుగా నవ్వఁగాను తేనె మోవి ఇచ్చి నీవు
దప్పి దేరుచుఁగరాదా తప్పులెంచనేఁటికి || అతఁ ||

చెలఁగి నీమేనబావ చెనకి పిలువఁగాను
పలుకరాదా వట్టిపంతాలేఁటికి
చెలిమి సేయఁగాను చేరి విడెమిచ్చి నీవు
అలపారుచఁగరాదా అడ్డమాడనేఁటికి || అతఁ ||

శ్రీవేంకటేశుఁడు నిన్నుఁ జేకొని కలయఁగాను
సేవలు సేయఁగరాదా సిగ్గు లేఁటికి
యీవల నిన్నురమున యిడుకొని వుండఁగాను
గావించి మెచ్చఁగరాదా పరవశమేఁటికి || అతఁ || 599 ||

శ్రీః శ్రీః శ్రీః శ్రీః శ్రీః

# 1వ అనుబంధము
## అకారాదిక రాగ సంకీర్తన సంఖ్యాసూచి

| రాగములు | — | సంకీర్తన సంఖ్యలు |
|---|---|---|
| అహిరి | .. | 17, 38, 64, 93, 103, 123, 139, 170, 199, 215, 251, 297, 336, 354, 364, 398, 399, 416, 423, 441, 467, 479, 524, 534, 553, 573, 582, 590 |
| అహిరినాట | .. | 20, 29, 44, 95, 98, 143, 235, 272, 322, 330, 370, 451, 460, 499, 501, 520, |
| కన్నడగౌళ | .. | 82, 422, 580 |
| కాంబోది | .. | 2, 14, 45, 67, 94, 126, 192, 249, 267, 289, 292, 300, 313, 316, 329, 376, 446, 458, 461, 483, 526, 555, 561, 569, 585, |
| కురంజి | .. | 237, 250, |
| కేదారగౌళ | .. | 68, 469, 565, 592 |
| గుండక్రియ | .. | 178 |
| గుజ్జరి | .. | 160, 198, 356 |
| గౌళ | .. | 157, 212, 241, 260, 285, 324, 350, 362, 407, 516, 593 |

* * *

# 2వ అనుబంధము

## అకారాదిగ సంకీర్తన రాగ సంఖ్యాసూచి

| సంకీర్తనమొదలు | రాగము | సంకీర్తనసంఖ్య |
|---|---|---|
| అంగడిఁబడె | పాడి | 177 |
| అంగడిఁబెట్టు | వరాళి | 15 |
| అంటినా | ఆహిరి | 139 |
| అంతటి | సామంతం | 274 |
| అంతదొడ్డ | దేసాక్షి | 475 |
| అంతమమ్ముఁజెన | ముఖారి | 135 |
| అందరము | పాడి | 509 |
| అంధరి | దేవగాంధారి | 443 |
| అందరు | శుద్ధవసంతం | 19 |
| అందితేఁబొంది | సాళంగం | 24 |
| అందుకేతల్లడ | కాంబోది | 446 |
| అందుకేరా | పళవంజరం | 145 |
| అందుకేపో | ఆహిరి | 103 |
| అందువల్లఁగా | గౌళ | 212. |
| అట్టికాపీ | దేసాళం | 334 |
| అడుగరే | కాంబోది | 313 |
| అడుగరే | కాంబోది | 376 |
| అడుగరే | పాడి | 78 |
| అడుగరే | కాంబోది | 585 |
| అతివ | ముఖారి | 70 |
| అదరిపాటు | బౌళి | 279 |
| అదిచెప్పు | గౌళ | 260 |

* * *

